# వ్యంజన సూత్రము

## *The Principle of Suggestivity*




హెచ్. ఎస్. బ్రహ్మానంద

**H S. Brahmananda**

ప్రథమ ముద్రణ 1981

ప్రతులు 1000



ప్రచురణ  అక్షర ప్రసారము
శ్రీమతి హెచ్ నిర్మల
C-13, శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
క్యాంపస
ఎస్. వి. పురం
అనంతపురం 515 003 A. P.

వెల రూ 40/-

ముద్రణ  శారదా ప్రింటింగ్ ప్రెస్
అనంతపురం

*At the*

*lotus feet of*

**The Mother**

*the source*

*of all speech*

# కీలకం

## The Clue

నానాచ్ఛిద్ర ఘటోదర స్థితమహాదీప ప్రభాభాస్వరమ్
జ్ఞానంయస్యతు చక్షురాదికరణద్వారా బహిఃస్పందతే
జానామీతి తమేవ భాంతమనుభాత్యేతత్సమస్తంజగత్
తస్మై శ్రీ గురుమూర్తయే నమఇదం శ్రీ దక్షిణామూర్తయే

శ్రీ శంకరుల దక్షిణామూర్తి స్తవం (6)

*'He whose intelligence flashes outside through the eyes and other sense organs, just like the bright light of a great lamp placed in a jar having many holes and after whose shining this whole universe of the objects shines to Him the Divine Teacher Shri Dakshinamurti, is this prostration*

*Chinmayananda (1972) pp 64–65*

# విషయ సూచిక.

## 2 సూత్రీకరణము 137-276

## (CODIFICATION)

# Acknowledgments

I wish to record my cordial gratitude and appreciation to the track–layers of Vyanjana theory in its philosophical rhetorical and linguistic perspectives namely Messrs Aurobindo John Woodroffe V S Agrawala K C Pandey Ananda K Coomaraswamy Krishna Chaitanya K Krishna Moorthy Raniero A Gnoli Louis Renou John Brough Kunjunni Raja J F Staal Roland Barthes and a host of others recognised in the work and drawn heavily upon who have chistled my thinking on this epistemological understanding of linguistic function

I take it a pleasure to thank my colleagues of Sri Krishna devaraya University (the hitherto Autonomous P G Centre of S V University) the University Authorities and the staff who have been a constant source of hope and help to bring out the book in its present form

I feel it to be exceptionally relevant to pay homage to late Dr K Nagabhushana Rao an inspiration in disguise through the books on Semiotics he had purchased for the library

The publication derives the benefit of the kind remarks of encouragement by Prof B Rama Raju Prof S V Joga Rao and Prof K Lakshmi Ranjanam who adjudicated the thesis in its original form submitted for the award of Ph D of S V University (A P G C) in 1979

The person to initiate me to proof–reading Mr R Ramulu has been at the back–ground of the present work The press managed in his dual role as a student and a businessman by Mr M R Amarnath backed by his kins has been more a laboratory where the book was improvised to its present form deserve my congratulations

I reserve my vote of thanks to the research associates who helped me in the drafting of press–scripts and the typist Mr D B C Naidu who actually put the matter into the Telugu Godrej type to start with

ANANTAPUR H S B
August 1981

ప్రరోచన :

**Prologue** :

tasmaat sataamatra na duuSitaam  
mataani taanyevatu Sodhitaani  
puurvapratisThaapita yojanaasu  
muulapratisThaaphalamaamananti

— **Abhinava Gupta**

(Abhinava Bhaarati)  
[the fourth stanza of intermizzo]

*'A rich and fruitful harvest may be culled by posterity from the inheritance of thought left to it by its predecessors Thus the doctrines of the sages of antiquity will only be refined by us here and not refuted*

— **Tr. Raniero, A Gnoli**

'Aesthetic Experience According to Abhinava Gupta  
p 51 (1968)

# శ్రుతి

## (The Inner Voice)

### Mind & Speech

దైవం మనః[1]

దేవీం వాచమజనయంత దేవాః[2]

వాఙ్ మేమనసి ప్రతిష్ఠితా

మనో మేవాచి ప్రతిష్ఠితమ్[3]

ప్రియతో వాఙ్మనసిసంపద్యతే[4]

వాఙ్మనసి దర్శనాత్ శబ్దాత్ చ[5]

### The Vedic Symbolism

ప్రజాపతిర్వా ఇదమగ్ర ఆసీత్

తస్యవాక్ ద్వితీయా ఆసీత్[6]

సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్

— తదైక్షత[7]

వాగ్వా అస్యాః ప్రజాపతేః స్వమహిమా[8]

వాగేవ విశ్వాభువనాని[9]

వాగ్వైవిరాట్ వాగ్వైప్రజాపతిః[10]

అహం రాష్ట్రీసంగమనీ వసూనామ్[11]

పరమేష్ఠినీవాక్[12]

మహిషీవాక్[13]

వాగ్ యోనిః[14]

అంభృణీవాక్[15]

వాక్ పరివేష్ట్రీ[16]

వాగ్వై సుబ్రహ్మణ్యా[17]

వాగ్వై బ్రహ్మచ సుబ్రహ్మచ ఇతి[18]

వాగ్వై సర్వరాజ్ఞీ[19]

తస్యామనసా ఏషాకుల్యాయద్వాక్[20]

తస్మాత్ మాధ్యమికామ్ వాచంమన్యంతే[21]

మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునాధియోవిశ్వా
విరాజతి[22]

The manifestation

చత్వారి శృంగా 23

యేత్రిషప్తాః పరియంతి విశ్వారూపాణి బిభ్రతః[24]

చత్వారివాక్ పరిమితాపదాని[25]

The Vision

సక్తుమివతితఉ నా 26

ఉతత్వః పశ్యన్ నదదర్శవాచమ్ 27

The Question

కేనేషితమ్ వాచమిమాం వదంతి ? [28]

The Language Speaks

వాచంవదంతిం సర్వేప్రాణా అనువదంతి - [29]

---

1 R V 1-2-164-18, 2 R V-8-100-11 3 Ait Up inv 4 Chaan Up 6-8-6 5 Br Suu 4-2-1 6, TaanDya Br 20-14-2 7 Chaan Up 6-2-1-3, 8 *Sat* Br 2-2-4-4, 9 A Bh 14-3 10 *Sat* Br 3-5-1-34 & 5-1-5-6, 11 R V 10-125-3 12 ibid, 13 *Sat* Br 6-2-4, 14 Ait Br 2-38 15 Devi Suukta, 16 KauS Br Up 2-1, 17 Ait Br 6-3, 18 ibid 19 KauS Q Ku Bh p XIII, 20 Jaab Up, Q Ku Bh p XIII, 21 Ya ska on R V 1-3-12 22 R V 1-3-12 23 R Sam 10-81-2, 24 Ath V 1-1-1 25 R Sam 1-164-45 26 R Sam 10-81-2 27 R Sam 10-81-4 28 Kena Up 1-1, 29 KauS Br Up 3-2

'ఉపహ్వాయే సుదుఘాంధేనుమేతాం సుహస్తోగోధుగుత దోహదేనాం [30]
'దూరమైపోయిన గోతతింబిలుచు పోలిక నేదావినిస్వనించెడన్'

ఇదొకగవేషణ ఇప్పటికి పదేళ్ళక్రితం మొదలైంది ఇప్పటికొక మజిలీ చేరుకోవడం జరిగింది గోవులు దొరికాయా అంటే చూద్దంమాత్రమే జరిగింది వెనక్కి మళ్ళించుటకురావడానికి ఇంకా ఎన్ని మజిలీలున్నాయో? వేచిచూడాలిమరి!

అందరిలాగే తానూ రెండుఎమ్మేలు పుచ్చుకొన్నాడు ఏదో ఒక కవిమీదో కావ్యంమీదో, సాహితీ ఉద్యమంమీదో సిద్ధాంతవ్యాసం రాసుకోవచ్చు లేక ఎకవిభాషనో వర్ణనాత్మకంగా పరిశీలించవచ్చు మాండలిక పరిశీలనాచెయ్యవచ్చు అలాకాకుండా ఈమూడోమార్గం ఏమిటని ?

ప్రాధమికంగా తాను సంగీతజ్ఞుడు స్వరంలోని అంతర్నాదాన్ని వినడం చిన్నప్పటినుంచి జీవితంలో భాగమైపోయినవాడు దానిఫలితమే ఈవిచికిత్స దీని స్వరూపం విలక్షణమైంది

మొదటిరోజున భాషాశాస్త్రపాఠం విన్నక్షణంలో ఒక 'idea మేల్కొంది పశువులకు భాషలేదా! ఉంటె దానికీ మానవభాషకీ ఉన్నసంబంధం ఏమిటని? ఏమిటో అప్పటికి ఇది చాలా అస్పష్టంగా ఉన్నప్రశ్న పాఠం చెప్పనటీచరూ పుస్తకాలలో ఇలాగేవుందని దాటవేసినపశ్న ఆప్రశ్నకు స్పష్టమైన సమాధానం దొరికేటప్పటికి ఈగ్రంథం తయారయింది

అదేరోజున సాహిత్యపాఠంవిన్నాడు 'వాగర్థావివసంపృక్తౌ అని కవి అంటున్నాడు ఈ అనువిద్ధత ఎలాంటిదని ? ఆవాక్కు - అర్థంఏమిటని?

ఒకవైపు శబ్దార్థాల సంబంధం యాదృచ్ఛికమని ఒకరూ, నిత్యమని మరొకరూ పాఠంచెప్పడం మొదలిడితే అప్పుడే వదవులోకి దూకిన విద్యార్థిగతిఏమిటని?

---

30 R V 1 - 22 - 164 - 26

ఇలాగోకడం మొదలైనబుర్ర ఈనాటికి 'వ్యంజనసూత్ర' కీర్తనం పొడ్డిస్తోంది ఈప్రశ్నాంతరంగాలే దీని వెనుక 'శ్రుతి'

మనం అంతా సంఘంనుంచే నేర్చుకొంటామని కొందరంటారు. వ్యక్తి జన్మతో సంస్కారరూపంగా గ్రహించేదీ కొంతవుందని కొందరంటారు తనకు మాత్రం ఈవిషయంలో రెండూ ముఖ్యంగానే కనిపిస్తున్నాయి భావమే వస్తువుగా అభివ్యక్తిని పొందుతోందన్న idea సంస్కారానికి సంబంధించింది చదువు - అంటే సంఘం దాన్ని 'సూత్ర' రూపంగా వ్యాఖ్యానించేలాచేసింది అలా ఇది టూఇన్‌వన్' అయిపోయింది

కేవలం పాఠంమాత్రంచెప్పడానికి గురువెందుకు ? ఒక ఆలోచనామార్గాన్ని ఆవిష్కరింపజేస్తే గురువవుతాడు తనకి అబ్బిన సౌభాగ్యం అలాంటి గురువులు దొరకడం, వాళ్ళే ఈమార్గావిష్కరణకు పాదులుతీసిన గురుపాదులనితనవిశ్వాసం తన 'ఉజ్జ్వల భవిష్యత్తు' ను కోరిన వాళ్ళనిస్వార్థప్రేమానురాగాలూ ఆశీస్సులూ శక్తివంతాలనీ తన నమ్మకం వాళ్ళలో ఉపాధ్యాయులూ ఉన్నారు వారిశక్తి ప్రసారమే ఈరచనకు స్ఫూర్తి తన కపోలకల్పనం ఏమీలేదని తనకూ తెలుసు -

ఒకరోజున అనిపించింది 'వ్యంజనసూత్రం' మీద రాయాలని అంటే ఏమిటోకూడా తెలియకుండా ఎలారాయడం ? ఎందరినో అడిగాడు। లాభంలేకపోయింది

చదువులకోసం వూరూరూతిరగడం, ఉద్యోగంలో చేరడం ఇవన్నీ మామూలు విషయాలె కాని ఈ అంశంమీద రాయడంమాత్రం మామూలుగా జరగలేదు గ్రంథాయిన్నాయి స్పష్టంగా అవి సాహిత్యసిద్ధాంతంగా ధ్వనిని గురించి చెబుతున్నాయి భాషాశాస్త్రంలో దీనికి ఎక్కడచోటు కల్పించడమని ?

గురువుగారెమో ఒకటే ప్రశ్న రెండేళ్ళు అడిగారు? 'శబ్దములింగియా।' అని? అసలు ఆప్రశ్న అర్థమవడానికే తలప్రాణం తోకకివచ్చింది. పుస్తకాలలో

రేనివిషయాలుకూడా వుంటాయని తెలిసినప్పుడే 'వ్యంజన' అంటే ఏమిటో బోధపడింది

ఎల్లలుపుట్టారు కృభాషని పరిశీలించడం నిత్యకృత్యమై పోయింది అప్పుడు తెలిసింది - శబ్దానికి సంకేతత్వం చాలాదశల్లో ఏర్పడుతోందని కలలు వస్తున్నాయి ఏమిటోగా ఉండే ఆ కలకు అర్థం ఎలాచెప్పడమన్న ప్రశ్న వేసు కొంటే కావ్యంలో ధ్వని' స్వప్నభాషకు అర్థం ఒకటిగానే ఉంటాయని అప్పుడు అర్థమయింది

ఎవరో బంధువులువచ్చారు పోట్లాటజరుగుతోంది ఒకరిమాట మరొకరు వినరు ఇద్దరూ చెబుతున్నది ఒకటే - కాని బయటికి అంతాగోలగావుంది అప్పుడు తెలిసింది 'వాచ్యార్థం లేకపోవడం అంటే ఏమిటో

సినిమాలు చూడ్డంలోకూడా తనకి 'వ్యంజనే' కనిపించింది ఒకనాటి నాటకాలలోని 'రసధ్వనికి కి చక్కనిచోట్లు experimental films అని చన అను భవం నిరూపించింది. అంకుర్, కరావలి శంకరాభరణం,హరిశ్చంద్రుడు-విలాయత్ ఖాన్ఎతార్ పన్నాలాల్ఘోష్వేణువు, ఘంటసాలగారి బహుదూరపు బాటసారి' - ఇలాంటివి experience ని నిరూపిస్తున్నాయని అన్నివర్గాల్లోని, అంతస్తుల్లోని మనుషులూ అంగీకరించారు ఏబిస్మిల్లాఖాన్ షహనాయి వాద్యమో విన్నపుడు కల్గే అనుభవం సత్యనారాయణగారి కల్పవృక్షంలోని ఆర్ద్రితలాంటిది. మరికొన్నిట fact ప్రధానం కదా ' అనిపించవచ్చు. Fact కూడా experience ని వదలి వేరుగా ఉండదు ఇవి అనుభవంలో ఉన్నసత్యాలే, కాని భ్రమలుకావు ఇన్నిటా ప్రధానం నిస్సందేహంగా శబ్దప్రభావమే'

ఇలా నిత్యజీవితంలోని అనుభవాల్ని మధించడంద్వారా గాఢాలోచనలో ఆశ్రమం' - అంతకంటె అడవి లాంటి ఈప్రదేశంలో సిద్ధాంతాలకూ లొంగని స్వచ్ఛమైన మనస్సుతో ఆలోచించడానికి అవకాశం దొరకడంమాత్రం

ఒక తన భాషా అనుభవం అంచేత ఈపరిశోధనకు క్షేత్రం 'సమాజం, సేకరణకర్త ఎప్పటికప్పుడు ఎదుగుతున్న వ్యక్తి', అంశాలు 'భాష - అనుభవం', ప్రయోగ పద్ధతి వ్యవహారంలో భాగస్వామిగా వ్యక్తి తన అనుభవాన్ని రికార్డుచేసుకోవడం ఫలితం 'వ్యంజనసూత్రం'

అందువల్ల ఈవ్యాసంలోని విషయమంతా తననే సేకరణకర్తగా కల్గిందన్న మాట అంచేతే ఒక reporter's style అవలంబింపబడింది ఇందులో

ఇక గ్రంథాలయాలకు తిరగడం ముందువేసినబాట అస్పష్టంగా ఉండటంతో బండిని ఆపుకొంటూ వెళ్ళాల్సివచ్చింది ఇలా ఒక topic లోంచి మరో topic లోకి, మరో subject లోకి, అలా అలా మరో system of learning లోకి, - వెశ్తైతప్పా అభివ్యక్తి'కి, 'అభాసకూ', 'reflection కీ ఉండే సంబంధం వైరుధ్యం అర్థంకాలేదు మొత్తంమీద చాలా అంశాలు స్ఫురించినవే తన 'మిత్రద్వయం' తో చర్చించినవే తన స్టూడెంట్స్‌తో 'క్లాసులో' నైనా confirm చేసుకొన్నవే అంతెందుకు తన శ్రీమతికూడా కొన్ని అంశాల్ని - ప్రతిపాదనల్ని - స్థిరీకరించడానికి data ఇచ్చింది ఇలా 'living context లో జరిగిన పరిశోధన ఇది

తర్వాత కనిపించారు ఒక్కరొక్కరే 'పూర్వపథికృత్తులు' - తన అనుభవాల్ని ఇతరులూ పొంది సత్యమని రికార్డుతీసిన వాటినిమాత్రమే ఈవ్యాసంలో పొందుపరచడం జరిగింది

రచయిత ఏంరాసినా ఏ 'sensibility తో రాస్తున్నాడన్నది ప్రధానం అదికేవలం మానసికమే అయినా సంఘంలో మనపాత్ర దానిస్వభావాన్ని నిర్ధరిస్తుంది తనేమో భాషాశాస్త్రం పాఠంచెప్పేవాడు తెలుగుశాఖలో సాహిత్యవిద్యార్థికి కావాల్సిన 'సాహిత్య భాషాశాస్త్రం ఎలావుంటుందో తయారు చెయ్యాలన్న academic goal ఒకటి తనకీవున్నా కేవలం అది మాత్రమే కారణంకాదు - ఈగ్రంథం పుట్టడానికి.

సమకాలిన సమాజంలోంచివచ్చిన ప్రేరణే దీనికిమూలం 'వ్యంజనసూత్రం' అనగానే ఇది బూర్జువా సాహిత్యం బాబోయ్! ఇందులో Linguistics ఏమిటి? అని వెదరి ముక్కుమీద వేలేసుకొన్నవాళ్ళున్నారు అంటే కావ్యంలో ఉన్న అలంకార విషయంలాంటిదే ధ్వని'। ఆ వ్యంజన అన్నది ఒక 'పాప్యులర్' అవగాహన పాప్యుల మాత్రమేఏమిటిలెండి. ధ్వన్యాలోకాన్ని 'కావ్యాలంకారం' 'ధ్వన్యలంకారం' అనివ్యవహారించిన వ్రాతప్రతులే ఉన్నాయి అంటే మన సంప్రదాయపండితులు పూర్వశాస్త్రాలకుచేసిన వ్యాఖ్యానాలూ అర్థంచేసుకొన్నతీరూ కేవలం ఒక 'పడి' లోనివి గురువు ఎలాగో - శిష్యుడూ అలా! సంప్రదాయసూత్ర పరిజ్ఞానంనశించి కేవలం ఆచారం మిగిలిపోయినట్టుగా, 'ఆలోకం' లాంటి శాస్త్ర గ్రంథానికీ అదేగతిపట్టింది

శాస్త్రరచనవేరు ప్రతిశాస్త్రానికి మౌలికమైన కొన్ని ఆలోచనా విధానాలుంటాయి వాటిని అర్థంచేసుకోకుండా ఆశాస్త్రాలు అంతుచిక్కవు కాని ప్రతి శాస్త్రానికి ఒక పాప్యులర్ 'version తయారవుతుంది అలా అరిగిపోయిన ఆలంకారిక సంప్రదాయంలోని మౌలికమైన సూత్రాల్ని (భావం- వ్యంజన - అభివ్యక్తి ఇలాంటివి) బయటపెట్టిన చిరంతనులు ఆనాడూవున్నారు ఈనాడూవున్నారు. వాళ్ళందర్నీ ఒకచోట చెప్పడం 'బూర్జువా' పని ఎలా అవుతుందని తన ప్రశ్న సమాజానికి లాభమేమిటి? అని మరో friend ప్రశ్న

మార్క్స్, లెనిన్ మొదలైన మేధావులు భిన్నభాషాశాస్త్రాల్నిగురించిచెబుతూ సమాజానికీ భాషకూ బింబ ప్రతిబింబభావాన్ని అంగీకరించని యాంత్రిక భాషా శాస్త్రీయుల అతర్కమార్గాన్ని ఎంతగానిరసించారో లెనిన్ ప్రతిపాదించిన reflection అన్న తాత్త్వికసూత్రానికి వెనుక ఏమానవ మానసిక భౌతిక సమన్వయం గతితార్కిక దృష్టితో సాధించబడిందో అర్థంచేసుకొంటేనే కాశ్మీర శైవాగమంలోని ప్రత్యభిజ్ఞ - ఆభాసమార్గాలు ఎలా విశ్వమార్గాలో అర్థమవుతాయి ఆనాడే జాతి, కులభేదాల్ని నిరసించి ప్రపంచాన్ని శివపరిస్పందంగా సూత్రీకరించిన వాళ్ళమార్గంలో ఎంత విశ్వజనీన మానవతాదృష్టి ఉందో స్పష్టమవుతుంది

కౌలమార్గాన్ని అవైదికంగా నిరసించి కేవలం మాయాద్వైతానికే పట్టంకట్టి బ్రాహ్మణ్యాన్ని, వైదికమతతత్త్వాన్ని కేవలం ఒక 'జడ పదార్థంగావ్యాఖ్యానించు కొని నిష్క్రియమైన మనసంస్కృతి పునరుజ్జీవనానికి, సర్వమానవగతంగా ఉన్న ఉచ్చారణపర్రిచేతన లక్షణాన్నిగురించి వ్రాయడం- ప్రచారంచేయడం నిర్ద్వంద్వంగా అభ్యుదయ మార్గంలో పయనించడమే -

అరవిందులు ఒచోటరాశారు 'భాషావిజ్ఞానానికి ప్రథమలక్షణం 'నమ్రత' ఎప్పటికప్పుడు ఇంకా దృఢమైన పునాదుల నిర్మించుకొంటూ దానిశాస్త్రత్వాన్ని నిలుపుకోవడానికి సమర్థనచూపించడం దానిధర్మం అని, అది ఆ ఒక్కశాస్త్రానికే కాదు - అన్నిటికీ వర్తించే విషయమే

ఈ ఉదాత్తగుణాన్ని లక్ష్యంగా ఉంచుకోవడం తనకు ఇష్టమైనవిషయం కావ్యభాషాస్వరూపలక్షణనిరూపణంలో భాషావిజ్ఞాని కొన్ని కొత్తపుంతల్ని తొక్కాల్సివస్తోంది నిన్నసత్యమని అంగీకరించిన విషయాన్ని నేడుకాదని ఒప్పు కోవాల్సివస్తోంది భాషావిజ్ఞానంలో వచ్చినంత తొందరగా అలాంటిదృక్పథ పరిణామం ఇంకా మనతెలుగు విమర్శనలోకంలో రావడంలేదు

అంచేతే సాహిత్యసిద్ధాంతాన్ని linguisticise చెయ్యడం అలంకార శాస్త్రంలోని dialectic ని నశాస్త్రీయంగా 'formalise చెయ్యడంలోనే కావ్యభాషలోని విశ్వజనీనలక్షణాల్నిపట్టుకోగలమని ఈరచనద్వారా తనకు తెలిసింది

భాషాశాస్త్రం ఎందుకుచదవాలి? అని విద్యార్థి అడిగితే since it keeps you busy అని సమాధానంచెబితే అది 'అకెడిమిషియన్ బుకాయింపు' అవుతుంది తప్ప శాస్త్రీయసమాధానంకాదు ప్రతిశాస్త్రానికి వెనకవున్న శబ్దప్రమాణం ఏమిటో భాషాశాస్త్రమేచెప్పాలితప్ప మరోటి ఎలాచెప్పగలుగుతుంది?

అందుకే ఈగ్రంథంలో భిన్నశాస్త్రమార్గాల్ని ప్రదర్శించడం, సమన్వ యించడం జరిగింది. ఒకరకంగా ఈ 'కదంబ రచనకు భాష ఎన్నిరంగాల్లో

ఎంత విశ్వమయ - విశ్వోత్తీర్ణ లక్షణాలతో ప్రత్యక్షమౌతూందో చెప్పడం కూడా ఒక ప్రయోజనమే

అభినవులు ఓచోట రాసుకున్నారు 'నాకు ప్రపంచమంతా శివమయంగానే వుంది మరి జగత్తు అనేధ్వని దేన్నిసూచిస్తుందో తెలియటంలే - దని Vivas ని చదివినా పత్రికారచనల్లో భాషాప్రయోగంచూసినా, కావ్యభాషలో ప్రాముఖ్యతా సంప్రదాయన్ని గురించిరాసినా, భావగణం మీద పాకులాడినా, వేదానికీ - వాదానికీ ఏమిటి సంబంధమని వాదించినా, తనకు 'వ్యంజన ఒక్కటే కనిపిస్తోంది

అలా ఈ గ్రంథమంతా తన ఆలోచనా ప్రవంతికి అభివ్యక్తికృతి మాత్రమే మరి పాఠకుడికీ ఇందులో చెప్పబడిన అంశాలతో ఏ మాత్రం తాదాత్మ్యం కల్గినా ఇది విశ్వజనీన స్వరమే అవుతుంది కావాలనీ చేయాలనీ పండితుల్ని, పరిశోధకుల్ని, పాఠకుల్నీ అభ్యర్థిస్తున్నాడు

ఎంతరాసినా ఇది ఇనక పాతర తరగదు ఎక్కడో ఓచోట అట్టవేయాలి కాబట్టి ఆపెయ్యటం దిగితేగాని లోతుతెలీదు

రాయప్రోలువారు రమ్యాలోకంలో రాశారు - తాను కొత్తగా ఏమీ చెప్పబోవడంలేదని అది పాండిత్య లక్షణం అంటే స్ఫురణకు అందని విషయం ఏమీలేదని అర్థం

అందుకే ఇదంతా కేవలం 'శ్రుత మే శుశ్రుమ, ఆహుః గ్రధితపూర్వమ్ ఆమ్నాత పూర్వమ్, కథితః, బ్రూతే, - ఇలాంటి మాటల్ని వాడటం శాస్త్రమర్యాద

భిన్న శాస్త్రజ్ఞుల మధ్యన సదవగాహన చాలా ప్రధానం అది ఎప్పుడు ఏర్పడుతుందంటే - అందరూ ఒకే విశ్వసత్యాన్ని దర్శించి ఆలోచించినపుడు - ఏదో ఒక సామాజికావసరం శాస్త్రజ్ఞుల్ని ఒకచోట సంఘటితపరిచినపుడు అప్పుడు భాషాశాస్త్రజ్ఞుడు సంప్రదాయ వ్యతిరేకి అని, విమర్శకుడు తర్కబుద్ధిలేని చాదస్తుడని తేల్చివేసే పనివుండదు అలాంటి సంఘటన ఈ యుగంలో ఎక్కడవస్తుంది? అందులోనూ మనదేశంలో 'కొయ్యగుర్రం' సంస్కృతి, చదువుల orthodoxy – రాజాశ్రయం పోయి ప్రభుత్వాశ్రయం. వెరసి మన కున్న భేదాభిప్రాయాలనే సంప్రదాయాలుగా చెలామణీ చేసుకొంటున్నాం

తనకీ పద్ధతి సుతరాం ఇష్టంలేదు

కడపట ఓ చిన్నమాట ఇది భాషా సంబంధివిషయం కదా! వ్యావహారికంలో ఈ శ్రుతి రాసినట్టే రాయరాదూ! ఏం కొంపమునిగిపోయేది! - అంటూ అడిగింది పీళ్ళ ఆవిడ ఒకనాడు

ఆమెకి ఏం చెబుతాడు? ఏదో చెప్పాడు వ్యవహారం - వ్యంజన (అనుబంధం - 3) చదువు ! తెలుస్తుంది ! అన్నాడు

అసలు రహస్యం ఇది వ్యవహార భాషలో రాయటమంటే ము - బదులు ం 'వచ్చినాడు బదులు 'వచ్చాడు - అనడం మాత్రమే కాదుగా! అది వ్యవహారించే content' కి సంబంధించింది తమిళంలో లాగా తెలుగులో diglossia లేదు - నన్నయభాష - ఈ నాటికీ ప్రతి తెలుగు వాడూ follow అవగలుగుతున్నాడు సామాజికావసరంలేని పదమో - అనుబంధమో రాలిపోతే పోతుంది దానివల్ల రచనలోవచ్చే నష్టం ఏమీలేదు ఎక్కడో 9 శతాబ్దంలోని ఆనందవర్ధనుడి sensibility ని form లోనూ తీసుకురావడానికి అలా 'కావ్యశైలి'ని ఆధారంగా తీసుకోవాల్సివచ్చింది అసలీసిద్ధాంతంలోని ప్రాధాన్యం భాషలోని అంతర్నిర్మాణ అభివ్యక్తి కాబట్టి వ్యవహారానికి దూరంగా తీసికెళ్ళే 'కావ్యశైలి అవలంబించబడింది - అంటే సూత్రరూపభాష (deep structure) కావ్యవాక్యం - అని అర్థం ఇష్టాయిష్టాలకు ఇక్కడ ప్రసక్తిలేదు ప్రాచీనభాషా పునరుద్ధరణ అంతకంటేకాదు ఇలారాస్తే గౌరవం పెరుగుతుందనీకాదు. Content ని బట్టి form - అంచేత ఈ వ్యాసంలో వాడబడింది 'metalanguage తప్ప 'conversational variety కాదు ఇక్కడ కనిపించేవి 'stylemes తప్ప 'morphemes కావు

ప్రతి శీర్షికా ambiguous గా ఉండటానికి కారణం ఇందులోని 'content అని పాఠకులూ అంగీకరిస్తే తనది tearse style అని అనుకోరని తాననుకొంటాడు

ఎందరో మహానుభావులు - అన్నాడు ఒక కృతికర్త వందనాలు వాళ్ళకే కాకుండా అందరికీ

నమోమహద్భ్యో నమఅర్భకేభ్యోనమో యువభ్యోనమ ఆశినేభ్య ః
యజామదేవాన్యది శక్నవామ యజ్యాయసః శంసమ్మావృక్షి దేవాః31
పురుషస్యవాగ్ రసః32
అగ్నిర్వాగ్ భూత్వాముఖం ప్రావిశత్33
• ఆనందో బ్రహ్మ

31 R V 1-2-27, 32 Chaan Up 1-1-2, 33 Ait Up 1-3-2

# చత్వారి వాక్

శబ్దం నాల్గురకాలు

1 తార్కికుల లింగం 2 లౌకికుల, వైయాకరణుల వాచకం

3 వైదికుల ప్రతీక 4 కవుల వ్యంజకం

ఇది వర్ణచతుష్టయస్వరూపమహాశబ్ద విభక్తదశ ఇదె చాతుర్వర్ణ్యం

శబ్దశక్తిచేత అర్థకక్ష్య భిన్నమౌతున్నది లింగ శబ్దం తాత్పర్యశక్తి కలది లేక అనుమాపకం వచకం అభిధాశక్తి వ్యంజనాశక్తి వ్యంజకానిది ఈ శక్తులే వృత్తులు - వ్యాపారాలు శబ్దవ్యాపారమే - ప్రసరణ శీలమేశక్తి ఈ నాల్గు ఆకులుగలది శబ్దచక్రం ఈ నాల్గింటిని రెండుగా విభాగించవచ్చు

1 సమష్టిశబ్దం 2 వ్యష్టిశబ్దం

ప్రథమం ప్రతీక - లేక వ్యంజకం లేదా - కావ్యశబ్దం

రెండవది వాచక - లింగశబ్దం, ఇది మనఃకల్పితం ఆలోచనాజన్యం

అది స్ఫురణాజన్యం దార్శనికం స్వతంత్రావతరణ శక్తికలది

ఇది హృదయజన్యం అది మనోజన్యం

ఈ శబ్ద స్వరూపం - స్వభావం - స్థాయి తెలియకుండా శబ్దార్థ సంబంధ నిర్ణయం కుదరదు

ప్రతీకాశబ్దానికర్థంలేదు భావమే ఇది తాత్త్వికమూ - పారమార్థికమూ వావ్యార్థముండదు మనఃప్రవోదితం కాదుకనక దానికి వావ్యార్థం చెప్పటం పేరే అపాండిత్యం అదార్శనికత దాని కక్ష్య - భూమిక వేరన్న పరిజ్ఞానం లేకపోవటమే లోకంలో అపశాస్త్రవిర్భూతికి - అపసిద్ధాంత వ్యాప్తికీ హేతువు. ఇందుకే భాగవతమన్నది

శబ్దస్యహి బ్రహ్మణ ఏషపంథా
యన్నామభిర్ధ్యాయతి ధీరపార్థైః
పరిభ్రమం స్తత్ర నవిందతేర్థాన్
మాయామయే వాసనయా శయానః

"వేదశబ్దానికి నైఘంటికార్థం / వ్యావహారికార్థంలేదు ఈ మాయాజాలంలో చిక్కుకొన్న మనస్సుకి వేదార్థావగతి శూన్యం"

'మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునా
ధియో విశ్వావిరాజతీ' (ఋగ్వేదం)

''బృహత్సింధువు, సరస్వతి దివ్యదర్శనంతో మనల్ని జ్ఞానంలో జాగృతులను చేస్తూ మన ధీపథాలను వెలిగిస్తున్నది''

ఈ ప్రచోదన సమష్టిదశలోది ఇక్కడ వ్యష్టి మనస్కృతలేదు ఈ శబ్దం ప్రతీక వాచ్యార్థంలేనిది లౌకికశబ్దం వ్యావహారికం కనక అతీతార్థంలేనిది రెంటినీ కలిపేది వ్యంజకం కావ్యం నీరసలోకాన్ని సరసంగా ఆవిష్కరిస్తున్నదికనక, సుఖ దుఃఖ సమన్వితలోకాన్ని అభినయోపేతంచేసి రసవత్తరంగా ఆవిష్కరింప చేస్తునది - కనక లోకమూ = వాచకమూ + అభినయమూ = ప్రతీకాకలిం వ్యంజక శబ్ద మౌతున్నది కావ్యంలో వాచ్యార్థముంటూ ప్రతీకార్థం ధ్వనిస్తున్నది కనక రెంటికి సమన్వయం వ్యంజన సూత్రం ఇందుకే ధ్వన్యాలోకంలో 3-1 వృత్తిలోగీతాశ్లోకం 'యానిశా - - ఉదాహృతమైనది అంటే వైదిక ప్రతీకను వ్యంజన సూత్రంలోకి ఆచార్యుడు ఆకర్షించుకున్నాడు

ఇక్కడ శబ్దంకాడా స్ఫురణాజన్యమేతప్పా ఎవడూ ఆలోచించి (కావ్యం) వ్రాయటంలేదు ఈ విషయం ధ్వన్యాలోకంలోనూ చెప్పాడు, సరస్వతి తనంత తానై కవిననుగ్రహిస్తున్నదని

ఈ శబ్దానికి కర్త వ్యక్తికాదు సమష్టివ్యక్తి మనలో లోపలి మరోతత్త్వం ఇది నిత్యార్థం విశ్వజనీనం వైయక్తికంకాదుకాబట్టి వాచకం వైయక్తికం కాబట్టి కల్పితం అనిత్యం ఇక్కడ భాషా భేదాలున్నాయి అక్కడలేవు

లోకంలోనూ ఇక్కడ మొదలుపెట్టి ఇక్కడ ముగిస్తామని అనుకొని మాట్లాడటంలేదు, మరి పొసగింపు - పూర్వాపర సంధానత్వం - ఏక వాక్యత వక్త భాషకెలా సంక్రమిస్తోంది; నియామకు డెవడు ? మనకు తెలిసిన విషయంకాదు ఇదే ఇలా ఉన్నపుడు కావ్య, వేద శబ్దం దగ్గరికి వెళ్తే మన

వ్యాకరణం పనికి రాకుండా పోతున్నది ఇందుకే లౌకిక వ్యాకరణానికి లొంగని ప్రయోగాన్ని 'ఛాందసమ' న్నారు అంతే - దర్శన జన్య శబ్దానికి అదర్శన జన్యమైన - తర్క జన్యమైన వ్యాకరణ శాస్త్రంపట్టదు

ఈ శబ్దానికిది అర్థమన్న సంకేతం ఎంత విచిత్రమైంది? తరతరాలుగా ఇలా అనుకొంటున్నారు కనక - అనే సమాధానం వ్యావహారిక శబ్ద విషయం కావచ్చుకాని దార్శనిక శబ్దవిషయం కాదే। శబ్దాని కెన్నిరకాలుగా అర్థం చెప్పవచ్చు?

I పదప్రత్యయ విభాగదృష్టి - వ్యాకరణ శాస్త్రవిషయం

II సందర్భగతానువిద్ధతచేత సంక్రమించే విచిత్రార్థ పరంపర - ఆలంకారిక విషయం గతో స్తమర్కః - వాక్యం ఇదే దృష్టితో చర్చింపబడ్డది

III వేదశబ్దం దగ్గర ఇవి రెండూ కుదరవు

a) ధాత్వర్థదృష్టి - అగ్ని - అగ్రమందున్నవాడు.

b) ప్రతీకాదృష్టి - గోవు శబ్దానికి ప్రతీక (ఇది గుణసంబంధి దృష్ట్యా)
పద్మం = విశ్వం (ఉన్మేషనిమేషరూప సౌందర్యదృష్ట్యా)

c) విలోమదృష్టి - శబ్దాన్ని తిరగవేసి అర్థం చెప్పటం.
హంస - సోహం (ఇక్కడ సూత్రం - తత్త్వం తిరగబడి వ్యక్తమై సృష్టిగా పరిణమించిందికాబట్టి)

ఇలా సూత్రాలున్నాయి - అర్థ నిశ్చయానికి

ఇదిలా ఉండగా భిన్న శబ్దాలుకలిసి వాక్యమేర్పడితే అన్నీకలిసి ఏకైకార్థాన్ని ఎలాప్రతిపాదిస్తున్నాయి? ఇదొకటి మరొకటి - ఆ అర్థాన్ని శ్రోత ఎలా గ్రహిస్తున్నాడు? ఇదిజ్ఞాన సిద్ధాంత విషయం వస్తుజ్ఞాన హేతువేమిటి? పదార్థం - మనస్సుల సంయోజనం వీటి స్వరూప మేమిటి? జగత్సంబంధిజ్ఞానం మనకెలా సిద్ధిస్తున్నది? జగచ్చాలనశక్తి శబ్దంకనక శబ్దం జగత్సంకేతంగా ప్రాచీను

లభివర్ణించారు దాని సంకేతంగోవు ఈ గోసాంకేతిక మేమిటి? ఈ ప్రశ్నలన్నీ శాస్త్రీయాలే సమాధానంగా మనలోనే మౌలిక జ్ఞానగ్రహణ - వాక్యార్థగ్రహణ యంత్రం ఉండి ఉండాలి - అనడం ఇక్కడనుండే వ్యంజనశక్తి సిదాంతం పుట్టింది ఆ గ్రహణశక్తిమీద ఆధారపడి శబ్దశక్తి అవగతమవుతున్నది ఇందుకే ఆనందవర్ధనులన్నారు ,

శబ్దార్థ శాసనజ్ఞాన మాత్రేణైవ నవేద్యతే

వ్యంజనసూత్రమంటే శబ్దశక్తి నిర్వచనం విద్యపేరే సూత్రం ఎవడు విద్యాపేత్త? సూత్రతః నిర్వచించేవడు ప్రతిదీ నిర్వచనయోగ్యమే ఆ నిర్వచనం సూత్రితం కావటం పేరే శాస్త్రం. వాచ్యార్థముండగా రహస్య - ప్రధానార్థం - దూరంగా ప్రసరిస్తున్నది ఆ శక్తి స్వరూప నిర్వచనం వ్యంజన సూత్రం సూత్రం అనేకత్వాన్ని ఏకైకార్థోన్ముఖం చేసేది వ్యంజన - అంటే భౌతిక మనస్సంకల్పితం కాకుండా శబ్దగత విచిత్రార్థాన్ని బహిర్గతం చేసేశక్తి అని అర్థం

ఇదే విషయాన్ని వ్యష్టి పరిధినుంచీకూడా ఆలోచించవచ్చు అసలు శబ్ద మేమిటి? అర్థ మేమిటి? - వాటి స్వరూపం, స్వభావం ఏమిటి? ఎందుకు పుడుతున్నది? అంటే ఏ ప్రయోజనాన్ని ఆశించి? ఎక్కడనుండి జన్మిస్తున్నది? అంటే భౌతిక - అక్షరరూపభాష శబ్ద - పూర్వ పూర్వావస్థాస్వరూపం ఏమిటి? ఇదంతా తేల్చకుండా వ్యావహారికంగా శబ్దార్థాలను భావించటం జ్ఞానలక్షణ మనగలమా ;

మొదటిదాన్ని వివరిస్తూ పతంజలి మహర్షి భాష్య పీఠికలో అన్నారు

అథ గౌరిత్యత్ర కః శబ్దః - గోవన్నాము ఇక్కడ శబ్దమేది? గంగడోలు, తోక, కొమ్ములుకలదా; అది ద్రవ్యం తలవూపటం; తోకాడించటమా ? అది క్రియ శుక్లాదివర్ణమా ; అదిగుణం వస్తువుకంటె భిన్నంగావుంటూ వస్తువు నశించినా నశించని సామాన్యమా ; - అది ఆకృతి

కస్తర్హి శబ్దః ? దేన్ని ఉచ్చరిస్తే ఆయా అవయవాలుకల గోవులు బుద్ధికి గోచరిస్తాయో అది శబ్దమంటే - ఇది విచారణ సారాంశం వ్యష్టి మనోజన్యమైన వ్యావహారిక శబ్ద నిర్వచనం

మరి అర్థమంటె ? - శబ్దబోధిత పదార్థం సరే। అదేమిటని? అది మరొక దానికి ప్రతీక ఇది శాస్త్రీయంశం అది అదె గోవంటే గోవే - ఇది వ్యావహారికం అది ప్రతీకార్థం - ఇది వాచ్యార్థం, అది నిత్యం - నియతం ఇది అనిత్యం - పరంపరాగతం (conventional) నిత్యార్థం భావించలేని వ్యక్తి అనిత్యార్థాన్ని కల్పించుకొంటున్నాడు ఆరోపించుకొంటున్నాడు ఈ ఆరోపిత సత్యంలోకం వాచ్యార్థమంటే ఇదే ఏ విధంగా బాహ్యవర్ణాదులు అర్థ బోధకాలుకావో, ఎందుకని నిత్యమైన విశ్వజనీనమైన శబ్దం - స్ఫోటగా గుర్తింప బడి అర్ధబోధక సమర్థంగా భర్తృహరి సంప్రదాయంలో చెప్పబడిందో - అందుకే అర్ధంకూడా పై రితిలోవుంది శబ్దమూ - అర్థమూ మనః కల్పితాలా కావా ! - మనః కల్పితాలు వాచక వచ్యార్థాలు - అతీత మనః పరిచోదితాలు కావ్య వేదశబ్దాలు - (చూ ఈ గ్రంధం (వ్యం సూ ) పుట 78) ఈ వ్యంజక ప్రతీకా శబ్దాలు మనోఽతీతార్థ వ్యంజకాలు ఇవి 'conventional కావు నిత్యాలు విశ్వజనీనాలు

ఈ శబ్దార్థ సంబంధం ఏమిటి నిత్యమా కార్యమా (కల్పితమా!) శబ్దార్థాలు నిత్యమైనపుడు సంబంధమూ నిత్యమే అంటే సిద్ధమేకాని సాధ్యంకాదని ఇది పతంజలి మతం దీన్నిగూర్చి ఈ సిద్ధాంతవ్యాసంలో భిన్నవాదాలు పరామర్శించబడ్డాయి అక్కడ అర్థమంటే ద్రవ్యమా ? ఆకారమ ? జాతా మొదటి రెండూ అనిత్యాలు మూడవది నిత్యం బుద్ధిలో ఏది భాసిస్తుందో నిత్యప్రవాహంః - అది అర్థం ఆకార - వ్యక్తులు - కావు ఇవివాచ్యార్థాలు అది మానసిక అవభాస ఈ శాస్త్రీయ విచారణ ప్రవాహంలో ధ్వని విచారణ చేసిందీ ప్రస్తుత గ్రంథం

వాచ్యార్థ కక్ష్యదాటిన పిదప వ్యంగ్యార్థ కక్ష్య శబ్దాన్నికున్న వాచ్యార్థం మనః కల్పితం వ్యంగ్యార్థం మానసికావభాస మనస్సులో ఉద్యోతించేది స్వయం

ప్రకాశ మానార్థం నిత్యార్థం శబ్దం జన్మిస్తూ, అనేక అవరణలు ఛేదించుకొంటూ దశలు మార్చుకొంటూ వ్యక్తదశకుచేరి వ్యావహారిక శబ్దరూపం పొందుతున్నది - వైఖరీ వాగ్రూపం పొందుతున్నది

ఇక్కడ ఒకప్రశ్న మూలభూత శబ్దం ఎందుకుత్పన్న మౌతున్నది? అని.
కేనేషితం వాచమిమాం వదంతి?

మనుష్యులు ఎవరిచే ప్రేరేయబడిన ఈ వాక్కునుచ్చరిస్తున్నారు? అన్న కేన తాత్పర్యమేమిటి?

అర్థావభాసనిమిత్తం శబ్దోత్పత్తి జరుగుతోంది అర్థమంటే తాత్పర్యతః భావం భావోద్రిక్తత శబ్ద జన్మకారణం కిమిదం వ్యాహృతంమయా?'- ఏమిటిది? నాచేత ఇలా ఉచ్చరితమైన దన్న వాల్మీకి వాక్యార్థమిదే ఆ భావం నేటి మన సత్వ శాస్త్రప్రకారం బాహ్యవ్యక్తిదికాదు లోపలివ్యక్తిది వాడు నిత్యపదార్థం కనక శబ్దం అర్థాన్ని బహిర్గతం చెయ్యడానికే పుడుతున్నది ఇది విశ్వస్థాయి (cosmic level) లోని మాట వ్యక్తిలో సాంఘికమైన పరస్పరావగాహన (communication)కు కనక శబ్దగత వ్యంజకతా శక్తిచేత రహస్యార్థావభాస - ఉద్యోతనం జరుగుతున్నది వక్తా్శ్రోతా చెవులప్పగించి వినటమే దానంతటది పుడుతున్నది ఇందుకే ధ్వన్యాలోక పరిచ్ఛేదాలు ఉద్యోతాలన బడ్డాయి ఉద్యోతన మంటే ప్రకాశం (illumination) – దర్శనం (vision) అవి అర్థం.

'ఉద్యోతనసూరి అంటే ఆచార్యుడని జైనగ్రంథ ప్రసిద్ధం ఈ ఉద్యోతన శబ్దం బౌద్ధ గ్రంథాల్లోది - ధ్వన్యాలోకం శాంతరస్థాయిగాచెప్పిన 'తృష్ణాక్షయ సుఖం అన్నమాటలోని తృష్ణ - బౌద్ధం చెప్పిన 'తన్హా - తద్విధారణ అక్కడ అత్యధికం - తృష్ణను చంపటమే సన్న్యాసం అందుకే బౌద్ధం కేవలం సన్న్యాసమతం - కాగా 'ఉద్యోతన శబ్దమూ వారిదే కాని 'ధ్వని శబ్దాన్ని వైయాకరణులనుండీ వీరు గ్రహించినా వేరే అర్థం చెప్పినట్టు - ఉద్యోత శబ్దంకూడా వేరే అర్థంలోనే వ్యవహరింపబడింది కాశ్మీర శివాద్వైత సంప్రదాయంలో శివుడు ప్రకాశాంశ అర్థ స్వరూపుడు - నిత్యుడు దేవి శబ్ద

స్వరూప విమర్శాంశ చలన రూపస్పృష్టస్వరూపిణి అది అవ్యక్త తత్త్వం రెండూ సత్యాలే శబ్దం తాను వ్యక్తమౌతున్నది తనంతతానై ఇది స్వతంత్ర శక్తి. వ్యక్తమౌతూ వ్యంగ్యార్థాన్ని గుంజుకొని వస్తున్నది ఇదే సృష్టి వచ్చిన తర్వాత అపండితుడు వాచ్యార్థాన్ని - సృష్టి వ్యావహారికతను చూస్తున్నాడే తప్ప సృష్ట వ్యంగ్యార్థ రామణీయకాన్ని చూడటం లేదు కాబట్టి శబ్దశక్తి చేత ఉద్యోతితమైన - ప్రకాశమానమైన అర్థంధ్వని శివుడు

ఈ ఉద్యోతనం శబ్దశాస్త్ర మాత్రేణైవ నవిద్యతే - అంతు దర్శనేనైవ - వ్యంగ్యార్థావభాస తార్కికంకాదు రసావేశానుభూతం అంటే సాక్షాద్బోధ తప్ప మనోద్వారేణ కాదని తాత్పర్యం దీన్ని సహృదయధర్మంగా చెప్పారు దీన్నే వారి తత్త్వశాస్త్రంలో శక్తిపాతంగా అభివర్ణించారు (శబ్దశక్తి) దేవి అనుగ్రహంద్వారానే శివసాక్షాత్కృతి - అని తాత్పర్యం దీన్నే (వైదికులు) ఋగ్వేదంకూడా ఇలా అన్నది

ఉతత్వః పశ్యన్నదదర్శవాచమ్
ఉతత్వం శృణ్వన్నశృణోత్యేనామ్
ఉతోత్వస్మై తన్వం విసస్రే
జాయేవపత్య ఉశతీ సువాసాః

వాక్కు కన్పించినా ఒకనికి కన్పించనట్లుగానే ఉందట విన్పించినా విన్పించ నట్లుగానేవుంది మరొకనికి తన నగ్న స్వరూపాన్ని ప్రదర్శిస్తున్నది - అనురాగవతి భర్తృప్రేమగలసతి స్వతనూ ప్రదర్శనం చేసినట్లు

అంటేఅర్థంతర్కబోధితంకాదు బోధ (జ్ఞానం) తార్కికంకాదు ప్రత్యక్ష దర్శనమే వేదాంత సత్యమూ ఇంతే - ధ్వనీ - ఇంతే. కాబట్టి శబ్దం వ్యావహారికంకాదు ప్రతీకే వాచకంకాదు ఆ ప్రతీకకూడా నీరసప్రతీకకాదు సరసప్రతీక అంటే వ్యంజకం - తార్కిక లింగంకాదు అర్థం అనుమితంకాదు అనుభూతం - దర్శితం

ఈ వైదిక ఔపనిషదిక విచారణధార ధ్వన్యాలోక పీఠిక - భూమిక దీనితోనే గుప్తపాదులు తార్కికుల అనుమానవాదాన్ని - మహిమభట్టు సిద్ధాంతాన్ని కూలంకషంగా ఖండించారు రసధ్వని విషయకంగా అనుమాన సిద్ధాంతం దుష్టమూ - హేయమూ

ఇది భూమికగా ఈ సిద్ధాంతవ్యాసం అవతరించింది ఇది శబ్దశాస్త్రమా; తత్త్వశాస్త్రమా; అలంకార శాస్త్రమా; అన్న మీమాంస కలుగుతుంది ఈ మూటిల్లోనూ ఉన్నది శబ్దమే ఐనా కక్ష్యలు మాత్రం భిన్నం - అర్థాలు వేర్వేరని అర్థం

చత్వారిశృంగా త్రయో అస్యపాదా
ద్వేశీర్షే సప్తహస్తా సోఅస్య
త్రిధాబద్ధో వృషభో రోరవీతి
మహాదేవో మర్త్యా అవివేశ

ఈ వేదమంత్రాన్ని పతంజలి భాష్య పస్పశంలో ఉదాహరించి నాల్గు శృంగాలంటే నామాఖ్యాత ఉపసర్గ నిపాతాలన్న నాల్గు శబ్దాలనీ మూడు పాదాలంటే త్రికాలాలనీ, రెండు తలలంటే నిత్య - కార్యరూప శబ్దాలనీ ఏడు చేతులంటే 7 విభక్తులనీ, మూడుచోట్ల బంధింపబడడమంటే హృదయకంఠశిరస్సులనీ. అరవడమంటే ధ్వనించటమనీ - ఇలా మహాదేవుడు శబ్దమేననీ చెప్పాడు ఇది తన శాస్త్రానుకూలంగా చెప్పిన అర్థం

కావి వైదికార్థంవేరు ఇలా కక్ష్యభేద దృష్ట్యా శబ్దార్థాలు మారుతున్నాయి అంటే చత్వారిశృంగా - పురుషార్థ చతుష్టయం, రెండుతలలు - వ్యక్తావ్యక్తాలు (భూమ్యాకాశాలు); మూడు పాదాలు - ముల్లోకాలు, ఇలా వైదికార్థం చెబితే భిన్నకక్ష్యలోకి పోతున్నది విషయం కాబట్టి ఇదంతా విచారణలోకి తీసుకోవటం

శాస్త్రీయం అందుకని ఈ గ్రంథం ఆ పనిచేయటం నేటి పరిశోధనా పరిధికి క్రొత్తకావచ్చు తప్ప శాస్త్రితఃకాదు నిత్యమే ఉన్నదే

శబ్దోత్పత్తి కారణమేమున్నదానికి బహుళ రెండు సమాధానాలు (1) భౌతిక దశలో అభిప్రాయ ప్రకటనం - అంటే వ్యవహార నిమిత్తం - ఇది సాంఘికదృష్టి

(2) తాత్త్వికదృష్ట్యా - అంతరభావం వ్యక్తీకరణం పొందటం - సమష్టి దశ అంటే సృష్టి ఇది cosmic aspect' ఇక్కడ వైయక్తిక ప్రయత్నం లేదు ఉన్నభావం తనంతతానై అభివ్యక్తిపొందుతున్నది వేద కావ్యభాషా పరిధి ఇదే

ఈ రెండు దృష్టులూ పాశ్చాత్యుల్లోనూ వున్నట్లుగా ఈ గ్రంథం 78వ పుటలో కార్టీజియన్ సంప్రదాయవాదంగా వివరింపబడ్డది అంటే ఇదంతా శబ్దార్థ విచారణాపరిధి ఇది విస్తృతమైన కొలడీ లోతుపెరుగుతుంది

ఈ గ్రంథం దానికి వ్యంజకం

ప్రస్తుత గ్రంథాకృతి

1. పృథక్కరణ 2 సూత్రీకరణ - అధ్యాయాలుగా విభక్తం ప్రథమమంతా శబ్దార్థవిషయక పాశ్చాత్యపండిత వివేచనసారాంశం ద్వితీయం ప్రాచ్యదర్శనం వ్యంజనసూత్రం భాషాశాస్త్ర విషయమా, అన్నదానికి సమర్థనంగా భూమిక అసూత్రితమైనది అది లేకపోతే ఇది భాషాశాస్త్ర విషయం కాదనటానికి అవకాశం ఉండేది. ఇప్పుడులేదు (చూ స్టాల్, రాబిన్స్ వాక్యాలు వ్యం. సూ పు 8 - 9) అందుచేత అది భూమిక - అంటే స్థాయిదశ ఆ స్థాయిలో నిలబడి చూడాలేతప్ప భాషాభేదాలు - కుటుంబాలు - ఈ గోలదీనికి భూమికకాదు. ఇది శబ్దార్థతత్త్వ విచారణ మూలసూత్ర విచారణ. వ్యక్త భాషాభేద విమర్శకాదు అది అతిస్థూలం. ఇది అతిసూక్ష్మం అందుకని పాఠకునికి క్లిష్టమే

పృథక్కరణంలో ప్లాటోవాదం తాత్త్వికదృష్ట్యా - బహుశా ఊర్ధ్వదృష్ట్యా లేక సమష్టిదృష్ట్యా చేయబడింది ఇది కేన వాదానికి సాన్నిహిత్య సమీప్యతలు పొందుతుంది. వస్తువు భావానుకరణం శబ్దం వస్త్వనుకరణం - అన్నచోట (వ్యం సూ పుట 39) విచారణ తాత్త్వికం

స్టాయికులవాదం కొంత తాంత్రిక సన్నిహితం శబ్దార్థాలు వ్యక్తావ్యక్తాలనడం దీనికి నిదర్శనం శబ్దార్థాల నడిమి సంబంధం సహజమనటం భారతీయ వైయాకరణ సంప్రదాయగతాంశమేనని స్పష్టమే నిరూపింపబడింది

శబ్దానికున్న అర్థం ప్రత్యేకమా। సందర్భగతమా। అన్నదానికి అగస్టయిన్ ఇచ్చిన ఉదాహరణ (చూ వ్యం సూ పుట 47) - కుశల శబ్దాదుల దగ్గర భారతీయుల విచారణకు సన్నిహితమే కుశ - దర్భ కుశలు నేర్పుగా కోసేవాడు - కుశలుడు ఈ వాచ్యార్థం 'నేర్పరి అన్న లక్ష్యార్థంలోనే స్థిరపడింది -

ఇలా ప్రాక్ పాశ్చాత్య విచారధారా సాన్నిహిత్య సమీక్షకోసం ఈ అధ్యాయం వ్రాయబడటం నిజంగా శబ్దార్థ జిజ్ఞాసువులకెంతో ఉపకరిస్తుంది అక్కడక్కడా సంబంధం గ్రంథకర్త స్థాపించాడు ఉదా చూ పుట 87

పాశ్చాత్యుల్లో వ్యంజనను గుర్తించినవారు ఎంప్లేప్ (వ్యం. సూ పుటలు 60 61) ప్రభృతులుగా ఈ గ్రంథకర్త గుర్తింపు। ఈ అంశం ధ్వనివాదంతో ఇంకా విస్తృతంగా పరిశీలించడానికి యోగ్యమైన విషయంగావుంది అలాగే 86 పుటలో వ్యంజన అని అనకుండా అదెలా ఉన్నదో ఒక సంభాషణ గంపర్జ్ - ఉదాహరించాడని సూచించబడింది అలాగే అర్థాలు సప్తవిధాలనీ అందులో వ్యంగ్యార్థ మొకటన్న భావన లీచ్‌పండితునకున్నట్లు సూచించబడింది (వ్యం సూ పుట 93)

స్వప్నం మానవుడికి తనలోతు - మరొక తెలియని పరిధి - తనకున్నదని చెప్పినట్లుగా వ్యంజనా వ్యాపారం శబ్దానికున్న అన్యపరిధిని సూచిస్తుంది - కనక

వ్యంజన భాషాశాస్త్ర పరిధిలోదే అనటానికుదాహరణగా పు 96లో Fonagy మాటలు ఉదాహృతం కావటం ముదావహం అలాగే బార్తైస్ హాక్స్వంటివారు భాషేతరాంశముల నాధారముగ తార్కికముగ లొంగని కావ్యవ్యంజకతను సూత్రీకరింపవలయునని ఈ నాడు వాదించుట వ్యంజనసూత్రావిర్భావమునకు సమర్థనము (పుట 117) అనడంకూడా

ఈ పృథక్కరణాధ్యాయమంతా వ్యంజనసూత్ర పీఠిక

ఈ అధ్యాయాంతంలో ఈ గ్రంథకర్త ఒక చిత్రమైనమాట అన్నాడు

ప్రాచ్య పాశ్చాత్యములనువింగడింపు మానవ మనస్తత్వ సంబంధి తప్ప దేశవిషయంకాదని - ఇది విషయాన్ని అంతరదృష్ట్యా మనస్తత్వదృష్ట్యా చూడటం భౌగోళికంగా - భౌతికంగా చూడటం 18 19 శతాబ్దాల భౌతికదృష్టి ఆధునికం మానసికదృష్టి - మనస్తత్వ ॥ ప్రదృష్టి అంటే పరిశోధన భౌతిక కక్ష్యనుండీ అంతఃకక్ష్యా వ్యాప్తిపొందటం ఈ ప్రాక్పాశ్చాత్యభేదం మానసికం ఇదేవిషయాన్ని కృష్ణప్రేమ తన కఠోపనిషద్వ్యాఖ్యానంలోనూ అన్నాడు

వ్యంజనసూత్రానికి పునాదిగా కాశ్మీరశివాద్వైత సంప్రదాయాన్ని నేపథ్యంగా స్టాల్ప్రభృతులు గుర్తించినట్లు భూమికలోనే స్పష్టపడింది దానికి వివరణగా సూత్రీకరణంలో 200-201 పుటల్లో సోదాహరణంగా సూచితమైనది కాని అది కూలంకషంగా చర్చితంకాలేదు కాకపోవటానికి హేతువుఅధి పెరిగితే ప్రస్తుతవిషయం లుప్తమౌతుందికనక

కాశ్మీర శివాద్వైతం ధ్వన్యాలోకానికి ఇంచుక పూర్వమే ప్రారంభమైనది ఆనందవర్ధనుల సమకాలీనుడైన కల్లటభట్టు (855-83 A D ) స్పందకారికాకర్త దానికివ్యాఖ్య వ్రాసాడు గ్రంధ ప్రారంభంలో అన్నాడు

శ్రీ శివ ద్వైత సద్భావ సంభూత్యై భవతాత్సదా

పర్యాయః సంగృహీతోఽయం స్పందవృత్త్యర్థ ద్యోతకః

(ఈ ద్యోతకశబ్దమే ధ్వన్యాలోక ఉద్యోతశబ్దం ఇంటుకే ఈ ప్రస్తుత సిద్ధాంతకర్త కూడా ఇలాగే అభిప్రాయపడ్డాడు) ఈయన గురువు వసుగుప్త పాదులు - అని స్పందకారికలో పేర్కొన్నాడు ఇతడే శివాద్వైత సంప్రదాయ ప్రవర్తకుడు (క్రీ శ 800 ప్రాంతం) తత్సంప్రదాయ మూలగ్రంథమైన శివసూత్రకర్త - లేక - దార్శనికుడు ఈయనే (చూ K C పాండేగారి అభినవగుప్త పుట 154) అందుచేత ఆనందవర్ధనుల ధ్వని సిద్ధాంతానికి వ్యంజనావ్యాపార విచారణాధారంగా ఈ ప్రత్యభిజ్ఞాసంప్రదాయంవుందనుకోవటంలోని సామంజస్యం లేదనుకోవటంలోలేదు ఇది ఆధునిక పరిశీలనల్లో గుర్తింపునకువచ్చిన విశేషాంశం దాన్ని ఈ గ్రంథకర్త గుర్తించడం సమంజసమే

పు 141లో మహిముని గ్రంథాధ్యాయాలు విమర్శలు - కాబట్టి అతడు వివేకి అనీ - వ్యక్తి వివేకగ్రంథకర్త కాబట్టి - ఆనందుడు స్ఫురణను విశ్వఎంచినాడు కనుక ఆలోకించినాడనీ (ధ్వని ఆలోకం) కుంతకుడు వాగున్మేషమును సూత్రీకరించినాడు (అతని గ్రంధ అధ్యాయాలు ఉన్మేషాలు) కనుక స్పందవాదిగా ఈ గ్రంధకర్త అనటం సొగసుగా ఉంది ఎందుకంటే ఆయా గ్రంథకర్తల సిద్ధాంతవ్యంజకంగా నామకరణంచేసారనటం కాస్త ప్రియమైన సత్యం కనక సొగసుగా వుందనటం ఈ మాటలు తెలుగులో పూర్వం ఎవరూ అనగా విన్నవీకావు కన్నవీకావు ఒక పరిశోధనఇంతలోతుగా చేస్తేతప్ప సిద్ధాంత గ్రంథంకాదు

ఉన్మేష శబ్దం స్పృష్టార్థంలో శివాద్వైత పరిభాష. 'యస్య ఉన్మేష నిమేషాభ్యాం జగతః ప్రళయోదయౌ తంశక్తి చక్రవిభావ ప్రభావం శంకరంనుమః' అని స్పందకారికలో ప్రథమశ్లోకం ఈ ఉన్మేషమే వక్రోక్తి జీవితాధ్యాయం

వ్యంజనసూత్ర ఖండన చేసినవారిలో ప్రథితుడూ ప్రథముడూ వ్యక్తి వివేకకర్త - దీనిపై గుప్తపాదులవారిలోచన వ్యాఖ్యలో సమగ్ర ఖండనం వుంది - ఆయా విషయాలు ఈ గ్రంథంలో పరామృష్టాలు కావటం జిజ్ఞాసువులకు ఆనందప్రదాయకాలు (చూ పుటలు 158- 66)

ఆనందవర్ధనుడు చేసిన అవివక్షితవాచ్య - వివక్షితాన్యపరవాచ్యాలన్న ధ్వని భేదాలను ఈ గ్రంథకర్త భాషలో రెండు ప్రధాన భావవ్యక్తీకరణ దశలున్నవి శబ్దావివేకిత శబ్దనివేదిర (పుట 208) అం అవివక్షిత - వివక్షిత భేదకల్పనలోవి భాషాసూత్రి వివేచన చెయ్యటం వ్యంజనసూత్రం భాషాశాస్త్ర విషయం ఎలా అవుతున్నదో వివరించడానికి ఒక ఉదాహరణ మాత్రమే

212 వ పుటలో ఘటప్రదీప న్యాయాన్ని భిన్నమతాచార్యులు భిన్నంగా ఎలా వ్యాఖ్యానించారో చెప్పబడింది ఇది చాలా అద్భుతంగా ఉంది

ఇలా చెప్పుకుంటూపోతే గ్రంథమంతా పునరుదాహృతమౌతుంది కాబట్టి సహృదయ శేఖరులూ విపశ్చిన్మణులూ ఆలోకించాలి - ప్రతిభాలోచనంద్వారా

216 పుటలోవి 'ఆధునిక నిరూపించిరి అనేవాక్యం అలాకాదు ఉండాల్సింది మాండూక్యంచేసిన త్రివిధ పురుష వాదాన్ని ఆధునిక మనస్తత్త్వ శాస్త్రం సమర్థిస్తున్నది కాబట్టి ఈ దృష్టిలో దాన్ని ఆధునికులు చూచారనాలి ఇదే తాత్పర్యంలో ఆ వాక్యమనబడినా ఆ అర్థం రావటంలేదు అక్కడే తాంత్రిక సంధ్యాభాష వ్యంజనకు ప్రాణమనటంకూడా వివరణ సాపేక్షకమే

ఈ పద్ధతి విచారణ తెలుగులోలేదు డా కుంజున్ని రాజాగారి The Indian Theories of Meaning వంటి గ్రంథాలు ఒకటి - తప్పితే - రెండు - ఈ గ్రంథానికి చాలా మాసిపోయిన రంగుల నేపథ్యం మాత్రమే కనక ఈ నవ్యదృష్టి భాషాశాస్త్ర వేత్తలకేకాదు - ఆలంకారికులకున్నూ ఉపాదేయమే

గ్రంథ రచనతోపాటు జ్ఞాపికా వివృతి - అనుబంధాలుకూడా గాథానుబంధాలు కావటం విశేషం అవి అనేక విషయాలకు కూడలిస్థానాలు విద్యార్థికి ఇవెంతో ఉపకరిస్తాయి ఎన్నోవిషయాల్ని అందులో గ్రంథకర్త వివరించాడు నిజానికి జ్ఞాపికలలా ఇవ్వడం తెలుగు పరిశోధనలో క్రొత్తమలుపు

అందుకనే ఈ గ్రంథం ఒక నవ్యదీపాలోకం

విశిష్టమార్గ ప్రబోధకం

సెప్టెంబరు 1981 'కుమార భారతి

# వాక్ ప్రబోధము

## INVOCATING VA K

నమోవాచే నమోవాచస్పతయే

- తైత్తిరీయారణ్యకము 1-30-3 పా.

యస్మాదేషణ విక్రియా యమదితాహ్యానంద చిద్రూపమయో
యస్త్యైవోద్ధర శక్తివైభవ మిదం సర్వం యదేవం విధమ్
తద్ధామ త్రికతత్త్వమద్వయమయం స్వాతంత్ర్య పూర్ణప్రథమ్
చిత్తేస్తాచ్ఛివ శాసనాగమ రహస్యాచ్ఛాదన ధ్వంసమే

(తంత్రాలోక ప్రథమాహ్నిక మంగళశ్లోకము)

ఇది అభినవగుప్తపాదుల శివశక్తిస్తుతి వాక్కును దేవీ స్వరూపముగను ఆనందమును శివస్వరూపముగను భావించి సమర్చించినవారు కాశ్మీర శివాద్వయ వాదులు వ్యక్తమగు సకల ప్రపంచమును శివ పరిస్పంద సుందరముగ భావించిన వ్యక్తావ్యక్త సమన్వయ సాధకులు పండించిన శబ్దార్థ బీజ సత్ఫలములే ఆలంకారిక సిద్ధాంతములుగా భారతదేశమున ప్రచలితములగుచున్నవి (చూ అనుబంధము 2 పు 285-290) ఇది వైదికమును అనుభవ సన్నిహితమును అగు విశ్వసత్యము అంతర్నిహితములగు భావములు శబ్దార్థరూపములనంది బహిర్గతములై మరల స్ఫురణానుభవమున హృదయోన్మేషమునందుచున్నవి వ్యంజన సూత్రమునకు ఆనందవర్ధనాచార్యులును అభినవగుప్త పాదులును గ్రహించిన భూమిక ఇది ఇది తాత్త్విక సూత్రము

ఈ పరిశోధన వ్యాసమున కిది విషయము. విద్యాలయ సంప్రదాయమున ఏ శాస్త్రమునకాశాస్త్రమునట్లే చదువుకొనుట ఒక పద్ధతిగనున్నది. కొన్ని శాస్త్రములను సమన్వయించుట మరియొక పద్ధతి ఈ వ్యాసమున రెండవ పద్ధతి అవలంబింపబడుచున్నది భాషా శాస్త్రములు భిన్నములున్నవి ప్రాచీన వైయాకరణ తార్కిక మీమాంసకాదుల భాషా శాస్త్రములున్నవి కాని వారా పేరిన ఎలువలేము పాశ్చాత్యులలో ఇటీవల రెండు శతాబ్దులనుండి భాషావిజ్ఞానమొకటి ఉద్భవమై అనంతమై విధ్యమును పొంది భిన్న పరిశోధనలందు చోటు చేసికొన్నది ప్రపంచమునగల దేశములలో దాదాపన్నిటను భాషనుగురించిన మీమాంస ఏదో ఒక రూపమున జరుగుచున్నది ఎన్ని పద్ధతుల జరుగుచున్నదో చెప్పుటకు వీలులేదు ఇన్నిటను శాస్త్రీయతాదృష్టి ధ్యేయముగనున్నది ఆ శాస్త్రము విజ్ఞానము కావచ్చు మనస్తత్త్వ శాస్త్రముకావచ్చు తర్కమును కావచ్చు తాత్త్వికముగను చూడవచ్చు

ఇటీవలి సంవత్సరములలో భారతీయులలో కొందరును పాశ్చాత్యులును భారతీయాలంకారికుల భాషాదృష్టిని గుర్తించి విశ్లేషింప ప్రయత్నించిరి ఒకరిద్దరు కాశ్మీర శివాద్వయమునగల వ్యక్తావ్యక్త సమన్వయమార్గమును గూర్చియు వ్రాసియున్నారు కాని సమగ్రమగు ప్రాతిపదికపై వ్యవహారకార్యభాషల నడుమగల భేదమును, ఆ భేదమునకు హేతువులను తత్పర్యవసానముగ భాషను నిర్వచించుటలో కలిగెడి మార్పులను, అవశ్యకతను గురించి ఉపన్యసించిన వ్యాసములు రామి ఈ వ్యాసముపపన్నమగుచున్నది

భాషనుగూర్చి వ్యవహార కావ్య తాత్త్వికదశలందు మూటను విశ్లేషించుటకు వీలున్నది మొదటి రెండును మూడవదానియందు పర్యవసించినచో సమగ్రత సాఫల్యత వ్యంజనేతర వాదములన్నియు వ్యంజనమున అంతర్భావితములై పోవుటకు ఈ వ్యక్తావ్యక్త సమన్వయసూత్రము కారణము

కావున ఈ వ్యాసము ఆనందవర్ధనుని ఆత్మపదార్థము వేదోపనిషత్పునిశితార్థము కావ్యాలోకన సహృదయచింతితార్థము రసార్థము. వ్యంజన సూత్రము

ఇందు రెండధ్యాయములున్నవి శాస్త్రీయ పరిశోధనలో ద్విధాకరించుట ఒక లక్షణము సమన్వయించుటకు ఇది హేతువు

మొదటి అధ్యాయము పృథక్కరణము ఆత్మపృథగ్భావ భావుకులు చార్వాకులు ఆస్తిక్య నిరాసము వాస్తవికతా దృష్టి సర్వసాధారణముగ భాషా పరిశీలనయందు కనిపించెడి శాస్త్రీయతాలక్షణములు నిర్మాణమును గూర్చి పరిశీలించుటతో భాషాశాస్త్రజ్ఞుడు తన పరిశోధనము సఫలమైనదని నిర్ణయించుకొనును భాషాప్రయోజన తత్త్వములనుకూడ నిర్మాణాత్మకముగనే నిరూపింప ప్రయత్నించును ఇది భాషాపరిశీలకులలో కొందరి దృష్టిమాత్రమే దీనిని మరికొందరు నిరసింతురు కొందరంగీకరింతురు ఇట్లు పరిశోధకుల నడుమగల భేదభావములే ఇట పృథకరింపబడినవి కావున పృథక్కరణము

రెండవ పద్ధతి - ప్రాచీన గ్రీకు నాగరికతా ప్రపంచ మూలస్తంభములైన సోక్రటీసు, ప్లాటో, అరిస్టాటిలులును భాషనుగూర్చి మీమాంస చేసిరి వారియందా కాలములందుండిన తార్కిక - వాస్తవికాదిదృష్టులు చూపిన ప్రభావములే భిన్న సిద్ధాంతములైనవి ఆధునికులలోగల నిరూపణ క్షమత్వాది లక్షణములు క్రొత్తవి కాకపోయినను మానవునికి భాషతోగల సంబంధమును వారు మరువలేదు భాషను ససూర్ తరువాతివారు కేవలమొక యంత్రమాత్రముగ నిరూపించుచు వచ్చిరి వచ్చుచున్నారు ఇటు ప్రాచీనులనుండి వీరిని పృథక్కరించుటయు ఇచ్చట మరియొక ప్రయోజనము కావున పృథక్కరణము

మూడవ పద్ధతి - అభినవుల మీద చక్కని పరిశోధనచేసిన నోలిపింటి పండితులు వ్యంజన సిద్ధాంతము కేవలము ఆనందవర్ధనుని ఉపజ్ఞయని పాశ్చాత్య సాహిత్య భాషా మీమాంసలందెచ్చటను ఈ దృష్టిలేదనియు చెప్పిరి - భారతీయులందుగల లౌకికాలౌకిక సమన్వయము దీనికి హేతువనిరి ఈ దృష్టితో సోక్రటీసు మొదలు బార్తెస్ వరకుగల పాశ్చాత్య పరిశోధకులందరును అభావ - భాక్త - అనాఖ్యేయతా తాత్పర్యవాదులుగ పృథక్కరింపబడినారు ఇట్లును పృథక్కరణము

రెండవ అధ్యాయము సూత్రీకరణము చెల్లాచెదరుగనున్న పూసలు దారమున గ్రుచ్చబడినచో హారమగును కావున సూత్రమాధారము ఆధారము ప్రథమాధ్యాయమున పృథగ్భావముల నందిన ✱ ద్రష్టల నడుమగల అంతస్సూత్రమిట వ్యంజనతో సమన్వయింపబడినది. ఈ ప్రయత్నమాలంకారిక

వాదముల నాధారముగ భిన్నశాస్త్రముల నడుమచేసిన ఘనత ఆనందవర్ధనులది ఆశాస్త్రములు శబ్దప్రాధాన్య వాదములగు అభిధా - తాత్పర్యములు అర్థప్రాధాన్య వాదములగు లక్షణానుమితులు మీమాంసావాదములును గలవు - అభిహితాన్వయా న్వితాభిధాన వాదములు గలవు అనుభవము వాగతీతమను వాదమునుగలదు పూర్వాలంకారికులు వీరిచే ప్రభావితులై కేవల వాచ్యవాచక చారుత్వముతో కావ్యత్వసిద్ధియని భావించిరి మొదటిసారిగ కావ్యమున శబ్దార్థములొక ప్రమాణ మనియు, ప్రతిభాస్వరూపయగు సరస్వతి వాగ్రూపయై రసనిష్యందయగుచున్న దనియు, కవి సహృదయులు శబ్దార్థశాసన మాత్రతత్పరులు కారనియు, కావ్యార్థ తత్త్వవిదులు రసమయావధాన వాక్కులనియు సహృదయమనః ప్రీతి వ్యంగ్యాను భవమున నుండునవియు కావ్యరసములు వ్యంజక వ్యంగ్య సమన్వయము కల్గినవనియు - ధ్వని వ్యంజక వ్యంగ్య సమన్వయ భూమికయని గుర్తించి సూత్రించినవాడు ఆనందవర్ధనుడు అభిధా లక్షణ తాత్పర్యములను శబ్దార్థ వ్యాపారములే తంతువులుగా వ్యంజనను వక్తృశ్రోతృ ప్రతిభాసముత్థిత ద్యోతన ప్రక్రియగా నిర్వచించి వ్యంజనసూత్ర రచనచేసినవాడు గుప్తపాదులు - కావున ఇది సూత్రీకరణము

అనుషంగికముగ పాశ్చాత్య భాషాసిద్ధాంతములలో శబ్దార్థవ్యాపార ముఖముగ సంవదించెడి అంశములు ఆలంకారిక వాదములతో సమన్వయింప బడినవి ఇట్లు సమన్వయదృష్టితో ఇది సూత్రీకరణము

పార్యంతికముగ ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమునకును, అభినవుల 'అభివ్యక్తి'కిని, భరతుని రససూత్రమునకును, కాశ్మీర శివాద్వైతుల వాగ్వైభవ మునకును శంకరుల జగదనుప్రకాశమునకును ఏకైక సమన్వయముగ భాష నిర్వచింపబడుచున్నది - శబ్దార్థములద్వారమున భావముపొందు అభివ్యక్తి భాషయని ఆలంకారికులు దీనిని గుర్తించి సిద్ధాంతముచేసిరి పాశ్చాత్య శాస్త్రజ్ఞులు దీని గుర్తించియేయున్నారు కాని ఆధునిక భాషాసిద్ధాంతమున ఇది చేరలేదు కావున ప్రాచ్య పాశ్చాత్య దృష్టిసమన్వయముగా భాష తాత్త్వికముగ సూత్రింపబడినది ఇట్లును ఇది సూత్రీకరణము

ఇట్లీ సిద్ధాంత వ్యాసమునగల అధ్యాయద్వయము సుస్నిగ్ధ సంధిభావము గల్గినది. ఒకదానియందు మరొకదాని యందలి విషయములు సూచింపబడును సమన్వయింపబడును ఈ ప్రయోజనము వాశించియుండుటవలన అధ్యాయములు సుశ్లిష్టార్థకముగ నిర్మింపబడినవనుట సహృదయ పండితులు గ్రహింపగలరు వారికి నమస్సుమాంజలి అట్టివారినే సహృదయ చక్రవర్తులని శ్రీ గుప్తపాదు లనిరి సహృదయ చక్రవర్తులనగా ఆనందవర్ధనులు

వ్యంజనసూత్రము ప్రాచ్య పాశ్చాత్య భేదములేక నాకిట్లు సాక్షాత్కరించినది విషయమతిగహనమును సువిశాలమును, అతర్కితపూర్వమును, ప్రసిద్ధ ప్రస్థాన వ్యతిరేకమును అగుటవలన క్లిష్టమైనది ఇంకను పరిశోధితవ్యమే.

భిన్నదార్శనిక విమర్శకులు తమ గ్రంథములందును, వ్యాసములందును పెక్కుచోట్ల పాశ్చాత్య సాహిత్య విమర్శయందును చిత్రలేఖనాది కళలందును ఇతర శాస్త్రములందును ధ్వనిసిద్ధాంతముతో సమన్వయించు పెక్కువిషయములు సుష్ఠుగా నిరూపించియున్నారు శబ్దార్థ వ్యాపారదృష్టికి మాత్రము పరిమితమయిన ఈ పరిశోధనయందవి యథోచితముగ స్పృశింపబడినవి

ఇది కేవలము శాస్త్రసంబంధి చర్చ కావున ఆయావాదములు మాత్రముల్లేఖింపబడినవి నిరూపణములుచేయుట, విదర్శనములు చూపుట ఈ వ్యాస పరిధిలోనివికావు ధ్వన్యాలోక లోచనములకన్నను కావ్యార్థతత్త్వ నిరూపణ సమర్థములగు గ్రంథములు ప్రపంచ సారస్వతముననే అరుదనుట పండితలోక ప్రసిద్ధము

నాల్గనుబంధములున్నవి విశేషములందుగలవు

ఈ వ్యాసమునకు అంతర ప్రేరణ వాగ్రూపయగు 'భగవతి (intuition) యిచ్చినది. వ్యుత్పత్తి అభ్యాసములు సాహిత్యమును భాషాశాస్త్రమును నేర్పిన గురువర్యులవి పూజ్యులు అస్మదుపాధ్యాయులగు డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావుగారి సారథ్యము అవ్యాజ వాత్సల్యములీవ్యాస స్వరూప నిర్ణాయకములు వీరికి నమోవాకములు

మార్చి 1979

హెచ్. యస్. బ్రహ్మానంద

# భూమిక

'అనుపాసితవృద్ధానాం విద్యా నాతి ప్రసీదతి'

— వాక్యపదీయము 2 - 493

*'The Goddess of Learning does not smile on those who neglect the ancients'*

—tr by Brough J **1951**

వ్యాస రచనోద్దేశ్యము —

0 0 వ్యంజన (suggestivity) 'వాగ్' వ్యాపారమని ఆలంకారిక విష్ణు వానందవర్ధనుడును, మహేశ్వరుడభినవ గుప్తపాదులును స్థాపించిరి[1] ఆలంకారికబ్రహ్మ భరతముని రససూత్రమున కవిరుద్ధమును, వ్యాఖ్యానమును, నిరూపణము నగునది ధ్వని సిద్ధాంతము ధ్వన్యాలోకమున ఆనందవర్ధనుడును వ్యంజన వ్యాపారమును గురించి సిద్ధాంతము చేసినాడు

0 1 వ్యంజన వాగ్వ్యాపారమని ఆనందాభినవులు నొక్కి చెప్పుటకు కారణము 'వాక్' శబ్దము చేత శబ్దార్థవ్యాపారములు (వృత్తులు) మూడును వ్యవహరింపబడుట (ధ్వన్యాలోకలోచనములు 1 - 1 పుట 25) ఆనందవర్ధనుని ఈ దృష్టి శాబ్దికము[3] కావున భాషాదృష్టి (linguistic aspect) తో పరిశీలించుటకు ప్రయత్నము ఈ వ్యాసమున చేయబడుచున్నది

0 1 2 ఆనందవర్ధనుడు ప్రాథమికముగ ఆలంకారికుడు - రసధ్వని ప్రాధాన్యము నంగీకరించినవాడు సహృదయసంవాదము నాధారముగ వాదించినవాడు ఇతని సిద్ధాంతమున భాషకు చోటెక్కడ? అను ప్రశ్నము పుట్టవచ్చును

వ్యంజన భాషాదృష్టితో పరిశీలనీయమని ఇంతవరకే గుర్తించియుండుట అక్కడక్కడ వ్రాయబడి యుండుట ముమ్ముందు చూపబడును ఒట్టి ప్రయత్నము స్ఫోట విషయముగ కె కుంజున్నిరాజాగారు (Indian Theories of Meaning ITM) చేయగా ఒక విమర్శవచ్చినది అద్వైతమతతాత్త్వికదృష్టియున్న స్ఫోట సిద్ధాంతమును భాషా దృష్టితో పరిశీలించుట అసమంజసమని దానికి వారిట్లు సమాధానము చెప్పయున్నారు

It is true that Bhartrhari was a great philosopher and the Sphota Theory formed part of his philosophy but that does not mean that this theory cannot be studied from the linguistic point of view In fact Mandanamisra another great philosopher and an able exponent of the Sphota theory has dealt with it in his Sphota Siddhi purely as a linguistic one Even if it were so an attempt to study the linguistically relevant aspect of it would have been welcome to the students of language'

(I T M preface pp viii ix 1969)

అటే దృష్టి ఇచ్చుటను అనుసంధేయము అయినను శబ్ద వ్యాపారముగ వ్యంజనను ప్రతిపాదించుట ఆలంకారికులే చేసియుండుటవలన నీప్రయత్నమందలి నూత్నత యేమను ప్రశ్నమును కలుగవచ్చును కుంజున్నిరాజా గారును భారతీయ మీమాంసక, నైయాయిక బౌద్ధ వేదాంత ఆలంకారికుల శబ్దార్థ సంబంధ పరిశీలనమునే ఆంగ్లమున వ్రాసిరి కాని వ్రాయుటలో ఆధునికముగ వృద్ధిచెందుచున్న భాషాశాస్త్ర (Modern Linguistics) మౌలికాంశములతో వానిని సమన్వయించుట ఆనుషంగిక ప్రయోజనముగ నెరవేరినది - అదియే అందలి నూత్నత ఈ ప్రయత్నము నట్టిదియే

O 1 3 స్ఫోటను ప్రతిపాదించుచున్న వాక్యపదీయ' గ్రంథమున ప్రత్యక్షముగ వ్యాకరణ ప్రసక్తియున్నది కాని ధ్వనికారుడు వ్యాకరణ తర్క వేదాంత దృష్టులను ప్రత్యక్షముగ ఖండించెనుకదా! అని సంశయించుటకు పీలున్నది, రాజాగారు భాషాదృష్టితోడనే

Anandavardhana took the cue from Bhartrhari and developed the theory of language on the lines suggested by him

(I T M p o 276)

అని వ్రాసిరి ధ్వనివాద విమర్శకులను సమీక్షించుచు తమ గ్రంథాంతమున నిట్లు వ్రాసిరి

Many of the criticisms against the Dhvani theory are due to the fact that the poets and the literary critics did not *confire* themselves to a relatively small portion of language behaviour which is definite but tried to extend it to the totality of human experience including the emotional

(I T M p 278)

0 1 4 ఇట్లు భాషావిషయమునకే పరిమిత (confine) మగుటలో ఒక చిక్కున్నది వైయాకరణులకు తప్ప ఆలంకారికులకు తాత్త్వికులకు, భాషా దృష్టి ఆనుషంగికము మాత్రమేయనుచు ఒక పండితుడిట్లనెను

Language in their view was merely a dress of thought This conception of language was responsible to a great extent for their method of classification and recognition of the types and number of the modes of meaning

(N Balasubrahmanya, p 33 1956)4

వ్యంజనము వాగ్వ్యాపారమన్న ఆనందాభినవులదృష్టిలో భాష ఆనుషంగికమనుటెట్లు?

0 1 4 1 రాజాగారు భారతీయుల శబ్దార్థదృష్టిని సూక్ష్మముగ పరిశీలించిన విధము ముందు చూపబడుచున్నది ఆదృష్టితోడనే వారు 'వ్యంజన' మను పేరిట ఒక అధ్యాయము వ్రాసిరి (ఐ టి ఎమ్ పుటలు 277 - 315) ధ్వని సిద్ధాంతమున వ్యంజన వ్యాపారమునకున్న ప్రాధాన్యమును గుర్తించుట (277-283)

అనుమాన అర్థాపత్తి, అభిధ, తాత్పర్య, వక్రోక్తులనుండి ధ్వనిని వేరుచేయుట (289 - 302) ధ్వనిని వర్గీకరించుట (302 - 311) స్వరాదులను గురించి చర్చించుట (312 - 315) వీరి పరిశీలనమున ప్రధానాంశములు.

0 1 5 రాజాగారి గ్రంథరచనా సమయము 1951 ప్రాంతమున తరువాత దాదాపు ఇరువదిఆరు సంవత్సరములపాటు భాషాశాస్త్ర మభివృద్ధినందినది,[5] అందుచున్నది ఇప్పుడు భాషా దృష్టితో పరిశీలింపవలెనన్నచో శబ్దార్థములను గురించి పాశ్చాత్యదేశములందు ఇటీవలవృద్ధియగుచున్న అభిప్రాయములను-ముఖ్యమైన వానిని - సమన్వయింప జేసుకొనవలసియున్నది సూత్రీకరణము ప్రధానముగ పరిగణింప బడుచున్నయుగముకావున ఈసిద్ధాంతవ్యాసమునకు వ్యంజన సూత్ర (principle of suggestivity) మని పేరుపెట్టుటజరిగినది ఆంగ్ల నిఘంటువు లందెక్కడను 'suggestivity అను పదము కనిపించదు-ఇది ఆనంద వర్ధనుని - అనగా - ఆలంకారికుల - భాషా సిద్ధాంతమగుట వలన కాబట్టి భాషా ప్రక్రియా సూత్రముగ వ్యంజన సూత్రమిట వివక్షింపబడు చున్నది

## ధ్వనిసిద్ధాంతము - భాషాశాస్త్రజ్ఞులు

0 2 ఈ వ్యాసరచనను సమర్థించెడి రచనలు అటు పాశ్చాత్యులును ఇటు భారతీయులును ఈశతాబ్ది ప్రథమార్ధమునుండి చేయుట కారంభించి యున్నారు ఇట్టి రచనలలో స్పష్టముగా రాజాగారికి ప్రోత్సాహము కల్గించినదిగా గుర్తించ దగినది John Brough వ్రాసిన Some Indian Theories of meaning (1953) అన్న వ్యాసము వీరె అంతకుముందు (1951) వ్రాసిన వ్యాసములో సంస్కృత వ్యాకరణములందుగల భాషావిజ్ఞానమౌలికాంశములను స్థూలముగ వివరించి యున్నారు[6] బ్రఫ్ కంటెను ముందుగా ఈరీతి పరిశోధనకు నాంది పాడినవాడు Louis Renou వైదిక కర్మపద్ధతికిని వ్యాకరణ పరిభాషకును గల సంబంధముపై వీరు ఫ్రెంచిభాషలో వ్రాసినవ్యాసము (1941 - 42) ప్రసిద్ధమైనది తరువాత వీరును వ్యాకరణ వేదాంతములకు (1957), వ్యాకరణ అలంకారములకు గల సంబంధమును (1961) నిరూపించు వ్యాసములు వ్రాసియున్నారు[7] ఈ

సందర్భమున స్మరించదగినవారు W S Allen, T Burrow F Edgerton, Betty Heimann, Ratigan మొదలైనవారున్నారు 8 వీరు సంస్కృత వ్యాకరణాది శాస్త్రములను గురించి వ్రాయుచు ధ్వనినిగురించియు వ్రాసిరిగాని ప్రత్యేక విషయముగ వర్ణించిన వారుకారు

O 2 1 బ్రఫ్ వ్యాసము (1953) నందు ధ్వనిసిద్ధాంతమునగల మౌలికాంశములు కొన్ని వెలుగుచూచినవి ఇతడును ధ్వనిని సాహిత్యసిద్ధాంతముగ మాత్రమే గుర్తించినాడు

The theory of literal and metaphorical meaning was further extended in the 9th century by Anandavardhana in the Dhvanyaaloka This is primarily a treatise on poetics but as the basis of his aesthetic theory the author carries out an elaborate analysis of poetic meaning

(p 421 Staal (ed) 1972)

O 2 1 2 ధ్వనిని 'suggestion' అని అనువదించుటను బ్రఫ్ నిరసించలేదు అంగీకరించనులేదు (అదేవుట) తరువాతి వారిలో కుంజున్ని రాజాగారు 'వ్యంజన' అని అనువదించుటద్వారా ధ్వనిసిద్ధాంతములోని 'వ్యంజన ను వాగ్వ్యాపారముగా గుర్తించుటకు మార్గము వేసినారు

(చూ కుంజున్ని రాజా 1975)

O 2 1 3 కాని బ్రఫ్ వ్యాసాంతమున గల క్రిందివాక్యము అతని అవగాహనపై భారతీయ శాస్త్రముల ప్రభావమును నిరూపించుచున్నది

Logic, mathematics, linguistics science in general all convey messages in language and this language however technical *cannot be understood* save in a manner which is fundamentally similar to the understanding of every day usage

As the ancient Indian might say, the utterances ot the coster monger, the language of the great poet and the formulae of the atomic physicist are all in some sense, manifestations of the eame div ne vaak

(పై గ్రంథం స్టాల్ (సం) పుట - 423)

వ్యవహార, కావ్యభాషలన్న భేదమునకతీతమైన మౌలిక వాగ్వ్యాపారముగ వ్యంజనను వివక్షించుటకు హేతువీయభిప్రాయమే

O 2 2 బ్రఫ్ తరువాతి రచనలలో పేర్కొనదగినది ద్రావిడ భాషా పరిశీలకులలో అగ్రగణ్యుడయిన ఎం బి ఎమెనో వ్యాసము 9 వీరును ధ్వనిని సాహిత్య సిద్ధాంతముగనే గుర్తించినను, నీలగిరులలోని 'తోడా ప్రజల గేయవాఙ్మయమునకు సమన్వయించుటలో ధ్వనిసిద్ధాంతమునందలి సాహితీ విశ్వ జనీనత వ్యక్తమగుచున్నది

As the Hindu critics developed the theory the suggestion is one of an emotion which is to be commun cated to an audi pnce not by a bald statement of the emotion but by suitable statement of all the factors and the accompanying situation that sroduce the emotion Th s, the Toda words are fitted to do, if the emotion is taken to be one of a range that includ.s social values as well as the individual s private emotions

(M B Emeneau 1955/56 in Deli Hymes (ed) 1964 p 339)

O 2 3 ఎమెనో ధ్వనికి చూపిన నిర్వచనము ఎడ్గర్టన్ (1936) నుండి సంగ్రహించినది అది

Suggestion, which is fitted to move words unspoken by implications' (Ibid)

ధ్వనిని అర్థముచేసుకొనుటకో implication' ని గుర్తించుట ఒక మార్గము 10

(చూ Brough p 422 in Staal (ed) 1972)

రాజాగారి గ్రంథము (1963) తోనే అర్థవిజ్ఞాన (Semantics) దృష్టితో వ్యంజనపై సమగ్రపరిశీలన మొదలైనదని చెప్పుట సమంజసము

0 2 4 ధ్వనిసిద్ధాంతమును గురించి గాక అర్థవిజ్ఞాన దృష్టితో పరిశీలించిన వారును suggestion ని గుర్తించిన చోట్లున్నవి ఇట్టిపరిశీలన తెలుగు పరిశోధకులలో మొదట చేసినవారు జి ఎన్ రెడ్డిగారు (1966 1-8)[11] C C Fries (1954) గుర్తించిన Socio – cultural meaning విభేదముతో suggested meaning సంపదించునని వారుగుర్తించిరి, (పుట 28)

0 2 5 ఫ్రీస్ మాటలు క్రింద చూపబడినవి 12

In addition to the regularly recur ing responses to the lexical items and structural arrangements there are also throughout a linguistic community recurring responses to uniquewhole utterances or sequences of utterances

(Fries p 66 1954)

వ్యంజన పరిధి విశాలము ఫ్రీస్ గుర్తించిన socio – cultural meanings కూడ వ్యంజనలో అంతర్భవించునని రాజాగారు గుర్తించినారు

(I T M p 281)

0 2 6, ఈ శతాబ్ది ద్వితీయారంభమునుండి భాషాశాస్త్రవేత్తలకుభారతీయ గ్రంథములపై గల దృష్టివర్ధిల్లుచు వచ్చినది భాషాశాస్త్ర పరిణామమును గురించి వ్రాయుచు, ఆధునిక యుగమున భాషా శాస్త్రమున వచ్చిన పరిణామములలో కొన్ని ప్రాచీన భారతీయశాస్త్రములలో గుర్తింపవచ్చునను ఆర్ హెచ్ రాబిన్స్ ఇట్లు వ్రాసిరి (A Short History of Linguistics, (SHL)1967)

A further development of the Dhvani–Sphota relationship is seen in Anandavardhana's theory of poetic language (Dhvanyaa loka, 9th C A D) Just as the sounds reveal the meaningful entities themselves, so in poetry the chosen words and their literary meanings reveal further suggested senses and the beauty of the poem as a whole' (S H L 6–141)

0 2 6 1 ఇంతమాత్రమేకాదు. Hjemslev (1933) చేసిన 'stylistic analysis [13] తో ఆనందవర్ధనుని పరిశోధన సమన్వయించుచున్నదనియు అభిప్రాయ పడినాడు రాబిన్స్

Here one remarks a striking parallel with Hjemslve s conception of stylistic analysis as the treatment of the *content plane* and the *expression plane* of a natural language in some specific usage as themselves together forming the expression plane of a higher order *Connotative Semiotic*

(Cf Prolegomena pp 73–76 (1961 ed ) Robins
S H L Op cit p 141)

0 2 7 ఇంకను మరింత లోతుకువెళ్ళి కాశ్మీర శివాద్వైత సంప్రదాయమునకు అలంకార సిద్ధాంతముతో గల సంబంధమునుగూర్చి ప్రతిపాదించినవారు జె ఎఫ్, స్టాల్ (1969)

There are many links between sanskrit poetics and literary theory and criticism on the one hand and some philosophies of Kashmir Saivism on the other Here it must suffice to state that Kashmir Saivism considered its doctrine as a manifestation of the God Siva in the medium of language (Vaak) The universe consists of two regions vaacya to (be) spoken 'of , (cf signifie) and vaacaka speaking (cf signifiant) While both

aspects coincide in Siva vaacya corresponds to the objective substance of the world wh reas, vaacaka corresponds to con scious beings This metaphysical dualism was on the one hand connected with traditional grammatical and semantic doctrines but on the other hand developed into poetics and literary theory

(Sanskrit philosophy of language pp 522-23 )

ఆనందవర్ధనుని భాషా సిద్ధాంతము వ్యంజనసూత్ర ప్రతిపాదనము చేయుట కివాక్యములు పరమప్రమాణములు,

0 2 7 1 ఇక్కడ స్టాల్ ప్రచురించిన ఒక గ్రంథమునుగూర్చి ప్రసంగించ వలసియున్నది (A Reader on the Sanskrit Grammarians 1972) ఈగ్రంథమునకు వ్రాసిన పీఠికలో స్టాల్ ఇట్లనుచున్నాడు

"Contemporary scholarship within this philological perspec tive continues to produce valuable results that are new to western scholars though often perfectly well – known to Indian Pandits All the same there is a recent revival of interest in the the sanskrit grammarians which is partly linked with the extraordinary developments that have taken place during the last decade and a half in western linguistics (Preface p xii)

0, 2 7 2 స్టాల్ వ్రాసినది వైయాకరణులను గురించి కాని ఆలంకారికు లను కూడా భాషాపరిశీలకవర్గమునందు చేర్చినాడు స్టాల్ ఏశాస్త్రపరిణామము నందయినను కొన్ని సామాన్యలక్షణములుండుననియు ఆధునిక శాస్త్రముల పరి జ్ఞానమెంత యధికముగానున్న సంప్రదాయ గ్రంథములంత సమగ్రముగా బోధ పడుననియు ఈయన అభిప్రాయము

But now there are atleast two totally different reasons for such a revival First the activities of the Indian grammarians are the closest parallel in history to contemporary linguistics Second it appears that only contemporary insights can pave the way for adequate interpretations of the work of the Sanskrit grammarians (ibid)

0 2 7 3 పాణిని, భర్తృహరి, ఆనందవర్ధనాదుల పరిశోధనములను సరిగా అర్థము చేసికొనవలయునన్నచో వారియందు ప్రాథమికముగా గల వాఙ్నిర్మాణ, ప్రయోగ, తత్త్వదృష్టులను ఆయా నేపథ్యములతో చదువవలయును లేనిచో వారర్థముకారు ఈ అభిప్రాయమునే స్టాల్ ఇట్లు వ్యక్తముచేసినాడు

It is indeed not at all surprising that Panini and his colleagues cannot be properly understood unless they are taken for seriously what they are, that is linguists' (ibid)

ఈ వ్యాసమున చేయుచున్న ప్రయత్నము సరిగానదియే భిన్న భాషాశాస్త్ర సంప్రదాయములీదశాబ్దమునసంఘర్షించుకొనుచుండుటఈసమన్వయమునకు ప్రతిపాదనకు హేతువుగనున్నది

0 2 8 ఆనందవర్ధనుని సిద్ధాంతముతో పరిచయములేకున్నను, పాశ్చాత్య దేశములందు భాషాశాస్త్రమునేగాక సాహిత్యవిమర్శనుకూడ ప్రభావితము చేసిన నిర్మాణవాదము (sructuralism) ను సంకేత విజ్ఞాన (semiotics) దృష్టితో పరిశీలించిన Terence Hawkes (1977) New – New criticism అను అధ్యాయమున నిట్లు వ్రాసినాడు

The most important feature of this process is that it offers a new role and status to the critic It makes him a participant in the work he reads The critic creates the finished work by his reading of it he actively constructs the meaning So a

work of literature ultimately consists of everything that has been said about it As a result no work ever dies

(Structuralism and Semiotics (S S ) pp 156-160)

0 2 9 హాక్స్ పరిశోధనకు దీప్తి కల్గించిన Roland Barthes అను ఫ్రెంచి విమర్శక భాషా శాస్త్రజ్ఞుడు ఒక సిద్ధాంతమును చేసినాడు

' A work is eternal not because it imposes a single meaning on different men but because it *suggests* different meanings to a single man speaking the same symbolic language in all ages the work proposes man disposes

(from Barthes Critique et Verite p 51, Hawkes op cit p 157)

ధ్వని సిద్ధాంతమును ఇంతకంటె భిన్నముగ ఆనందవర్ధనుడు మాత్రము చెప్పినాడా ! పై బార్తెస్ మాటలందు work, it, suggests symbolic అను పదములు చాల ముఖ్యములు ఆనందవర్ధనుల వాగ్ వ్యాపారమను సిద్ధాంత మిట్టిభావననుండి పుట్టినది - తాత్త్విక సిద్ధాంతములకు దేశకాల పరిధులుండవుగదా!

0 2 9 1 అంతవరకు ప్రచారములోనున్న denotation (వాచ్యార్థము) connotation (వ్యంగ్యార్థము-తాత్పర్యమను అర్థమున)అనువిభాగమును mythology లోని నిర్మాణ దృష్టితో బార్తెస్ యిట్లు నిర్వచించినాడు

The first system is then the plane of 'denotation and the second system the plane of connotation We shall therefore say that a connoted system is a system whose plane of expression (i e signifier) is itself constituted by a signifying system, the common cases of connotation will ofcourse consist of complex systems of which language forms the first system

(Elements of Semiology (E S ) p p 89-90 (1964) cf examples by Hawkes S S pp 133-134)

0 2 9 2 బార్త్స్ చెప్పినట్లు సంకేతదృష్టితో language నిర్వచన మిట్లు గుర్తింపవలసియున్నది

'Language is the most pure organic semiotic system Every aspect of it signifies and it is produced solely by means of the body (Hawkes, S S p 135)

భాషకు మానవునితో గల ఆంగిక సంబంధమును గుర్తించుట భాషాపరిశీలన మున ఒక గొప్పమలుపు అందుకే ససూర్ గుర్తించిన లాంగ్ (langue) పరోల్ (parole) భేదములను ఈనాడు కేవలము మానవ భాషకే కాకుండ జంతు భాషకును సకల క్రియలకును అన్వయింపజేయగలుగుచున్నారు 14

(Hawkes S S pp 134 – 135)

0 2 9 3 వాచ్యార్థ వ్యంగ్యార్థములకు గల సంబంధమును, పరస్పర ప్రభావమును గూడ హాక్స్ గుర్తించినాడు

'In short the signifiers of connotation are madeup of the signs (signifiers related to signifieds) of the denoted system and *this makes connotation and so literature at large* one of the number of second order signifying systems which we characteristically super impose upon the first order system of language

There is also a reverse situation in which the sign of a prior signifier–signified relationship becomes the *signified* of a *further one* In this case the second-order system becomes a *metalanguage* (Hawkes S S p 134)

మొదట వ్యంగ్యము ప్రధానమగుట, తర్వాత వాచ్యము ప్రధానమగుట సూచింపబడుచున్నది

ప్రాచ్యపాశ్చాత్యమను విభేదములేకుండ వ్యంజన' సూత్రమును వాగ్వ్యా పారముగ దర్శింపవచ్చుననుటకు బార్తైస్ హాక్స్ మొదలగువారి పరిశోధనలు సాక్ష్యములు

O 2 10 కావున ఈవ్యాసము వాగ్వ్యాపారసూత్రదర్శనము (A look into the functional theory of language) వ్యంజన కేవలము సంస్కృతమునకో ఆంధ్రమునకో పరిమితముకాదు విశ్వభాషాసంబంధి (language universal) ఇట్టిపరిశోధనామార్గము Karl Buhler అను జర్మనీయుడు(1934)కూడసూత్రించియున్నాడు [15] కాని జరిగిన పరిశోధన స్వల్పము

## వాక్కు - భాష పరిభాషాసమస్య -

O 3 ప్రపంచమున భిన్నభాష (languages)లున్నవి కాని అన్ని భాషలందును శబ్దార్థములకొక అన్వయ (synthesis) మున్నది ఆ అన్వయ కారణముగనే ఒక భాషనుండి మరియొకభాషకనువాదము సాధ్యమగుచున్నది కావున వాక్ (the language) తత్త్వపరిశీలన మీ పై విధ్యమునగల శబ్దార్థసాజాత్యము నాధారముగ జరుగవలయునుతప్ప భేదపరిగణనమిందులకుపయోగించదు.

The very possibility of motion of meaning between languages would seem to be firmly rooted In the underlying templet or common architecture of all human speech ''

(George Steiner After Babel (A B ) p 105 1975)

పై మాటలందున్న human speech అనగా భౌగోళిక రాజకీయ చారిత్రక నేపథ్యముల కతీతముగనున్న మానవవాగ్వ్యవహారము భిన్నభాషలనడుమ కనిపించు శబ్దార్థమున్వయసూత్రము. అది వాక్కు [16]

Between the utterance and interpretation of meaning through verbal sign systems on the one hand, and the extreme multiplicity and variety of human tongues on the other lies the domain of *language as a whole* (italics mine—HSB)

(Steiner, in Afterword' to A B p 471)

కావున వాక్కునుగురించి భాష (ల) తోనే ప్రసంగించవలసి యున్నది మరియొక మార్గములేదు ప్రాచ్యపాశ్చాత్య భాషలకుప్రతీకలు (symbols) గా సంస్కృతాంగ్లములనుగొని యీభాషలందలి శబ్దార్థభాషావాగ్ వైవిధ్యమును ప్రదర్శింప పదములకు ధాతుముఖ నిరూపణము చేయుటవలన - భాషల అనంత్యమునకు వెనుకగల వాక్ సూత్రపరిశీలన మొనర్చుట ఇచ్చటిప్రయత్నము 17

0 3 1 నిఘంటువులలో రెండురకములున్నవి ఒకటి శబ్దార్థమును ధాతు (root) ముఖముగ నిరూపించునది ఇది అర్థముఖదృష్టి మరియొకటి శబ్దవ్యవహారమునాధారముగచేయు అర్థనిరూపణము - ఇందు ధాతునిరూపణ మవసరముకాదు సగోత్రసంబంధ (cognate relationship) మున్న భాషారూపములను ప్రదర్శించుట ఇట్టిది ఇది శబ్దముఖదృష్టి అమరసింహుడు, తత్పూర్వుడు యాస్కాచార్యుడు పాటించినది నిరుక్తమార్గము అనగా ధాతునిరూపణము కాని అమరమున పర్యాయపద (synonyms) ప్రదర్శనమే ప్రధానదృష్టి ఈశతాబ్దమున ఇండోయూరోపియన్ సగోత్రతను సంస్కృతమున దర్శించుచువెడలిన నిఘంటువులు కొన్నియున్నవి (ఉదాహరణమునకు Carl Darling Buck (ed) Dictionary of selected synonyms in the Principal Indo European languages, 1965) ఈ రెండుమార్గములలోనున్న సామ్యభేదము లాయాదేశ సంస్కృతీ నేపథ్యములను స్పష్టముచేయుచున్నవిగానున్నవి

'Meaning is a function of social-historical antecedent and shared response (Steiner, A B p 161)

ఒక నిదర్శనము చూపబడుచున్నది సంస్కృతమున 'భాషా అను శబ్దమున్నది నైఘంటికులిట్లు నిరుక్తినిచూపుదురు

భాష్యత ఇతి భాషా (గురుబాల ప్రబోధిక పుట 122)

'భాష్ అనగా మాట్లాడుట' (to speak) 'మాట్లాడు' అను అర్థమును దెల్పు సంస్కృతధాతువులింకను కొన్నియున్నవి

వచ్ బ్రూ వద్ / భాష్ - కావున భాషా' శబ్దము వాక్ / (వచ్) వాద/ (వద్) అనురూపములతో సమానమైనదనవలయును ఎందు సమానము? భాషా శబ్దమునకుగల ఇండోయూరోపియన్ సగోత్రపదములీయిర్థవ్యాప్తిని నిర్ధరించుటకు ప్రమాణముగ గ్రహింపవచ్చునేమో పరిశీలింపవలసియున్నది

| భాష | ధాతువు | |
|---|---|---|
| ప్రాచీన లిథూనియన్ | / bylotı / | సంస్కృతము bhan speak |
| లిథూనియన్ | / balsas / | * PIE bels / bhel |
| ప్రాచీన ప్రష్యన్ | / bıllıt / | (Buck p 1261) |

భాషా శబ్దమున భణతీతిభాషా' అని చెప్పుటకు వీలున్నదా? లేదు అందుకే ఇట్టివానిని పర్యాయపదములు (synonyms) అని భాషాశాస్త్రపరిభాష యందు పేరుచెప్పిరి అమరసింహుని పద్ధతి ఇట్టిది 18

'బ్రాహ్మీతు భారతీ భాషాగీర్వాగ్వాణీ సరస్వతీ (గురుబాలప్రబోధిక పుట, 122) కాని సంస్కృతభాష అందురుగాని, సంస్కృతబ్రాహ్మీ, భారతి, గీర్వా, గ్వాణి సరస్వతులను ప్రయోగములులేవు కొన్ని ఉన్నను అచ్చట భాషా శబ్దమునకు మనము పాటించు అర్థముకాదు మనము భావించు అర్థమేది? శబ్దార్థ ప్రపంచసర్వస్వము అంగ్లమున 'లాంగ్వేజ్' అందురు సంస్కృత సాహిత్యమున కేవలము ఛందలికములను అర్థముననే భాషా శబ్దము ప్రయుక్తము 19

0 3 2 శబ్దము అను మాటను పరిశీలింతము. సంస్కృతము - శప్ ధాతువు

1 శప్యతే అనేనేతిశబ్దః - (గురుబాల ప్రబోధిక పుట 115 )

2 శం సుఖం దదాతి వాశబ్దః — శమ్+దా = శబ్దః (పుట 115)

3 శపయత్యవగమయత్యర్థమితి శబ్దః — శపగతౌ = శబ్దః (పుట. 123)

పై మూడు ధాత్వర్థములందును 3 మౌలికము 1 2 లాక్షణిక ప్రవృత్తి కలినవి

సంస్కృత 'శబ్దము నకుకొన్ని ఇండోయూరోపియన్ భాషలందు సగోత్ర పదములున్నవి

చెకొస్లోవేకియా / sopichr / 'flute player'

రష్యన్ / sopet / snuffle'

ఇచ్చటను గ్రీకు లాటిన్ భాషలలో సగోత్రపదములు లేవనుట గుర్తింప దగినది ఆంగ్లములోని 'sound అను పదమునకు సమానార్థమునవాడుచున్నాము

0 3 3 అర్థము సంస్కృతమున అర్ అను ధాతువునకు move reach, attain' అను నర్థములున్నవి. అమరసింహుడిట్లు అర్థమును వివరించినాడు అర్థోఽభిధేయరై వస్తుప్రయోజన నివృత్తిషు - (గురుబాల ప్రబోధిక పుట 165 ) అభిధేయ నిర్వచనమిది శబ్దప్రత్యాయ్యః - యథాశబ్దార్థాకావ్యమితి (అవెస్తన్ arθa 'affair corcern' Skt Av * ar —) ఇచ్చటను గ్రీకు, లాటిన్ పదములు కనిపించవు, ఆంగ్లములోని meaning అను పదమునకు సమానార్థకముగ వాడుచున్నాము

భాషాశబ్దార్థములను పరిశీలించినచో 'లాంగ్వేజ్ సౌండ్' 'మీనింగ్' అను ఆంగ్లార్థములను వివక్షించుచు వాడుచున్నను, ఈ మూడు అంగ్లపదములకును భిన్నమగు వ్యుత్పత్తులున్నవనుట మరువరానిది

O 3 4 Language Latin Lingua 'tongue' సంస్కృతమున వాక్' శబ్దమునకు నైఘంటికార్థమిట్లున్నది

1 ఉచ్యత ఇతివాక్' — వచపరిభాషణే — పలుకబడునది (గురిగాల ప్రబోధిక పుట 122)

ఆనందవర్ధనుడును అభినవ గుప్తపాదులును మూడర్థములు వివక్షించిరి

1 శబ్దము వక్తి ఇతివాక్ — ఉచ్చరించును గనుక —
2 అర్థము ఉచ్యతే ఇతివాక్ — చెప్పబడును గనుక —
3 వ్యాపారము ఉచ్యతే అనయా ఇతివాక్ — సాధనమగు దీనిచేత అర్థము చెప్పబడును గనుక — (ధ్వ అ 1-5 లో పుట 10)

అందుచేత వాక్కు' నిర్మాణప్రమాణము (structural unit) 'భా వ్యవహారప్రమాణము (social dimension) ఇప్పుడు 'వాక్కు' అను శబ్దమునకు 'భాషా శబ్దముతో భేదము సిద్ధించుటలేదా। సంస్కృత 'వాక్కు' voice అనునర్థమున ఇండోయూరోపియన్ సగోత్రపదములను కల్గియున్నది

లాటిన్ / vox / 'voice
ఇటాలియన్ / voce / 'id
అవెస్తన్ / vac / id'
గ్రీకు / ou / poet

ఆధునికులలో langue parole అనుభేదములను langage (language) లో భావించుట క్రమపరిణామమైన కల్గినది దీనికి ప్రవక్త ఫర్డినాండ్ డిసస్యూర్ (Course de Linguistique 1910) ఇది ఆంగ్లమునగల language, speech ల మధ్యగల భేదమువంటిదని కొందరుభావించుచున్నారు (Noam Chomsky, 1965, Aspects of the theory of syntax, p 2)

O 3 4 1 'స్పీచ్' అనునర్థమును సూచించునదిగా నైఘంటుకులు సంస్కృత వచ్, బ్రూ, వద్, భాష్ ధాతువులను పేర్కొనిరి

| | | | |
|---|---|---|---|
| అవెస్తన్ | / vac, mru aoɪ / | speech | -ఫ్రెంచి / parole / speech |
| ఇటాలియన్ | / parlare / | 'id | |
| ఫ్రెంచి | / paɪler / | id | |
| లాటిన్ | / parabola / | id | |

ఆనిఘంటుకారులే సంస్కృత 'శబ్ద / పద / వచస్' లకు పర్యాయములుగా

లాటిన్ / verbum, vox / స్పానిష్ / pal ıbro /

ఇటాలియన్ / parola / గోథిక్ / waurd /

ప్రాచీన / ఆధునిక ఇండోయూరోపియన్ } / word /

ఇచ్చినారు (పుట 1262) వీరే మరియొకచోట (పుట 1038) 'శబ్దము' నకు పర్యాయపదముగా స్వన' మును గుర్తించిరి 'ఘోష' కూడగుర్తింపబడినది,

లాటిన్ / sonus /

ఎండితార్థమేమనగా ఒకభాషలో ఒకపదము వాడబడు అర్థము మరొకభాష యందు అట్లే కనిపించుటలేదని

ఇప్పుడు 'వాక్ శబ్దమునకు 'లాంగ్వేజ్ / స్పీచ్' (వ్యుత్పత్తి నాధారముగ) అను రెండర్థములు చెప్పగలుగుచున్నాము

వాక్పాణిపాదపాయూపస్థలు - కర్మేంద్రియములు - ఇట వాక్కు-నాలుక[20] వాఙ్మనశ్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు — జ్ఞానేంద్రియములు[21] — ఇట వాక్కు భాషాజ్ఞానము

ఎయూర్ చామ్స్కీలు భావించిన భేదములిచ్చటనున్నవి వాక్కు 'langue దశకును శబ్దము parole దశకును చెందినవి భాష అనుట కేవలము సాంఘిక ప్రమాణము 22 వక్కు శబ్దార్థరూపముగనుండును ఇది ఇటు ప్రాచ్యమునను అటు పాశ్చాత్యమునను ప్రాచీనవాదము 22 (చూ వ్యం సూ 1 - 2)

O 3 5 Meaning ప్రపంచమునందన్ని దేశములందును అన్ని వ్యవహార సమస్యలు పుట్టుటకును ఇదియే కారణము కార్ల్ డార్లింగ్ బక్ ఇట్లు నిర్వచించు చున్నాడు

' The meaning (of a word, sentence etc in part also of an action) is expressed by derivatives of words for sign, point out explain and words meaning primarily 'reason, thought sense understanding intention power force value inward ness etc all of obvious application' (p 1231)

అర్థమనగా ప్రతియొక్కరికిని తెలియుచున్నగే బయటికి చెప్పవలెనన్నచో సమస్య మొదలగును

ఎ) గ్రీకు / sign' / mark / (semasiology semantic semantics)

బి) గ్రీకు / vous/mind / reason/evvola /( notion / idea')
ఫ్రెంచి / quevent / force'
లాటిన్ / vis / strength force

సి) లాటిన్ / significatio /, / sensus / 'sense/feeling'
ఫ్రెంచి / sens / signification
ఇటాలియన్ / significato / sense (లాటిన్ లోవలె)

డి) ప్రాచీన ఇండోయూరోపియన్ / tacung /, / andgit /
మధ్య , / meaning /, / tokening /
ఆధునిక ఆంగ్లము / meaning /, 'sense

దీనినిబట్టి గుర్తింపవలసిన అంశము ఒకటున్నది ఒక భాషలోని ఒక పదమున కర్థనిర్ణయము ఆపదమును అభాషావ్యవహర్తలెట్లు వివక్షింతురో అట్లు చేయవలెనని దీనినే రూఢి నియమమందురు అర్థమునకు (ఎ)లో సాంకేతికత (బి) లో శక్తి, (సి) లో అనుభవము, (డి) లో ఇవి రెండను వివక్షింపబడు చున్నవి ఇవన్నియుగాక 'ప్రజ్ఞ' / ప్రతిభ అను అర్థములు (ఇ) లో ఇవ్వబడినవి

ఇ) రుమేనియా / inteles / 'understanding, 'meaning
ఫ్రెంచి / intelege / 'understand'
ఐరిష్ / ciall / 'intelligence reasoning'
/ inne / 'intestine (inner part)'

లాటిన్ / endo / / indu / / ind / / in /
*PIE *end-ya* (p 1232)

ఇట అర్థమనిగా ఆంతరికమగు ప్రజ్ఞ అను అర్థము సంభావింపవలసియున్నది కావున అర్థమును గురించి పరిశీలించుటలో (ఎ బి సి డి,) భిన్న మార్గములని గ్రహింపవచ్చును, (ఎ) - (బి) లోను, (డి) - (ఎ, బి)ల లోను కలిసిపోవును కాగా అర్థమునుగూర్చి (ఎ) సాంకేతికదృష్టితోను, (బి) శక్తిదృష్టితోను పరిశీలింపవచ్చును (ఎ బి ) లను కలిపి చూచెడుదృష్టి (ఇ) ఈదృష్టితో (ఇ) ఒక్కటేయున్నది - అది ప్రతిభ దీనికనేక వ్యక్తరూపములుండగా-ఒకటి భాష (లాంగ్వేజ్) అదియు వాక్కు (స్పీచ్) తో కూడినదికావచ్చు - వాక్కులేనిది కావచ్చు 24 శబ్దార్థములు రెండును వాక్కున అనువిద్ధములుగా నుండును దీనినే గ్రీకున 'సైన్' అని ఎరిచిరి

O 3 5 1 అర్థము స్వతంత్రము కావున వాక్కు లేనిచోటను ప్రవర్తిం చను భాషలేని క్రియాదుల (nonverbal actions) యందును అన్వయించును 'వాక్కు' అనుటను మానవోచ్చరిత శబ్దమను కేవలార్థమున గ్రహించినపుడు

O 3 5 2 విశ్వవ్యాప్తమగు శబ్దమనునర్థమున 'వాక్కు' ను గ్రహించి నపుడర్థములేని చోట్లను వాక్కు ప్రవర్తించును అర్థమనగా నిచట కేవలము రూఢి మూలమున సిద్ధించుతాత్పర్యము 25 (శబ్దబోధ)

O 5 6 కావున 'శబ్దము' ను ఎరిశీలించుటలో భిన్నదశలున్నవనుట గుర్తింపదగినది ఒక నిర్దిష్టార్థమున భాషనునియమింపుట పరిభాషా (meta language) కల్పనము ఇదియే వాగ్వికల్పము 26 ప్రతిశాస్త్రమును ఇదెపని చేయుచున్నది, లేనియెడల పూర్వాపరవై రుధ్యములు, అన్వయక్లేశము తప్పవు ఒక భాషనుండి మరియొకభాషలోని కనువాదము చేయునపుడీసమస్య మిక్కిలిక్లేశకారి

O 3 7 ఈసిద్ధాంత వ్యాసమున వ్యంజన' 'సూత్రము' లను రెండు శబ్దములు వాడబడుచున్నవి (సూత్రమునకు సంబంధించిన వివరణమునకు చూ. వ్యం సూ అధ్యాయము 2) 'వ్యంజన' శబ్దమును వ్యావహారిక శాస్త్ర తాత్త్వికదృష్టులతో నెట్లు వాడుచున్నారో తెలుపుట అవసరము

నైఘంటికార్థములివి

1 అర్థం వ్యనక్తీతి వ్యంజకః - అంజూవ్యక్తిశ్లక్ష్ణ కాంతిగతిషు

2 వ్యంజకాభిన యౌ సమౌ ___
అభిముఖేన ఆర్థోనీయతే అనేనేత్యభినయః - ప్రావణే (ణీఞ్)
(దీనిచేత అభిముఖముగా అర్థముపొందింపబడును గురుబాలప్రబోధిక పుట 151)

3, వ్యంజనం - లాంఛనశ్మశ్రునిష్ఠానావయవేష్వపి

4 వ్యంజనం - కాదిహాంతేస్యాదితి శేషః[27]

5 వ్యజ్యతే అనే నేతి వ్యంజనమ్ (పుట 781)

3 లో చెప్పబడినట్లు లాంఛనము' గాను 4 లో చెప్పినట్లు కకారాదులుగను గ్రహించుట వాగ్వ్యాపార సంబంధికాదు [28]

2 ననుసరించి అభినయములు అంగిక-సాత్త్విక - వాచిక - ఆహార్యకములని చతుర్విధములుగా గ్రాహ్యము వాచికముతప్ప తక్కినమూటను 3 గతార్థ మగును

1 వాచికము - శాబ్దికము - కావున అర్థమును వ్యంజించు - వ్యక్తీకరించు ప్రకాశింపజేయు - ప్రక్రియగా గుర్తించుచున్నది మొదటి నాల్గును 5లో తాత్త్వక సమన్వయమును పొందుచున్నవి

కావున 'అంజ్ ధాతువునకు బక్ anoint' అను అర్థము నిచ్చినాడు, (మా, పుట 1234)

సంస్కృతము - స్పష్ట, వ్యక్త 'clean, plain (to the mind)

[స్పశ్ - పశ్ + పశ్ see (originally visible, seen)] -

Buck op cit p 1234

అర్థమును స్పష్టము చేయునది శబ్దము కావున 'వ్యంజన' శబ్దసంబంధి,[29] ఇది తాత్త్వికదృష్టి ఇది వాక్కునకు సంబంధించిన వివరణము ఆలంకారికులకు మార్గదర్శక మీపద్ధతియే

O 3 8 'Suggestion అను ఆంగ్ల పదమునకు సమానముగ వ్యంజన ను పూర్వపరిశోధకులే గుర్తించిరి (చూ, కె కుంజున్నిరాజా ఐ టి ఎం, ఆధ్యా ) Webster s dictionary (vol III 5 – 2) లో 'సజెస్ట్' ధాతువునకు పర్యాయములుగ imply hint, intimate, insinuate అను రూపములీయ బడినవి (పుటయ 2286) క్రింది ప్రసిద్ధములైన యర్థము లొసగబడినవి

1) లాటిన్ suggestu (a) (suggerere to put under
heapup furnish, suggest)
(sub—gerere to bear, wage)

(a) లో ఇది అకర్మక క్రియగా గుర్తింపబడినది - సకర్మక క్రియగా

(b) లో క్రింది అర్థము చెప్పబడినది

(suggest an idea proposition or impulse into the mind')

(a) 1) *to seek to influence the mind of* (urge)
Two spirits do *suggest* me still—Shakespeare

2) arouse evoke (to call forth)
The pleasant voice that entied and *suggested* the most improbable falsehood from witnesses —Rose Macauley

3) to mention as a possibility – hint – intimate
X *suggested* that a change of government is necessary

4) to propose (something) as desirabe or fititing
X *suggested* a special committee to work on plants for a possible settlement — New Republic

5) to offer (as an idea or theory) for consideration
X *suggested* the conception of poetry as a living whole —T S Eliot

(b) 1) *to call or bring to mind* (as an idea or object) by a process of logical thought or natural association of ideas 30

(1) The explosion *suggested* sabotage

(2) To sense as an incentire, inspire

A short history *suggested* by an actual incident

(3) To give an indication or impression of, imply the preserve of

Admirable works yet suggested aloofness from the sordid realities—V L Parrington

నై ఘంటిక సారమిది

Suggest—may involve communicating or implanting an idea by calling attention to some notion likely to be associated with it by starting a mental association naturally leading to the notion in question

(webster s Dictionary p 2286)

దీనికి నిదర్శనము చూపబడినది

"The business of words in prose is primarily to state, but in poetry, not only to state, but also (and sometimes primarily) to suggest' — J L Lowes ( ibid )

నైఘంటిక ప్రయోగములను చూపుటలోని దృష్టి - వ్యావహారికమున సజెస్ట్ పదమునెట్లు వాడుచున్నారో తెలుపుట

Suggestion — act of suggesting

అని ఒక ప్రక్రియగా మాత్రము నిఘంటువు చూపినది. [పుట 2286]

0 3 8 1 కాని 'వ్యంజన' సజెషన్' అను పదములను శాస్త్రదృష్టితో ఉపయోగించినపుడు నిర్దిష్టప్రయోజనముండును వ్యంజనసిద్ధాంతము భారత దేశమునందు మాత్రమే పెరిగిన దగుటవలన ఒక సూత్రమున్నది ఇట్టి సూత్రము పాశ్చాత్యదేశములందులేదు ఈ శాస్త్రదృష్టి స్వరూపము తరువాత ప్రదర్శింప బడును [ చూ వ్యం సూ 2 12 ]

0 3 9 ఆనందవర్ధనుని దృష్టితో 'వ్యంజన' ఒకవ్యాపారము - వాగ్వ్యాపారము అనగా శబ్దమునకు వాచ్యార్థముతోపాటు తదాధారమైన - విశిష్టమైన వ్యతిరిక్తమైన అర్థాంతరమును స్ఫురింపజేయగల శక్తియున్నదని యర్థము [ధ్వ, ఆ 1 - 7 - 13] వాచ్యార్థమునకును ఇట్టిశక్తియే యున్నదనియు అలని సిద్ధాంతము కావున శబ్దార్థస్వరూపమైన వాక్కు (voice / speech) నకు సంబంధించినదీవ్యాపారము ఇది నిఘంటువువలన, వ్యాకరణము వలన, తర్కము వలన తెలియునది కాదని అతని నిరూపణము ఈ శాస్త్రములు శబ్దార్థములకున్న రూపప్రయోజన - వైవిధ్యమును లింగప్రమాణము నాధారముగ ఎవారించును ఈరూపప్రయోజనములు వ్యవహార కావ్యభేదములను కల్గినవని అవి గుర్తింపవు కాని కావ్యమునందలి వాక్కు రసవృత్తి కల్గినదిగా ఆలంకారికులు గుర్తింతురు

కావున విలక్షణమైనది ఈవిశిష్టత వక్తృశ్రోతృహృదయ సంబంధి అభిజ్ఞా (కాగ్నిషన్) మూలకముగ స్ఫురిత (perceive) మగునది బుద్ధి (ఇంటలెక్ట్) చేత గ్రహింపబడునది కాదు ఇది కేవలము అనుభవజ్ఞాతము (experienced)31

0 3 9 1 ఇట్టి స్ఫురణ (ఇన్ట్యూషన్) విశ్వజనీనము కావలయును గదా! పాశ్చాత్యులందెట్లు లేదనిచెప్పుట ? ఉన్నచో ఆనందవర్ధనుని సిద్ధాంతము పాశ్చాత్య విమర్శకులెవ్వరును చెప్పలేదని Krishnachaitanya Gnoli వంటి వారు ఎట్లు నిర్ధరించిరి ? సమాధానము నోలి (196 ) చక్కగ చెప్పినాడు

The main difference between India and the West is based on the fact that with us this conception 32 which goes back to the Alexandrian school and especially to origines – has remained restricted to the theological speculation Had it been developed in a literary direction we would have had a sort of counterpart to the conception of Anandavardhana

(Aesthetic Experience according to Abhinava Gupta
Introduction p xxxiv)

0 3 9 2 ఈ భేదము వ్యక్తావ్యక్త విషయములను వేర్వేరుగా చూచుట సమన్వయించుట - భాషాశాస్త్రాభివృద్ధిలో చారిత్రక పరిణామ దృష్టితో ఈ అంశమును నిరూపించిన పరిభాషాకల్పనము లెంతటి సాంస్కృతిక ప్రాధాన్యమును కల్గినవో విశదమగును వ్యంజనను వాగ్వ్యాపారముగ గుర్తించుటకిది 'భూమిక అనగా పూర్వరంగము

## జ్ఞాపికావివృతి (NOTES)

1 ఆనందాభినవులిరువురికి వ్యంజన సూత్ర ప్రతిపాదనమున సామ్యమున్నది, భరతుని రస సూత్రమును ఆధారముగనే ఇరువురి దృక్పథములు ప్రసరించినవి నిరూపణము ఇది

ఎ) అనుభావ విభావావబోధనోత్తరమేవ తన్మయీభవనయుక్తా తద్విభావానుభావోచిత్తవృత్తివాసనానురంజితస్వసంవిదానంద చర్వణాగోచరోఽర్థో రసాత్మా స్ఫురత్యేవ (ధ్వ ఆ పుట 81)

బి) శబ్దసమర్ప్యమాణహృదయసంవాదసుందరవిభావానుభావ సముచిత ప్రాగ్వినివిష్టరత్యాదివాసనానురాగసుకుమారస్వసంవిదానంద చర్వణావ్యాపారరసనీయో రూపో రసః (లో పుట 51)

౨) కావ్యార్థాన్ భావయంతీతి భావాః (నా శా అధ్యా ( ప్రారంభము అభినవభారతి వ్యాఖ్యానము)

ఈ మువ్వురి భవనయు 'వాగ్ధి సర్వస్యకారణమ్ (నా శా 7 - 50) అను వైదికాభిప్రాయానుసారియగుట ఈ సమన్వయహేతువు

౨ బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను బోలిక కేవలమాలంకారికము (ornate)గ చేయబడినదికాదు భరతుడు వాగభినయము (సృష్టి)ను గూర్చి ఆనందుడు వ్యంగవైభవము (స్థితి) ని గూర్చి అభినవుడు రసాభివ్యక్తి (శబ్దార్థములకు భావముతో అభేదదశ) - లయను గూర్చి ప్రతిపాదించియున్నారు ఒకరిని గుర్తించి మరియొకరిని వదలుటకువీలులేదు ఈవిషయమును తెలుగు పరిశోధకులలో మొదటగుర్తించినవారు తుమ్మపూడి కోటీశ్వరరావుగారు (1971) పుట 1 చూ Raniero Gnoli (1968) Introduction)

3 లోచన మీశాబ్దిక దృష్టినిట్లు సమీక్షించినది

వాచ్యార్థసామర్థ్యాక్షిప్తమితిభేదత్రయవ్యాపకం సామాన్యలక్షణం యద్వ్య ఞ్జనం ధ్వననం శబ్దస్యైవ వ్యాపారః (లో పుటలు 52 - 3)

(చూ పైన 1 (b) )

4 వాగ్వ్యాపార దర్శనమొక తాత్త్విక సూత్రము (epistemological principle) వాక్కు - ప్రపంచ ములభిన్నములు ఆలంకారికుల ఈమార్గమున ఒకవిశిష్ట దర్శనపద్ధతి యున్నది dress of thought అను మాటకు manifestation అని అర్థము 'వ్యక్తి' (అభివ్యక్తి) అనగ నిదియే ఇదివైయాకరణ మార్గమునను కొందరియందుగలదు భర్తృహరి నిదర్శనము మీమాంసకులును అంగీకరించిరి భట్టనాయకుడుదాహరణము కావున ఆలంకారికులకు వాక్

విరాసములేదు ఈనాడు stylistics మరల 'వాక్ ఒత్త్వమును గూర్చి ఆలోచించుచుండుట నిదర్శనము (చూ Barthes Halliday in chatman (ed) 1971 )

5 రాజాగారు (1969 ప్రతిలో) అనుబంధము additional bibliography నిచ్చియున్నారు కాని సిద్ధాంతపరముగ భాషా విజ్ఞాన సంప్రదాయములందు కానవచ్చు అలంకారిం శాస్త్ర సన్నిహితత్వమును సమన్వయింపుటకచ్చట ప్రయత్నముసాగలేదు

6 బ్రఫ్ (1951) వ్యాసమునందున్న విశ్లిష్టలక్షణమ భర్తృహరి 'వాక్యస్ఫోట' కీయనపట్టిన పిరాజనము ఈనాటికిని ఇంకను ఒరిశోధితవ్యాంశము

"In Bhartrhari s view, then the primary linguistic fact is the undivided sentence-sphota Just as a bare root has no meaning in the world (cf V P 2-212) so also the meanings of individual words are merely hints or stepping stones to the meaning of the sentence This is a plain linguistic fact which has none the less been clear to very few philosophers either in India or elsewhere and though famliar enough in modern linguistics, is still constantly everlooked in many discussions on meaning

(Brough p 413 in Stall, 1972)

7 వేదభాగముల ననువదించిన Louis Renou (1941-42 గ్రసమున) వైదిక వాక్కు ఛందమని' లోకవ్యవహారము 'భాష' యను వ్యాకరణ సంప్రదాయమును జూపెరి (చూ స్టాల్ సం పుటలు 435 - 36, 1972)

Renou relates the analysis of grammar to the practice of Veda recitation, shows how the concept of suutra 'rule is used in ritual and grammatical texts and how the concept of paribhaasa, 'metarule arose '

(స్టాల్‌పుటలు చూ పై గ్రంథం పుట 433)

8 మొదటి ఇరువురును వర్ణపదవిజ్ఞానమునకే తమ్మ్రమలను ధారపోసినారు తరువాతిమువ్వురును వ్రాసినవ్యాసగతాంశములు ఎమెనో, బ్రఫ్ వ్యాసముల ద్వారా తెలియుచున్నవి

9 ఎమెనో వ్యాసము (1955 - 56) న తోడా ప్రజలగేయమొకటి ప్రస్తావింవ బడినది ఆయన వ్యాఖ్యానమిది

'The panegyric for a deadman suggests by stereotyped, but *noncolloquial* (italics mine-HSB) statements about his buffaloes and the disputes he settled, that he was a person of consequence in the society This I think is poetical suggestion

(Emeneau p 339)

10 implication వక్తృవివక్షకు సంబంధించినది (చూ వ్యం సూ 2-12) అది అవివక్షితవాచ్యముకావచ్చు అర్థాంతర సంక్రమితమును కావచ్చు Edgerton గుర్తించినది రెండవది ప్రత్యేమేనని - Quintilian గుర్తించిన 'emphasis (1)' (Institutio viii 3)తో సంవదించు అంశమది మాత్రమే నని Brough (1953) వాదించు చున్నాడు చూ I T M పుట 303

11 అంతకు ముందుగా హిందీ భాషపై జరిగిన అర్థపరిశీలన Harda Bahri గారిది (1954 8 - 4 పుటలు 320 - 23 లలో Suggestion ప్రస్తావన ఉన్నది అట్లే Bhattacharya గారి (1962) గ్రంథము, R C Pandeya గారి (1963) గ్రంథము అర్థవిచారణకు అంకితములైనవి

12 ఫ్రిత్ వ్యాసము (1954) న 'context' ప్రధానముగ గుర్తింపబడినది కాని వ్యంజన వాగ్వ్యాపారముగ గ్రహింపదగినది అనగా సందర్భము వాక్యగతమై అర్థవిశేష సమర్పకమగుననుట

13 Hjemslev (1933) వేసిన ప్రణాళిక ఆరువాతికాలమున Barthes (1964) చేతిలో ఒక రూపమునందుకొన్నది ఈనాటి 'Stylistics సంప్రదాయమున ఈశాఖకు ఆద్యాచార్యుడుగా ఈయనను గుర్తింపవచ్చు దాదాపు ఇదే సమయమున Malinovsky (1935) భాషలో pragmatic magical functions ని గుర్తించి యుండుటయు ఇచట అనుసంధింపదగినది

14 Barthes (1964 / 67) పుటలు 32 33

1 Karl Buhler (1934) వాగ్వ్యాపారత్రయమును గుర్తించినాడు అవి (1) representative (2) conative (3) expressive Halliday (1971) ఇట్లు వాగ్వ్యాపార సిద్ధాంతమును నిర్వచించినాడు

By a functional theory of language I mean one which attempts to explain linguistic structure, and linguistic phenomena by reference to the notion that language plays a certain part in our lives that it is required to serve certain universal types of demand

(in Chatman (ed) 1971, p 331)

16 చూ బ్రహ్మానంద హెచ్ ఎస్ (అ ప ఉ సం 1979 1980)

ఎ) భాషా శబ్దము *biasa* (Javanese), *bahasa* (Indonesian) అన్నరూపాంతరములతో వ్యాప్తినంది యుండుట గమనించదగినది (చూ వ్యం సూ 1 9 6)

బి) వాక్ - నాలుక / నోరు అన్న అర్థములందు సగోత్రసంబంధము కని ఎంచని భాషలందును కనిపించుచున్నది తమిళం వాయి 'mouth also 'language (తెలుగు-వాడి నోరుమంచిదికాదు) తెలుగు వాగు 'prattle' (వాగుడుకాయ) వాకర 'vomiting sensation (వాంతి) లాటిన్ vagire 'cry

సి) సం వద్ speak' తె వదరు 'to prattle (వదరుబోతు)

డి) సం భాషా, త పేశ్ తె పేర్లు / పేలు - మధ్యగల సంబంధము కూడ ఆలోచింపదగినది తె అడుగు 'foot, also ask cf సం పద - foot also word కొన్ని ధ్వన్యనుకరణ రూపము లున్నవి సం లంతం తె లబలబ (చూ క్రింద 18)

17 ఇప్పు వరకు పరిశీలనకు లందినంతవరకు పొడుపుకథలలో (చూ బ్రహ్మానంద ప్రపంత మార్చి 1980) ఇట్టి 'విశ్వభాషా సామాన్యలక్షణము' లక్షణావృత్తి (metaphor) లోకనిపించినది ఇట్లే శిశుభాషలో - మాతృపితృవాచక రూపాలలోను అహేతునియామకత , శబ్దవ్యంజకత' - అనులక్షణములు విశ్వభాషా సామాన్యములుగ కనిపించుచున్నవి (చూ బ్రహ్మానంద భారతి 1978, 79, 80 )

18 అమరసింహుని పింగడింపు ఇక్కడ ప్రసక్తనీయము సరస్వతి యను అర్థ మున బ్రాహ్మీతు ఇత్యాదిగచెప్పి మాట్లాడు అను లర్థమున

వ్యాహార ఉక్తిర్లపితంభాషితంవచనంవచః' (అరేపుట) అని చెప్పి యుండుట గమనార్హము ఈ రెంటికిని సంబంధమున్నదని - ఈ పదమూ డింటిని (7 + 6) పర్యాయపడము లనియు గుర్తించియున్నాడు

కేచిద్ద్వావ్మోహ్యాక్త్రియోదశ వచనపర్యాయా ఇతిబ్రువంతి
(చూ అమరకోశమ్ - శక్తిధరశాస్త్రివాఖ్య పుట 47)

19 భరతనాట్య శాస్త్రమున అష్టాదశాధ్యాయమున విధింపబడిన భాషావిధానము నిదర్శనము అతిభాష ఆర్యభాష, జాతి, యోన్యంతరీవిభాషాది విభాగములుగలవు

(చూ నా శా 18-26, 47, పుటలు 95-97, దేవనాగరప్రతి 1967)

20 లాటిన్‌లో lingua / vox ల మధ్యగల సంబంధము 'వాక్కు' నకు గల భౌతిక మానసిక సంబంధమునకు తుల్యమైనది (చూ పైన 16) తె పలుకు speak (పల్ tooth) మాట word (మాటు – garb/secret)

21 ఇది మంత్రశాస్త్రప్రసిద్ధమైనవరుస శ్రీమదాద్యాకాళికాయాః వాఙ్మనః చక్షుః శ్రోత్రి జిహ్వాఘ్రాణప్రాణాః ఇహాగత్య చిరంతిష్ఠంతుస్వాహా। అని ప్రాణప్రతిష్ఠాపనమంత్రమని జాన్ఉడ్రాఫ్ ఉదహరించినాడు (చూ 1913/63 p 107 fn 6) కోశములలో చూపబడినవరుసలో 'వాక్కు' లేదు మనో నేత్ర జిహ్వాఘ్రాణత్వక్ శ్రోత్రములు (గురుబాలప్రబోధిక పుట 115) దీనికి హేతువు ఇట్లున్నది

'The saktı of the mantra ıs the vaacaka saktı , or the means by whıch the vaacya saktı or object of the mantra ıs attaıned The mantra lies ın the energy of the former

(Woodroffe, op cıt p 87)

22 సస్యూర్ తరువాత భాషా పరిశీలనమునకు సంఘము - వక్త - శ్రోత - వీని సంబంధము ప్రధానాంశము (చూ వ్యం సూ 1 - 9)

23 సోక్రటీసు, ప్లాటో అరిస్టాటిలుల మార్గమున - మానవునికి వక్కుకు ఉన్న సంబంధాన్వేషణమే ప్రధానము (చూ బ్రహ్మానంద, ఆ ప ఉ సం, 1980)

24, 'వర్ణమాల అన్నగ్రంథమున ఉడ్రాఫ్ అవర్ణాత్మకభాషను గుర్తించినాడు ఆనందవర్ధనుడు గీతమునగల వాచ్యాన్యతాగుణమును ప్రస్తావించుటలో తః అంశప్రాధాన్యము చూడవచ్చు (చూ వ్యం సూ 2 - 12)

25 సంగీతమునగల భావానుభవవిషయకముగ Steıner చెప్పిన ఈమాటలు అన్వర్థకములు

'Music is a 'language' in a peculiarly unstable sense We may be using it at the most technical semiotic level (both are sequential rule-governed sign systems obeying certain consraints) or in a sense almost too large for proper definition (both can 'communicate human emotions and articulate states of mind) (Steiner A B p 423 1975)

26, ఇక్కడ పరిభాష' 'technical term అను అర్థమున కాకుండ direction rule అను విశిష్టభావమున వివక్షింపబడినది 'స్వంరూపం శబ్దస్యాశబ్దసంజ్ఞా అనుపాణినిసూత్రవ్యాఖ్యానమున పతంజలిమహర్షి పాటించిన పద్ధతియిది చూ అభ్యంకర్ (సం) పరిభాషేందుశేఖరమ్ (పుటలు 3 4, 1962)

27 వ్యంజనమ్ (నపుం / వ్యంజనా (స్త్రీ) - అను లింగద్వయానుమతికి చూ గురుబాలప్రబోధిక పుట 892)

28 చూ వ్యం సూ 2 - 11 - 1, 11 - 3

29 చూ వ్యం సూ 2 - 13 - 1 13 - 2

30 ఎ (1) లో చెప్పబడినది మనస్సు ప్రభావితమగుట (inpression) బి (1) లో చెప్పబడుచున్నది మనస్సు గుర్తించునట్లు చేయుట (recolletion / recognition) దీనినే ప్రత్యభిజ్ఞ' అని శైవాగమభాషలో ఎల్లురు చూ వ్యం సూ 2 - 12 - 1

**31** ' Lossky and Bergson have made elaborate defences of intuition Lossky regards intuition as the capacity for knowledge of an object in its integrity The several qualities of an object are perceived by different sense organs which are however unable to mediate the unity of the whole complex of perceptions While it is possible for one to see the colour feel the shape and taste the sweetness of orange, it is impossible to see,

feel or taste its unity Likewise, intuition and not construction out of atomistic fragments is the process by which the unity of personality is grasped Similarly in the aesthetic context, the poem is reacted to as a unity The components are not reacted to individually and the total meaning obtained by an additive or logical process Cruce also streams intuition as the perception of particularity or unity He feels that sole reliance on associationism involves the sacrifice of the perception of unity Bergson claims that the operation of the intellect is indirect, being composed of a member of fixed states, which when combined give rise to inferential knowledge, while intuitive understanding is immediate

(Krishnachaitanya S P Ch 6 pp 118–160, 1965)

32. ఈ కన్సెప్షన్ ఏమనగా - ఆనందవర్ధనాదులు వ్యావహారిక - కావ్యభాషల కర్థసమర్పణశక్తి యందున్న భేదమును గుర్తించినట్లు పాశ్చాత్యులును గుర్తించుట పాల్‌వెల్లరీ, హెచ్ బెలుబెచ్ మొదలగువారు మత గ్రంథములందు వాడబడిన శబ్దములు రెండురకముల అనుభవములను కల్గించు చున్నవని వ్రాసిరి

1) Sensus historical vel literalis

2) Sensus spiritual qui

మొదటిది వ్యావహారికార్థానుభవము రెండవది తాత్త్వికార్థానుభవము కొన్ని passages ని చదివినచో వాచ్యార్థశూన్యములుగా - నిరర్థకములుగా ఉండుననియు కాని అట్టి ప్రతివాక్యమునకు గర్భిత తాత్త్వికార్థమొకటుండుననియు వారి నిరూపణమనియు నోలి చూపినాడు

(Gnoli Introduction p xxxiv 1968)

బార్తెస్, హాక్స్ మొదలగువారుచేసిన ప్రతిపాదనలును 'మైథాలజీ కి సంబంధించినవను విషయము ముందుచెప్పబడినది (చూ వ్యం సూ 1 - 12)

# 1. పృథక్కరణము (ABSTRACTION)

Abstraction is that form of mental activity which releases the essential content or fact from its connection with irrelevant elements it distinguishes it from them, or in other words differentiates it In its wider sense every thing is abstract that is separated from its connection with non-appertaining elements

— C G Jung (1953) p 520

చార్వాకైరివ ఆత్మపృథగ్భావే

— లోచనము పుట. 45.

## పాశ్చాత్యదృక్పథములు - శబ్దార్థములు

### 1 0 'పాశ్చాత్య' నిర్వచనము

**ఈ** అధ్యాయమున భారతీయేతర దేశీయుల శబ్దార్థపరిశీలనా దృక్పథములు పృథక్కరింపబడును - అనగా విశ్లేషింపబడును 'పాశ్చాత్య మనుటను నిర్వచింప వలసియున్నది ఈ అఖండవిశ్వమున ప్రాచ్యపాశ్చాత్యములను వింగడింపు జానపదమైనది - అనగా స్థూలమైన అభిప్రాయమనియర్థము భారతదేశమునకు ఐరోపా పశ్చిమముగానున్నదనుట అట్టిది అట్లే ఐరోపాయందు ప్రాగ్దిశగానున్న గ్రీకురోమను సామ్రాజ్యములకు పశ్చిమముగానున్నవి ఫ్రాన్సు ఇంగ్లండులు కావున 'పశ్చిమ దేశమనుట సాపేక్షకమగుమాట ఇన్నియర్థములందును సమానముగానున్నది భారతదేశమునకు పశ్చిమములనుట కావున ఇట

పాశ్చాత్యమనగా భారతీయేతరమను నర్థము సంభావింపవలసియున్నది భారత దేశమున ఈనాడు ప్రచలితముగనున్న భాషాశాస్త్రము చాలస్వల్పపరిధినిగలది ఇంకను ఎదగనిది అమెరికా ఇంగ్లండులలోని కొన్ని సంప్రదాయములను మాత్రమే ఇచ్చట మనము పఠించుచున్నది ఇంకను ఇతర దేశములందు సాగిన, సాగు చున్న భాషా పరిశీలన స్రవంతులున్నవి । ఈ స్రవంతులనడుమ జన్యజనక సంబంధములున్నవి ఒక్కొకచోనవిస్వతంత్రములును ఇవి యన్నియు సమాన రాజకీయ సాంఘిక వాతావరణములందు పుట్టినవికావు చారిత్రికముగను ఎచ్చట మొదలైనవో స్పష్టముగా చెప్పుటకు వీలునుగానివి ఒక ప్రయోజనము నాశించి ఈ భిన్నభాషాశాస్త్రసంప్రదాయములను వేరుచేసి చూచునపుడు మిక్కిలి ప్రమాదకారియగు నంశము ఆయాసంస్కృతీనేపథ్యములతో పరిచయము లేక పోవుట ఈశతాబ్దిద్వితీయారంభమునుండి భాషాశాస్త్రసంప్రదాయము లందనేకము లగు మార్పులతిత్వరితముగవచ్చినవి వీనికిహేతువు భిన్నశాస్త్రముల నేపథ్యముతో భాషను దర్శించుట సంస్కృతగ్రంథములను కూడ అట్లే చూడవలయునను స్టాల్ అభిప్రాయము పూర్వము ప్రదర్శితము (చూ వ్యం సూ 0 2 7 3)

ఇట్లే ఇంగ్లండు, అమెరికాలలోని భాషా పరిశీలకులును తమతమ ప్రాచీన సంస్కృతీనేపథ్యములను, ఆయాచారిత్రక దశలలోపుట్టిన భిన్నశాస్త్రములందు గల భాషా పరిశీలన దృష్టవైవిధ్యమునుగుర్తించి ఆధునిక భాషాశాస్త్ర సంప్రదాయములతో సమన్వయించుటకు ప్రయత్నించి యున్నారు అట్టి ప్రయత్నముల మూలమున ప్రాచీనత, నవీనతయను భేదములు శాస్త్రసత్యములకు లేవనువిషయము స్పష్టమైనది ఇట్టి పరిశీలకులలో ఒకడైన ఆర్ హెచ్ రాబిన్స్ (1967) చారిత్రకముగా ఆలోచించుట యనగా నేమో తెల్పుచున్నాడు

'Historical thinking about science or about anything else in human affairs consists in the study of the temporal sequences of persons and events, and the causal connections influences and trends that may be discovered in them and may throw light on them'

(A Short History of Linguistics S H L p 3)

ఇట్లు ప్రయత్నించి ఈనాటి భాషాశాస్త్ర పరిశీలకులలోని మౌలికమగు ఆలోచనావిధానములు సూక్ష్మముగనైనను పాశ్చాత్యదేశములకు (ముందు చెప్పిన యర్థములో) సంస్కృతినైశిత్యమును ప్రసాదించిన గ్రీకు రోమన్ మేధావుల ఆలోచనా విధానములందంతర్భవించునని నిరూపించినాడు

But in the European tradition we are in a position to follow a continuous line of development from the origins of the subject in ancient Greece, whereas we know little of the origin and early stages that lie behind the mature Sanskrit work of the Indians (S H L p 6)

(రాబిన్స్ వాక్యములోని ద్వితీయార్థమునకు సమాధానమే ఈసిద్ధాంతవ్యాసమున గల ద్వితీయాధ్యాయము) - ఇట్టి ప్రయత్నమును చేసిన మరియొకరు Francis P Dinneen (Introduction to General Linguistics I G L 1966) వ్రాసిన ఈక్రింది విషయము పాశ్చాత్యమనుట దేశకాలములకు సంబంధించినది కాదని సూచించుచున్నది ఈదృక్పథభేదములను traditional అని modern అని అనుచు భాషా దృష్టులందిట్టిభేదము ఒకప్పటి వ్యాకరణమునకును, ఈనాటి భాషాశాస్త్రమునకును గలదని Dinneen ఇట్లు వ్రాయుచున్నారు

The cardinal differences between the classifications and rules of traditional and modern structural grammars are those that distinguish empirical sciences and humanistic studies '

(I G L, p 166)

ప్రాచీనులందును empirical' దృష్టియున్నవారున్నారు వారిని విమర్శించిన humanist' దృష్టిగలవారును ఆకాలముననేయున్నారు ఈదృక్కోణవైవిధ్యము విశ్వసత్యమును దర్శించుటలో పర్యవసించును భాషనుకూడ అట్లే దర్శింతురు కావుననే Dinneen అర్థ'మనగానేమి యని ప్రశ్నించుటలోనే ఈ భేదముగలదనిరి

'The problem that most separates the two concerns the ole of meaning in the analysis of language (I G L p 168)

కావున 'శబ్ద మనగానేమి యనుటయందను నుండవలయును ఉన్న దనుటకు ముందుచూపిన Gnoli వాక్యము (వ్యం సూ పుట. 26) నిదర్శనము. పాశ్చాత్యమనగా ఈదృక్పథ భేదమనియర్థము.

## 1 1 గ్రీకువాదములు (క్రీ. పూ 5 - 3 శ) -

గ్రీకువాదములన్నియు తాత్త్వికపరిధిలో భాషను పరిశీలించుటయందు పర్యవసించుచున్నవి ఈవాదము తర్కము నాశ్రయించినది ఈవాద (dialectics) స్వరూపము విశాలమైనది మనకు తెలిసినంతవరకు సోక్రటీసు[3] (క్రీ పూ 400-348) తనకు ముందున్న చార్లటన్స్ వాదములను ఖండించి క్రాటిలస్ వంటివారు భావించునట్లు శబ్దము (name) ప్రాకృతికము (natural) కాదనియు హెర్మోజీన్స్ వంటివారు వాదించునట్లు కేవలము రూఢి (convention) మూలకము కాదనియు — ఒక సంస్థిద్ధాంతమును చేసినాడు శబ్దార్థ సంబంధ సమీక్ష ఇతనితో ఒక రూపు నందుకొన్నది ఈవాదమునే 'physis-nomos controversy అందురు సోక్రటీసు సంస్థిద్ధ సమాధాన మిది

We must admit that both convention and usage contribute to the manifestation of what we have in mind when we speak (I G L p 76)

పేరుపెట్టువాడెవడైనను ఆలోచించి పెట్టును కావున అర్థముతో నిత్య సంబంధముండక తప్పదు. Gk poseidon అని ఒక సముద్రము పేరు. posi (for the feet) desmos (a fetter) అను వ్యుత్పత్తిననుసరించి ఆ నామము సార్థకము

కొన్ని రూపములు వర్ణోచ్చారణ ప్రక్రియా సూచకములు—

Gk sigma phi, ski

కొన్ని ప్రత్యక్షముగ భావవ్యంజకములు 'rho' (apico-alveolar trill) గతి సూచకము Gk rhoein 'నది అని అర్థము నదికి ధాత్వర్థమిట (to flow) సమన్వయించుచున్నది

కొన్ని వర్ణములు పరస్పర విరుద్ధభావములను ప్రదర్శింపగల్గియుండును. Gk lamda జారుడును సూచించును' — leios (slippery) olisthanei (slips) ఏతద్విరుద్ధముగ కాఠిన్యమునుకూడ 'లామ్డా సూచించుట గలదు

Gk sklerotes (hardness)

కొన్ని రూపముల నడుమ సంబంధమనిర్వచనీయము 4

Gk rho, sigma ల నడుమ ఇట్టి అనిర్వచనీయ సామ్యము (unexplainable equivalence) గలదు కావున భాష ప్రాథమికముగ రూఢి మాత్రమే అని అతని సిద్ధాంతము

Since letters both alike and different can represent things that resemble or differ from each other it appears that language is fundamentally conventional' (I G L p 76)

1 1 1 ప్లాటో (క్రీ పూ 400-348) తో అర్థమును గూర్చిన ఒక సిద్ధాంతము వృద్ధినందినది ప్రపంచములోని వస్తువులకు శబ్దములనుకరణము (ఇమిటేషన్స్) లని ఇతని వాదము కనుక శబ్దములు వాస్తవికములు కావు వస్తుబోధకములు (రెఫరెన్షియల్) మాత్రమే వస్త్వతిశయ సత్యములను బోధించుశక్తి శబ్దములకు లేదు కారణము మానవుడే వస్తువులకు పేర్లు పెట్టుకొని యుండుట కర్త భగవంతుడైనచో ఒక శబ్ద మొకే వస్తువును బోధించును. భాషయందట్లుకాదు. కనుక

"Language, when it leads us to a study of the natural structures themselves, can be a powerful ally When it leads only to self language can be worst of all deceivers since it has enough similarity to the structure of the world to give a good imitation or real knowledge '

(as of – F, Sontag cf Morris p 114)5

శబ్దమునకున్న యీ అనుకరణశక్తికి కారణము—వస్తుసందర్శనము వలన భావము పుట్టుట ఆదిపదస్రష్ట (The first legislator of words) వస్తు స్వభావమును ప్రదర్శించునట్లే పదములు సృజించెను లేకపోయినచో మూక బధిరుల వలె మానవులందరు సైగలతో శిరోహస్త ప్రసారణములతో అభిప్రాయములను నివేదింపవలయునుగదా! [క్రాటిలస్ 422] కావున భావము వాక్కు భిన్నములు కావు

Thought and speech are the same, with this exception that what is called thought is the silent inner conversation of the soul with itself 6The stream which flows from the soul in vocal utterance through the mouth is called speech

(Sophist 263)

కావున భాష భౌతికములైన అంగవిన్యాసములలో నొక్కటియే సంగీత చిత్ర లేఖనములందు వలెగాక వాక్కు (స్పీచ్) నకు ప్రత్యేకత యొకటున్నది

a name expresses a more fundamental relation to the underlying reality than do music or painting (Cratylus 423)

ఈవాక్కు కవి వాక్కు అది కేవలమనుకరణము కాదు పదస్రష్ట (The third maker of words) భౌతికమగుశబ్దముగ వస్తుతత్త్వమును, స్వభావమును (nature and essence of things) మాత్రమే చెప్పును (expresses) కాని మరల ప్లాటో శబ్దము వస్తుభౌతికత్వమును మాత్రమే అనుకరించునని వాదించును [See Morris p 118]

ఇట్లు ప్లాటోవాదమున అర్థముకాని క్లిష్టత యొకటున్నది ఈవైరుధ్యమును ప్లాటొ మరియొక విధముగ పరిష్కరించినాడు అది అందరును పదసృష్టలు కారనుటకోనున్నది ప్రాచీనులు సృష్టించిన పేర్లు 'a very true and rational one' (Laws-VII, 816) కాని కాలక్రమమున భాష కలుషితమగును ఇతర భాషాపదములు చేరుట, శబ్దస్వభావము తెలియని పామరుల ఉచ్చారణము (Laws – 2 659-60) — వీని కారణముగ భాషలోని fidelity నశించును ఫలితముగ భాషలో పరస్పర వైరుధ్య (paradox) స్వభావము కనిపించును

కావున అర్థము (మీనింగ్) వస్తువు (అబ్జెక్ట్) నందుగాని శబ్దము (లాంగ్వేజ్) నందుగాని యుండునదికాదు కావున భాషద్వారమున భౌతికతత్త్వమును అసమగ్రముగనే గుర్తింతుమని ప్లాటో మరొకచోట చెప్పును [క్రాటిలస్ 432], అందుకె ప్రాచీనభాష చిత్రము (ఎక్చర్స్) ల వంటిదని అందలి శబ్దము వస్తువును సమగ్రముగ ప్రతిబింబించునని ప్లాటో అనుట

Either the word corresponds to its object in every particular or the word does not apply at all (Cratylus 431-2)

కావున భాష అటు సత్యప్రతిపాదకము కాదు ఇటు పూరిగ యాదృచ్ఛికము కాదు

" Language neither expresses reality nor varies in a completely arbitrary fashion (Morris, p 128)

ఇట్లు ప్లాటోవాదము7 భావ వస్తుశబ్దములకు పరిమితమై సోక్రటీసు వాదములకంటె భిన్నము కాదనుట గుర్తింపదగినది [ cf I G, L p 76]

1 1 2 అరిస్టాటిల్ (క్రీ పూ. 384-322 అని S H L p 14) తో భాషా పరిశీలన మరింత లోతునకు పోయినది శబ్దమునకు భావమునకు సంబంధముండిన యుండవచ్చును లేనిచో లేదు ఇది మానవ వాక్కున మాత్రమే వాక్కును

ఇతడు 'వాయిస్' అని వ్యవహరించెను. ఇతర శబ్దజాలము (నాయిస్) కంటె పేరయినది వాక్కు

a sound uttered by an animal in association with an image' (see I G L p 81)

అందువలన శబ్దములకున్న వాచ్యార్థము (referential meaning) నాధారముగనే అతని వాదము సాగినది

steed అనగా 'గుఱ్ఱము Good steed' ఒక వ్యక్తినామము, ఇచట 'good అను రూపమునకు భావమేమి? కాని పశువుల అరపులతో బాధా క్షుత్క్రోధాదిభావములు నిత్యసంబంధమును కల్గియున్నవి




శబ్దార్థదృష్టులను రెంటిని భాషాపరిశీలనమున ఉపయోగింపవలయునను ప్రతిపాదనము ప్లాటోలో మొదలయినను అరిస్టాటిలు దానికొక సమగ్రస్వరూపము నిచ్చినాడు ప్లాటోకు పూర్వము భాషలో మూడు రకముల పదజాలము గుర్తింపబడినది (1) onoma (2) rhema (3) logos అరిస్టాటిల్ మరియొక దానిని గుర్తించెను—అది (4) syndesmoi

(see for details I G L pp 79 83)

అతని పరిశీలము ననుసరించి పదములలో కొన్నిటికి వ్యస్తముగను కొన్నిటికి సమస్తముగను భావబోధకశక్తి కల్గుచుండుననుట గ్రహింపగలము

అరిస్టాటిలు పరిశీలనము మిక్కిలి వైవిధ్యము కలిగినది అర్థమును logical stylistic, grammatical అనుదృష్టులతో చూడవలెనని ఇతని వింగడింపు 8

శబ్దమును వర్ణపద వాక్యదశలలో పరిశీలింపవలెనని ఇతని ప్రతిపాదన ఈసంప్రదాయము అనంతరకాలమున స్థాయికులచేత విమర్శింపబడినను ఆధునిక భాషా శాస్త్ర సంప్రదాయమున అవిచ్ఛిన్నముగ అంగీకరింపబడినది మరల Malinovsky Firth వంటివారు దీనిని వ్యతిరేకించిరి 9 ఈసిద్ధాంత వ్యాస ప్రయోజన దృష్టితో అతని పరిశీలనమున categories లో చెప్పబడిన ఒక అంశము ప్రధానము

వాక్యములు రెండు విధములుగ గుర్తింపబడినవి

1) equivocal expression

2) univocal expression

1) శబ్దరూపము సమానముగనుండి భిన్నార్థముండుట,

animal | man
| portrait of the man

2) శబ్దరూపముల నడుమ పైపై వైవిధ్యము లేకుండుట

animal | man
| ox

(categories–section 1 cf I G L p 84)

వాక్యము ఎద పృథగర్థ సంజాతమను అభిప్రాయమును కూడ ఇతడు గుర్తించినాడు వాక్యమును 1 combined expression గను పదములను

2 uncombined expression గనువింగడించుట దీనికినిదర్శనము (section 2 ibid) ప్రాథమికముగ ఇతనిది వాస్తవిక దృష్టి భాషను నిర్మాణ దృష్టితో పరిశీలించుట ఇతనితోడనే మొదలయినదని చెప్పవచ్చును

అరిస్టాటిలు అర్థమును గూర్చి భావదృష్టితో ఒక ప్రణాళికను అందించెనని అంగీకరింపక తప్పదు అట్లే సోక్రటీసు ప్లాటోలకంటె స్పష్టముగ భాషయందు నియమ (convention) మే ప్రధానమని చెప్పినవాడను అరిస్టాటిల్ అనియే చెప్పవచ్చును 10

'Language is by convention since no names arise naturally (De interpretatione-2)

1 1 2 1 ప్లాటో, అరిస్టాటిలు లిరువురును కావ్యభాషను ప్రత్యేకముగ గుర్తించిరి కావ్యమునందలి ఛందోఽలంకార విషయములను తొలగించినచో మిగులునది వాక్కు (స్పీచ్) మాత్రమే కావున కావ్యమనగా ఛందోఽలంకారములు మాత్రమే (Gorglas 502) నని ప్లాటో వాదము, 11 logos / syndesmoi అను అంశములను గూర్చి rhetorics లో పరిశీలించుట సమంజసమని అరిస్టాటిలు భావించెను

అరిస్టాటిలు కావ్యమందలి శబ్దసాధుత్వమును గూర్చి ఇట్లనెను

" l nking particles (Gk synedesmoi) should be introduced in their natural order before and after, as they are required

they should also be made to correspond while the hearer still recollects

(Rhetoric III IV 5)

ఇట్లే కొన్ని శైలులు కొన్ని భావములకు పనికి వచ్చునవియు ఇతని వాదము

' The style of written compositions is most precise that of debate most suitable for oral deliver and so speeches that have been suitable for oral delivery and so speeches that have been written to be spoken sound sylly when they are not declined orally and do not fulfil their proper function

(Rhetoric II, XII I)

మొదటిసారిగ మెటఫర్ నిర్వచన మితని నుండియే బయల్వెడలినది

'Metaphor is the synthesis of several units of observation into one commanding image it is the expression of a complete idea, not by analysis not by abstract statement but by a sudden perception of an objective relation

(Poetics XXII pp 16-17)[12]

'మెటఫర్ ప్రయోజనమును గుర్తించి ప్రయోగించుట భాషాపరిజ్ఞానమున్నదనుటకు నిదర్శనము ఇది ఒకరినుండి నేర్చుకొనునది కాదు ప్రజ్ఞకు పరాకాష్ఠ[13]

Since a good metaphor implies an intuitive perception of the similarity in dissimilars (Read op cit p 23)

గ్రీకువాదములందుగల analogy దృష్టికి పర్యవసానమీ నిర్వచనము —ఎందులకనగా rhetoric' ను, నైయాయిక మార్గమున నిర్వచించిన అర్థ లాక్షణిక వాదులవలె (చూ, వ్యం సూ 2 6) సోక్రటిస్ మున్నగువారును dialectics లో భాగముగ గ్రహించుట (చూ Rhetoric Book 1 1354a) కారణము ఎత్రిమిటివ్ (mythical) భాషను ఛిన్నమైనదిగా తలంచుటఈముప్పరి యందును సమానగుణము ఈలక్షణమునే బార్లెస్ హాక్స్ నోలి వంటివారును గ్రహించిరి వ్యక్తావ్యక్తవిషయసమన్వయము లోపించుట యనగా నిదియే ఈలోపమును సవరించుటకు జరిగిన ప్రయత్నమును కొంతకుకొంత 'స్టాయిక తత్త్వవేత్తలు చేసిరి

### 1 1 3 స్టాయిక తాత్త్విక దృక్పథము (క్రీ పూ 1 శ)

అరిస్టాటిలుతో గ్రీకువాదములందొక శకముపూర్తికాగా, ఏథెన్స్ లో పుట్టిన మరియొకశాఖ 'స్టాయిక్ తత్త్వద్రష్ట Zeno (300 BC) మూలపురుషుడుగా చెప్పబడుచున్న ఈ సంప్రదాయమునందలి ప్రత్యేకత 'భాషా' పరిశీలనకు స్వతంత్రత (antonomy) ను సంపాదించుట తత్పూర్వము తార్కిక పరిధులకు లోబడిన భాషా మీమాంస ఈదశయందు తాత్త్విక పరిధియందు పరిభ్రమించినది14 ఈ సంప్రదాయమునందు పుట్టిన గ్రంథములెన్నో, ఎవో తెలియుటలేదుకాని అనంతరపరిశోధకులనుబట్టి వీరి భాషాదర్శన స్వభావమిట్లు సమీక్షించవచ్చును ఇందు రెండుప్రధానాంశములుగలవు (1) వాక్తత్త్వము (2) శబ్దార్థ భేదపరిగణనము

వాక్తత్త్వమునుగూర్చి వీరి అభిప్రాయములుమూడు.

1) మొదటిది భావము (impression) తరువాత మానవునిబుద్ధి (mind) శబ్దరూపముగ (making use of speech) భావముకల్గించు అనుభవము (experience) ను వ్యక్తీకరించును (expresses)

2) న్యాయదర్శనమే వస్తువివేకమునకుమూలము

3) ఆ న్యాయదర్శనముసైతము శబ్దార్థముఖమైన 'వాక్ దర్శనమును మూలముగా కల్గినదని పండితాభిప్రాయము 15

(Diogenes 7 – 49)

ఇక రెండవవిషయము శబ్దార్థభేదపరిగణనము

శబ్దమువ్యక్తమని అర్థమవ్యక్తమని గుర్తించుట - అర్థముకేవలము వస్తుభావబోధకమను దృష్టితోకాక - మానవునికున్న వాక్ పరిజ్ఞానముద్వారమున శబ్దముచే

(వక్తృశ్రోతృ) హృదయములందుగలుగు అనుభవవిశేషముగా గ్రహింప వలయుననుట వీరిదృక్పథభేదము. 16

(Diogenes 7-62)

స్టాయికులు సహజ (natural) వాదులు సోక్రటీసు ప్లాటోలలో అస్పష్టముగ నున్న సహజవాదమీదశయందు సిద్ధాంతమైనది శబ్దార్థములనడుమ సహజ సంబంధమున్నదని వీరువాదించిరి వీరికి కొంచెము పూర్వుడు Epicurus (క్రీ పూ 341 - 270) ఒక మధ్యస్థవాదము చేసియున్నాడు - శబ్దములు సంభవదశలో సహజములని వ్యవహారమున నియమరూపభేదములను పొందెనని - స్టాయికులీ శబ్దసంభవదశ (protai phonai – first sounds) మీద పరిశోధనను కేంద్రీకరించిరి (see S H L p 19)

అరిస్టాటిలువరకు కేవలము పదము (word) మీదనే పరిశీలన జరుగగా స్టాయికులతో పదబంధము (వాక్యము) గుర్తింపబడినది వీరిదృష్టి ఇది

( cf S H L P 27 )

Word meanings do not exist in isolation and they may *differ according to the collocation in which they are used*

(S H L p 21)

Augustine ఒక ఉదాహరణమిచ్చినాడు

ferri అనగా ఖడ్గమనిఅర్థము (ఖడ్గధారయనియు) (తె అంచు) occulorum (కన్నులకు సంబంధించిన) అను పదముతో కలిసినపుడు keenness of vision' అను అర్థము జనించుచున్నది (చూ S H L p 22) కావున పదమునకుపృథగర్థములేదు పదార్థము (word meanig) కేవలము బుద్ధితో విశ్లేషింపబడునది మాత్రమే కావున శబ్దమర్థముతో కృత్రిమసంబంధము కల్గినదికాదని వీరి వ్యతిరేకముఖ నిరూపణము

తాత్త్వికదృష్టియుండుటవలన అర్థాంతరములను, గర్భితార్థములను సాంకేతి కార్థములను ప్రదర్శించు భావవాహకగా వీరువాక్యమును దర్శించిరి ఇది తరువాతి కాలములందు భిన్నసంప్రదాయములందు మౌలికమగు ఆలోచనా విధానముగ పరిణమించినది 17 ఉదాహరణము–మధ్యయుగము (1100 - 1600 AD) నందలి 'speculative grammatical tradition (see S H L p 77)

## 1 1 4 అలెగ్జాండ్రియనులు (క్రీ పూ 3 - 1 శ)

అరిస్టాటిలు వేసిన analogy మార్గమీకాలమునకు దాదాపు సిద్ధాంత మైనది తత్పూర్వమున్న తాత్త్విక తార్కిక ధోరణులుగాక ఈదశయందు కావ్య భాషాసాధుత్వనిర్ణయము (హోమర్‌రచనల నాధారముగ) ప్రధానమైనది Dionysius Thrax (క్రీ పూ 100) వ్రాసిన 'Techne అను వ్యాకరణ గ్రంథమిట్లు వ్యాకరణ ప్రయోజనమును నిర్దేశించినది 'వ్యాకరణము కవుల ప్రయోగములనుగూర్చిన ప్రక్రియాపరిజ్ఞానము ఇందు ఛందము, కావ్యప్రయోగ వైచిత్రులు, శబ్దములవ్యుత్పత్తి మున్నగు ఆరుఅంశములుండునని అతని విశ్లేషణము అన్నిటికన్నను ముఖ్యమగునంశము కావ్యభాషావిమర్శనము (S H L p 31) ఈదృష్టికి ఫలితము వ్యాకరణసూత్రము ప్రయోగానుసారిగ నుండవలయునను వాస్తవికదృక్పథము (empirical attitude) పెరుగుట (ibid)

## 1 1 5 రోమనులు.

గ్రీకు వాదములన్నియు రోమనులచే అనూదితములైనవి 'లాటిన్' రాజ భాషయగుట Crates (క్రీ పూ 2 శ) ద్వారమున స్టాయిక్ తాత్త్వికదృష్టితో కూడిన గ్రీకుల పరిశోధనాఫలితములు రోమను సామ్రాజ్యమును చేరుట - ఈ కారణములుగ Varro (క్రీ పూ. 116-27) పరిశోధనలందు స్టాయిక్‌లమార్గమున భాషలోని మూలరూపముల (primal words) పై జరిగినమీమాంస ప్రధానమగు

మన్నది ఈకాలమునను కృత్రిమవ్యుత్పత్తులు విరివిగనే వ్రవ్వబడినవి ఈయుగ మున Remmius Palaemon (క్రీ. శ 1 శ) 'article ని గూర్చి చేసిన ప్రతిపాదనము గమనింపదగినది has no stable meaning but indicates emotion (S H L p 53)[18]

ఇతని విద్యార్థి Quintilian (క్రీ శ 30 - 100) ఇతని రచన ద్వాదశ గ్రంథావళి (in twelve books) గ లభించియున్నది దీనినామము 'Institutio Oratio (The Training of an Orator) పూర్వము చెప్పినట్లు అరిస్టాటిలు సంప్రదాయమున అలంకారము శ్రోతను persuade[19] చేయు సూత్రముగ గుర్తింపబడియుండుటవలన, ఈగ్రంథరచనవలన Quintilian ఆశించిన ఫలితము వక్తృత్వలక్షణము (Principles of oration) చెప్పుట కాపున emphasis' ని వక్తృవివక్షాత్మకముగను, శబ్దార్థగతముగను - రెండువిధముల Quintilian నిరూపించినాడు (cf Institutio, Book VIII) అది 'శైలీ విషయమని ఇతని వింగడింపు. ఇతడుచెప్పిన ఇతరాంశములనుబట్టి న్యాయవాది గ ఇతడు భాషనుదర్శించినాడని చెప్పవచ్చును

(చూ వ్యం సూ పుట 29 fn 10 also 1 10 7 1)

ఈయుగమునకు సంబంధించిన మరొకఅంశము analogy అన్న పద మున కర్థముమారిపోవుట[20] అదికేవలము రూపసంబంధివ్యాపారముగ గుర్తింప బడినది ఇక్లే నామక్రియాదివర్గములును నిర్దిష్టమగు అర్థములను పొందినవి Priscian (క్రీ శ 500) వ్రాసిన వ్యాకరణమునసీప్రసక్తియున్నది (cf S H L pp 52–54)

## 1 1 6 మధ్యయుగములు (క్రీ శ 1100-1600)

ఈ ఆరుశతాబ్దములను 'dark ages అని పాశ్చాత్య పరిశోధకలోకము ఎల్చినది. వ్యాకరణమితరశాస్త్రములతోపాటు అంగభూతమైనది ఈ'సప్తకళా విధి

(seven liberal arts–S H L p 69)లో వ్యాకరణ, తర్క, అలంకారములు ఒకి ముఖ్యాంగమయినవి వ్యాకరణమన్నిశాస్త్రములకును మూలభూతమనియు గుర్తింపబడినది 21

ఇంతకుపూర్వమే క్రైస్తవమతసూత్రములకు అన్వయమునొందునటుల శాస్త్రములనడుమ ఒక సమన్వయముచూపబడినది క్రీ శ 5వ శతాబ్దమున Martianus Capella వ్రాసిన 'Mercury 'Philologia ల వివాహమిందులకు నిదర్శనము.[22] philologia వధువు ఆమెనలంకరించుటకు వచ్చిన చెలికత్తెలుగా వ్యాకరణ, తర్క, అలంకారాది సప్తశాస్త్రములు సంకేతింపబడినవి శాస్త్రము కొనగబడిన యాదివ్యస్పర్శవలన బైబిలు అనువాదములు బోధనకుపయోగపడు వ్యాకరణగ్రంథములు తయారగుటకు వీలుకల్గినది క్రీ శ 1200 - 1350 ప్రాంతమున వచ్చిన మరియొక ఉద్యమతరంగము 'speculative grammars (De modis significandi) ఆవిర్భావము పూర్వవ్యాకరణములకు వ్యాఖ్యానములు పుట్టుటతోపాటు భాషాపరమైన సూక్ష్మఆలోచనావిధానములిదశయందు దర్శింపబడినవి, Peter Helias (12 శ.) దర్శనమిది.[23]

'వ్యాకరణము తాత్త్వికునిచె దర్శింపబడునుతప్ప వైయాకరణిచేకాదు, 'తర్కపరిజ్ఞానములేని వైయాకరణి మీమాంసాబుద్ధిలేని అజ్ఞానివంటివాడు (cf S H L p 76)

ఈఆలోచనలఫలితమనంతరకాలమున కొన్నిసిద్ధాంతములకు బీజములైనవి 'universal grammar అన్న భావస్రవంతికిదియే మూలము (ibid).

13 వ శతాబ్దమున 'Petrus Hispanus' (Pope John XXI) వ్రాసిన 'summulae logicales లో మరల శబ్దార్థమీమాంస 'వ్యాప్తి' దృష్టితోకన్పించు చున్నది Signification (భావమనిచెప్పవచ్చు) - మూడు విధములని ఇతని వర్గీకరణము

1 signification 2 supposition 3 appellation మొదటిది ముఖ్యార్థము (meaning / intention / denotation / concept) రెండవది వ్యాప్యార్థము (things meant / extension / connotation / instances) మూడవది వ్యాకరణసంబంధి (cf I G L p 133 also S H L p 77) 'A man runs there' అనువాక్యమున 'A man' సోక్రటీసు కావచ్చు, రామా రావు కావచ్చు దల్లె లామా రావచ్చు కాని ఈఅర్థవ్యాప్తి (suppositio – అని Petrus) సమస్తపదమున నియతి (conditioned) మగుచున్నది 24 (The musical man runs) అన్నపుడు musical man అనియే అర్థము

ఈ శతాబ్దమునవే Michel de Marbais చెప్పిన మరియొక అంశము ప్రధానము

'A word includes in itself its sound as it were its matter, and its meaning as its form

(Q Thurot (1869 156) in S H L p 77)

శబ్దము ద్రవ్యము అర్థము వ్యాపారమునసిద్ధించు స్వరూపము శబ్దార్థములు రెండును పదమున కలిసియుండునను ఈఅభిప్రాయముకూడ తిరువాతి వారి కుద్దీప్తిని కల్గించినది

ఈయుగమున గుర్తింపదగిన మరొకఅంశము వస్తువుకున్న అస్తిత్వ (modi essendi) మీమాంస భాషకూడవస్తువే భాషలో శబ్దములర్థములనెట్లు బోధింపగలుగుచున్నవని ప్రశ్న బుద్ధికారణముగనే శబ్దమునకర్థసమర్పణశక్తి (modi significandi activi) కలుగుచున్నది తజ్జన్యములైన భావములు (qualities) బుద్ధిచే అనుభవింపబడుచున్నవి (modi significandi passivi)25

(cf S H L. p 78)

ఈ మిమాంసకు ఫలితముగా పదసంఘాతముచే వాక్యమెట్లేర్పడుచున్న దనుటకు సమాధానముగా Thomas of Erfurt (క్రి శ 1350) వంటి వారు కొన్ని దశలూహించిరి - material formal, efficient and final అని మొదటి రెండు - పదములకు, వానికూర్పునకు సంబంధించినవి మూడవదాని యందు వక్త ఇచ్ఛ-తజ్జన్యమైన అర్థసమర్పకశక్తి, నాల్గవదానియందు భావసమగ్రత ఉద్దేశింపబడినవి

(cf S H L p 81)

దీనివలన కలిగిన మరియొకఫలితము విశ్వభాషాసామాన్యలక్షణములుగా వస్తుభావములకు బుద్ధియొసగు సమన్వయము ను గుర్తించుట (op cit p 87) భాషలోశబ్దార్థములకునడుమ బుద్ధి యట్టి సంధానము గూర్చుచున్నదని యీ అభిప్రాయమున కర్థము

ఇంతవరకున్నట్లు వైయాకరణి కేవలము కవుల ప్రయోగములకంకిత ముగుట కియుగమున వీలులేకపోయినది ఫలితముగా

'Grammar is the science of language, and its field of study is the sentence and its modifications its purpose being the expressions of the concepts of the mind in well – formed sentences

(Q Siger 1913 93 in S H L, pp 88-89)

అను నూత్నమగు అవగాహన వ్యాపించినది కాని ఈదశలో పూర్వమార్గమున నున్నవారును (auctores) గలరు ఈనూత్నశాస్త్రదృష్టి (artes) ఉన్నవారికీ వర్గముతో స్పర్ధ పెరిగినది Battle of the seven arts అను ఒక సంఘటన సాంకేతికము (allegorically)గా ఈస్పర్ధను చిత్రీకరించినది (see for details S H L pp 89 – 90) 26

## 1 1 7 సాంస్కృతిక పునరుజ్జీవనము - హేతువాదాభ్యుదయము

16వ శతాబ్దమునుండి ఐరోపాలో వచ్చిన పరిణామము సాంస్కృతిక పునరుజ్జీవనము (cultural renaissance) దీని ఫలితము భాషాపరిశీలనమున నెట్లు ప్రసరించినదో పరిశీలించవలయును ఈయుగప్రధానలక్షణము ప్రపంచ విస్తృతి, భిన్నభాషలు, సంస్కృతులు-వీనిలో ఐరోపాపరిచయము ఇంతవరకున్న వాస్తవిక హేతువాదదృష్టులు సమగ్రతలనుపొంది సిద్ధాంతములైనవి గెలిలియో కొపర్నికస్‌వంటి వైజ్ఞానికులు వాస్తవిక (empiricism) దృక్పథమును, Descartes వంటి తత్త్వశాస్త్రవేత్తలు హేతువాద (rationalism) సరళిని వృద్ధిపొందించినారు 27 మొదటిది తత్పూర్వమున్న scholastic philosophy కి వ్యతిరేకముగ పుట్టినది

The centrepiece af empiricism was the thesis that all human knowledge is derived externally from sense impressions and the operations of the mind upon them in abstiaction and generalisation (O S H L p 112)

జ్ఞానమింద్రియానుభవమునకు అతీతముకాదు. అట్టిది జ్ఞానముకాదు శాశ్వత సత్యములులేవు - హేతువాదము దీనిని తిరస్కరించినది తర్కమునాశ్రయించినది

The rationalists sought for the certainty of knowledge not in the impressions of the senses but in their refutable truths of human reason (ibid)

ఈ ఇరువాదములనడుమ భేదముస్వల్పము 28 అరిస్టాటిల్ మున్నగువారి తర్కముకాదిది. గణితవైజ్ఞానిక శాస్త్రపరిధిపరిమితమైన తర్కమిది

16 17వ శతాబ్దములందు భాషాపరిశీలనమునీ రెండుదృష్టులను ప్రభావితము చేసినవి హేతువాద ప్రభావమే universalist theory ఆవిర్భావము బైబిలు

(Genesis II, Book 1, chs 8 & 9) లో గల Tower of Babel' కథను అసత్యము చేయుటకై - సర్వప్రపంచమానవులకును ఏకైక భాషానిర్మాణము చేయుటకై -జరిగిన అప్పటి ప్రయత్నములీయూహనాధారముగగొనినవి 29

ఫ్రాన్సులో M Mersenne చేసిన ఒకప్రతిపాదన (17 శ) ఈ సందర్భమున గుర్తించదగినది

"ఇకారాంతరూపములు స్వల్పతను పలుచనిదనమును సూచించు నని అభిప్రాయపడు Mersenne ధ్వనులకున్న విశ్వజనీన భావగుణముగ 'స్వల్పత ను భావించుట హేతువాదప్రభావమే - అని పరిశోధకులనుచున్నారు 30 (cf SHL p 114) French Port Royal Grammarian సంప్రదాయమీహేతువా దమునుండి పుట్టినదే (క్రీ. శ 1637-61) తరువాతి శతాబ్దములందు ధ్వనివర్ణ విజ్ఞానాదులు క్షేత్రపరిశీలన నాశ్రయించుట వాస్తవికదృక్పథప్రభావముతోనే (cf S H L pp 117 – 123) కాని సస్యూర్ రంగముననవతరించువరకు జరిగిన భాషాపరిశోధనములన్నియు ప్రధానముగ చారిత్రికదృష్టిని కలిగినవే (18, 19 శ) విశ్వవిద్యాలయస్థాపనలు భిన్నశాస్త్రములు అధ్యయనవిభాగములుగా వేరుపడుట వానిమధ్య సమన్వయముకన్న భేదములే స్థిరపడుట ఈకారణములగ భాషాశాస్త్రమున ఏదో ఒకశాస్త్రనేపథ్యము దనిలో ఏర్పరచుకొన్నదృష్టి పరి శోధనావిధానము - ఇది మార్గమయినది ఈదశయందు (18 19 శ) సంస్కృత ముతో ఇంగ్లండు పండితులకు పరిచయముకల్గి ఇండోయూరోపియన్ సోద రత్వము గుర్తింపబడినను సంస్కృతశాస్త్రముల సమగ్రఅధ్యయనమువలన భాషాశాస్త్రసూత్రములభివృద్ధి నొందుటమాత్రము 20 వ శతాబ్ది రెండవభాగముననే జరిగినది

(చూ స్టాల్ ఎట లు, వ్యం సూ పుట. 8)

ససూర్ ముందుటి శతాబ్దమున ఈపరస్పర విరుద్ధసిద్ధాంతములకు మూల పురుషులుగా గుర్తింపదగినవారిద్దరు, ఒకరు Wilhelm Von Humboldt

(క్రీ శ 19 శ) - ఇతడు హేతువాది, వ్యవహర్తకున్న సృజనాత్మకశక్తి అనంత మని, దానిని గుర్తించుటకు శాస్త్రపరిధిచాలదని గుర్తించినవాడితడు 31 మరొకరు A Scheleicher (1821-68) డార్విన్ జీవ పరిణామసిద్ధాంతమును సంపూర్ణ ముగ భాషకు ఆపాదించి వక్తృవివక్షాదులకు సంబంధించకయే పెరుగు తరుగు, మారు—జీవ పదార్థముగా భాషనితడూహించినాడు ససూర్ పూర్వరంగ వాతావరణమిది

## 1 2 ఫర్డినాండ్ డి ససూర్ (1859-1913) శబ్దార్థసమన్వయదృష్టి

ససూర్ విద్యార్థులు తమగురువుగారి ప్రసంగములను క్రోడీకరించి యున్నారు ఆ గ్రంథము Cours de linguistique generale అనుపేరిట 1916 లో అచ్చయినది ఆధునిక భాషావిజ్ఞాన పితామహుడుగా గుర్తించబడుచున్న ససూర్ 'నిర్మాణ (structuralism) వాదప్రతిపాదకుడు 32 ఇతడు స్విస్ పండితుడు ససూర్ ముఖ్యముగ మూడంశములనుగూర్చి ప్రతిపాదించి యున్నాడు (1) భాషాపరిశీలనలో చారిత్రిక, వర్ణనాత్మకదృష్టులు (2) వ్యవహర్త భాషా పరిజ్ఞానము వాఙ్నిర్మాణ (langue) సంబంధి వ్యవహారము శబ్దసంకేతసమాహారము (parole) కావున వాఙ్నిర్మాణతత్త్వము వ్యక్తిపరిమిత వ్యవహారము కన్న విశిష్టము - (suprapersonal - ఇది Emile Durkheim సాంఘికసూత్రాను సారియని Robins అభిప్రాయము S H L p 200)33 (3) వాఙ్నిర్మాణము వర్ణపదాదిగతమగు సంబంధములనాధారముగ విశ్లేషింపబడవలయును తప్ప సంప్రదాయగతముగ వచ్చుచున్న నామక్రియాది అర్థవిభాగదృష్టితోకాదు

కావున ససూర్‌తో మొదలయిన భాషావిజ్ఞాన పరిశోధనామార్గము వాఙ్నిర్మాణసంబంధి

This is the theory expressed in his statement thta *langue* is forme non *substance* - అంటుకే భాషను chess game తోను train

తోను పోల్చినాడు ఒక వ్యవస్థయందొక్కొక వస్తువునకున్న ప్రత్యేకతల నాధార ముగ నిర్ధరింపదగిన యర్థమేతప్ప - వస్తువునకు స్వతస్సిద్ధభావములేదని సస్యూర్ నిర్ణయము (cf S H L p 201)

ఇతని నిర్మాణవాదమున రెండు ప్రధానాంశములుగలవు

1 భాష సంకేతమయము (a system of signs) సంకేతము (sign) రెండంశములను బంధించుచున్నది ఒకటి అర్థము (signifie), మరొకట శబ్దము (signifiant) భాషలోకనిపించు లన్వయసూత్రమిదొక్కటే 34

(cf I G L p 192)

2 సంకేతములు యాదృచ్ఛికములు (arbitrary) సంకేతములేర్పడుటలో శబ్దార్థముల నడుమ నెట్టి నిమిత్తనైమిత్తిక భావము (motivation) నులేదు, కాని పద వాక్యగతమగు విభక్తి ప్రత్యయాదులు చేరుటయందొక క్రమమున్నది ఇదియు సాపేక్ష (రెలటివ్)మగు నైమిత్తికత మాత్రమే కావున సంకేతముల నడుమ గల సంబంధ వైవిధ్యముల ద్వారమున భాషానిర్మాణ పదిశోధన చేయ నగునని అతని ప్రతిపాదన

(cf Cours pp 34 97)

1 2 1 కొందరు పండితులననుసరించి రష్యాదేశమున ఆకాలమున సాహిత్య విమర్శలో కొంతకాలము పెరిగి ఆగిపోయిన నిర్మాణవాదము (formalism or rstructural criticism) సస్యూర్పై ప్రభావము చూపియుండునని భావింపవలసి యున్నది (చూ హాక్స్ పుట 17) ఏమయినను సస్యూర్ ప్రతిపాదనమున ఒక ద్వంద్వాత్మకత యున్నది అది ఒకవైపు భాషాసంకేతము శబ్దార్థములను బంధించునని చెప్పుచు మరియొకవైపు సంకేతములనడిమి సంబంధములే (elations)వానిభేదములే(differences) భాషను గురించి పరిశీలించుటకు ప్రమాణ ములనుటలోనున్నది మొదటిది తాత్త్వికదృష్టి భాషకు మనవునితోగల మానసిక

సంబంధమునకు సంబంధించినది రెండవ యభిప్రాయము వ్యక్తవిషయ సంబంధి నిరూపణక్షమము

Linguistics works on the borderland where elements of sound and thought combine their combination produces form not a substance (Cours p 158)

కావున భాష అన్వయ (syntagmatic) ప్రత్యామ్నాయ(paradigmatic) సంబంధము (relations) లను కలిగినది శబ్దమునుగూర్చి ఈరెండు దృష్టులతో పరిశీలించవచ్చును

అర్థమును పరిశీలించుటలో మూడు అంశములను ససూర్ గుర్తించెను 35

(౧) భావము (signification) ఒక శబ్దమునకు ఒక వస్తువుతోగల నిత్య సంబంధము

(౨) వైశిష్ట్యము (value) ఒక శబ్దమున కితర శబ్దప్రపంచముతోగల సంబంధ వైవిధ్యములవలన కలుగు ప్రత్యేకత

(౩) అర్థము (content) భావవైశిష్ట్యముల సమాహారము

ఈత్రైవిధ్యము చాలాకీలకమైనది ఆంగ్లమున sheep, motton అను రెండుపదములున్నవి ఫ్రెంచిలో ఈరెంటికిని mouton అను ఒక్కపర్యాయ పదమేయున్నది ఈమూటిని పోల్చి ససూర్ ఇట్లు వాదించెను 'ఒక్కొక్క సందర్భమున నీమూటికిని అర్థభేదమున్నది కాని mouton అనుపదమునకు sheep motton లకున్న వైశిష్ట్యములేదు Sheep ప్రాణివాచకము motton నిర్జీవపదార్థవాచి ఫ్రెంచిలో ఈభేదపరిగణనము లేదుగనుక ఈరెండు పదములకున్న భావము ఒక్కటికాదు

అందువలన ససూర్ ఒక సిద్ధాంతము చెప్పినాడు సంకేతసమాహారమైన వాఙ్నిర్మాణము (la langue) నిత్యవ్యవహారమునకున్న శబ్దరూపము (la parole) కన్నను భిన్నము ఈ రెండును కలిసి భాష (la langage) అగును

ఇట్లు ససూర్ పరిశోధనమంతయు వాక్, శబ్ద, అర్థ, భాషా రూపములను వింగడించుటకే విన్యస్తమయినను తరువాతివారు అతని పరిశోధనమున గల సంకేతగత శబ్దార్థనిత్యత్వమునశాస్త్రీయముగా తలచి వదలివేసిరి

తక్కిన అతని పరిశోధనమునుగూడ అమెరికావారును ఇంగ్లండువారును వ్యాఖ్యానించుకొనుటలో భేదములున్నవి [36] కాని నేటివరకును భాషాశాస్త్రమునందు 'structuralism అవితథముగ అంగీకరింపబడినది

## 1 3 ఎంస్లేవ్ (Louis Hjemslev) తార్కిక దృష్టి

ఈ ఫ్రెంచి పండితుడు ససూర్ ప్రతిపాదనములను తార్కిక దృష్టితో అశాంతములకు లాగినవాడు కనుకనే అభిప్రాయ నివేదనసాధనములైన అవాంతర భాషలనుకూడ గుర్తించినాడు [37]

ససూర్ పరిశోధన భావము (signification), వాక్కు (expression) లకు సంబంధించినది ఎంస్లేవ్ మరియొకదానిని దర్శించినాడు. అది సంసర్గము (commutation) నైఘంటికార్థముకంటెను భావము భిన్నము భిన్నభాషల నడుమనేకత్వమును సాధించుచున్నది ఈతాత్పర్యమే (purport) ఎంస్లేవ్ అయిదు భాషలనుండి సమానభావముగల వాక్యముల నిచ్చినాడు.

| | |
|---|---|
| jeg vid det ikke | (Danish) |
| I do not know | (English) |
| jene said pas | (French) |

en tie da (Finnish)

na lu vara (Eskimo)

(Prolegomena p 50)

The purport so considered exists p ovisionally as an amorphous mass as an unanalysed entity which is defined only by its external functions namely its functions to each of the sentences we have quoted Just as the same sand can be put into different molds and the same cloud could take on over new shapes so also the same purport is formed or structured diffe-rently in different languages What determines its form is solely the functions of the language, the sign function and the functions deducible thereon Purport remains each time substance for a new form, and has no possible existence except through being substance for one form or another (ibid, pp 50 – 52)

భాషలో రూపమై విధ్యములను సాధించుచున్నవి భాషావ్యాపారము అను సూత్న విషయము భాషాపరిశీలనమునవే ఏకైకమైనది తాత్పర్యము పరిశీలనము లొంగునది కాదు విశ్లేషణకసాధ్యమైనది కాని దాని భిన్నవ్యక్తీకరణముచే భిన్నభాషలలోని వాక్యములు - అని అతని అభిప్రాయము

ఏపాత్రలో పోసిన ఆపాత్ర ఆకారమ పొందు నీవివలె, భిన్నరూపము లందెడి మేఘమువలె ఏకైక తాత్పర్యము భిన్నభాషలందు భిన్నరూపములనందగల దని గ్రహించుట వీరి పరిశోధనమున ప్రధానము రూపమునువదలి తాత్పర్యము తాత్పర్యమునువదలి రూపమును ఉండవనుట వ్యంజన' దృష్టితో వాల ప్రధానము తరువాతి సంకేతవాదులకు కప్రతిపాదనము మూలమైనదనుటకు గా త్రెవ (1964) నిదర్శనము 38

అట్లగుటవలన భాషను శబ్దదశ (expression plane) యందును, భావ దశ (content plane) యందును పరిశీలింపవలయునని అతని సిదాంతము

శబ్దదశ భాషను కేవలము శబ్దమయము గ నిర్వచించుటలో అవ్యాప్తి (under differentiation) ఉన్నది అవర్ణాత్మకములై అభిప్రాయ నివేదన సమర్థములగు అభినయగతి స్వరాదులున్నవి అందువలన

" From these premises, we are led to a formal definition of a semiotic as a hierarchy, any of those components admits of a further analysis into classes defined by mutual relation so that any of these classes admits of an analysis into derivation defined by mutual mutation (ibid p 106)

జానపదకళలలో, వస్త్రధారణములలో సాహిత్యములో, ఈనిర్వచన మెంతయు సార్థకము సస్యూర్ భాషను ఒక chess game తో పోల్చినాడు, అదనుసారిగా ఎంస్లేవ్ భాషనిట్లు నిర్వచించినాడు

'A language may be defined as a paradigmatic whose paradigms are manifested by all purports and a text correspondingly as a 'syntagmatic whose claims if expanded indefinitely are manifested by all purports (ibid p 109)

## 1 3 1 ఎంస్లేవ్ – వ్యంజన

వాచ్యవ్యంగ్యార్థములను denotative connotative semiotics 39 అని ఇతడు వ్యవహరించెను రెండవదానినిట్లు నిర్వచించెను emotional and stylistic differences in meaning అని ఈఅర్థములను కల్గించునవి connotators అని చెప్పుచు

The connotators form a semiotic with this interesting property their expression plane is a denotative semiotic with the connotators themselves as the content (ibid - p 353)

శబ్దముమాత్రమే కాకుండ అర్థముకూడ వ్యంజకముగ ప్రవర్తించుననుట ఆనంద వర్ధనుని సిద్ధాంతము. మున్ముందు ప్రదర్శింపబడును భిన్నశైలులు - గద్యపద్యాది భేదములు, వచన విపర్యాస అనుకృత్యాదులు, శిష్టగ్రామ్యాదివర్గభేదములు వాక్షేప్తాది భిన్నమాధ్యమికములు విస్వరాలు—వీటిని వ్యంజక సామగ్రిగా ఎంసెపి గుర్తించినాడు (అదే గ్రంథము పుట 115)

ఇట్టి పరిశోధన చేయుటకు అతని దృష్టితో శాస్త్రీయ పరిశోధన (scientific study) మనగా తార్కిక వివేచన (logical study) మని అర్థము

## 1 4 సపిర్—మానసిక భౌతికవాదము

భాష యాదృచ్ఛిక సంకేతమయము కేవలము మానవసంబంధి పశు పులకువలె నిసర్గము (instinctive) కాదు అర్థము (మీనింగ్) చాలక్లిష్టమగు నంశము భౌతికము కాదు కావున మానసికమగు సత్యము మిక్కిలి వైవిధ్య మును ప్రదర్శించునది

the flow of language itself only is constant its inner meaning, its psychic value or intensity varies freely with attention (Language p 14)

ఈ గూఢార్థము (inner meaning) ను భావము (thought) అని సపీర్ వ్యవహరించెను (అదే పుట) శబ్దము భావముతో నిత్యసంబంధము కల్గినదనుట కన్నను భావము శబ్దముయొక్క సమగ్ర సారాంశమనుట ఇతని నిర్ణయము 40 (పుటలు 14 1 ) ఇట్లనుటకు సపీర్ ఒక హేతువును గుర్తించెను వాక్సహా యిములేని అభిప్రాయ నివేదక సాధనములుండుట ఆహేతువు శ్రవణ సంకేత ములు లేకుండగనే భావప్రదర్శనము ప్రత్యక్షముగ సాధ్యము అందువలన భాషను రెండు రీతుల పరిశీలింపనగునని అతని నిరూపణము

1 అభిప్రాయనివేదకముగ 2 మార్పునందని శబ్దనిర్మాణముగ (పుట 38) అభిప్రాయ నివేదకముగ గుర్తించుటలో రెండు దశలున్నవి

1 pre rational stage 2 ideational or cognitive sphere మొదటి దశ కేవలము వస్తుభావములను బోధించు దశ ఈదశలో ఎర్గిజుకు స్వచ్ఛందత లేదు ఇతి జాతి సంబంధి రెండవ దశలో ideations ప్రధానము emotions volitions దీని కింగభూతములు ఇక్కడ వాస్తవికత వ్యక్తి సంబంధి వ్యవహారమునందువలె కేవలము శబ్దమునకు సంబంధించినవి కావు

' They are strictly speaking never absent from the normal speech but their expression is not of a truely linguistic nature The nuances of emphasis tone and phrasing the varying speed and continuity of utterance, the accompanying bodily move ments all these expre\s something of the inner life of impulse and feeling but as these means of expression are at last analysis but modified forms of instinctive utterance that man shares with lower animals 41 they can not be considered as forming part of the essential cultural conception of language however much they may be inseparable from its cultural life (Ibid p 39)'

రెండవ దశలో మానవభాషకు జాంతవభాషలతోగల సామాన్య లక్షణములను గుర్తించుట చాల ప్రధానాంశము కావున భాషలో నిసర్గమగు లక్షణము భావ స్పందనగుణము భాషకున్నదనుటను సపీర్ భావించెననుట ఆనందవర్ధనుని అసం లక్ష్యక్రమ వ్యంగ్య సిద్ధాంతమునకు చాల సన్నిహితమగు విషయము

సపీర్ మరియొక విషయము చెప్పినాడు—వ్యక్తిమాత్ర పరిమితములైన ఇట్టి చర్చలు భాషాపరిశీలకునికి వ్యర్థమనియు కవులకు పనికివచ్చుననియు, కళాకారునికివి ఇవి యొక్కొక్కసారి సమస్యాజనకములగుననుట ఆవిషయము (పుటలు 40 41)

ఒక శబ్దమునకు భిన్నభావములు కానవుడు కల్పించుకొనునవే storm tempest hurricane, అను ఆంగ్లపదములకుగల విశిష్టార్థప్రతిపత్తులు కేవలము సాంస్కృతికములని సపీర్ వాదము (పుట 40) భాషలేనిచోట భావముకూడ ఉండదని సపీర్-ఉర్ఫ్ల సిద్ధాంతము 42 (ఇక్కడ సపీర్ దృష్టి మొదటి అంశముపైన ఇక్కడ భావము సాంస్కృతిక భావము—(cultural conception)

It is illusory to think that experience can occur without the formative guidance of the linguistic habits of a person experiencing the world we live in is first and foremost one to a large extent unconsciously built upon the language habits of the group (Selected Writings p 162)

సాంస్కృతికముగ భిన్నభాషలందు సమానముగనున్న స్ఫురణానుభవమునుకూడ గుర్తించినాడు

The latent content of all languages is the same, the intuitive science of experience (Language p 218)

ఇట్లనుచున్నను సపీర్ పరిశీలనము రెండవపద్ధతికి మాత్రము పరిమితమగుటవలన స్ఫురణానుభవమును సిద్ధాంతీకరింపలేదు 43

## 1 5 బ్లూమ్ ఫీల్డు (వాట్సన్)—అభావవాదము

భాషాశాస్త్రము స్వతంత్ర (autonomous) మని, శాస్త్రీయ (scientific) మను వాదము 19 వ శతాబ్దిలోనిదైనను, వారిదృష్టిలో సైంటిఫిక్ అను పదమునకు 'exact అని అర్థము ధ్వని సూత్రముల నిర్మాణము, చలనాత్మక పద్ధతిలో భాషాకుటుంబము లేర్పరచుట ఇట్టివానిలో ఈ exactness కుదిరినది కాని శబ్దార్థసంబంధ నిరూపణమున సాధ్యము కాలేదు దానిని సాధించుటకు

ప్రయత్నించి శబ్దార్థములను సమగ్రభౌతిక స్వరూపముగ నిర్ణయించి నిరూపింప దలచినవాడు బ్లూమ్‌ఫీల్డు

ఇతని కాలమునకు (1930 ప్రాంతమునకు) 'సైంటిఫిక్' అను పదమునకు restricting experiment to empirical data అను అర్థము వ్యాపించినది సజూర్ సపీర్‌లలో ఉన్న మానసిక భౌతిక సంబంధదృష్టిలోని ద్వంద్వాత్మకత స్థూలదృష్టితో ఎంపిరికల్' అని చెప్పుట కుదరదు ప్రధానముగ ఆకాలమున మనస్తత్త్వ శాస్త్రమున ప్రబలియున్న ప్రవృత్తివాదము (behaviourism) బ్లూమ్ ఫీల్డు నెంతయు ప్రభావితము చేసినది ఫలితముగ Language (1933) అవతరణము ఇటువంటి దృష్టి సాంప్రదాయిక చిత్తప్రవృత్తియున్న పండితులకు కాలముననే ఈ గ్రంథమెంతయో అసంతృప్తిని కూర్చినది 'వాట్సన్ ప్రతిపాదించిన ఈ ప్రవృత్తివాదము నేడెన్నియో సవరణలను బొందినది 44 కాని అమెరికా భాషా శాస్త్రజ్ఞులలో కొందరికి తదనుయాయులకు (e g ,Hockett 1958) 'Language వెనుక మార్గమే ఈనాటికిని అవశ్యమనుసరణీయమైయున్నది

వ్యక్తమగు విషయముల నాధరముగ సూత్రముల నేర్పరచుకొనవలయును గాని అవ్యక్తములతో కాదనుట వాట్సన్‌వాదసారాంశము (Battle p 26, cf I G L p 242)

ఈ శాస్త్రీయతాగుణము 'ఆలోచనను గూడ భౌతికకార్య ప్రక్రియగా నిరూపించినది

'Thinking is merely talking but talking with concealed musculature (Battle p 33 I G L p 241)

ప్రాచీనులు 'emotional అని వ్యవహరించినదానిని 'visceral అని వాట్సన్ వ్యాఖ్యానించెను ఇదిభౌతికవాదములలో అతితీవ్రవాదము

కావున భాషయింతయును శబ్దార్థములనబడునవి కేవలము భౌతిక స్టిమ్యులస్ (స్టిములస్)ములకు ప్రతిక్రియ (రెస్పాన్స్) లవంటివని బ్లూమ్‌ఫీల్డు గ్రంథమంద అటను నిరూపింపదలచెను

ఈదృష్టితో భాష ఒక భౌతిక ప్రక్రియ - తినుట నిద్రించుటవంటిది "ధ్వని తరంగములు రెండు వ్యక్తులదేహములలోని నాడీమండలముల నడుమగల శూన్యమును నింపుచుండుటయే మాట్లాడుట అని ఇతని సరిక్రొత్త నిర్వచనము (లాంగ్వేజ్ పుట 2)

శబ్దమే పరిశీలనకు యోగ్యమని (పుటలు 32-33), అర్థము కాదని ఇతని నిరూపణము కారణము శబ్దమునకే అర్థమున్నది (పుట 27) అర్థమనగా—

' We have defined meaning of a linguistic form as the situation in which the speaker utters it and the response which it calls forth in the hearer (Language p 139)

శబ్దముపయోగింపబడు సందర్భము శ్రోతలో కల్గించు ప్రతిక్రియ ఒర్థ నిర్ణయమున సమగ్ర వివరణము కేవలము మనకు శాస్త్రీయపరిజ్ఞానమున్న అంశ ములకు మాత్రము చేయగలము పశువృక్షాది నామములందుకుదాహరణములు ప్రేమ, ద్వేషము మొదలగువానిని నిర్వచించుటకు నేట మన విజ్ఞానము (1930 ప్రాంతమునకు) అంతగా ఎదగలేదింకను—కావున అసాధ్యము కాని ఇట్టి శబ్దజాలమే భాషలో అధికమనియు (పుటలు 139-140) అతడు గుర్తించినాడు

అంతవరకు భాషాపరిశీలనలో అర్థపరిశీలన వెనుకబడియే యుండునని బ్లూమ్‌ఫీల్డు భావించెను (పుట 140)

## 1 5 1 బ్లూమ్‌ఫీల్డు గుర్తించిన అర్థవైవిధ్యము

పై వాక్యములందే భాషాశాస్త్రముయొక్క స్వతంత్రప్రతిపత్తి పరాస్తమగు చున్నను అతడు అర్థమును గూర్చిన సమస్యను ఒకదానిని గుర్తించెను

Connotations అర్ధనిర్ణయము శాస్త్రీయముగ జేయుటకు వీలుకాని విశేషార్థములున్నవి (పుటలు 142-143). బాహ్యవస్తు ప్రేరణము లేకుండగనే శబ్దోచ్చారణము లుండవచ్చు—మానవస్థితికారణము 45 ఇట్టిభాష displaced speech ఒక వ్యవహర్త ఎన్ని సందర్భము లందొక శబ్దమునుపయోగించునో ఆసందర్భము లలోని అర్థముల సమాహారమే connotations (p 143) Lying, irony poetry fiction లకు ఈభాషేకారణము (ibid)

ఈవిశేషతను సాధించుటకు 'ఒక శబ్దమునకొకే అర్థముండవలె నని ప్రతిపాదించినాడు (పుట 148) కాన్నన అర్థములలో కనిపించునవై విధ్యమున కొంత భిన్నసందర్భములలో ఉపయోగపడి టవలన కల్గుచున్నదని చెప్పుటకువీలయినది మరికొంత స్థితికారణమనుటతో సాధింపబడినది

వ్యవహర్తలు సామాన్యముఖ్యార్థములేవియో (నార్మల్ లేక సెంట్రల్) విశేష (లక్ష్య పరిణత)- (మార్జినల్ మెటఫారికల్ ఆర్ట్రాన్స్ఫర్డ్) అర్థములేవియో గుర్తింపగలుగుచుండుట (పుట 149) ను గుర్తించినబ్లూమ్ఫీల్డు విశేషార్థములు కలుగుటకు క్రింది ఆధారములుచూపినాడు

1) వ్యవహర్తసాంఘికస్థితి 2) వాని దేశకాలములు 3) ప్రాచీన శబ్దజాలము (సాంకేతికపదములు శిష్టప్రయోగములు అన్యదేశీయములు) తో పరిచయముండుట

కాని విశేషార్థములనంతములు - అనిర్వచనీయములు46 - అని అతడే అంగీకరించినాడు (అదేపుట)

అర్థపరిశీలనము భాషాశాస్త్రమున భాగమగునదికాదు కావున మరొక శాస్త్రమునర్థనివరణము చేయుటకు గ్రహింపకతప్పదు కావున కేవలము సంకేతములే పరిశీలనయోగ్యములు

The signals can be analysed, but not the things signalled about (Language p 162)

## 1, 5 2 మోరిస్ - సెమియాటిక్ (1938)

భాషాతత్త్వమును భౌతికముగ విశ్లేషించుటలో మరియొక విధానము దాదాపు అదేసమయమున అవతరించినది సంకేతము (sign) దాని నిర్మాణము మానవ సంస్కృతి నాగరకతా స్వరూపమును నిర్ధరించునవి - కావున మనోవ్యాపారమనగా సంకేతవ్యాపారమమాత్రమే తార్కిక తాత్త్విక దృష్టులు - ఈభౌతిక తత్త్వమును గ్రహించుటలో విఫలమయినవి - కావున త్యాజ్యములు 47 సంకేత విజ్ఞానము (semiotic) కేవలము ఒక శాస్త్రచర్చకుమాత్రమే పరిమితముకాదు విజ్ఞాన, గణిత తర్క - ఇత్యాది భిన్నశాస్త్రములు సంకేతములనే వాడుచున్నవి కావున ఆశాస్త్రములందలి సంకేత సంకేతిత సంబంధములను నిర్ణయించునట్టిదిగా - universal గా - సంకేతమును శాస్త్రీయముగా నిర్వచింపవలసియున్నది (ఇట్టిప్రయత్నమునే universal grammarians ఒకప్పుడు కోరినది) 48 ఈప్రయత్నముతో Charles Morris సిద్ధపరచిన ప్రణాళిక (1938) లో semiotic ప్రయోజనమిట్లు చెప్పబడినది

Semiotic supplies a general language applicable to any special language or sign and so applicable to the language of science and specific signs which are used in science

(Foundations of the Theory of Signs p 3)

ఇట్టి విశ్వజనీన దృష్టితో సంకేతవ్యాపారమిట్లు నిర్వచింపబడినది

The process in which something functions as a sign may be called semiosis 49 (Foundations p 3)

శబ్దము - అర్థము అనుమాటలింమరావు శబ్దార్థములను మాటలు అతి వ్యాప్తి, అవ్యాప్తి దోషములను కలిగినవి. కావున సంకేత వ్యాపారయిున 4 అంశములు గుర్తింపబడినవి

mediators – sign vehicles (సంకేతములు)

takings account of— interpietant (భావగ్రహణము)

agents of the process- interpreters (వ్యవహర్త)

that which is taken account of- designation (వస్తువు)

సంకేతస్థానమున శబ్దము నుంచినచో 'అర్థ ప్రసక్తి లేకుండగనే వాగ్వ్యవహారమున మానవుడు చేయుచున్న వ్యాపారమునంతయు సూత్రీకరింపవచ్చును (Fonndations p 4) - ఇది ప్రవృత్తివాదము (behaviorism) నకు లొంగిన వ్యాఖ్యానము (పుటలు 5-6) - కాని semiosis ఎ ఒక్క శాస్త్రమునకును బద్ధమైనదికాదు - అందుకే 'private expeilence నంగీకరించినది - taking account of' అనగానిది (పుటలు 5 6)

## సంకేత వ్యాపారదశలు (పుటలు 5-9)

1) ప్రథమదశ - సంకేతము వస్తువునుబోధించుదశ (Semantics)

2) ద్వితీయదశ - సంకేతము వ్యవహర్త అధీనములో వర్తించుదశ (Pragmatics)

3) తృతీయదశ - సంకేతములు సంధానమునొందుదశ (Syntactics)

## భాషా నిర్వచనము (పుట 10)

నిర్మాణవాది (formalist) భాషను కేవలము సంకేతమయముగా జూచును వ్యవహర్తను, వస్తువును నిర్లక్ష్యముచేయును కావున ఇదిదోషము వాస్తవిక వాది (empiricist) సంకేత - వస్తుసంబంధమునే చూచును కాని వ్యవహర్తను విస్మరించును కావున ఇదియు అసమగ్రము ఈక్రొత్తమార్గము - ప్రయోగ మార్గము (Pragmatics) దీని ననుసరించి భాష

a type of communicative activity social in origin and nature by which members of a social group are able to meet more satisfactorily their individual and common needs

(Foundations, p 10)

సంకేతములు రెండు రకములు కొన్ని ఇంద్రియసంబంధమున్న ప్రతి క్రియారూపములు నిత్యవ్యవహారమున మాట్లాడు మాటలు పాటలలోని మాటలు ఇట్టివి (p 12) కాని నేర్చుకొనబడు సంకేతములున్నవి — చిత్రలేఖనము నందలి గీతలు, వాయిద్యముపై వాయించు మ్రోతలు, మరియు (వ్రాయు) సంకేతములు — ఇట్టివానియందు ప్రయత్నమున్నది — కావున ప్రవృత్తిజన్యములు (అదే పుట) కావున సంకేతములందు సహజత్వము నియమము — రెండును గలవు (పూర్వవాదములకు సమాధానము పుట 43) [50]

## భావబోధకశక్తి — భాష (పుటలు 26-29)

భావము శబ్దేతరము — అశాబ్దికము (non-linguistic) భాషభావమెట్లు ప్రతిబింబించును? దీనికి తాత్త్వికులు చెప్పు సమాధానము thought — spoken word — mind — reflection అను వరుసలోనుండును (p 26&30)

కాని ఇది అశాస్త్రీయము దీనికి పరిష్కారము సంకేతవ్యాపారమును ప్రయోగాత్మకముగ నిర్వచించుట అదియే 'Pragmatics (పుట 31) అరిస్టాటిల్ చెప్పిన అలంకారిక భాషానిర్వచనమున నీ ప్రయోగదృష్టియే ఎక్కువ ... కాని వారిపద్ధతియందు సంకేతమును గ్రహించునది బుద్ధి (mind)—కాని ఈయుత్పన్నపద్ధతిలో కేవలము ప్రవృత్తి-వాడుక (habit p 31) ఈవాడుక వ్యవహర్త జీవలక్షణము (organic property ibid)

కావున మనము బుద్ధిదశగాభావించునది కేవలము సంకేతముకల్గించు వికారము మాత్రమే ఏవస్తువూ అర్థము కాదు-సంకేతము సూచించు అనేక వస్తువులలో అదియొకటి యగుటవలన 'అర్థ మనుచున్నాము తప్ప ఏదియు శబ్దమును కాదు—అది మాధ్యమిక (mediator) ముగా వస్తువుతో వ్యవహర్తకు సంబంధము కల్పించుచున్నది కావున (పుట 45)

కాబట్టి 'Linguistics' అన్న ఒక శాస్త్రము భిన్నమైనది లేదు అది సంకేత విజ్ఞానములో ఒక భాగము మాత్రమే (పుట 55)

ఈదృక్పథమునింతగా వివరించి చెప్పుటకు కారణమున్నది ఆనందవర్ధనాదులు 'శబ్దార్థము లను పదములను చాలయర్థములందువాడిరి (చూ వ్యం సూ 2 13) ఆయర్థములందన్నిటను ప్రధానములగు విషయములు మూడే— వస్తు భావ వ్యాపారములు—అనగా సంకేత, సంకేతిత, మార్గములు విశ్వ సత్యము మానసికమా ; భౌతికమా ; అనియంగీకరించుటలో భేదవిభేదము లున్నను గుర్తించుదశలుమాత్రమేశాస్త్రమునందైనను నిమూడే- యనుటను ప్రవృత్తివాదముకూడ నియమించుచున్నది వ్యవహర్త - వాడుక అను ... టలు ... మునకు చెందునవి కావు భావానుభవమునగల వ్యక్తినిష్ఠ (subjectivity) ను నిరూపింపజాలవు—వస్తునిష్ఠ (objectivity) నుకూడ చెప్పజాలవు (ఉదాహరణమునకు చూ పైగ్రంథము పుటలు 40 41)

తరువాతి సంవత్సరములందీ ప్రవృత్తిమార్గమునవలంబించి ఛామ్స్కీ ప్రవృత్తులు హేతువాదమునవలంబించుట యందు చూపబడును 1975 తరువాత నుండల Pragmatics మరొక రూపాంతరమున రూపుదిద్దుకొన్నది (చూ వ్యం సూ 1 10)

## 1 6 ఛామ్స్కీ పూర్వరంగము—కొన్ని దృక్పథములు

బ్లూమ్‌ఫీల్డు మొదలు ఛామ్స్కీ (1957) వరకు భిన్నదేశములందు భిన్న వాదములు పుట్టినవి 51 తరువాత అన్నియు ఛామ్స్కీని ఆధారముగ గొన్నవి యని అర్థముకాదుకాని భాషాశాస్త్రలక్ష్యములను నిర్వచించుటలోయన పేంచ ప్రణాళికతో ప్రపంచమున నలుమూలలగల భాషాపరిశీలకులలో ఛామ్స్కీమార్గానుయాయులధికమైనారు కానివారినిగూర్చియు తర్వాత ప్రసంగించుట జరుగును

### 1 6 1 ఫర్త్ (మాలినొవ్‌స్కీ) సందర్భవాదము

భాషాపరిశీలకుడు స్వీకరించు భాషాంశమునుబట్టి అతని దృష్టియు మార్గములను నియతములగును ఇంతదనుక అనాగరిక (జానపద) జనసమూహముల నాధారముగ జరిగిన పరిశోధనము స్వల్పము మాలినోవ్‌స్కీ 'ట్రోబ్రియాండ్' ద్వీపవాసుల భాషను సంస్కృతీ నేపథ్యముతో పరిశీలించుచు ఆభాషారూపములను అనువదించుటలో కొన్నిసమస్యలను గుర్తించినాడు 52 శబ్దము సందర్భముచే నియమింపబడియే అర్థవంతమగుచుండుట గుర్తించి భాషాపరిశీలకునకు 'statement of meaning అవసరమని ఇతడు భావించినాడు సాంస్కృతిక పదజాలములో మిక్కుటముగ కన్పించుచున్న ఈ సమస్యను contex of situation

అని ఇతడు వ్యవహరించినాడు ఈదృష్టితో అర్థమనగా పదము (వాక్యము) ఒక సందర్భమున నిర్వర్తించు ప్రయోజనము భాష ఒక ప్రక్రియ (process) తప్ప అభిప్రాయ సంకేతము కాదని ఇతని సిద్ధాంతము 53 మొదట అనాగరిక భాషలందే ఈప్రక్రియాముఖ నిర్వచనము కుదురునని భావించినవాడు తరువాత సర్వభాషలను ప్రక్రియలే అను అభిప్రాయమునకు వచ్చినాడు

ఇతని పరిశోధనమునగల విలక్షణత—ఈప్రక్రియాలక్షణము శిశుభాష యందును గలదని గుర్తించుట (సమకాలీనముగా Piaget, Otto Jesperson మున్నగువారియందీలక్షణమున్నదనుటకు చూ Roman Jakobson (1971) బ్రహ్మానంద, భారతి మార్చి 1980) 54

"In all the child s experience words when seriously uttered mean in so far as they act The intellectual function of words probably develops later and develops as a by-product of the pragmatic function Thus the source of the marginal attitude towards words is, if the theory developed here is correct to be found in the use of words by infants and children

(Coral Gardens — II p 62 cf I G L p 300)

భాషను సంకేతమయముగా భావించుటలో అభిప్రాయనివేదన ప్రయోజనము మాత్రము గర్భితమైయున్నది ఈదశ బుద్ధి వికసనమునకు సంబంధించినది శిశువుల భాషావ్యవహారమున శబ్దార్థముల సటుమ ప్రత్యక్ష సంబంధమున్నదనుటనే mean in so far as they act అని మాలినోవ్‌స్కీ చెప్పినాడు శిశు, జానపద వాక్కులందుగల ఈలక్షణమునే 'magical function అని ఆయన భావించినాడు 55

ఇట్టి దృష్టితో భాష ఒక ప్రక్రియగా ఊహింపబడినది భాషలోని

యాదృచ్ఛికతకిదియొక సమాధానము ఏశబ్దమే యర్థమునైనను బోధింప వచ్చును—సందర్భాశ్రితముగా అట్లుగాక శబ్దమునకు వాచకత్వ (రెఫరెన్షియల్ మినింగ్) ము నంగీకరించి భాషలోని అర్థవైవిధ్యమునంతయు వివరించుట అసాధ్యమని మాలినోవ్స్కీ నిరూపించెను (దైనందిన, కావ్యభాషా వ్యవహారములనడుమ భేదమును గుర్తించుటయందును ఇతని నిరూపణము ప్రశంసనీయము కావ్యభాష కృతకమని ఇదియొక వ్యావాత్సాంఘటనామయమని ఒక నిర్దిష్ట ప్రయోజనము నాశించి కల్పించబడునని వెంటనే మరువబడ ననియు నిర్దేశించెను) ఈదృష్టితో శబ్దప్రధానము అర్థము.

Meaning is therefore the effect of words on human minds and bodies, and through these on the environmental reality as created and conceived in a given culture

(Coral Gardens II p 53) (cf I G L p 302)

## 1 6 1 2 వ్యవస్థావ్యాకరణము

## (Poly Systemic Grammar)

శబ్దార్థములకు సంబంధించి ఫర్త్ సిద్ధాంతమంతయు మాలినోవ్స్కీ చెప్పినదే సస్యూర్ నిర్మాణవాదము నంగీకరించుచు బ్లూమ్‌ఫీల్డు భౌతికవాదమును ఖండించినవాడు ఫర్త్ భాషను అర్థముకొరకే పరిశీలింపవలెననుచు పరిశీలనము మాత్రమే శబ్దాశ్రితమై సందర్భనిబద్ధమై యుండవలెనని ఫర్త్ ప్రతిపాదనము

(Synopsis of the linguistic theory cf I G L p. 122)

అర్థములో రెండు దృష్టులు గుర్తింపబడినవి.

1) **Collocation** కొన్ని పదములు కొన్నిపదములతో కూడియే కనిపించును పదముల నడుమగల ఈ ఆకాంక్ష (expectancy) 'collocation అనబడును

2) Colligation రెండు వ్యాకరణాంశముల నడుమ అర్థపరిణామహేతువు నైఘంటిక పదములు కేవలము ఈసంబంధములకు exponents' (వ్యంజకములు) మాత్రమే 56

## 1 6 1 3 సందర్భవాదము (Context of Situation)

సందర్భమనుమాట భాషలో భిన్నదశలలో వాడబడినది వర్ణపద వాక్య సంఘటనాదులు భిన్నదశలు. భాషలో ఈసందర్భము వర్తులక్రమము (సైక్లికల్ ఆర్డర్) కలిగినది సందర్భములో మరొక సందర్భము—ఇట్లు అన్నియు సంస్కృతి కి సంబంధించినవే అర్థము చారిత్రకముగనో మానసికముగనో నిర్వచించినచో వచ్చెడి సమస్యలిక్కడ ఉండవు ఇంగ్లండులోనీపద్ధతి ప్రసిద్ధినొందినది. కాని వ్యంజనను పరిశీలించు దృష్టితో ఈవిషయమింతవరకు చాలును

1 6 1 4 అటు బ్లూమ్‌ఫీల్డుకాని ఇటు ఫర్త్‌కాని అంగీకరించని విశ్వభాషా సామాన్యలక్షణము (universal in language) ను భాషావ్యవహర్త పైయాకరణ ప్రతిభ (intra-linguistic competence) ను ప్రతిపాదించుచు 1957వ సంవత్సరమున నోమ్‌ఛామ్‌స్కీ Syntactic Structures ప్రకటించుటతో అమెరికా పండితులకు భాషలోని పరివర్తన సిద్ధాంతముపైపు దృష్టిపోయినది దీనితోఫర్త్ ఆశించిన సైద్ధాంతిక సమన్వయము ఫలింపకయేపోయినది (cf, I G L p 123) కాని ఫర్త్ అనుయాయులు prosody పైపు చూపినశ్రద్ధ శబ్దార్థ సంబంధచర్చపైపు ప్రసరింపచేయుచున్నట్లు లేదు (cf Halliday in Chatman (ed) 1971)

## 1 6 2 కార్ల్‌బ్యూలర్ – వాగ్వ్యాపార త్రైవిధ్యము

మాలినొవ్‌స్కీ వాగ్వ్యాపారదృష్టిలో సందర్భమనగా - సంఘమునాశ్ర

ముంచినది కాని సమకాలీనముగా (1934) కార్ల్‌బ్యూలర్ అను జర్మన్ పండితుడు వాక్కునకున్న త్రివిధ వ్యాపారములను గుర్తించినాడు అతడు మన సత్త్వశాస్త్రజ్ఞుడు 57 మాలినొవ్స్కీ ననుసరించి వాక్కునకు pragmatic magical functions (cf Coral Gardens and their magic Vol II 1935) ఉండగా బ్యూలర్ ననుసరించి representational, conotive and expressive functions ఉన్నవి (cf Buhler, Sprachtheorie 1934) మొదటిది సాంఘికమగు భాషావ్యాపారమునకు రెండవది వైయక్తికమగు వాగనుభవమునకు సంబంధించినది

ఇట్టి విభజనము భాషానిర్మాణాతిశాయి కావున భాషాపరిశీలనమున దీనికి చోటులేదనువారునుగలరు (ఉదాహరణమునకు Bloomfield ఇట్టి అభిప్రాయమునే వ్యక్తముచేసియున్నాడు 58 నిర్మాణదృష్టికి ఒదిమిమైన ఏభాషాపరిశోధకునికైనను ఇట్లే అనిపించవచ్చును)

కాని ఇది కేవలము పాక్షికమగు నభిప్రాయము మాత్రమె ఒక వ్యాసమున Halliday వాగ్వ్యాపార దృష్టికిగల నిర్మాణసమన్వయమునిట్లు గుర్తించినాడు

'If language is, as it were programmed to serve a variety of needs then this should show up in some way in an investigation of linguistic structure'

(Linguistic function and literary style, in Chatman (ed) 1971, p, 332)

ఉదాహరణమునకు Halliday ననుసరించి ఈమూడు వ్యాపారములు క్రింద చూపబడుచున్నవి

1) ideational (expression of content)

2) interpersonal (using language as means of his own intrusion into speech event)

3) textual (the situation and language are linked together by this function)

బ్యూలర్ భావించిన conotive expressive అను రెండు విభాగములను పైని (2)లో గతార్థములగునని Halliday అభిప్రాయము ఇచ్చట మనకు కావలసిన యంశము వాగ్వ్యాపారమీమాంస ఏదో ఒకరూపమున జరుగుచున్నదనుట—కాని జరిగినకృషి మాత్రము చాలస్వల్పమగుటచేచింతవ్యమగు విషయము

## 1 7 హేతువాద పునఃస్థాపనము
## కార్టీజియన్ సంప్రదాయము

ఇరువదవశతాబ్దపు ద్వితీయార్ధ భాషాపరిశోధనరంగమంతయు Noam Chomsky ప్రతిభచుట్టును ప్రదక్షిణము చేయుచున్నది [59] దీనికి కారణములు రెండుగలవు (1) ప్రపంచమున విజ్ఞానతర్కముకన్నను శాస్త్రీయముగ గుర్తింపబడిన హేతువాదము (2) భిన్నదేశములందు గలయువభాషాశాస్త్రవేత్తలు నూతన వతా సామ్యదృక్పథములతో భాషను పరిశీలించుటతో సామాజికావగాహనమును కొలుచుచుండుట [60] నోమ్‌ఛామ్స్కీలోగల ఈ రెండులక్షణములను నూత్నవ్యాకరణ భాషావిజ్ఞాన సిద్ధాంతములుగా రూపునందుకొన్నవి ఛామ్‌స్కీ అర్థదృష్టి స్వరూపమెట్టిదియో ఇచ్చట చూపబడును

1 7 1 భాషాశాస్త్రధ్యేయములను స్పష్టముగా నిర్వచించిన ఛామ్స్కీ నిజమైన భాషాశాస్త్రాభివృద్ధి ఇట్టిదని అభిప్రాయపడినాడు

' Real progress in linguistics consists in the discovery that certain features of given languages can be reduced to universal

properties of language and explained in terms of these deaper aspects of linguistic form

(Aspects of the Theory of Syntax p 35 1965)

ఛామ్స్కీ అర్థమును గురించిన సూక్ష్మసిద్ధాంతమేదియు చేయలేదనువారు గలరు [61] ఉదాహరణమునకు Dinneen ఇట్లు వ్రాయుచున్నాడు ఛామ్స్కీ అర్థదృష్టి ఇట్టిదని—

what appears to be an elegant intra linguistic method of describing meaning without making a commitment to any of the disputed theories about what meaning is (I G L p 23)

కాని ఛామ్స్కీ అర్థదృష్టిని అర్థముచేసికొనుట మిక్కిలి క్లిష్టమగునంశము పైనచెప్పిన 'intra linguistic అను మాటవెనుక ఒక తాత్త్విక సిద్ధాంతమున్నది దానిననుసరించి ఛామ్స్కీ అర్థదృష్టి నియమితమగుచున్నది భాషావిశ్వజనీనత అంతర్నిర్మాణసూత్ర విమర్శ — ఇతని పరిశీలన ధ్యేయములుకాగా వెనుక 1) డికార్టె ప్రభృతులు ప్రతిపాదించిన తాత్త్విక సిద్ధాంత ప్రభావము 2) సమకాలీనమగు గణిత తర్క మానసిక శాస్త్రాదుల ప్రభావము — ఉన్నవి వానిని ఇచ్చట పరిశీలించుట తరువాతి ప్రయత్నము

1 7 2 ఒక ఆలోచనా సంప్రదాయముగా నేమియను ప్రశ్నను మొదటిసారిగా ఆధునిక భాషాపరిశీలకులలో వేసికొన్నవాడు ఛామ్స్కీ డికార్టె, హంబోల్టు మున్నగు (17 18, 19 శ ) వారిలో కనిపించు లట్టి ఆలోచనా స్రవంతిని గుర్తించి 'Cartesian అను పేరిట ఛామ్స్కీ వ్యవహరించినాడు (1966) ఈదృష్టితో మానవభాష స్వతంత్రము పశుభాషకన్నను భిన్నము భాషలో ప్రధానమగునంశము సృజనాత్మకత ఇది అనంతము కేవలము ప్రేరణ సంబంధికాదు వాగుత్పత్తి దేహముతోపాటు మానవుని చర్యలను వ్యాఖ్యానిం

చుటకు మనస్సునుకూడ గుర్తింపవలయును మనస్సు సృజనాత్మక వ్యాపారము కలిగినది భాషానిర్మాణ ఉపయోగములలో ప్రధానమగు లక్షణ మీసృజనయే (creativity) 62

One may discover two Generative Powers in Man one common with the Beasts and Plants and the other participating of Spiritual Substances, God and the Angels (p 3) Wit(Ingenio) is a generative power the Understanding is a Generative Faculty (p 3)

(Q Juan Huarte (1575), Cartesian Linguistics
(C L) p 79 f n 9)

కావున భాష కేవలము యాంత్రిక వ్యాఖ్యానమునకు లొంగునదికాదు కారణము మానవప్రజ్ఞ (దైవప్రజ్ఞకన్నను భిన్నమైనది -పుట 79) త్రివిధము గనున్నది — ఇంద్రియావధినికలిగిన పరిజ్ఞాన అనుభవశక్తి (docile wit) అపూర్వ అవితర విషయములను చెప్పెడి మేధశ్శక్తి (perfect wit) అవిద్యావంతులయ్యు నెనక సుస్థితిలేని ఎచ్చివారివంటి వారియందుండు అసాధారణమగు తత్త్వదర్శనశక్తి (third wit) 63 ఈమూటియందును memory understanding imagination ప్రధానాంశములు (ibid)

వాగ్వ్యవహారము చేయలేని మనిషికాని, చేయగల్గిన జంతువుకాని లేవు (పుట 5) పశువునందు 'instinct (జన్మసహజమగుభావము) మనిషియందు thought (అభ్యస్తమగు ఆలోచన) ప్రధానములు — దీనికి కేంద్రము మానవుని లోని విశ్వజనీనమగు మనస్సు దీని అభివ్యక్తికి సాధనముగా భాష ఉపయుక్తమగుచున్నదితప్ప కేవలము అభిప్రాయ వినిమయమునకు కాదు (చూ పుటలు 11-12),64

Language, mind ల మధ్యగల నిర్మాణసంబంధముపైన రెండు సిద్ధాంతము లున్నవి

1) The structure of language reflects the nature of thought (Beauzee)

2) Language serves as a medium of thought (La Mettrie) (C L p 30)

చామ్స్కీ ననుసరించి గుప్త (deep) వ్యక్త (surface) నిర్మాణ (structures) ములను విభాగము లీమొదలై సిద్ధాంతముననుసరించి వాక్కును అనుశీలించుటకు సంబంధించినవి కావుననే James Harris ననుసరించి when a man speaks

his speech or discourse is a publishing of some energie or motion of his soul (Q Hermes p 223 C L p 31)

అందువలననే linguistic act (వాక్ప్రక్రియ) రెండు ప్రయోజనములను కల్గినదని చామ్స్కీ అభిప్రాయము

1) ఇంద్రియా (మనస్సుకూడ) నుభవమును ప్రకటించుట (publish perception)

2) కాంక్షాదులను తెలుపుట (publish volition)

వాక్యములలోను ఈరెండు రకములున్నవి 65 కొన్ని వక్తృమనఃస్థితి వ్యంజకములు మరికొన్ని శ్రోతృప్రతిక్రియనపేక్షించునవి కావున వాక్య విశ్లేషణమునగల మనోవ్యాపార సమన్వయమిది (పుట 32)

1 7 2 1 ఈకారణమువలన ఇంతవరకు శబ్దార్థములుగ భావింపబడిన విభాగములను బాహ్య అంతర నిర్మాణభేదములుగ గుర్తింపవచ్చుననుట కార్టీజియన్ సిద్ధాంతమున ప్రధానాంశము—అంతరనిర్మాణము భావము (idea)

linguistic sign వాక్కు
- —sound (శబ్దరూపము)—outer
- —signification (భావరూపము)—inner

భావరూపమనగా how it expresses a thought' అని అర్థము (పుటలు 32 33) ఇది మరల ససూర్ ప్రతిపాదనమునకు పునర్వ్యాఖ్యానమే శబ్దార్థముల నడుమ ఏకముఖత్వముండనక్కరలేదనుటయు గుర్తింపబడినది (పుట 33) అంతర్నిర్మాణము కేవలము —నంక సత్యమనుటయు పునరుద్ఘాటింపబడినది (పుట 34) ఇది విశ్వభాషా సామాన్యమగునంశమనుటయు సూచింపబడినది (పుట 35) 66

1 7 2 2 అర్థము భావము యొక్క 'comprehension కి సంబంధించినది శబ్దము extension కి సంబంధించినది భావము (idea) కన్నను భిన్నమగు శబ్దనిర్మాణముండ ననుటకు ఛామ్స్కీ పెక్కు ఉదాహరణములు చూపియున్నాడు నిదర్శనమునకు ఒక వాక్యము బాహ్యముగ నిర్ధారితముగనుండి ఆంతరికముగ వ్యతిరేక భావము కలిగినదికావచ్చు 67

(చూ ఆర్నాల్డ్ వాక్యములు C L పుట 44)

1 7 3 ఛామ్స్కీ గుర్తించిన మరొక అంశము భావముయొక్క స్వతస్సిద్ధత (innateness) త్రిభుజమున్నది దానినిగురించిన భావచిత్ర (image) మొకటి స్వతస్సిద్ధముగా మనిషికున్నందువల్ల త్రిభుజలేఖనము జరుగుచున్నది భాషయందు భావగ్రహణముకూడ ఇట్లే జరుగుచున్నది (చూ C L పుటలు 67-68)68 —నవ వాక్కునకు ఒక ప్రత్యేకతయున్నది ఇతర శబ్దజాలములోలేని ప్రత్యేక గుణమిది అది వక్తశ్రోతల నడుమగల ఏకైకమగు భావనిర్మాణము నాధారముగ మానవవాక్కు సృజింపబడుటలోనున్నది

It is because of the virtual identity of this underlying system in speaker and hearer that communication can take place, the sharing of an underlying generation system being traceable ultimately to the uniformity of human nature

(C, L p 71)

1 7 4 ఈవ్యంజనసూత్ర ఎరిశోధనమునవెట్టి ప్రాణాళిక ఊహాంపబడి నదో అట్టిరె Cartesian Linguistics ని వెలుగులోనికి తెచ్చుటకు ఛామ్స్కి అనుసరించినాడు 69 కాని Plato Aristotle లందుగల భావ ప్రాధాన్య వాదముకాదిది రూపప్రాధాన్యవాదము కావుననే మరియొకచోట మనోవ్యాపార ప్రక్రియా స్వరూపమును గురించి ఇట్లు ప్రశ్నించుకొనినాడు ,

We do not understand and for all we know what makes it possible for a normal human intelligence to use language as an instrument for the free expression of thought and feeling or for that matter what qualities of mind are involved in the creative acts of intelligence that are characteristic not unique and exceptional in a truly human existence

(Language and Mind p 101 1968)

ఛామ్స్కిమీద మిక్కిలిగాఢములగు విమర్శలున్నవి 70 గుప్తనిర్మాణము వ్యక్తనిర్మాణముగా అభివ్యక్తిని పొందుచున్నదని అంగీకరించినతరువాత, ప్రకృతి సహజమగుశక్తిగా వాగుత్పత్తిని అంగీకరించినతరువాత (C L p 60) ఛామ్స్కి వేసకొన్న పై ప్రశ్నలు బౌద్ధికములగుతర్కపరిధి నాశ్రయించినవితప్ప స్వాభావిక ముగ శబ్దభావ సమన్వయమును సాధించినవిగావు కావున అర్థస్వరూపమీ దృష్టితో ఇంకను అనిర్వచనీయమే

1 7 5 ఛామ్స్కి ప్రతిపాదించిన పరివర్తన (transformation) మన్న సూత్రము (rule) తో కావ్యభాషయందుగల వక్రత (deviance) ను నిరూపించుటకు ప్రయత్నముచెసి భాషలో కావ్యత్వము (style)71 అనబడు అంశము కేవలము ఒక 'systematic variation అని అభిప్రాయపడినవారు కొందరున్నారు ఉదాహరణమునకు Nils Erik Enkvist అట్టివాడు ఒక వ్యాసము భిన్నభాషాశాస్త్రమార్గములు style అను అంశమునెట్లు నిర్వచింప ప్రయత్నించినవో చెప్పుచు బ్లూమ్‌ఫీల్డులో style అన్నపదమే కనిపింపదనియు,

Harris లో వ్యాప్తిదృష్ట్యా నిర్వచనము కనిపించుననియు Bloch లో మరింత సమగ్రత కనిపించుచున్నదని ఇట్లు ఉదాహరించినాడు.

'the message carried by the frequency distribution and transitional possibilities of its linguistic features especially as they differ from those of the same features in the language as a whole, (Bloch 1953 pp 40 ff)

ఇవియన్నియు అసమగ్రములగు అభిప్రాయములే ఒక్క పరివర్తన సిద్ధాంతమే కావ్యభాషలోని ప్రత్యేకతను సూత్రించగలదు ఎందులకనగా వాక్యలోని బాహ్యాభ్యంతరదశ లింటే గుర్తింపబడినవి కావున

'By giving substance to features that do not actually appear on the surface of a text transformation grammar should be capable of analysing a figure such as ellipsis for example with increased rigour

(Enkvist, in Chatman (ed) p 51, 1971)

ఉదాహరణమునకు Metaphor ని ఇట్లు పరివర్తన సూత్రములద్వారముస విశ్లేషించవచ్చునియు అతని అభిప్రాయము 72

1 8 వీన్‌రిష్ కావ్య భాష అర్థమనగా నేమో నిర్వచించునవసరము చామ్‌స్కీ ప్రభృతులకులేదు ప్రభృతులనగా Katz Fodor Postal[73] మొదలగువారు అది తాత్త్వికులకు సంబంధించిన పనిగా వదలివేసిరి 74 ఒక విమర్శలో వీన్‌రిష్ (1965) ఆధునిక బాషాశాస్త్రజ్ఞులు అర్థమును శబ్దాతిరిక్తము (meta linguistic) గ భావించిరనియు అదిదోషయుక్తమనియు చెప్పెను—

'Modern Linguistics, Bloomfieldian as well as generative, has proceeded from the assumption borrowed from symbolic

logic that semantic rules (rules governing the meaning of words) are metalinguistic statements outwardly distinguishable from statements in the object language

(Explorations in Semantic Theory p 47 ed 1970)

దీనికి వ్యతిరేకముగ శబ్దమునకే విశిష్టార్థ ప్రతిపత్తియు ఇమిడియున్నదని ఏన్‌రిష్ ప్రతిపాదన (అదే పుట) భాషకున్న కావ్యోపయోగమును గుర్తించుట (పుట 471) తో ఈప్రతిపాదన పుట్టినది అర్థవక్రత వాక్య వక్రతలను భిన్నముగ గుర్తించుట (పుట 470) జాతీయము (idioms) లను అంశగోపనసూత్రము (suppression rule) ద్వారమున వివరించుట (పుట 459) కు ప్రయత్నించుటలోని సాధకబాధకములను విమర్శించుట 75 ఇవి పరిశోధనలో ప్రధానాంశములు ఇతడే ఒక అంశమును గుర్తించినాడు

Other forms of metaphor realisation can not be formulated until the theory is refined to accommodate more fully the phenomena of contexual specializations (ibid p 465 f n)

1 8 1 ఈపరిణామము నిట్లు సమీక్షించవచ్చును భాషావ్యవహర్త ప్రతిభ (competence) కేవలము వాక్యములను వ్యాఖ్యానించుకొనుటలో మాత్రమేగాక, సృజించుటయందును గలదని గుర్తించుట—కావ్యోపయోగము శబ్దమునకు విశిష్టార్థ ప్రతిపత్తిని కల్గించునని గ్రహించుట—ఇట్టి అభిప్రాయములు క్రమక్రమముగ భాషా పరిశోధకులలో వ్యాపించి ననూర్ ప్రతిపాదనలలో నిర్లక్ష్యము చేయబడిన అన్వయసూత్రముపైపు దృష్టి ప్రసరించుచుండుట గుర్తింపవచ్చును వీన్‌రిష్ ఇట్లనివాడు (పైవ్యాసముననే)

' Today linguists are resuming their search for a far richer characterisation of notion of human language and it is apparent that in such a characterisation a detailed statement of the semiotic sub-mechanisms of language76 will occupy a prominent place (p 396)

## 1 9 సామాజిక భాషాశాస్త్రము (Socio linguistics)

ఇరువదవ శతాబ్దమున భాషాశాస్త్రమును ప్రభావితము చేసిన ఇతర శాస్త్రములలో సామాజిక విజ్ఞానము (సోషియాలజీ) వాల త్వరితముగ ప్రపంచము నలుమూలలగల పండితుల నాకర్షించినది వ్యంజనదృష్టితో పరిశీలించినచో వీరి ప్రయోగములందు ప్రసక్తనీయాంశములు పెక్కులు గలవు

### 1 9 1 ప్రతిభానిర్వచనము

చామ్‌స్కీ ప్రభృతులు ప్రతిభ'77 (competence) ను కేవలము వ్యాకరణగత నిర్మాణ సూత్రముగ గ్రహించిరి ఇది అసమగ్రమనియు ప్రతిభానిర్వచనము వ్యవహారదక్షత (communicative capacity) నంతయు బోధింపవలయునని D H, Hymes78 (1972 పుటలు 284-288) వంటివారు వాదించిరి వక్తవ్యాంశము భాషానియమములకు లోబడియుండుట, జ్ఞాపకశక్తికి తగియుండుట, సందర్భాదిదృష్టులతో ఉచితమగుట వక్తవ్యాంశము శబ్దరూపమును పొందుట—ఇవి ప్రతిభను గుర్తించుటలో సమస్యలు ఈదృష్టిలో వ్యవహర్త (native speaker) కేవలము వ్యాకరణబద్ధముగా వ్యవహరించువాడుగ మాత్రమేకాకుండ వాగితరములైన అనేకాంశములచేత నియమింపబడుచున్న వాగ్వ్యవహారముగలవాడని గ్రహింపవలసియున్నది

వక్త, శ్రోత, అనువక్త అనుశ్రోత వక్తవ్యాంశము సందర్భము, మానసికస్థితి ప్రయోజనము ఇట్టి అంశములలో కొన్ని79 సాంఘికములగు విద్యాసంపదాది స్థితులను, స్త్రీపురుష వయోవృద్ధాదిభేదములను వాగ్ వ్యవహారమును నిర్ధరించుచున్నవి

### 1 9 2 భాష ఒక ప్రతీక

ఇంతవరకు నిర్మాణదృష్టితో భాషను నిర్వచించినవారే అధునికులందరును కాని సంఘమున భాషకుగల ప్రయోజనమును గురించి పరిశీలించినవారుకావున వీరు

' A language is functionally defined as a superimposed norm used by speakers whose first and ordinary language may be different A language is the medium of communication between speakers of different dialects 80

(E Haugen p 102 1966)

భాషను అమూర్తనిర్మాణముగ గ్రహించుచున్నారు వ్యవహారమున నున్నవి భిన్నమాండలికములే ఈభిన్నమాండలికములు కలసియే భాషయగు చున్నవి సాంఘిక నియమములవంటివే భాషయందును గలవు కావున నే భాష అందించు భావములను సంఘమంగీకరించుచున్నది ఇట్లు భాష వ్యక్తిసాంఘికస్థితికి ప్రతీక (symbol) అని హాజన్ నిరూపించినాడు 81 (పుట 110)

## 1 9 3 ఉచ్చత — నీచత

భాషా వ్యవహారమే సాంఘికముగ వ్యక్తికి ఉచ్చత నీచతల నాపాదించు నదియు వ్యక్తిసంస్కార విశేషమంతయు జాగ్రదజాగ్రదవస్థల (careful and careless speeches) తో ఉపయుక్తమగుచున్న భాషాప్రయోగపద్ధతి ననుసరించి తెలియుచున్నదని నిరూపించినవారు కొందరున్నారు 82 (Labov 1963)

భాషయందీదృష్టితో ప్రధానముగ రెండుశైలులు కనిపించుచున్నవి నిత్య వ్యవహారోపయుక్తమగు సంవాద (colloquial or lower style) ఉపన్యాస రచనాది విశేష వ్యాసంగోపయోగి సాహిత్య (literary or higher style) భేదములే ఈశైలులు ఇటాలియన్ అరబిక్ మొదలగు భాషలందును ఈభేదమున్న దని ఎ ఫెర్గ్యూసన్ నిరూపించుచున్నాడు 83

**1 9 4** వ్యవహర్తల మతసాంఘిక దృక్పథములు సంభాషణలాధార ముగ పరిశీలించినపుడు వక్తృశ్రోతృ ప్రక్రియల ద్వారమున నిరూపింపవచ్చునని J J Gumperz 84 పరిశీలన

ఒక శ్వేత శరీరునికి కృష్ణదేహునికి మధ్యజరిగిన సంభాషణమునుదాహ రించినాడు Alan Dundes అను పండితునికి ఒక నీగ్రో శిష్యుడు చెప్పిన వృత్తాంతమట ఇది[85] పాశ్చాత్యదేశములలో Who dat? (who is that?) అను వాక్యనిర్మాణము నీగ్రోలలో మాత్రము కనిపించును ఇతరులెవ్వరు నట్లనరు

'Governor W died and went to Heaven When he knocked on the door a voice answered who dat?' He said Never mind I will go to the other place (p 128)

వ్యంజనమును పేరు వాడలేదు కాని స్వర్గమునకు బోయినను మారని మానవుల ఉచ్చ నీచ వర్గీకరణలు (categorization) గంపర్జ్ చేత గుర్తింపబడినది అతని వాక్యమిది

'The notion of categorization devices thus extends to both linguistic form and linguistic content (p 218)

అర్థవ్యాప్తియందీ అంతరువులు గుర్తింపబడుట ఒక ప్రధానమగు మలుపు

## 1 9 5 అనుభవనేపథ్యము

ఇద్దరు వ్యవహర్తలు మాటలాడునపుడు ఆయిరువురికే అర్థమగు విషయము లుండవచ్చును మూడవవాడు విని అర్థము చేసికొనుటలో కొన్ని సమస్యలు రావచ్చును ఇట్టిచోట్ల విను విషయములకంటె తెలియునంశములు భిన్నములుగ నుండుట సంభవించుచున్నది ఇట్టి పరిశీలనమున background expectations ప్రధానమని గుర్తించినవాడు Garfinkel (1971)[86] భార్యాభర్తలిద్దువురు మాట్లాడుకొనుచున్నారు

1) Husband Dana succeeded in putting a penny in a parking meter today without being picked up

2) Wife Did you take him to the record store ?

దీనికి అతడొసగిన వివరణము రెండవ అధ్యాయమున వివరింపబడ్డవున్న వాక్యానుమితికన్నను భిన్నముకాదు 87

వ్యవహర్తల సాంఘిక జీవనము, వ్యక్తిగత అభిప్రాయములు అర్థావగాహనమును నిర్ధరించుననియు, ఇట్టి వైయక్తిక సంబంధములు (intra-personal relations) వాక్యముల ద్వారమున గుర్తింపనగునని నిరూపించిన పండితులింకను గలరు

## 1 9 6 భాషలో ఆలంకారికత (Rhetorics in language)

వీరు భాషలో ఆలంకారికతను గుర్తించుటకు పర్యాయపదముల నుపయోగించుటలో సాంఘికములగు విలువలు ప్రతిబింబితమగుచుండుట హేతువు C Geertz చేసిన పరిశీలన ఈదృష్టితో చాల ప్రశంసనీయము 88 పదములు వాచ్యార్థములను మాత్రమేగాక సాంఘికమైన అంతరువులను వ్యంజించునని వీరు గుర్తించిరి 'గృహము అను అర్థమును సూచించు జావనీస్ పదములు మూడున్నవి

1) dalem (higher class)
2) grija (middle class)
3) omah (lower class)

శ్రోత సాంఘికస్థితి ఉన్నతమగునపుడు 1, మధ్యమమగునప్పుడు 2 నిమ్నమగునపుడు 3 వాడబడుచుండును (తెలుగున గల మేడ, భవంతి ఇల్లు గుడిసె

కొంప మొదలగు పదములనిట్లే ప్రయోగించుట గమనించవచ్చు ఆదేభాషలో 'you అను ఆంగ్ల పదమునకు 4 kowe 3 sampejan 2 pandjenengan 1 pandjendngandalem వాడుదురు. కర్మణ్యర్థమున [2 3, 4, di—] [1 dipun] అని వాడుదురు (తెలుగునను 1 నువ్వు 2 మీరు అను పదములవాడుకలో కూడ ఇట్టి సాంఘిక భేదము గమనించవచ్చు)

ఈభేదములను వారు ప్రత్యేకమైన పేర్లతో గుర్తించికూడ యున్నారు Kramabiasa Kramamadya ngokobiasa—అని ఈభేదములను స్థూలముగ చెప్పుచురు (పుట 171) [89] ఇట్టివానినే వీరు శైలీభేదము (stylemes) లని గుర్తించిరి Geertz ఇట్టి భేదములను సందర్భముల నాధారముగ భిన్నముగ వర్గీకరించి చూపినాడు (చూ పుటలు 174-176)

1 9 7 ఆఫ్రికాలోని 'సొమాలి' సంఘమునగల సాహిత్యమును పరిశీలించిన Andrzejewski (1963)కూడ వారి ఆర్థికజీవితమునకు, సంస్కృతీ నైతికత్వమునకు సంబంధము లేదనుచు అనుప్రాస (alliteration) శోభితమైన వారి కవిత్వము ఒక ప్రత్యేక విద్యయని లిఖిత సాహిత్యము కాకపోయినను వారి నాటక సంప్రదాయము అత్యున్నతమైనదని నిదర్శనము చూపినాడు కలహాద్ ఇయో కలహాద్ అన్న సొమాలీ నాటకమునుండి ఒక పాత్రమాటలుగా ఉదాహృతమైన ఖండమిది ఈక్రింది వాక్యములందిలి వాన, మేఘములు మెరపులు పచ్చిగడ్డి, పండు చెట్టు పొద తినుట—అన్నియు లాభాలాభములకు కష్టసుఖములకు సంకేతములు దేహమును మనసును, హృదయమును ఆక్రమించిన దుర్దశలను వ్యంజించునది కడపటి వాక్యము, ఇందు వాచ్యతలేదను విషయము మాత్రమావ్యాసకర్తచే గుర్తింపబడినది దాని ఆంగ్లానువాదమిది

,The rain clouds thundered and the lightening flashed
And fresh grass was engendered from them on the land
when fruit ripened,

And the high tree and the hubob bush put forth
their berries, we picked them
And ate our full I have never forgotten all that
I keep it in my mind my bossom and my belly

ఇట్టి దృష్టితో సాహిత్యమైన ప్రయుక్తమగు (సర్వనామ పర్యాయపద రూపము లను) శైలీ రూపములను మాక్ ఇంటోష్ (1963) షేక్స్పియర్ నాటకము లందు నిరూపించియున్నాడు 90

ఇంతమాత్రమేగాక గంపర్జ్‌వంటివారు ఇట్టిచోట్ల మెటఫర్' ప్రయోజనము కానవచ్చుచున్నదనియు కాని భాషాశాస్త్రమున మనకుగల పరిజ్ఞానముతో ఇట్టి ఆలంకారికాంశములను వివరించుట అసాధ్యమనియు చెప్పినారు

## 1 10 అర్థపరిశోధన —అనేక ముఖత్వము

ప్రస్తుత భాషాశాస్త్రపు పరిశోధనలందు ఏఒక సిద్ధాంతమునను ఏఒక్క దేశమునందుగాని ప్రపంచమునందలి భిన్నదేశములందుగాని నమ్మకమేర్పడ లేదు 91 వైవిధ్యముండుట పరిణామమునకు నిదర్శనమని తృప్తిపడుచున్నాము అర్థవిషయక పరిశీలనము చాల వెనుకబడియున్నదని, భాషాసిద్ధాంతము పుష్టము కావలసిన యవసరమున్నదనియు చాలమంది పరిశోధకులు యభిప్రాయము వ్యక్తముచేసిరి

1 10 1 పరివర్తన సిద్ధాంతము వాక్యార్థములను విశ్లేషించుటకే వినియుక్తమయినదని, రచన (creativity) కు సంబంధించినంతవరకు ఈసిద్ధాంతము అసమగ్రమయినదని Jacobvits (పుట 2 9) 92 వాదించెను పదమునకుగల లక్ష్యార్థములన్నియు బోధించుటకు సమర్థమగుటకు పదమును వస్తువును బోధించునదిగాకాక, వస్తువునకు సంబంధించిన పరిజ్ఞానము (cognition) ను

నిక్షిప్తము చేసికొనిన అర్థవాహక (tag of the semantic process) గా గ్రహింపవలెనని Lenneberg (1967, పుట 534) 93 వాదించెను వీరి దృష్టిలో అర్థము కేవలము మానసిక ప్రక్రియ ఈదృష్టితో జరిగిన పరిశోధనలును స్వల్పము [సామాజిక భాషాపరిశోధకులు కొంతవరకు ప్రయత్నించుచున్నారనుట ప్రదర్శితము]

1 10 2 కావ్యభాషలో కనిపించుచున్న వాక్య, అర్థవక్రత (deviance) లను పరిశీలించుటకు భాషలో రెండు వ్యాకరణములున్నవని, అవి భిన్నములని కొందరు వాదించుచున్నారు 94 వాక్యవక్రతా విశ్లేషణ (S D Analysis) ద్వారమున 'మెటఫర్' ని గురించి పరిశోధించి అది అసాధ్యమనియు, లాక్షణిక వాక్యమనగా కేవలము వాక్యాంతర్గత వక్రత కాదనియు వాక్యేతరాంశములను గ్రహింపక తప్పదని డా మైకేల్‌రెడ్డి (1969) నిరూపించెను 95 బహ్వర్థకత (ambiguity) నాధారముగ భాషలోని అర్థపరమైన సమస్యలను పరిష్కరించుటకు ప్రయత్నించిన G J Kooij (1972) తనకు ముందిట్టి ప్రయత్నము చేసిన Empson (1930) చేసిన ప్రయోగము మార్గదర్శకమని అంగీకరించుచున్నను మానసిక సత్యములను అంగీకరించెడి ఇట్టి పరిశోధనలు ప్రయోగమునకు క్లిష్టతనాపాదించునని వాదించెను 96 కొందరు భావించినట్లు projection rules ని నమ్మినను వీన్‌రిష్ (1965) వాదించినట్లు నానార్థకత అనంతమనినను దోషయుక్తమనియు Kooij భావించెను బహ్వర్థకతను సూత్రీకరించుటకు అతడు ప్రయత్నించెను (పుట 139 1971)'7

1 10 3 ఇంగ్లండు పరిశోధకులలో కొందరు మరింతదూరము పోయి వ్యంగ్యార్థమును గురించిన పరిశోధన మనమింకను మొదలుపెట్టలేదనిరి

'We have dealt only with problems of cognitive content or denotation meaning We have ignored in other words, all problems of stylistic variation or connotative values 98

(Manfred Bierwisch Semantics in N H L p 182 1970)

1 10 4 Adrienne Lehrer (1974) అను పరిశోధకురాలు ఎవి నిర్మాణమునకు అర్థవ్యాప్తికి మధ్యగల సంబంధములను గురించి వ్రాసెను 99 ఒకేపదము భిన్నసందర్భములలో భిన్నార్థములను స్ఫురింపచేయుచున్నప్పుడు ఇంతవరకున్న సిద్ధాంతముల నాధారముగ మనమా అర్థవైశాల్యమును కొన్ని తరగతులక్రింద విభజింపగలుగుచున్నాము కాని, వానిమధ్యగల లాక్షణిక వ్యాప్తి (metaphorical extension) ని గురించి ఆలోచించుటకు ప్రయత్నింపబడలేదని ఆమె వాదము అమె యుదాహరించిన వాక్యములలో నాల్గుచూపబడు చున్నవి

1) I *ran* on to the field

2) The car *runs* on petrol

3) The road *runs* from Manchester to Burmingham

4) Somebody has left the tap *running*
(Semantic Fields and Lexical Structure p 201 1974)

పై వాక్యములందు 'ఇటాలిక్సు లో'నున్న పదములకు (1) move quickly (2) function (3) connect (4) issue forth liquid అను విలక్షణార్థములున్నవి ఇట్టి అర్థములను సమన్వయముచేయు సూత్రము 'మెటఫర్' మాత్రమేనని అమె సూచన (అదే పుట)

1 10 5 ఫోడార్ (1973) ఒక వ్యాసమున100 అర్థభేదముల నడుమ గల పరస్పర సంబంధములు తార్కికముగ గుర్తింపబడుట కష్టము ఇంతవరకు అర్థపరమైన సమస్యల నన్నింటిని గుర్తింపగల తర్కము కనిపెట్టబడలేదు అట్టి తర్కమేదియో చెప్పుటయు కష్టమే (పుటలు 198-294) అని అభిప్రాయపడెను.

1 10 6 తత్త్వశాస్త్ర పరిశోధకులు కొందరు భాషపై వ్యాసములు వ్రాసిరి H G Alexander (1967) పరిశీలననుసరించి[101] భాషా వ్యవహార మున మూడంశములున్నవి 1 వక్త (అనువక్త) 2 శ్రోత (అనుశ్రోత) 3 విషయము (మొదటి రెండంశములు సామాజికభాషాశాస్త్రజ్ఞులు గుర్తించినవే) విషయము చతుర్విధమా ఒకటి వస్తు భావసంఘటనాత్మకము రెండు వక్తృ శ్రోతృగ్రహణ సంబంధి మూడు శబ్దజాలము నాల్గు ఉభయుల అనుభవము ఇట్టి సంశ్లిష్టాంశములను అతడు సూత్రీకరించుటకును ప్రయత్నించినాడు (పుటలు 13-16)

1 10 7 తర్క (లాజిక్) దృష్టితో పరిశీలించినవారిలో H P Grice (1968)[102] ఒకరు వక్తృ వాక్య పదార్థములను భిన్నభిన్నముగ గుర్తింపవలసిన యవసరముగలదని ఇతని వాదము ఒక వాక్యము వాచ్యార్థమును మాత్రమే కాక అర్థాంతరమును ప్రతిపాదించుననుటను సూత్రీకరించియున్నాడు వక్త ఒకటి చెప్పును శ్రోత యొకటి అర్థము చేసికొనును అది వక్తభావించిన అర్థము కానక్కరలేదు

ఒకడు వర్షించుచున్నది అని చెప్పును శ్రోత వర్షించుచున్నదనుటను నిర్ధారణముగ భావింపనవసరములేదు నిర్ధరించుకొనియే వక్త చెప్పుననియులేదు చెప్పునను వస్తుభావము లట్లే యుండనక్కరలేదు కావున పదవాక్యార్థములు, వక్తృ వివక్షితార్థములు పృథక్త్వమును కలిగినవని అతని నిరూపణము (పుట 6 )

1 10 7 1 న్యాయశాస్త్రమున 'suggestio falsi' అను పరిభాష యున్నది దీనికి వ్యతిరేకము suppressio veri Suggestion of an 'untruth false statement as opposed to suppression of truth[103]

ఆధునిక న్యాయ తర్కశాస్త్రములందు సత్యమును అసత్యముతోకాక అసత్యమని మనము గుర్తించుదానికి భిన్నమైనదానిగా గుర్తించుచున్నాము కావున న్యాయము నిరూపణ (ఎంపిరికల్) మైనదితప్ప, ధర్మము (స్వాభావికమైనది) కాదు ఈదృష్టితో శబ్దము బోధించునది ఒక వస్తువును కాదు భావమును కాదు ఇతర వస్తుభావ ప్రపంచముతో భేదములను అందుకే Blumberg (1976) తార్కికదృష్టి తో[104] శబ్దము ద్వారముననేగాక ఇతర సాధనముయను అభిప్రాయనివేదకములు కావున భాష శబ్దసంకేతమయమనుట ఎట్లు? అని ప్రశ్నించెను ఇతడే మరియొకచోట వాక్యనిర్మాణమునకు దాని ప్రయోజనమునకు (అనగా అర్థమునకు) నిత్య సంబంధము లేదనియు వాదించినాడు (చూ పుటలు 7 -77)

Wittgenstein మున్నగు తార్కికులు చేపిన ప్రతిపాదనలు ముందు ప్రదర్శింపబడుచున్న మహామభట్టువాదముల[105] కన్నను భిన్నము కాకపోవుట వలన క్రింది వివరణ చాలు

భాషా పరిశీలకులందరు శబ్దమును భాషాసంకేతముగ గ్రహించక పరిశోధన చేయుట అసాధ్యము శబ్దమనగా నేమి? అని ప్రశ్నించుకొనుటలోనే తార్కికులు ఇతర శాస్త్రములతో విభేదించిరి కావున ఇట్టివాదములు చేసిరి

1. 10 8 Geofrey Leech (1975) అర్థములు ఏడురకములని చెప్పెను 06

1) conceptual meaning
2) connotative meaning
3) stylistic meaning
4) affective meaning
5) reflected meaning
6) collocative meaning
7) thematic meaning

(Semantics, p 15 1975)

ఈ ఏడు రకములుగా విభజించుటలో 56 ఉపవిధములును చూపినాడు కాని ప్రధానముగ అర్థములు మూడు రకములనినాడు

I conceptual (1)
II associative (2—6)
III thematic (3 & 7)

ఇతడు వ్యంగ్యమును 2 (associative) గా భావించియుండుట గుర్తింపదగి నది 107 II వ్యంగ్యము నతడిట్లు నిర్వచించెను What is communicated by virtue of what language refers to (p 16) ప్రస్తుత విశ్లేషణలో లాంగ్వేజ్ అనగా వాక్కు కావున వ్యంగ్యము వాగ్వ్యాపారజనిత మనబడినది 3 భాష ఉపయుక్తమగు సాంఘిక సందర్భములవలన ఏర్పడు అర్థవిశేషము 4 వక్తృభావమును అనుభూతులను వ్యంజించెడి అర్థము 5 ఒక వాక్యము వ్యంజించెడి రెండు భావములలో ఒకదానిచే మరియొకదానిని బోధించు అర్థము 6 అసంబద్ధమగు ఒక పదప్రయోగముచే బోధింపబడు అర్థము

ఇందు 3 4 సామాజిక శాస్త్రమునను, ( ఫర్త్ సిద్ధాంతమునను స్పృశింపబడినవి 5 భాషాశాస్త్రముననే క్రొత్తది లిచ్ కూడ వివరింపకయే వదలినాడు 10 I వాచ్యార్థవిషయము III కాకువుకు సంబంధించినది

1 10 9 వాక్యార్థము వాక్యభావము భిన్నములని గుర్తింపబడుచు వచ్చినను వాక్యరూపము వాక్యప్రయోజనము భిన్నములుగ నుండుట 'శైలీ' సంబంధ కారణముగనని G W Turner (1975) ఒక వ్యాసమున ప్రతిపాదించినాడు 109 అతడిచ్చిన యుదాహరణము—

I wonder if you could tell me the time (p 14)

పై వాక్యము నిర్మాణ దృష్టితో ఒక నిర్ధారణము కాని ప్రయోజనము ననుసరించి ఒక ప్రశ్న ఇట్టివానిని గర్భితప్రశ్న (loaded questions) లని అతడు వర్గీకరించెను 110

1 10 10 శిశుభాషను గురించిన పరిశోధనవలనకూడ శబ్దార్థములకు సంబంధించిన నూతనాంశములు తెలియుచున్నవి Jean Piaget తో మొదలయిన శిశు ఆలోచనావిధానము వాగుత్పత్తి అర్థము—వీని మీమాంస ఈనాడు భిన్నకోణములందు సాగుచున్నవి 111 ద్రావిడభాషలలోని మాతృపితృవాచకములనాధారముగ ఈవ్యాసకర్త అప్ప/అమ్మ అన్న రూపములకు వాచ్యార్థములు లేవనియు కేవలము అవి భావవ్యంజకములనియు నిరూపించియున్నారు (చూ బ్రహ్మానంద 1980, a b)112 మరియొక వ్యాసమున శిశువాక్కునగల లక్షణావృత్తి (met phor) ని గురించిన వివరణమున్నది (చూ బ్రహ్మానంద 1981)113 ఈపరిశీలనములనుబట్టి శబ్దార్థనిత్యత్వవాదమును గూర్చిన ఒక సమగ్రవ్యాఖ్యానముయొక్క ఆవశ్యకత గుర్తింపబడుచున్నది

Piaget (19-2) పరిశోధనమున రెండంశములు గుర్తింపబడినవి

1) శిశువుల ఆలోచన అతార్కికము స్ఫురణాత్మకము (autistic)

2) వృద్ధుల ఆలోచన తార్కికము బౌద్ధికము (intellectual)

Roman Jokobson (1971) పరిశీలనయందీ అంశములు నిరూపించబడినవి భాషయందు శబ్దములర్థవిహీనములయ్యు భావప్రదర్శకములు కావచ్చుననుట స్థాపింపబడినది 114

1 10 10 1 ఇటీవల కొందరు vocal style అను అంశముక్రింద శబ్దమునకున్న ఈభావప్రదర్శక శక్తిని గూర్చి వ్రాయుచున్నారు దీనికి కారణము ఇది

The mouth is a tool which is more closely connected with and which conforms more closely to infernal powers than do the eyes'

(Q Thomas Mann in Ivan Fonagy in
Chatman (ed) 1971 p 161)

దీనికి నిదర్శనముగా వక్తృవివక్షాపూర్వకమైన ఉచ్చారణ విధానమొకటి ప్రదర్శింపబడినది

పారిస్‌నగరవాసులు [ఎ] అనుటకన్న [ఎ] అనుటను సభ్యముగా గుర్తింతురట నోరుతెరచి మాట్లాడుట సభ్యతకాదని వారి ఊహ

10 10 2 వాగ్వ్యాపారము నందొక దాంపత్యధర్మ (sexual principle) మున్నది—అది జీవశక్తిపొందు ఆవిర్భావ తిరోభావములకు సంబంధించినది ఆవిర్భావము కండరముల, నరముల tension గాను (శబ్దము) తిరోభావము వాటి 'release గాను (అర్థము) ఊహించినచో వాగ్వ్యాపారము నందుగల భావనీయకశక్తికి వెనుకగల వ సఎక భౌతికసమన్వయము గుర్తించవచ్చునని Fonagy వాదించుచున్నాడు [115] కావ్య వాక్కున నీప్రక్రియ ఛందముచే లయింఎబడి (death principle) శబ్దార్థము బంధింపబడుచున్నవనియు అతని వాదము (చూ పూర్వవ్యాసము పుటలు 170 171)

The poet must express by the same language that everybody uses something that he does not know, and that expression would be imp ssible if there did not exist the second language offered to him by verbal style'

(Fonagy op cit p 17ı)

స్వప్నము మానవుని మనోవ్యాపారదశలను సమన్వయించుచున్నట్లుగా కావ్యత్వము వాక్కునకున్న భిన్నభావనాదశలను సమన్వయించుచున్నదనియు ఇతడభిప్రాయపడినాడు (అదే పుట) [116]

ఇట్లు all articulated sounds are expressive (p 162) అనియు ex-pressive గ ఉండెడి శిశువులోని archaic ago [117] babblingదశనుదాటి

వృద్ధవ్యవహారముగామారి denotative గా పడుచున్నను expressive గ మిగిలియున్నదని Fonagy అభిప్రాయము (పుట 1~0)

1 10-11 ఇన్ని అభిప్రాయములు సంకరములగుచున్న ఈనాటి భాషా శాస్త్ర వాతావరణమున ఆంధ్రదేశమునను కొందరు వ్యంజనను గూర్చి పరిశీలించుచున్నారు

కృష్ణస్వామి (19 6) ఒక వ్యాసమున[18] ఇట్లనిరి

Is not it true that if a text like the Ramayan or Mahabharat or the Bible appeals to everyone there must be some universals and universal tendencies in the texts expressed and suppressed' (p 1)

విశ్వసామాన్యముగ అందరినాకర్షించు ఒక భావమునకు ఉదాహరణమును వారు చూపిరి

'eccome! said he
umm! sa d she
you are divine! said he,
you are mine! said she

— Cummings

పైపద్యమున he 'she లు నిర్దిష్ట వ్యక్తుల నుద్దేశింపక విశ్వపురుషస్త్రీ సామాన్యవాచకములు కావున అందరి నాకర్షించును ఇట్టిదే మరియొక ఉదాహరణము—

'I wandered lonely as a cloud'

పై వర్డ్సువర్తు పద్యము ప్రకృతి కవిత్వమని అందరనుకొందుము అంది మహా

తా త్త్వికదశలు వ్యాఖ్యానించవచ్చుననుచు అది పరమశివుని ప్రళయతాండవమును తాకుచున్నదనిరి

may also be interpreted as a nature poem that has a mystic element in it (at the inner level), perhaps about cosmic dance, the dance of Lord Shiva if you like (p 5)

‹నేటి పండితులకు ఇట్టిపద్ధతి నచ్చకపోవచ్చు వర్డ్సువర్తు భారతీయమైన ఇట్టి రహస్యములెట్లు నిబంధించెనని ప్రశ్నించవచ్చు, అది విమర్శకులపని కాని ఇట్టి పద్యమందరికిని నచ్చుటకు కారణమేమనుటకు సమాధానము మీవద్దలేదు (పుట 5) అని కృష్ణస్వామిగారి చమత్కారము (మీవద్ద — భాషాశాస్త్రజ్ఞులవద్ద నని వారిభావము) దీనికి వర్డ్సువర్తు సమాధానమున్నది

I was often unable to think of external things as having external existence and I commenced with all that I saw as something not apart from but inherent in my own immaterial culture

కృష్ణస్వామిగారి వ్యాసము ప్రస్తుత సిద్ధాంతదృష్టితో భాషాపరిశీలనమున ఒక మైలు రాయి ప్రశ్నములు వేసినారు కాని సమాధానము లేదు

the significant generalisations about linguistic universals must be captured

అని ఛామ్‌స్కీ ప్రభృతుల ఆశయము ఆ ఆశయము నెరవేరుటకు పరాకాష్ఠ impression through suppression' అన్న అంశమును గుర్తించుట అని కృష్ణస్వామిగారి వ్యాసమునగల అభిప్రాయము 119 కావున వ్యంజన సూత్రము పరిశీలింపదగినది 120

## 1 10 12 స్టైలిస్టిక్స్ — అర్ధపరిశీలనము

ఇంతవరకు చూపిన భిన్నమార్గములలో పరిశోధనములు సాగించుచున్న వారందరును కావ్యత్వమనగా ఏమియనుప్రశ్నమునువేసికొని style అను అంశముక్రింద పరిశోధించుచున్నారు శైలియని శైలిశాస్త్రమని అసమగ్రములగు అనువాదములున్నను art of composition అను సువిశాలార్థముగల style కావ్యతి'మను అనువాదమునకే తగినది 1969 లో Villa Serbelloni లో బరిగిన ఒక పండిత సదస్సు ఏకగ్రీవముగా ఆమోదించిన విషయములు రెండు 121

1) Stylistics—Linguistics లో భాగముకాదు

2) Style ని గురించి చెప్పుటకీనాటి భాషాశాస్త్రసంప్రదాయము లందేదియును సమర్థముకాదు

(See Chatman s Introduction to Literary Style p XIV item 3 )

ఈనాడు కావ్యభాష వ్యవహారభాషకంటెను భిన్నమా ! వక్రతయనునది కావ్యభాషకొక లక్షణమా! కావ్యవాక్యము అవక్రముగనుండరాదా! భాషలోని కావ్యత్వమే విలక్షణమగునదా! అను ప్రశ్నములు సమాధానము దొరికీ, దొరకనివిగా మిగిలియున్నవి పండితులు వారికితోచిన సమాధానములు వారు చెప్పుచున్నారు వీరియందరి అభిప్రాయములు Stephen Ullmann చూపిన ఈపాటతో 122 సమన్వయించుచున్నవి

Stylistics is the study of what is extra-logical in language
(Q Fernandez Retamar in Chatman ed pp
133 & 156 fn 6)

ఈ అతర్కితలక్షణములు కావ్యభాషయందేగాక, వ్యవహార భాషయందును గలవనుట ఈనాడు చాలమంది గుర్తించుచున్న విషయము అందుకే 'semantics ని గురించిన మీమాంస జరుపునపుడు భాషలో ప్రతిదశలోను కావ్యత్వలక్షణ (stylistic counterpart) మును మినహాయించిచేయుటకు వీలు లేదు ఉదాహరణమునకు పర్యాయపదములు, అనేకార్థక పదములు ధ్వన్యను కరణరూపములు ద్వితీయార్థగ్రహణములు, మున్నగునవి వ్యవహారమున సాధించుచున్నదీ కావ్యత్వలక్షణమునే కావున అర్థవిజ్ఞానముయొక్క సమగ్రత వ్యవహారమునగల కావ్యత్వమును గుర్తించుటలోనేయుండునని Ullmann అభిప్రాయపడినాడు (పై వ్యాసము)

1 10 12 1 ఈవ్యాసమున ప్రతిపాదింపబడుచున్నట్లే (వ్యంజన వాగ్వ్యాపారమని, కావ్యవ్యవహార భేదములిందు ప్రసక్తములు కావన్నట్లు) కావ్యత్వము భాషలోని ఒక ప్రత్యేకవర్గము (genre) కాదనియు కేవలము వాగ్వ్యాపారదశలో ఒక భేదము మాత్రమేననియు Halliday వంటివారు వాదించుచున్నారు [123]

' The characterisation of stylistics as a discipline concerned with the study of the language of literature is thus trivial
(Hasan, in Chatman (ed) p 301, 1971)

అట్లే ఈసిద్ధాంతవ్యాస ప్రయోజనముకూడ కేవలము కావ్యభాషాస్వరూప పరిశీలనముకాదనుట గుర్తింపదగినది కాని ఒకభేదము ప్రాచ్యపాశ్చాత్య విలక్షణముగా గుర్తింపదగియున్నది. పాశ్చాత్యమున శ్రోతను ప్రభావితముచేయుటయే Rhetoric ప్రయోజనము Style నిర్వచించుటలోకూడా ఈప్రభావమున్నది (See Rene Wellek p 72 in Chatman ed 1971) [124] కాని భారతీయమగు ఆలంకారిక పరిశోధనమున ఆసమస్యలేదు కారణమీసర్వంతీ వాగ్వ్యాపారము నాశ్రయించియుండుట

## 1 11 ఆధునిక సూత్రపద్ధతి—వ్యంజన

ఈసిద్ధాంత వ్యాసమున 'సూత్రము' rule అను భాషాసిద్ధాంతపరిభాషా దృష్టితో కాకుండ అంతర్నియమ (underlying principle) మనునర్థమున వాడబడినది [125] కావున ఇది భాషాతత్త్వ సంబంధి నియమముగా వివక్షింపబడుచున్నది మనకు పరిచయమున్న భాషాశాస్త్ర సంప్రదాయములలో పరివర్తన సిద్ధాంతము వ్యవహర్త (speaker) ను 'భాషానిర్మాణమును సూత్ర (rule) రూపమున జీర్ణించుకొనినవానిగా గుర్తించుచున్నది [126] ఆసిద్ధాంతము ననుసరించువారు సూత్రీకరణమును రెండు అంశములక్రింద భావించిరి

1) నిర్మాణము (structural description)

2) ప్రక్రియ/పరిణామము (structural change) [127]

ఈదృష్టితో జాతీయములను, లాక్షణికార్థములు కలిగినపదములను సూత్రీకరించుటకు కొందరు ప్రయత్నించుట చూడబడినది

ధ్వని సిద్ధాంతమున అంతర్గతముగానున్న వ్యంజన ప్రక్రియను అట్లు సూత్రీకరించుటకు వీలగునేమో ప్రయత్నింపవలసియున్నది ఇచ్చట రెండు ఆటంకములున్నవి

1 ఇంతదనుక ప్రసిద్ధమైన సూత్రనిర్మాణము భాషాగతవర్ణ పద వాక్యాది శాబ్దికాంశములకు సంబంధించినది అర్థమునుగూర్చి పరిశీలించునపుడును శబ్దగత పరిణామముల నాధారముగనే సూత్రనిర్మాణము జరుగుచున్నది అనగా శాబ్దికమగు మార్పు లేనపుడర్థశబ్దముల సంబంధమునుగూర్చిన సూత్రనిర్మాణము చేయుటకు వీలులేదు [128]

క్రింది వాక్యమున వాచ్య (denoted) వ్యంగ్య (suggested) అర్థములు రెం డును వక్తృశ్రోతృ సంబంధము నుబట్టి వ్యాఖ్యానించుటకు వీలున్నది

'మా కోడలికింకా తెల్లారలేదు' (చూ అనుబంధము 3)

వ్యంజన వాక్యనిర్మాణ భేదములను ఆశ్రయించినదికాదు. మానసిక భౌతిక ప్రక్రియా సమన్వయరూపమైనది భౌతికమగు శబ్దము—మానసికమగు అర్థము వీని నడుమగల జన్యజనకరూప ప్రక్రియాసూత్రము వ్యంజన,[129] కావున దీనిని వివరించుటకు మరియొక ప్రణాళిక కావలసియున్నది (అది ద్వితీయాధ్యాయమున ప్రయత్నింపబడినది)

2 వాచ్య వ్యంగ్యముల నడుమ చారిత్రక పరిణామములేదు ఒకనాడు వాచ్యముగనుండి మరియొకనాడు వ్యంగ్యముగునదిలేదని అర్థము—కావున ఇచ్చట చారిత్రిక సూత్రములవంటివి కుదరవు

ఏ ధ్వనిపరిణామము[130] *K — c-/-f v (in Telugu)

బి అర్థపరిణామము—అవధాని[131]

1) అవధానము చేయువాడు, (అవధానతగలవాడు)

2) ఇంటిపేరు (generalisation)

ఒక కాలమున పండితులు లక్ష్యార్థముకల్గిన పదములే కాలక్రమమున ముఖ్యార్థకములైనవనిరి (చూ వ్యం సూ 2 6) కాని ఇది దోషమనియు metaphorical period [132] అన్న చారిత్రికదశ లేదనియు అది అర్థవ్యాపార, మనియు సిద్ధాంతీకరించిన పాశ్చాత్యులే ఉన్నారు వ్యంజన విషయమునను చారిత్రికదృష్టి పనికిరాదు

కారణములు రెండు గలవు 1) వ్యంజన నిత్యవ్యవహారగత (వక్తృ శ్రోతృ ప్రాధాన్యము కల్గినది) మగుట 2) వక్తృశ్రోతృగతముగను వివేకమునకు సంబంధించిన అనుమాన సంబంధి గాక సహృదయస్ఫురణకు సంబంధించినది కావున సర్వపద సాధారణమును, నియమపూర్వభావితమును కాకుండుట (పై కారణములు ద్వితీయాధ్యాయమున సమగ్రముగ వివరింపబడును)

ఈ హేతువులవలన చారిత్రక సూత్రనిర్మాణము కుదరదు

3 ఈ శాస్త్రజ్ఞులేకాక మరికొందరు భాషోపయోగమును దృష్టియందుంచుకొని సూత్రములు వ్రాసిరి ఇవి ప్రాథమికములైన ఆలంకారికాంశములందు జరిగినది ఉదాహరణమునకు ఒకచోట Synonymy ఇట్లు సూత్రీకరింపబడినది 133

The sentence ((a)) is for the person $P_l$ in the kind of situation S1 synonymous with the sense (or designation) ((b)) for the person Pm in the kind of situation Sn

S (a $P_l$ $S_j$ b Pm Sn)

(Arne Naws p 248, 1958)

పర్యాయ పదములవలన సిద్ధించు అర్థములు రెండును వాచ్యములే ఇరువురు గ్రహించు భిన్నార్థములు వ్యంగ్యానుభవమిట్టిది కాదు ఒకనికే వాచ్యముతో పాటు కలుగు మరియొక భావానుభవము. ఇది వాక్యదశకే కాకుండ వాక్యసమూహదశకుకూడ సంబంధించినది కావున నీపద్ధతియు కుదరదు

4 వక్తృశ్రోతృ విషయములను దృష్టియందుంచుకొని H G Alexander వంటివారు సూత్రనిర్మాణము చేసిరి.134 లక్ష్యార్థములను బంధించుటకు ప్రయత్నము చేసిరి ఆసూత్ర మిట్లున్నది ఇదియు వాక్యదశకే పరిమితము

E—C— { S, R — Term
( x x x x x x x x x x )
Extension of the term

E = Experience — S = Symbol
C = Concept — R = Referent

(Alexander p 77, 1967)

పైనాల్గు దృష్టులతోగాక తాత్త్వికదృష్టితో వ్యంజన నాధారముగా భాషను పునర్నిర్వచించుచున్న ఈవ్యాసమున — భాష భావాభివ్యక్తిగ సూత్రీకరింపబడినది ఇచ్చటగల సూత్రపదమున కర్థము భారతీయ శాస్త్రములందు ప్రసిద్ధము ఆధునిక భాషాశాస్త్రమున ప్రసిద్ధముగాదు శబ్దార్థ వ్యాపార దృష్టితో ఈ ప్రయత్నము కొంతవరకు సంకేతవాదము (semiotics) ననుసరించువారు చేసిరి ఇది వ్యంజనకు సన్నిహితముగ నున్నది

## 1 12 భాషావిజ్ఞానము — సంకేతవాదము

ఇంతదనుక ఆధునిక భాషావిజ్ఞానముగ పరిగణింపబడినదంతయు బ్లూమ్‌ఫీల్డు తరువాతి వాదమే ముందక్కడక్కడ చూపబడినట్లు అమెరికాదేశీయుల నిర్మాణ వాదమునకు క్రమక్రమముగ జరిగిన సవరణలు ముఖ్యముగ అర్థదృష్టితో ఏర్పడినవనుట స్పష్టము అర్థదృష్టి సాహితీ విమర్శకులకు, మన తత్త్వశాస్త్రజ్ఞులకు, తార్కికులకు, తాత్త్వికులకు చాల ప్రధానము అందువలననే బ్లూమ్‌ఫీల్డు కాలమునుండి వృద్ధియైన ఈశాబ్దికదృష్టిని రిచర్డ్స్ బార్‌ఫీల్డ్ వంటి పాశ్చాత్యులును అరవిందుని వంటి భారతీయులును తీవ్రముగ విమర్శించుచు వచ్చిరి[135] ఆయాపండితుల తాత్త్విక దృక్పథములతో వారువారు విమర్శించుచున్నను భాషాశాస్త్రజ్ఞులొక శాఖగా పరిధులేర్పరచుకొని పరిశోధనలు చేయుచువచ్చిరి[136]

1 12 1 ససూర్ దృష్టిలో సంజ్ఞ (సైన్) లను గురించి చర్చించు శాస్త్రము మానవికవిజ్ఞానమున భాగముగ జెప్పవలయును ఈశాస్త్రము నతడు సెమీఎయాలజీ (semisiology) అని పిలిచెను (Gk semeion = sign) మానవోచ్చరిత సంజ్ఞలు ప్రపంచమునగల ఇతర జంతువస్తు సంజనిత శబ్దజాల ములో సంబంధము కల్గినవి కావున భాషాశాస్త్రము సంకేతశాస్త్రములో భాగమని ససూర్ వాదము 137

1 12 2 ససూర్ అభిప్రాయము నంగీకరించినచో పశువుల అరపుల నుండి రససిద్ధాంతమువరకు అన్నిటిని సెమిఎయాలజీ లో భాగముగ గ్రహింప వలయు యుండును 138 ఇట్లు గ్రహించి పరిశోధించినవారె 'semiologists అని పిలువబడిరి ఈదృష్టితో వాక్కు సంజ్ఞ (సైన్) సంకేతము (సింబల్) కాబ ససూర్ వాక్కును శబ్దార్థసమాహారముగ భావించెనని ముందు చెప్పబడి నది దీనిని గురియించుంచుకొనియే శబ్దార్థదశలందు భాషా పరిశీలన జరుగవలె నసెను ఈపద్ధతిని కొందరు సెమియాలజీ అనియు మరికొందరు 'సెమియా టిక్స్ అనియు వ్యవహరించిరి. 139

సెమియాటిక్స్ స్వరూప స్వభావాదులింకను శాస్త్రీయముగ రూపొందింపబడక పోయినను ఒక ప్రణాళిక మాత్రము Ronald Barthes చేత ఏర్పడమయినది 140

1 12 3 బార్తెస్ పరిశీలన చాల సూక్ష్మమయినది ససూర్ ఎంస్లేవ్ లాకన్ మున్నగువారి పరిశీలనలు ఇతని గ్రంథమున సమన్వయమునొందినవి 141 వాగ్రూపము పొందని సంజ్ఞలేనందున లింగ్విస్టిక్స్‌లో సెమియాలజీ భాగముగ గ్రహించుటతో ససూర్ అభిప్రాయమునకు చక్కని సవరణ ప్రతిపాదింప బడినది 142

1 12 4 బార్తెస్ ప్రణాళిక నాల్గంశములక్రింద విభక్తమయినది.

1) Language and speech
2) Signified and signifier
3) Syntagm and system
4) Denotation and connotation
(Elements of Semiology E S p 14 1967)

వ్యంజన సూత్ర దృష్టితో 2, 4 అంశములు ప్రధానములు అందులో 1, 3 అంశములు గతార్థములగును

1 12 5 సంజ్ఞ-శబ్దము (sign vs linguistic sign) ససూర్ sign లో signifier signified కలిసియుండునని భావించెను భిన్నభిన్న శాస్త్రకారులు sign — signal — index — icon — symbol—allegory అను పదములను వాడుచున్నారు ఇన్నిట కనిపించు సమానలక్షణ మొకటున్నది రెండంశములన్వయము పొందుట ఒక చెట్టున్నది అదియొక వస్తువు జీవమున్న అజాంతవపదార్థము అనగా చెట్టు' / cettu / అన్న అజ్ఞల్సంయోగ శబ్దరూపముచేత (ఇదొక అంశము) బోధింపబడుచున్న ఒక అంశమని అర్థము కాని పై పర్యాయపదములను సూక్ష్మతరముగా హెచ్ వాలెన్ 143 విభజించెను (పుటలు 175-200)

signal / index లలో మానసిక సత్యము లేదు మొదటిది ప్రత్యక్షము వాస్తవికము రెండవది సూచకము మాత్రమే

symbol / sign లలో మానసిక సత్యమున్నది ఇట మొదటిది సామ్యజనితము అసమగ్రము రెండవది నిత్యము సమగ్రము (బార్తెస్ పుట 38)

కావున భాషలోని వాక్కు నిత్యము సమగ్రము అయిన మానసిక సత్యము ఇది శబ్దేతర అభిప్రాయ నివేదన సాధనములతో భాషను పోల్చిచూచుటవలన ఏర్పడిన ఒక పరిజ్ఞానము

## 1 12 6 శబ్దార్థము సంజ్ఞితము
(linguistic signified vs semiological)

ఆధునిక భాషాశాస్త్రమున వాక్కు గుర్తింపబడనందున అర్థము పరిశీలనకు అతీతమని అయోగ్యమని అభిప్రాయములు ఏర్పడినవి (చూ బార్తెస్ పుట 44) కాని సంజ్ఞితమును గురించి పరిశీలించినవారు గుర్తింపక తప్పలేదు 1) సంజ్ఞితము శబ్దరూపమును పొందవచ్చును పొందకయుండవచ్చును 2) సంజ్ఞితము వ్యాప్తి గుణమును కల్గినది 3) ప్రతి సంజ్ఞితమునకు దేశ కాలబద్ధములగు వ్యాఖ్యానములుండును భాషాశబ్దమునకును 2 3 గుణము లున్నవి కాని అవి శబ్దమును వీడిలేవు ఈయనువిద్ధత హేతువుగా శబ్దము వస్తువుతో సంబంధించినది కాకపోయినను అర్థముతో నిత్యసంబంధము కల్గినదానిగా గుర్తింపగలుగుచున్నాము (బార్తెస్ పుటలు 42 46)

## వస్తువు (The signifier)

వస్తువనగా ఉండునది (<vas = to be) చెట్టు ఒక వస్తువు శబ్దము కూడ శబ్దముకూడ వస్తువే వస్తువు బోధించునది భావము వస్తువు చెప్పని భావముకాని భావము చెప్పని వస్తువుకాని లేదు కావున ధ్వనులు కాని, వస్తువులు కాని, ఊహలు కాని, వస్తువులే (చూ పుటలు 47-48)

## భావము (The signification / semiosis)

భావమనగా పుట్టునది (bhu = to be born) శ్రవ్యతను దృశ్యతను కల్గినది సంజ్ఞ భావమొక ప్రక్రియ భావమువలన శబ్దార్థములు బంధింప బడుచున్నవి భావముతోడి సంబంధము వస్తువునకెట్లున్నదనుటలో అభిప్రాయ భేదములున్నవి

1) ససూర్ — భావము = శబ్దము / అర్థము (అనువిద్ధత)

2) ఎంస్లేవ్ — భావము = శబ్దము — సంబంధము — అర్థము (వ్యాపారము)

3) లాకన్ — భావము = వస్తువు / అర్థము (వస్తుబోధ)

4) బార్తెస్ — భావము ≡ అర్థము ≡ సమన్వయతి (శబ్దము — అర్థము)

(బార్తెస్ పుటలు 48 51)

ఒక వస్తువు భావమునెట్లు బోధింపగలుగుచున్నది ఇదియే ప్రశ్న శబ్దార్థముల నడుమను వేసికొన వీలున్నది సస్యూర్ శబ్దార్థముల మధ్య సంబంధము యాదృచ్ఛికమనెను—(ఇది నిర్మాణ దృష్టితో) Benviste ఒకచోట యాదృచ్ఛికత శబ్దమునకు వస్తువునకు నడుమ తప్ప శబ్దమునకు అర్థమునకు నడుమ కాదనినాడు 144

ససూర్ దృష్టియందును వాక్కు కేవలము శబ్దమేకాదు అర్థముతో కూడినది కావున భాషలోని యాదృచ్ఛికత వస్తుశబ్దముల నడిమిదే భాషాపరిశీలకులను ధ్వన్యనుకరణ శబ్దము (onomatopoetic sounds) లున్నవనిరి ఇక్కడున్న సంబంధము (motivation) ప్రత్యక్షము వ్యాకరణాంశముల నడుమ సంబంధమువలనను (grammatical motivation) ఈ యాదృచ్ఛికత సహజతగా భాసించుచుండును 145

the linguistic sign is arbitrary a priori and non arbitrary a posteriori'—Levi Strauss (quoted in E S p 51)

కాని వస్తువునకు భావనుతోనున్న సంబంధమును వ్యాఖ్యానించుటయందును విట్టి సమస్యలున్నవి [146] ఉదాహరణమునకు పశువుల అరపులు. చేష్టయు శరీర నిర్మాణశాస్త్రజ్ఞులు ఒక విషయమును కనిపెట్టిరి తేనెటీగ తేనెయున్న ప్రాంతమును సూచించుచు నాట్యము చేయును ఇంతవరకు నాట్యమనుక్రియ తేనెయున్న ప్రాంతమును సూచించునదిగా సంబంధిత సంజ్ఞయగుచున్నది కాని ఆ నాట్యము 8 అంకెవలె సుళ్ళుతిరుగును తేనెయున్న దూరమునదెట్లు సూచించును ప్రశ్నవేసికొని కొందరు దానినే వస్తుభావముల నడిమి యాదృచ్ఛికతగా భావించిరి (చూ హాకెట్ 1958, అధ్యాయము 64—పుటలు 570-571 మరియు బార్తెస్ పుట 52 మౌనిన్ మాటలుగా) [147] కాని సంకేతవాద దృష్టితో 'meaning is articulation (అర్థమే శబ్దము)అని అంగీకరింపబడినది కావున (బార్తెస్ పుట. 58) దర్శన శ్రవణములు సంకేతములలో నిమిడియుండుటవలన వాగ్రూపముగను వాగనపేక్షితముగను భావమే సృజింపబడుచున్నది.—అనుభూతమగుచున్నది[148] అని బార్తెస్ అభిప్రాయము (పుట. 54)

## 1 12 7 వాచ్య వ్యంగ్యార్థములు

## (Denotation and Connotation)

బార్తెస్ రెండుపద్ధతులలో భావము (సిగ్నిఫికేషన్)ను పరిశీలింపవచ్చుననెను

1) $\frac{E}{ERC}$ RC — In the first case the first system (ERC) becomes the plane of expression or signifier of the second system'

2) ER $\frac{C}{ERC}$ — In the second (opposite) case of derivation the first system (ERC) becomes not the plane of expression as in connotation, but the plane of content, or signified of the second system

(E S pp 89-90)

E = expression (శబ్దము/వస్తువు)
R = relation (వ్యాపారము)
C = content (అర్థము / భావము)

మొదటిదశ కావ్యభాషయందు రెండవదశ శాస్త్రభాషయందు కనిపించుచున్నవి. వీనిని వివరించి సిద్ధాంతములు చేయలేదు కాని ముఖ్యాంశములు మాత్రము సూచింపబడినవి

Connotation, being itself a system, comprises signifiers and the process which unites the former to the latter (signification) and it is the inventory of these three elements which one should undertake in the first place for each system (E S p 91)

వ్యంజన వ్యాపారమని చెప్పిన ఆనందాభినవులకు అత్యంత సన్నిహిత ప్రతిపాదనము ఇచట శబ్దము - అర్థము - వ్యాపారములు ప్రతిపాదింపబడినవి (రెండవ అధ్యాయమున ఈయంశములే వివరింపబడును)

1 12 8 ఇతనిచే వ్యంజక శబ్దార్థముల స్వభావము కూడ వివరింపబడినది

వ్యంజక వాక్కు (signifiers of connotation) అభిధావాక్కు (signs = signifier + signified) లే వ్యంజకములుగను మారును వాచక శబ్దార్థములనేకములు కలిసి ఒకే వ్యంజక వాక్కుగా వ్యవహరించుటగలదు అపుడు వ్యంగ్యార్థమొకటిగనే యుండును కావున వాచ్యవ్యంగ్యముల నడుమ రూపపరిణామ సామ్యముండనక్కరలేదు ఇట్లు వ్యంగ్యము వాచ్యమును ఆచ్ఛాదించు (caps) చున్నను, వాచ్యము పూర్తిగ నశింపదు కావున వ్యంజక వాక్కు అచ్చటచ్చట కనిపించుచుండును 149

వ్యంగ్యార్థము (The signified of connotation) వ్యంగ్యార్థము సాధారణము విశ్వజనీనమైనది పరివ్యాపకమైనది మరియు చెప్పవలసినచో తత్త్వసూచిక—(a fragment of ideology)

'ఫ్రెంచి' అనునది వ్యక్తమగుచున్న ఒక భావము (వ్యంగ్యార్థము) ఫ్రెంచి భాషలో కూర్పబడిన అనేక వాక్యములను పరిశీలించినచో తెలియనది—ఇవి ఫ్రెంచి' యని

ఇట్టిదే ఒక గ్రంథమును సాహిత్య'మనుకొనుట సాహిత్యము ఒక వ్యంగ్యార్థము దానికి గ్రంథమొక బాహ్యస్వరూపమనుకొనవచ్చును వ్యంగ్యార్థములు ఒక జాతియొక్క సంస్కృతీ తత్త్వములకు చంత్రికు అవినాభావ సంబంధమును కల్గియుండును ఇట్లు అలంకారము (రెటరిక్) వ్యంజక వాక్య సమాహారము (ఫారమ్) కాగా, తత్త్వము (ఐడియాలజీ) వ్యంగ్యార్థముల సమాహారము అని బార్తెస్ పండితుని యుపజ్ఞ (పుటలు 91-92) అందులకే భవిష్యత్తున జరుగబోవు భాషాపరిశోధనము వ్యంగ్య (కన్నొటేషన్) మునకు సంబంధించినదని బార్తెస్ ాస్యము చెప్పగల్గినాడు 150

## 1 13 నిర్మాణవాద సమీక్ష

నిర్మాణవాద మనుమాట నిరర్థకమని కొందరనిరి 151 కాని Piaget వంటి వారు నిరూపించినట్లు మూడు లక్షణములున్నవి Hawkes సూచించినాడు 152

1) అంతస్సమగ్రత—(The idea of wholeness)

2) అంతఃపరివర్తనము—(The idea of transformation)

3) అంతర్నియమము—(The idea of self-regulation)

ససుర్ మొదలు నేటవరకు అన్నివర్గములకు చెందిన భాషాపరిశీలకులును నిర్మాణవాదులే పీలయినంతవరకు శబార్థగతాంశముల నాధారముగ భాషా నిర్మాణమును పరిశీలించినవారె వాగితరాంశములను గ్రహించుటతో శాస్త్రీయ తకు భంగము వాటిల్లునని వీరి భావము

1 13 1 కాని ఇంతదనుక చూపబడినవారిలో భాషను వాక్యాను వర్గీకరించక కొందరు విభేదించి కొందరు పరిశోధించుచున్నను అందరిధ్యేయ మ నను భాషానిర్మాణమేయున్నది ఇదియే నిర్మాణవాదమనుటకు కారణము

1 13 2 భాషను నిర్మాణదృష్టితో మాత్రము చూసిన చాలమ భాషా ప్రయోజనమున్నది సంకేతవాదుల (semioticians) ప్రయోజనము నాధర ముగనే పరిశీలించిరి కాని ఈ రెంటిని బంధించెడి అంశము ఒక పరిశోధకుడు భాషాతత్త్వమును గ్రహించెడి పద్ధతియందుండును (భారతీయులు శబార్థాద్వైతము నాధారముగనే నిర్మాణ—ప్రయోగతత్త్వములను పరిశీలించిరని ఈవ్యాసకర్త ప్రతిపాదించియున్నాడు 153 పాశ్చాత్యులలో సోక్రటీసు మొదలు నేటివరకు వీనిని వేరుచేయుట సంప్రదాయముగ వచ్చినది నోలి వాక్యము దీనికి ప్రమా ణము(చూ వ్యం సూ పుట 26) ఇట్లు ఆధునిక భాషాపరిశీలకుల ప్రయోగ విధాన ములు 'వస్త్వాశ్రయత నిరూపణక్షమత్వములను మూల సూత్రములుగా కలిగి ప్రాచీన గ్రీకుల పద్ధతులకన్నను విలక్షణములై యున్నవి

## పృథక్కరణ సారాంశము

ఆనందవర్ధనులు వ్యంజనా వ్యాపారమును అభిధా లక్షణ తాత్పర్య వృత్తులనుండి పృథక్కరించిరి వేరుచేసిరని భావము అది వారి ప్రథమోద్యోతము

కావ్యస్యాత్మా ధ్వనిరితి బుధైర్య స్సమామ్నాతపూర్వః
తస్యాభావం జగదురపరే భాక్తమాహు స్తమన్యే
కేచిద్వాచాం స్థితమవిషయే తత్త్వమూచు స్తదీయం
తేన బ్రూమః సహృదయమనః ప్రీతయే తత్స్వరూపమ్

(ధ్వ ఆ 1 1)

కావ్యతత్త్వవిదులైన బుధులు కావ్యాత్మ ధ్వనియనిరి పరంపరగా ఈయభి ప్రాయము సమ్యక్ప్రకటితము సహృదయమన ప్రకాశమానమయ్యె కొందరు దీని యభావమును వాదింతురు ఈవికల్పములన్నియు అభావవాదములే

1) కొందరు ధ్వనిలేదందురు

2) కొందరున్నను 'భాక్త' మందురు

3) కొందరున్నది అనిర్వచనీయమందురు

ఇంతవరకు ప్రథమాధ్యాయమున గుర్తింపబడిన పాశ్చాత్యవాదులలో ఈమూడు తెగలవారును గలరు — వ్యంజన' ఇక్కడి ప్రాతిపదిక

1) బ్లూమ్‌ఫీల్డు వంటి భౌతికవాదుల వాదము అభావవాదమే వీరు శబ్దమునకు అర్థమునకు ప్రత్యక్ష సంబంధమును నిరసించిరి ఆరిస్టాటిలు వీరికి ఆద్యుడు — నిదర్శనము లక్షణ (metaphor) నిర్వచనము

2) సపీర్‌వంటి మానసిక భౌతికవాదులు పాక్షికముగ అభావవాదులు కొన్ని చోట్ల ప్రత్యక్ష సంబంధము గుర్తించిరి సోక్రటీసు, ప్లాటో మతానుయాయులు వీరు ఛామ్‌స్కీ మున్నగువారియందు కన్పించు సిద్ధాంత పరిధులిందుకునిదర్శనము

3) ఎంప్సన్‌వంటి తార్కికులు తాత్పర్యవాదులు అందుకే శబ్దార్థదృష్టితో

కాక వస్తు-భావదృష్టితో చర్చించిరి అర్థానంత్యమును గుర్తించిరి వివ్వచిం చుటకును ప్రయత్నించిరి సెమియాటిక్ స్టైలిస్టిక్ పరిశోధనలిట్టివే

—ా రైస్ హాక్స్ వంటివారు కొందరైనను భాషేతరాంశములను ఆధారముగ తార్కికముగ లోంగని కావ్యవ్యంజకతను సూత్రీకరింపవలయునని ఈనాడు వాదించుచుండుట వ్యంజన సూత్రావిర్భావమునకు సమర్థనము

ప్రాచ్య పాశ్చాత్యములను వింగడింపు కేవలము దేశకాలములకు సంబం ధించినది కాదని మానవ మనస్తత్త్వమునగల ఆస్తిక్య—ఆస్తిక్యేతర భేదమని ముందే చెప్పబడినది కావుననే 9వ శతాబ్దమున నెపుడో గుర్తింపబడిన అభావ వాదులీనాడును కనిపించుచున్నారు ఇది వ్యంజన సూత్రమునకుగల విశ్వజనీనత

ఇటీవలి సంవత్సరములలో కొందరు ప్రాచ్యపాశ్చాత్య సిద్ధాంతములను సమన్వయదృష్టితో పరిశీలింప ప్రయత్నించుచుండుట భాగ్యమే ప్రదర్శితము ఉదాహరణమునకు కృష్ణచైతన్యగారు

సహృదయము ను 'the like hearted/einfuhlung/empathy'లుగను

'భావనా వ్యాపారము ను endotelic listening గను

వ్యాఖ్యానించి యున్నారు [154] దీని ప్రయోజనమేమి ? పరస్పర విరుద్ధములుగ కనిపించెడి ప్రాచ్యపాశ్చాత్య దృక్పథములందుగల విశ్వసామాన్యములగు ఆలో చనా స్రవంతులను గుర్తించుట ప్రాచీన నవీనములను భేదములను పాటిం చుటవలన కలుగు అసమన్వయమును తొలగించుట ఈదృష్టితో భిన్న సిద్ధాంత ములిట వేరు చేయబడినవి

ఇన్ని సిద్ధాంతములందును వక్తృ శ్రోతృగతమైన అనుభవము (experience) అంతర్గతముగనున్న అంశము కావుననే పాశ్చాత్య భాషా

-రిశీలకులయందును—భావింపకున్నను మానవులందరివలె శబ్దవ్యంజకతకు సం బంధించిన ఆలోచనలటనట ఉద్యోతితములయినవనుట ఎత్తిదర్శింపబడినది కాని సూత్రీకరించిన, సిద్ధాంతీకరించిన ఆనందవర్ధనులు లేకపోయిరి ఇదియే అనిర్వచనీయత 155

## జ్ఞాపికా వివృతి

1) See foı example Modern Theories about language Phillip W Davis (1973) also Current Trends in Linguistics, Thomas A Sebeok (ed) Vol I (for introduction)

2) ఇందు ఉదాహరింపబడిన Robins Dinneen గ్రంథములతోపాటు See J T Waterman 'Perspectives in Linguistics (1963 70)

3) See 'Literary Criticism Plato to Dryden Alan H Gilbert (ed) 1962, also The Collected Dialogues of Plato Hamilton and Cairns (ed) 1961 (ed 1973) p xiii (introduction)

4) చూ వ్యం యా 2 13 4

5) See Plato s Theory of Language Morris Henry Partee Foundations of language 8-1 pp 113-132 (1972)

6) cf infracit 1 5 argument by Watson

7) ప్లాటోవాదమును Theory of forms అని యందురు అన్ని భాష లందును రూపము (form) సమానమే ద్రవ్యములు = శబ్దములు (substance) మాత్రమే మారునవి Minor differences in sounds and syllables count for little the languages of different countries point to a common truth (See Morris fn 5 above p 121)

8) We call a defining criterion semantic when it requires us to associate an item of form with some unit or combination of units on the content plane of language We can call the criterion the formal when it requires us first to observe some factor in the comparison of a form or to correlate a difference in one form with a difference in another form which may or may not involve differential function' (See IGL p 85) చూ వ్యం సూ 2 3

9) cf R H Robins article on Linguistics in Great Ideas Today vol 8 pp 25 36 (1970)

10) cf S H L p 19 and on Image theory of Meaning See I G L p 83

11) Argument by Socrates Well now if you should strip from all poetry its music rhythm and meter the residue would be nothing else but speech? - q from Plato —(See above fn 3) p 285

12) See Herbert Read English Prose Style p 23 (1968 ed)

13) అరిస్టాటిలు వ్రాసినది పద్యవిషయకమని Read అభిప్రాయము చూ పైగ్రంథము (fn 12 p 23) కాని వచనమునందును మెటఫర్ ఉన్నదని F L Lucas నిరూపణము See Style Ch Metaphor pp 191-218 1955) నైయాయికుల దృష్టి సరిగా ఇట్టిదేయనుటకు చూ వ్యం సూ 2 6 2

14) వైయాయిక మీమాంసకుల నడుమ భారతీయ తత్త్వశాస్త్రమున కన్పించు భేదము దీనికి సమాంతరముగనున్నది చూ వ్యం సూ 2 4

15) See I G L Ch 2 particularly p 41, also fn 34 (below)

16) ibid also Saussure Cours pp 156-7 (1960 ed)

17) cf S H L p 77 & pp 138-139

18) ఆ ందవర్ధనుని పరిభాషలో ఇది వర్ణవ్యంజకత చూ వ్యం సూ 2 12

19) cf infracit p. 29 fn 10, also 1 10 12 1 (argument by Rene Wellek)

20) తాత్త్విక పరిభాషలో సంకేతములకు సాపేక్షము (relative) లగు అర్థము లుండును దీనినే vagueness అని భ్రమించుట జరుగుచుండును analogy అట్టి ఒక పరిభాష రూపదశయందే ఈనాడీ మాట వాడుచున్నాము. అలంకారముల యందన్నిటనుగల మౌలికాంశమే ఔపమ్యము (చూ వ్యం సూ 2-5) అర్థ దశయందును సమన్వయించుకొన్నపుడే analogy anomoly సమస్య అవగతమగును

21) చూ వ్యం సూ 2-11-3-6 ధ్వ ఆ 1 13/1-7 క్రింద లోచనము

22) వాగ్దేవి వాచస్పతి సంకేతములతో వర్ణనలు వేద వాఙ్మయమున ప్రసిద్ధము చూ వ్యం సూ 2-11

23) మౌలికములగు సత్యములు ఎప్పుడును ఋషులచేతనే దర్శింపబడినవి తాత్త్వికు డనగా నతడే, ఋషిర్దర్శనాత్ — అనుటకర్థమిదియే పరస గ్రంథము లు తయారుచేయుటకు కావలసినది పాండిత్యమ సత్య ప్రతి పాదన చేయుటకు దర్శనము (vision) అవసరము ఈ అర్థమునే ఒక సందర్భమున చామ్స్కీ మరియొకరీతిని నిరూపించినాడు (See Cartesian Linguistics p 57 1966) — ఆలంకారిక సిద్ధాంతకర్తలలో భరతానందాభినవులిట్టి original thinkers

24) చూ వ్యం సు 2- (అభిధావృత్తి — అర్థనిర్ణయము)

25) చూ వ్యం సూ 2-12 ఇది స్టొయిక్సుల భావముతో సమన్వయముకల్గి యున్నది యాంత్రిక వివరణమునకు చూ Charles Morris (1938) f n 47 below

26) ప్రాచీన శాస్త్రములందుగల ఈసాంకేతిక స్వరూపము ఆధునికులకర్ధరహితముగా కనిపించవచ్చునియు, జానపద విజ్ఞాన దృష్టితో ప్రాచీన నవీన భేదములు కానట్టి—ఒక ఆలోచనా భేదమే ఈ allegory కి కారణమని ఈనాడు పండితులంగీకరించుచున్నారు (వివరములకు చూ బ్రహ్మానంద, స్రవంతి 1980)

27) ఇంతవరకు వాస్తవిక దృష్టినాధారముగ భాషావిజ్ఞానము సాధించినప్రగతి అసామాన్యమైనది భాషల విస్తృతి సంఖ్య, పరిగణన, వర్ణన—ఇవి భాషాతత్త్వమును గ్రహించుటలో అనల్పప్రాధాన్యమును కల్గినవే

28) See S H L p 112 for details Reason (హేతువు) సహాయమున సత్యదర్శనము సాధ్యమా ; దానికి హృదయము (conscience) సాధనమా ; అనునది మిక్కిలి క్లిష్టమగు సమస్య హేతువు విశ్లేషణ సమర్థము హృదయము దర్శనగుణము కల్గినది స్ఫురణనుగూర్చిన సిద్ధాంతములు హేతువును విరసించినవి, (See for example George Steiner ch 2 1975)

29) See Steiner After Babel chs 1-3 (1975)

30) Otto Jesperson ( 922) వంటివారును ఇట్టి అభిప్రాయములు చెప్పియున్నారు మాతృపితృ వాచకముల విషయముగ ఇట్టి వాదములకు చూ బ్రహ్మానంది, భారతి మార్చి జూలై (1980) చూ క్రింద జ్ఞాపికలు, 54, 115

31) See S H L p 175 also Cartesian Linguistics pp 3-30

32) See for details Terence Hawkes Structuralism and Semiotics (1977)

33) See 1-2 1 (cf Hawkes opcit, p 17)

34) See Barthes (1964) Hawkes (1977) also fn 5 (above)

35) A) the association of a given sound with a given concept

B) is established by studying the other terms of a linguistic system to which it is operable ..results solely from the simultaneous presence of others

C) can be considered the sum of the signification and value (Saussure, Cours pp 158-162)

36) Compare I G L p 203, with Perspectives p 62 for example

37) Five marginal languages i e , (1) traffic lights (2) telephone dialing (3) chiming clocks (4) the morse code (5) prisoner s raffling codes ఇతని గ్రంథము ఫ్రెంచిలో వ్రాయబడినది (1938) Prolegomena to a theory of language అను పేరిట ఆంగ్లానువాదము వచ్చినది (1961)

38) చూ వ్యం సూ 1-12-

39) See S H L p 141

40) సపీర్ లో విశిష్టముగా గుర్తింపదగిన సామాజిక భాషాసంబంధమును గురించిన వివరములకు See J B Pride 'Sociolinguistics, in John Lyons 1972 pp 88-89

41) cf Krishnachaitanya S P p 134, also Chomsky C L ch I, pp 2-14 for an opposite view

42) See S H L p 176

43) See S H L p 207 (for an undeistanding of Sapir's influ- ence on American Linguistics)

44) See for details IGL p 240

45) పానుకస్థితి అను మాట ఎందుకు వాడలేదో గుర్తించుట అవసరము cf Charles Morris (1988) Compare Chomsky C L (1966)

46) అందుకే అభావవాదమని బాలసుబ్రమణ్యగారు (1976 p 37) గుర్తించిరని ఊహించవచ్చు ఈ అనిర్వచనీయాంశము హేతువాదోన్ముఖ పరిశీలనయందును తప్పదు చూ వ్యం సూ 1-7-4

47) మోరిస్ తన వ్యాసమున ఒకచోట తాత్త్విక దృష్టితో చేసెడి అశాస్త్రీయ పరిశీలనామార్గమునిట్లు నిరసించినాడు

the impression that the system is about the world and perhaps superior in truth to science comes from a confusion of analytic and synthetic sentences and from the illusion that the congenital attitudes evoked by the signs constitute semantical rules (p 41 1938)

48) Leibniz for example cf S H L p 113, and Charles Morris opcit p 31

49) వాగ్వ్యవహారముగా గుర్తించుటలో శబ్దార్థముల నిర్వచనములు తప్పక విస్తృతి పొందును చూ వ్యం సూ 2-18

50) See Morris opcit p 30

51) అర్థపరిశీలనా దృష్టితో ఈభిన్న సంప్రదాయములను Herbert Lander

తన గ్రంథమున చర్చించినాడు See Language and Culture ch 8 p 47 ఛామ్స్కీ ప్రభృతుల భాషాశాస్త్రపరిధులుపట్టని పరిశోధనా మార్గములకు See Chatman (ed) Literary Style (1971) Ch 2 pp 47–133

52) See Bronislaw Malinovsky Coral Gardens and Their Magic 1935

53) See Halliday s article in Chatman (ed) 1971 pp 330–68

54) Piaget గ్రంథము The language and thought of the child (1922 1966 ed), Jeperson Mamma and Papa—some fundamental problems అన్న వ్యాసము (1922 గ్రంథములోనిది) Roman Jakobson Why Mama and Papa (1971 గ్రంథములో నిది) వీనిమీద చర్చలకు చూ బ్రహ్మానంద 'శిశుభాష - మాతృపితృ వాచకాలు', భారతి, మార్చి 1980 పుటలు 48-55) చూ పైన జ్ఞాపిక, 30 మరియు క్రింద 115

55) Magical —అద్భుతమని, అతర్కితమను అర్థమున ఇట్లు వాడబడినది వ్యంజన ప్రక్రియలోని శాస్త్రీయతను గుర్తించుటలో ఇది ఒక సమస్య విజ్ఞాన తత్త్వపరిధిని విస్తృతముచేసి ఆలోచించినచో ఇది 'magical కాదు

56) exponent—అన్నను వ్యంజకమనియేఅర్థము ex presses–expressive అను మాటలందీయర్థమే కలదు చూ Halliday (1971) fn 53 above pp 332 333

57) See Harold Weinrich's article 'The Textual function of the French article , in Chatman (ed) pp 223-24, (1971)

58) I remember L Bloomfield bluntly telling me that he had no interest in stylistics or the stuoy of poetic language Rene Wellek Stylistics Poetics and Criticism in Chatman (ed) p 66 (1971)

59) competence అను మాటను ప్రతిభ'గా అనువదించిన తెలుగుభాషా శాస్త్రజ్ఞులలో మొదటివారు చేకూరి రామారావుగారు (1971) ఆఅను వాదము యాదృచ్ఛికమైనను, ఆలంకారిక నేపథ్యమున్న శబ్దమిది ఛామ్స్కీ ప్రతిభ-యనగా భాషాపరిశీలనమున హేతువాద ప్రరస్సరమైన ఆలోచనా మార్గావిష్కరణశక్తి - అని అర్థము

60) మార్క్స్ ప్రభావము (social objectivity) తో అర్థము something external to the individual consciousness అని వాదించు structuralists ఉన్నారు cf Loszlo Antal (1963, 1964)

ఇట్లు భాషాశాస్త్రమునను సామాజిక దృష్టికి సుడిపెట్టుట అవాంఛనీయ మనుమన్న రచనలు కనిపించుచున్నవి See for example Harmont Haberland & Jacob L Mey (ed) Journal of Pragmatics 1 1-7 (editorial p 7) also Liberty and language, Geoffrey Sampson (1979) pp 5 6

61) Chomsky (1957), (1965) రచనములను పోల్చిచూచినచో అతనికి అర్థముపై పుగల దృష్టి మారుచుండుట గమనించవచ్చును

We are forced to conclude that grammar is autonomous and independent of meaning

(Syntactic Structurs, pp 15-19, 1957)

It should not be taken for granted that syntactic and semantic considerations can be sharply distinguished'

(Aspects of the Theory of Syntax p 77, 1965)

కాని మొదటిది వ్యాకరణ విశ్లేషణకు సంబంధించిన వివరణము రెండవది వాక్యనిర్మాణ సంబంధి ఈసందేహములు Cartesian Linguistics రచనముతో తీరినవి

62) రామారావు ( 9/1) గారి వ్యాసమున transformation అనుటం పరివర్తన మను అనువాదమున్నదికాని generative అనుటకులే చామ్స్కి-పత్రికారము ingenio అనుటకుద త్వర్థము engender, generate సృజనాత్మకత సిద్ధాంతమున భాగమైన విషయముగా గుర్తించుటయవసరము See C L pp 78-79, also fn 63 below

63) జానపదుల పొడుపుకథలలోను, ఎల్లల భాషలోను, మానసిక వ్యాధులుగల వారియందునుగల ఈఅతర్కిత లక్షణము—వారి వాక్సృజనతో సంబంధము కల్గియున్నది విశ్వసత్యములు ఇట్టివారి నోటను ఒక్కొకసారి బయల్పడుటగలదనియు అట్టి సందర్భములందు పని చేయుచున్నది వారియందలి వైయక్తికచేతనముకాదని విశ్వసుప్తచేతనమని Jung పండితునియభిప్రాయము cf Myth of Meaning Ch 2 (1968)

64) గుప్తవ్యక్తనిర్మాణ విషయమున ఒకవైపు అభివ్యక్తి (reflection) ని మౌలికముగ గుర్తించుచు, వివరణమున సాధన (instrument) మైన వాక్కును అంగీకరించుటలో యాంత్రికతయున్నది

65) See, for details, Chomsky C L pp 36-37 (1966)

66) వ్యక్తరూపములు భిన్నమయ్యు పరివర్తన సూత్రములు భిన్నమయ్యు గుప్తనిర్మాణము విశ్వజనీనమని గుర్తింపబడినట్లే, వ్యంగ్యార్థములు భిన్నమయ్యు సలంక్ష్యాసంలక్ష్య మార్గములు భిన్నమయ్యు వ్యంజనప్రక్రియ మాత్రము విశ్వభాషా సామాన్యమనుటయే ఈవ్యాస ప్రధానోద్దేశ్యము

67) comp infracit 1 10 9, with 2 12

68) కార్టీజియన్ మార్గమున ఈశక్తి cognoscitive power గా గుర్తింబడినది See C L p 67

69) చామ్స్కీ 1966 గ్రంథమునాటికి కొందరి దృష్టిలో అశాస్త్రీయము ఆధునికము కాదు కారణము ఏ 17వ శతాబ్దముననో గుర్తింపబడిన సత్యమును పునరుద్ఘాటించుట దీనినే గ్రంథాంతమున చామ్స్కీ ఇట్లు సమీక్షించినాడు.

I have tried to indicate that much of what is coming to light in this work was foreshadowed or even explicitly formulated in *earlier and now largely forgotten theories* (italics mine – H S B ) (C L p 73)

70) పరివర్తన సిద్ధాంతమునగల 'mathematical reductionism మీద చామ్స్కీ ఆలోచనాసరళిలోని 'హేతు' దృష్టిమీదవచ్చిన తీవ్రవిమర్శకు ఒక ఉదాహరణము George Steiner 'After Babel (1975 and references therein) 'Deep Structure అన్నమాటను సరిగా నిర్వచింపవలసిన అవసరమున్నదనుటను Steiner మాటిమాటికి గుర్తుచేసినాడు భాషాశాస్త్రము విజ్ఞానమను పేరిట పిలువబడు రోజులు గడచిపోయినవని నిరూపించినాడు వాగ్వ్యవహార (idiolect) ప్రాధాన్యమును సూచించినాడు (చూ పుటలు 9 -108 294)

71) It has in fact become possible to recognise levels of grammaticality and thus of deviance, by finding out at what depth of the generative process a given construction deviates from normal — Enkvist p 54 (opcit) also see Samuel R Levin, Poetry and Grammaticalness' (1964) J P Thorne

Stylistics and Generative Grammars (1965) and Enkvist opcit p 61 for some more recent references Jacobs and Rosenbaum 'Transformation, Style and Meaning (1971)

72) cf Enkvist opcit p 51 ఇట్టి ప్రయత్నము Mathews చేసినాడు Concerning a linguistic theory of metaphor (1971) అన్న వ్యాసమున క్రింది వాక్యము విశ్లేషింపబడినది

Man is a wolf

ఇది లక్ష్యార్థక వాక్యము ఈలక్ష్యార్థము man అనుపదముతో సంపదించు [+మానవ] అను లక్షణమును, [–మానవ] అను లక్షణముతో స్పర్థింపచేయుట (conflicting) వలన సిద్ధించుచున్నదని Mathews వివరణము (చూ K Hammor వ్యాసము 1979, పుటలు 209 220) కాని Robert Sanders (1973) Loewenberg (1975) లలో ఈపద్ధతి పై మరికొంత చర్చయున్నది వారిననుసరించి metaphor ని వివరించుటకు భాషాశాస్త్ర పరిధి చాలదనుట గమనార్హము Sanders ని అనుసరించి (1) లక్ష్యార్థమును 'intralinguistic గా నిరూపించుటకవకాశములేదు (2) సందర్భవశముగనే లక్ష్యార్థసిద్ధి—అంతియగాని వాక్యమునకున్న అర్థ విశేష సమర్పక శక్తికాదు *Redefining rules* ని ఆధారముగా complex expression ని simple form లోనికి map చేయుటకవకాశమున్నదని అతని అభిప్రాయము కాని ఒక ఉదాహరణమున్నది

The ape spoke to me

ఇచ్చట 'expression లో complexity లేదు ఇట్టిచోట్ల redefining rule ని ప్రవర్తింపచేయుట కష్టము

Loewenbergస్పష్టముగా metaphorical cases ని వివరించలేనిసందర్భ

ములు పెక్కులున్నవని స్పష్టముగా తెలిపినది (చూ పుట 210) వీనిమీద చర్చకు చూ K Hammor వ్యాసము (పూర్వోదాహృతము)

73) See Jerold J Katz & Jerry A Fodor The structure of Semantic Theory (1963) (1964) Jerold J Katz and Paul M Postal Semantic interpretation of idioms and sentences containing them (1963)

74) cf Rulon S Wells (1954) Weinreich (1966) for some discussion particularly pp 395-470

75) జాతీయములను పదములకో ఎదబంధములకో మాత్రము పరిమితమై చేయు ఇట్టి అర్థపరిశీలనలోని అసమగ్రతను Weinreich ఇట్లు సమీక్షించినాడు

But even systematic semantics is doomed to an isolated place within linguistics as a whole so long as paradigmatic relations are the only form of patterning to which attention is given It is undoubtedly important to understand how the meaning of a word in a vocobulary is determined by the meanings of other words in the same vocobulary (Explorations p 468)

చూ వ్యం సూ 2-4

76) చూ వ్యం సూ 1 3 1-4 మరియు 1-12

77) cf fn 59 above

78) Communicative Competence in J B Pride (ed) (1972)

79) చూ వ్యం సూ 2-13-5

80) Dialect Language Nation in J B Pride (ed) (1972)

81) మాండలికము - ప్రమాణభాషగా ఎదుగుటలో selection of norm, codification of form elaboration of function acceptance by the community అను నాల్గంశములు ప్రధానము (Haugen, p110) భాషకున్న ఈసాంఘిక అస్తిత్వము నాధారముగా language reflects society (Berezin 1976) అను అభిప్రాయమేర్పడినది

82) 'The social motivation of sound change, Word 15 pp 273-309 (1963)

83) Diglossia in Dell Hymes (ed) (1964)

84) 'Sociolinguistics and communication in small groups in J B Pride (ed) (1972)

85) ibid

86) Studies in Ethnomethodology in J B Pride (ed) (1972)

87) For details of the 'intention (of the husband) and the 'inference of the wife, see Garfinkel opcit p 21(, cf వ్యం సూ 2 8

88) 'Linguistic etiquette in J B Pride (ed) (1972) (చూ అనుబంధము 2 ద్రావిడధ్వని సిద్ధాంతచ్ఛాయ)

89) సంస్కృత భాషాశబ్దవ్యాప్తి కారణముగ నీభాషలలో ఈరూపసామ్యము కనిపించవచ్చు ఇండోయూరోపియన్ సగోత్రతను గురించి మొదట చర్చింపబడినది చూ పుటలు 10 మరియు 39

9 ) See Andrzejewski Poetry in Somali Society in J B Pride (ed) 197∠) cf the pronominal substitutional effect observed by Mc Intosh among we/our/your in the dialogue between Celia and Roselind, from As you like it See J B Pride (ed) 1972

91) చూ జ్ఞాపకలు 1 మరియు 51 నమ్మకమనగా ప్రపంచమందలి నలు మూలలందలి భాషాపరిశీలకులను convince చేయగల్గినభాషానిర్వచనము ప్రక్రియా నిర్వచనములు, నిరూపణములు—అనియర్థము అట్టి శాస్త్ర మున్నదా అన్నప్రశ్న రావచ్చు గణితముననొ విజ్ఞానమ ననో విశ్వ జనీనమగు అంగీకారమున్నపుడు భాషాశాస్త్రమునలేకపోవ్వట ఎట్లు భాషకున్న మానసిక భౌతిక ప్రక్రియాసమన్వయిమును గుర్తించుటలో ఈవిశ్వజనీనత యుండునని ఈనాడు స్పష్టమగుచున్నది ఈవ్యాస ప్రయో జనముకూడ ఇట్టిదే

92) See Readings in the Applied Transformational Grammar Mark Lester (ed) (197υ) pp 61–95

93) op cit pp 253 86

94) See Mac Harmond Poetic Syntax in John Lyons (ed) 1973 Levin Linguistic structures in Poetry ibid Thorne Generative Grammar and Stylistic an ılysis ibid

95) See 'A semantic approa h to Metaphor in Binnick (1969) q in Kooij ( 971) p 123

96) See Seven Types of Ambiguity (193( ) The conditions for the types can be abstracted as follows (1) when a detai is effective in several ways at once (2) two or more alternative meanings are fully resolved into one, (3) two apparently unconnected meanings are given simultaneously

(4) alternative meanings combine to make clear a complicated state of mind in the author (5) when the author is describing the idea in the act of writing or not holding it all in the mind at once (6) what is said is contradictory or irrelevent and the reader is forced to invent interpretations, (7) contradiction making a division in the author s mind

97) cf Katz J J Postal P M An integrated theory of linguistic descriptions (1964) Weinreich Explorations in Semantic Theory (1966)

98) Semantics incl in John Lyons, ed (1973) pp 166-184

99) Semantic fields and lexical structure (1974)

100) Formal Linguistics and Formal Logic in John Lyons (ed) (1973)

101) Language and Thinking (1967)

102) Utterer s meaning sentence meaning and word meaning' in J R Searle (ed) 1971

103) Webster s Third Dictionary infracit p 2286

104) Language and Logic (1976)

105) చూ వ్యం. సూ 2-19 cf Tractutus Logico-Philosophicus (1922, 1961)

06) Semantics' (1975) రోమన్‌యాకబ్‌సన్ చేసిన ఇట్టి ప్రయత్నము నకు చూ Karl D Uitti వ్యాసము Chatman (ed) pp 113 114

107) భాక్తమనగా associated అనియే అర్థము గుణవృత్తి/భాక్తమను పేర్లక్రింద ఈచర్చయున్నది చూ వ్యం సూ. 2 6

108) అర్థమునుకూడ వ్యంజకముగ గుర్తించుటలో ఇట్టిభేదము నిర్వచింపబడుచున్నది చూ వ్యం సూ 2 12

109) 'Stylistics (1975)

110) వాచ్యప్రతీయమానమనుఅర్థద్వయమును నిరూపించుటకు ఆనందవర్ధనుని నిరూపణము సరిగా ఇట్టిదే చూ ధ్వ అ 1 4 క్రింద వ్యం సూ 2 12

111) See for example Meaning in child language, Lawrence,B Leonard (1976) The Phoetics of Cat and Mama Lg 54 4 (1978) particularly p 851

112) చూ జ్ఞాపకలు 30, 54

113) శిశువాక్కు - లక్షణావృత్తి ( 981, ప్రమాణములో)

114) చూ జ్ఞాపక 54లో ఉదాహృతవ్యాసము

115) The functions of vocal style, in Chatman (ed) 1971 pp 159-176

116) కావ్యభాషలోని ఈలక్షణమును గుర్తించినది కాశ్మీరశివాగమ సంప్రదాయము చూ వ్యం సు 2 12

117) archaic, primitive అనుశబ్దములచే సూచింపబడునది వైయక్తికము కాని సామూహికపు ప్రచైతన్యముయొక్క creative impulse cf Chomsky C L p 47 (in the discussion of Du Marsai s conception of the act of mind as a singe unit)

118) Expression impression suppression and depression (అముద్రిత వ్యాసము 1976)

119) Otto Jesperson (1933) వ్యక్తిముచేసిన 'suppression ని గురించిన వివరణమునకు చూ వ్యం సూ 2-10 3

120) స్థూలముగనైనను, An Introduction to the notion of Suggestivity అను వ్యాసమున, ఈరచయిత (1976) వ్యంజన వ్యాపారమును గుర్తించియున్నాడు (f n 118 120 presented in the 6th All India Conference of Linguists, Tirupati Jan 1976)

121) ఈసదస్సున జరిగిన చర్చలు, చేసిన ప్రసంగములు Literary Style అను గ్రంధరూపమున Seymour Chatman సంపాదకత్వమున ముద్రింపబడినవి (1971) ఈసదస్సును సమీక్షించుచు ఆయన వ్రాసిన ఈవాక్యములీగ్రంథమున పాటింపబడుచున్న system ని సమర్థించునవిగా ఉన్నవి

' Still it was widely urged by the least 'linguistic of the stylisticians—that those things in literature beyond language may very well have their own codes or systems and that the task of the literary student is to inquire into these as systematically as he can

(Introduction p xv)

122) పైసదస్సున ప్రారంభోపన్యాసముగ Stylistics and Semantics (Chatman (ed) pp 133-158, 1971) మీద ప్రసంగించిన Ullmann ఈరెండు విభాగముల నడుమగల interpenetration మీదనే కేంద్రీకరించినాడు

123) Halliday (op cit) 331-32

124) Rene Wellek in Chatman (ed) 1971, cited above fn 58

125) Rule ని గురించిన తన అభిప్రాయములను Chomsky క్రిందివాక్యం మున స్పష్టపరచియున్నాడు ఇది వ్యాకరణ సంబంధి సూత్రము 'On the notion 'rule of grammar (in, 'The Structure of Language, Jerry A Fodor, Jerrold J Katz (ed 1964) p119

126) N Chomsky Aspects of the Theory of Syntax (1965)

127) ఇచ్చట పరిణామ మనగా 'చారిత్రక' మని కాదు ప్రక్రియ-అనిఅర్థము See Historical Linguistics and Generative Grammar (1972)

128) 'intralinguistic అనగా అర్థమిదియే అర్థ భావములను స్పష్టముగా వేరుచేయుటకీవ్యాసమున జరుగుచున్న ప్రయత్నమునకు హేతువిదియే

129) శబ్దార్థముల నిడుమగల ఈ అనుక్రమణికపై చర్చకు See Krishnachaitanya S P p 120

130) See Bh Krishnamurti 'Telugu Verbal Bases p 6 (1951)

131) See G, N Reddy 'A study of Telugu Semantics, p 99 (1966)

132) cf Owen Barfield 'Poetic Diction, p 73 (1951)

33) Toward a Theory of interpretation and preciseness —in Semantics and Philosophy of language (1958)

34) Language and Thinking (1967)

35) I A Richards Speculative Instrument (1955)
Owen Barfield Poetic Diction (1951)
Aurobindo 'On the Veda, (1956)

136) పరిదులేర్పరచుకొనుటవలననే శాస్త్రీయతవృద్ధిపొందును — goals ఇట్లు నిర్వచింపబడునవే Chomsky ప్రయత్నము (C L) ఇట్టిదె

137) See Hawkes S S p 124 (1977)

138) ఆధునిక భాషాశాస్త్రమున భాగముగా వృద్ధిపొందిన అర్థవిజ్ఞానము (semantics) ఈదృష్టితో విభేదించిన యంశమున్నది 1826 ప్రాంతమున మొదట ఫ్రెంచిలో la linguistique అనుపదము ప్రయుక్తమైనది ఆంగ్లమున 1837 ప్రాంతమున linguistic(s) వ్యవహారము లోనికి వచ్చినది (cf Ullmann Semantics p 33 1967) భాషలనడుమ చారిత్రక పరిణామదృష్టి హేతువుగా భాషాశాస్త్రము పెరిగినట్లే అర్థవిజ్ఞానముకూడ పెరిగినది ఉదాహరణము Michael Breal దృక్పథము అర్థపరిశీలనము ప్రాథమికముగా చారిత్రికమని, intellectual law గా 'meaning ని పరిశీలింపవలెనని Breal ఆదేశము Ullmann ని అనుసరించి అర్థవిజ్ఞానమునొక విభాగముగా వృద్ధిపొందుటలో ప్రాచీన గ్రీకుల సిద్ధాంతములు కాకుండ ఒకవైపు భాషాశాస్త్రము, మరియొకవైపు సాహిత్యమున ఆనాడువచ్చిన కాల్పనికోద్యమములు హేతువులయినవి శబ్దమునకున్న విచిత్రశక్తులను గురించి వర్డ్స్‌వర్తు, షెల్లీ, విక్టర్‌హ్యూగో బాల్జక్ మున్నగువారి అభిప్రాయములను Ullmann తన గ్రంథమున ప్రదర్శించియున్నాడు ఆనాటి అభిప్రాయములకిది ఒక మచ్చుతునక

All words are impressed with a living power which they derive from the mind and which they return to it through the mysteries of a miraculus action and reaction between speech and thought By their very appearance words reawaken in our minds the creatures whose garments they are

(Balzac, q Louis Lambort 1832 Ullmann pp 4-5)

*Reisig Postgate* Breal లలో ప్రధానముగ కన్పించునది దీనికి భిన్నమగు చారిత్రిక దృష్టి C K Ogden I A Richards (1923) ప్రయత్నమునకూడ అర్థమునునిర్వచించుటలో ఏకముఖత్వముక న్పించదు క్రమముగా నిర్మాణవాద ప్రభావముతో పుట్టినది Structural Semantics (See Ullmann pp 8–9) కాని వీరందరును 'metaphor ప్రయోజనమును ఉనికిని గుర్తించియేయున్నారు జరగనిపని___ లక్షణావృత్తి స్వభావమును, తన్మూలముగ సిద్ధించు వాజ్నిర్వచన సమగ్రతను గుర్తించకపోవుట 'సెమియాలజీ పుట్టుటకు హేతువిది

139) See Hawkes opcit pp 123 124

140) ఫ్రెంచిలో మొదట వ్రాయబడిన Elements de semiologie (1981) ఆంగ్లములో Elements of Semiology గా అనువదింబడినది (1967) భాషలోని కావ్యత్వమును గురించి దాదాపు ఇరువది సంవత్సరములు శ్రమించియు విమర్శకుడుగాకాని, భాషాపరిశీలకుడుగా కాని - ముద్ర ను పొందుటకు వీలుకాలేదనుచు (పుట 3) Barthes ఒక వ్యాసమున (Style and its image in Chatman, ed 1971) *form content* అను విభాగము *Verba Res* అను గ్రీకు విభజనకు సంబంధించినదనియు *Res* (the demonstrative materials of the discourse) ఆకాంక్షకు సంబంధించినదనియు *Verba* నాశ్రయించినది *Elocutio* (the transformation of these materials into a verbal form) అనియు చెప్పుచున్నాడు Verbum—speech (వాక్కు - అభివ్యక్తి) కావ్యత్వమనగా అభివ్యక్తి యే అని అతని నిరూపణము 'Form is taken to be the appearance or 'dress of content' (p 4)

పరివర్తనసూత్రపద్ధతి భాషలోని కావ్యత్వాభివ్యక్తిని ఎందుకు సూత్రింపలేదో ఇట్లు Barthes సూచించుచున్నాడు (p, 11)

Stylistic transformations certainly have some affinity with those of transformational grammar, but they differ in a fu idamental point, where linguistics, inevitably implying a certain vision of language, becomes ideological The stylistic models can not be assimilated into deep structures, universal forms issuing from a phychological logic These models are only the depositories of culture

141) Barthes, opcit (1967) p, 80

142) చూ వాక్యపదీయము 1-124 వ్యం సూ 2 10

143) De lacti a la pensee (q in Barthes opcit 1967 p 10?)

144) 'Nature de signe linguistique (in Acts Linguistics 1 1939, q in Barthes opcit 1967 p 100)

145) Ullmann op cit ch 5 pp 116-140 for Telugu examples G N Reddy opcit ch 2-1 pp 38-71

146) Barthes quotes A J Greimas' distinction between seman tic and semiological as follows

semantic = referring to content

semiological = referring to expression

(cf, Barthes, opcit p 101 (1967) also p 10 (1971)

147) C F Hockett 'A course in Modern Linguistics (1958) G Mounin Communication Linguistic humaine et communication non-linguistique animale (1960)

148) కావుననే భావమునాధారముగ రసమునుగూర్చి ఆలంకారిక వాదము

పాగినవి స్థాయి'ని గూర్చిన చర్చ ఇందుకు ప్రమాణము స్థాయియే రసప్రతీతినందును అనుభవ సర్గనము లంధ భావమే శబ్దార్థములను బంధించుచున్నది రసధ్వని మీ' ంసకు కీలకమీదృష్టి

149) చూ వ్యం సూ 2-13-5

150) ధ్వనివర్ణాదులను అర్థముతో సంబంధములేకుండ పరిశీలించినదశ ప్రాచీన దశ అది కేవలము భౌతికపరిధిని కల్గినది అర్థము ను భాషాపరిశీల నాంశముగా గుర్తించి, భౌతిక నిరూపణశక్తిను చేయుటకుప్రయత్నించు దశ - అసమగ్రమైనను మధ్యమదశ భౌతికమానసిక సంధి ఇచ్చట ప్రధానము శబ్దార్థముల అనువిద్ధతను ప్రతిపాదించుచున్న ఈపరి శీలన—భాషాప్రక్రియాదృష్టి—అధునాత దశకు నిదర్శనము ఇది తాత్త్వికము సమగ్రము (For such a voice see Semiotic Bases of Universal Grammar by Sebastian Shaumyan (1980) where he establishes that a subject is a linguistic function and like all other linguistic functions it is language—independent and is rooted in the semantic properties of speech acts (p 3), by which he characterises a speech act as being composed of 4 elements, viz the sender, the receiver the external situation and the language used (ibid) having orientation towards one rather than three items emotive vocative, referential or metalingual functions (id)

151) Lehrer opcit (f n 99 above) p 44

152) Hawkes op cit p 16 (1977)

153) చూ 'భారతదేశంలో భాషాశాస్త్రం' ఆ ప ఉ సం (19 8)

154) Krishnachaitanya S, P p 45 (1965)

155) చూ జ్ఞాపక 46 నోలి వాక్యము వ్యం సూ పుట 26

# 2. సూత్రీకరణము (CODIFICATION)

సా ప్రతిభా నానుమీయమానా
అంతు తదావేశేన భానమానేత్యర్థః

—లోచనము, పుట 92

*"Truth is not what we discern*
*but what we create"*

— Saint Exupery
Q in Herbert Read p 252 (1960)

## 2 1 వ్యాపారత్రయచర్చ – ధ్వని వికల్పములు

ధ్వన్యాలోకమున ఆనందవర్ధనుడు ధ్వనిని నిర్వచించినాడు [1]

యత్రార్థః శబ్దోవా తమర్థముపసర్జనీకృతస్వార్థౌ
వ్యంక్తః కావ్యవిశేషః సధ్వనిరితి సూరిభిఃకధితః

(ధ్వ ఆ 1 13)

శబ్దార్థముల ఉపసర్జనత్వమువలన సిద్ధించుచున్న కావ్యవిశేషము ధ్వని ఇది శబ్దార్థవ్యాపారముల నాశ్రయించిన ప్రతిపాదనము ధ్వని లేదని ఉన్నను భాక్తమున భాగమని అనిర్వచనీయమని అకాలముననే ఆనందునికి వ్యతిరేకముగ ప్రతిపాదనలు జరిగినవి వీనినే ధ్వనివికల్పములందురు ప్రధమోద్ద్యోతమున

ధ్వని వికల్పవాద ఖండనములున్నవి అవి ఆనందవర్ధనుడూహించినవకొన్ని, ఆనాడున్నవికొన్ని కావచ్చునని పండితులనుచున్నారు[2] అవి మొత్తము ఐంచ విధములని లోచనము[3] (పుట 16)

(1-3) అభావవాదములు

(4) భాక్తవాదము

(5) అనిర్వచనీయతావాదము

2 1 1 చిరంతనులైన భామహోద్భటాదులు అభావవాదులు లక్షణలో వ్యంజన అవిర్భవించునని వాదించినవారు భాక్తవాదులు వ్యంజన అనాఖ్యేయమని వాదించినవారు అనిర్వచనీయతావాదులు కాని ఆలంకారికులు కొందరు గుణ వృత్తి నంగీకరించిరి వారిచే ధ్వనిమార్గమీషత్స్పృష్టము అనాఖ్యేయతావాదులు లక్షణకరణశాలీన బుద్ధులంకావున వాగతీతమను వాదముచేసిరి ధ్వనివికల్పములని ఎలువబడుచున్న వీనిని శబ్దార్థవ్యాపార దృష్టితో పునఃపరిశీలనముచేయుట ఇక్కడి ప్రయత్నము ప్రసిద్ధప్రస్థానాతిక్రమణము (ధ్వ ఆ పుట 106) వ్యతిరేకము (పుట 21) అనుస్మృతపూర్వము (పుట 35) అయిన ఆనందుని ధ్వన్యాలోకమున వ్యంజన సూత్రిదర్శనమిట్లు పృథక్కరింపబడవలసియున్నది శబ్దార్థవ్యాపారములే తంతువులుగా[4] ఈగ్రంథమున వ్యంజనసూత్రినిర్మాణము జరుగును ధ్వనివికల్పవాదములు ఈభిన్న వ్యాపారదృష్టుల నాధారముగపుట్టినవి వీనిని సమగ్రముగ ఖండించి ద్యోతనప్రక్రియగా వ్యంజనను సూత్రీకరించి తదాధారితమైన ధ్వన్యస్తిత్వమును స్థాపించిన మనీషఅభినవగుప్తశ్రీపాదునిది

2 1 2 రుయ్యకుని అలంకార సర్వస్వమునకు వ్యాఖ్యానమువ్రాసిన జయరథుడు తన 'విమర్శని'లో

యిద్యం ''తాత్పర్యశక్తి రభిధా లక్షణానుమితిద్విధా
అర్థాపత్తిః క్వచిత్తంత్రం సమాసోక్త్యాద్యలంకృతిః
రసస్యకార్యతాభోగః వ్యాపారాంతర బాధనమ్
ద్వాదశేత్థం ధ్వనేరస్యస్థితా విప్రతిపత్తయః '

ఇతి నీత్యా బహవో విప్రతిపత్తి ప్రకారాః సంభవంతి తథాం 'కావ్యస్యాత్మా

(ధ్వ ఆ 1-1) ఇత్యుక్త నీత్యైవ ధ్వనేర్విప్రతిపత్తి ప్రకారత్రయమిహా ప్రాధాన్యేనోక్తమ్' (అలంకార సర్వస్వము పుట 1) అని వ్రాసినాడు ఈప్రకారత్రయములు అభిధా — తాత్పర్య — లక్షణాభిధాన ప్రసిద్ధములైన శబ్దార్థవ్యాపారములు (అదే పుట) వీనినే ఆనందవర్ధనులు ఖండించి వ్యంజనను స్థాపించియున్నారు. అపుడు జయరథుడు సంగ్రహించిన ఎంటెండువాదము లేవరివి ?

వి రాఘవన్‌గారి వివరణమిది5

1) తాత్పర్యము—మీమాంసకుల వాదము

2) అభిధ—ప్రాచీన మీమాంసకులది

3 4) రెండులక్షణలు—జహదజహల్లక్షణలు - నైయాయికమార్గము

5 6) రెండుఅనుమితులు—తెలియుటలేదు6

7) అర్థాపత్తి—అనుమానపక్షముననే ఒక వాదము

8) తంత్రము—శ్లేషాద్యలంకారములు

9) సమాసోక్త్యాద్యలంకారములు

10) రసకార్యత—లొల్లటమతము—ఉత్పత్తివాదము

11) భోగము—భట్టనాయకుడు—భోజకత్వ వ్యాపారము

12) వ్యాపారాంతరబాధనము—అనిర్వచనీయత

కుంతకుని వక్రోక్తి [డాII- రాఘవన్)7

2 1 3 ఈసిద్ధాంత వ్యాస ప్రణాళిక దృష్టితో మొదటి నాల్గంశములను సమ్యక్పరిశీలనీయములు తక్కిన ఎనిమిదియు ఈనాల్గంశములందే అంతర్భ వించును అభిధాతాత్పర్యవాదములు తాత్పర్యతః ఒకటేయగుటవలన మూడు వాదములేయున్నవి

1) అభిధా—తాత్పర్యస్థాపకులు—మీమాంసకులు— ఇది శబ్దప్రాధాన్య వాదము తంత్ర సమాసోక్తి రసకార్యతాభోగను లిందలివి

2) లక్షణావ్యాపారవాదులు —నైయాయికులు —ఇది అర్థప్రాధాన్యవాదము లక్షణానుమిత్యర్థాపత్తులు వీరివి

3) వ్యంజన—కాశ్మీర శైవాగమములోనిది ఇది శబ్దార్థాద్వైతవాదము ఇక్కడ పరిశీలనకు ప్రమాణము వాక్కు అనగా శబ్దార్థసమాహారము పంద్రెండవవాదము కుంతకునిదనుకొనుటకు వక్రత ప్రత్యభిజ్ఞా సిద్ధాంతాను బంధి తము కావున వ్యాపారాంతర బాధనము కాదు వ్యంజన, స్పందములు8 వ్యాపారాంతరములే కాని బాధకములు కావు

కావున ధ్వని తత్త్వము వాక్కుల కగోచరమన్నవారే ఈవ్యాపారాంతర ప్రతిపాద కులు కావలెను అట్టివారు వేదాంతులు మాత్రమే భట్టనాయకుడిట్టివాడే 9

2 1 4 ధ్వని సిద్ధాంతమును గురించి తెలిసికొనుటకు ఈవాదములన్నింటి యొక్క పరిచయము అవసరము ఇందు ఇరువురు విలక్షణవాదులున్నారు

ఒకరు "వ్యక్తివివేక కారుడు—మహిమభట్టు
మరొకరు "వక్రోక్తిజీవిత కారుడు—కుంతకుడు

శబ్దార్థవ్యాపారములను గురించిన ప్రతిపాదనములలో ఈరెండును ప్రత్యేకములు, మహిముడు వివేకము (ఇంటలెక్ట్)న నమ్మకమున్నవాడు కావున విమర్శించినాడు 10 ఆనందుడు స్ఫురణ (ఇంట్యూషన్)ను నమ్మినవాడు కావున ఆలోకించినాడు 11 మొదటివాడు పండితుడు రెండవవాడు కవి కుంతకాచార్యుడు ఆనందుని సిద్ధాంతమునకు సవరణగా పరావాక్పరిస్పందదృష్టితో వాగున్మేషమును సూత్రీకరించినాడు 12 ఇది వాక్పరిస్పందశక్తికి సంబంధించిన వాదము ఇవి ఆయాచోట్ల విమర్శింపబడును

వేదకాలమునుండియు శబ్దార్థమీమాంస భిన్నమార్గములందు సాగుచున్నది, ఆనందవర్ధనుని దృష్టి శబ్దార్థములకుగల విలక్షణమైన 'ద్యోతన' శక్తికి సంబంధించినది ఈక్లిష్టమగు పరిజ్ఞానము స్థూలముగా సమీక్షింపబడును

## 2 2 శబ్దార్థపరిశీలనము—దశాత్రైవిధ్యము

తాత్త్విక పరిభాషయందు 'పదార్థ'మని వస్తుభావములకు పేరు పదార్థమును మూడుదశలందు వ్యాఖ్యానించుట (అర్థముచేసికొనుట) శాస్త్రసంప్రదాయముగ కానవచ్చుచున్నది అవి బాహ్య, బాహ్యాంతర ఆంతరదశలు 13 దైహిక, మానసిక తాత్త్విక దశలిట్టివి ఇట్టి పరిజ్ఞానము వృద్ధియగుటకు హేతువు, పరస్పర విరుద్ధములును, అనువిద్ధములును అయిన వ్యక్తావ్యక్తములు (మెటీరియల్ అండ్ అబ్‌స్ట్రాక్ట్)

శబ్దార్థములను పరిశీలించుటయందును సీమూడు దశలున్నవి అర్థమును పరిశీలించుట అనగా నేమి ?

'అమ్మ'—'తల్లి'

మొదటిది 'శబ్దము' రెండవది 'అర్థము', అదియు శబ్దమేకదా! మరి అర్థ మనుట ఎట్లుపొసగును? ఈచింతయే ప్రాచ్యపాశ్చాత్యవిభేదములేక దేశ కాలములతో నిమిత్తములేక శబ్దమును - శబ్దవైచిత్రిని - గూర్చి మానవునిచే భావింపజేసినది రెండవది శబ్దమే, శబ్దమే శబ్దమును బోధింపసమర్థము అప్పుడర్థమనుట మరియొక తెలియనిదానికి మనము పెట్టినపేరు కావలయును 14 ఆ తెలియనిదానిని శబ్దము మూడు దశలందు భావింపజేయుచున్నది కావున శబ్దార్థముల మీమాంసయనగా మనచుట్టునుగల శబ్ద ప్రపంచముతో మనకుగల భావనను సమన్వయింపచేసికొనుటయనుతాత్త్వికార్థము చెప్పవలయును ఇది శబార్థముల పరిశీలనమున తృతీయదశ

మొదటి రెండు దశలెట్టివి?

పైన చూపబడినది మొదటిదశ —'అమ్మ అనగా 'తల్లి' అనుట ఇచ్చట అమ్మ శబ్దము కేవలము ఒక సంజ్ఞ (సైన్) 'తల్లి యనుటను బోధింప గలుగుట కేవలము యాదృచ్ఛికము రూఢిమూలము 15 కేవలవ్యావహారికదశ ఈరెంటికి మధ్య మరియొక స్థితియున్నది అది శబ్దమును దేశకాలములకు బద్ధముచేయు లౌకికదశలో ఒక పరిణామము ప్రసంగమున శబ్దము రూఢి నియమమును దాటవి అర్థాంతరమును స్ఫురింపచేయును 'బృహస్పతి యను శబ్దమునకు బుద్ధిహీను డను అర్థముచెప్పుట ఈదశయే ఇచ్చట గుర్తింపదగు అంశమున్నది

శబ్దార్థములు వ్యాపార (ఫంక్షన్) ముఖముగ పరిశీలింపబడుటవలన నీదశలు గమ్యమానములైనవనుట ఇట్లు వ్యాపారముఖముగ పరిశీలించుటలో రెండు ప్రధాన పక్షములు నిరంతరము సంఘర్షించుకొనుచున్నవి అవి ఖండా ఖండ పక్షములు మొదటిది అవయవ (taxonomic) దృష్టి రెండవది అవ యవి (integral) దృష్టి నైయాయిక వైశేషికులు ప్రాయికముగ తార్కికులు,

మీమాంసకులు తార్కికులైనను ఆస్తిక్యబుద్ధియున్నవారు వైయాకరణులకు, ఆలంకారికులకు నైయాయికవైశేషిక మతములు నేపథ్యము కల్పించిన కాల ముండెడిది అప్పుడు పుట్టిన సిద్ధాంతములు మీమాంసకుల చేతిలో విమర్శకు లోనైనవి వేదాంతులు కొందరీ విషయములను స్పృశించినవారున్నారు కాని ఏ భర్తృహరివంటివారో వీనిని సమన్వయింపగల్గిరి అది మొదటచెప్పిన తృతీయదశ

ఆధునిక శాస్త్రముల కీవిభాగము నన్వయించినచో విజ్ఞాన(సైన్సు)ము మొదటి దశకును మానసిక తత్త్వశాస్త్రములు రెండవ దశకును చెందినవి16 ఒక్క సాహిత్యము మాత్రమే మూడవదశను నిరూపింపగల్గినది ఇది ఎట్లో ముందు నిరూపింపబడును

## 2 3 భాష — అవయవి, అవయవ సంబంధము

భాషయందవయవములేవి ? అవయవి ఏది ? అను ప్రశ్నము చాల వింతయైనది భాష వాక్యరూపములనుండును వాక్యమున పదములున్నవి పదమున వర్ణములున్నవి వర్ణములలో ధ్వనులున్నవి ఉచ్చారణమున వీని నాశ్రయించిన స్వరాదిభేదములున్నవి పరిశీలనమున ప్రమాణము (యూనిట్) ఏది ? ఖండాఖండపక్షము లిట భిన్నమార్గములు త్రొక్కినవి

పాశ్చాత్యదేశములందు సోక్రటీసు ప్రభృతులు పదములకుగల అర్థములనే విచారించినట్లు నైయాయికులు పదమునే ప్రమాణముగ స్వీకరించిరి గౌతమ న్యాయసూత్రములు పదమును గ్రహించి అర్థవిచారణ సల్పినవి వ్యాకరణములు పదదృష్టినే కల్గినవి—పాణిని, కాత్యాయన, పతంజలులు పదదృష్టికల్గినవారే యాస్కుని దృష్టిపదముపైననే

మొదట మీమాంసకులే వాక్యమునుగూర్చి మీమాంస సల్పిరి వాక్య శాస్త్రమని వారి పరిశీలన ఎలువబడినది 17 పాశ్చాత్యులందు స్టాయిక్ తాత్త్వికులే వాక్యార్థపరిశీలనమును సమగ్రముగ చేసిరి

కావున మొదటిపక్షమున పదమే అవయవి వర్ణములవయవములు రెండవ పక్షమున వాక్యమవయవి పదవర్ణములవయవములు

## 2 4 వాక్యార్థగ్రహణము

పదములును అర్థవంతములు—వాక్యములును అర్థవంతములే—అయిన పుడు అర్థమేకాకృతిగ భాసించునా పృథగర్థసమాహారమా ? అను ప్రశ్నముదయించి నైయాయికులలో కొందరు, భాట్టమీమాంసకులును, అన్వయమభిహితమనిరి వాక్యార్థము పృథక్పదార్థ సమాహారమని వీరివాదము ప్రాభాకర మీమాంసకులు పదములకు సమయాపేక్షాది కారణములవలన వాక్యాంతర్గతముగ కల్గు అర్థబోధ తక్క పృథగర్థము లేదనిరి కావున అభిధానమన్వితమనిరి 18 ఇవియే అభిహితాన్వయ అన్వితాభిధాన వాదములని భర్తృహరి కాలమునకు ప్రసిద్ధినొందినవి

## 2 4 1 స్ఫోట—అర్థబోధ

వాక్యము మాత్రమే సత్యమని పదవర్ణాది వైయాకరణ విభాగము కాల్పనికమని అర్థబోధ అఖండరూపమని 'ఏకోఽనవయవః శబ్దః' అని శబ్దమునఖండ స్వరూపముగ భావించి అర్థావబోధ 'స్ఫోట' మూలకముగ కల్గుచున్నదన్న తాత్త్వికుడు—అద్వైతి—భర్తృహరి అనాది నిధనమగు శబ్దబ్రహ్మము ప్రక్రియామూలమున అర్థభావరూపముల వివర్తమగుచున్నదవి ఇతని మతము (చూ వా ప 1-1, 2-1)

ఈదృష్టితో శబ్దము ప్రాకృతమని, వైకృతమని ద్వివిధము వర్ణదశ ప్రాకృతము ధ్వనిదశ వైకృతము (వా ప 1-77) అర్థబోధ వర్ణముల మూలమున వ్యంజింపబడు 'స్ఫోట' ద్వారమున జరుగుచున్నదని భర్తృహరి వాద సారాంశము ఇట స్ఫోట వ్యంగ్యము వరుసగా వీనినే వైఖరీ మధ్యమా పశ్యంతి దశలనిరి శబ్దబ్రహ్మము పశ్యంతీ స్వరూపము ఇది నిర్గుణము [19] (వా ప 1-1)

## 2 4 2 ఆనందవర్ధనుడు—కావ్యార్థగ్రహణము

భర్తృహరి ప్రతిపాదించిన వ్యంగ్య, వ్యంజక భావమును కావ్యమునకు అన్వయించుటలో ఆనందవర్ధనుని ప్రతిభయున్నది కావ్యము వాక్యదశ అనుకొనినచో అది వ్యంగ్యము కావలయును పదవర్ణదశలదున్న అవయవములేవి? వర్ణనములు వేని వర్ణనములు? విభావానుభావముల వర్ణనములు [20] వేని మూలమున? శబ్దార్థముల మూలమున కావున శబ్దార్థములను ప్రమాణముగ గ్రహించి కావ్యార్థనిరూపణము చేయనెంచుటవలన భర్తృహరి 'స్ఫోట కన్నను భిన్నమగు ప్రమాణమవసరమయినది ఆ ప్రమాణమే వాక్కు భగవతీ స్వరూపమగు వాక్కు పరమేశ్వరరూపమగు భావముతో నిత్యానపాయిత్వము కలిగినదను కాశ్మీర శివాద్వైతసూత్రము తప్ప మరియొకటి కావ్యార్థగ్రహణమును నిరూపింప సమర్థము కాదు

దేవీవాదము వాక్కు నాల్గురకములనిరి [21] పరా పశ్యంతీ - మధ్యమ - వైఖరులని పరాపశ్యంతులనువిద్ధములు నిర్గుణమగు భర్తృహరి వాదము ఇట సగుణమైనది ఇదియే ధ్వన్యాలోకమున వ్యంగ్యసద్భావమునకు ప్రాతిపదిక అభావవాద ఖండనములకు ప్రమాణము

## 2 5 అభిధా తాత్పర్యవాదములు—శాబ్దికదృష్టి

శబ్దమును మీమాంసకులభిదానమనిరి అనగా పేరు ముఅదు నిరూ ఎంచిన మొదటిదశ—అమ్మ - తల్లి వీని నడుమగల సంబంధము నిత్యమని నైయాయిక మీమాంసకులు, యాదృచ్ఛికమని వైశేషికులు వాదించెడివారు 22 ఇది చాలా ప్రాచీన వాదము అర్థమేర్పడుటకు కొన్ని నియమములు చెప్ప బడినవి సంసర్గము విప్రయోగము, సాహచర్యము మొదలగునవి 23 ఇవన్నియు సందర్భాదిహేతువులు ఈ హేతువులవలన అర్థము (అభిధేయము) ఎర్పడుచున్నది అభిధానాభిధేయములు అభిధా శక్తి (వృత్తి వ్యాపారములు నామాంతరములు) చే కట్టబడియున్నవి కావున శబ్దము వాచకము అర్థము వాచ్యము వాచ్యవాచక భావము శబ్దార్థముల సంబంధము 24 లోచన మభిధనిట్లు సమీక్షించినది

సమయాపేక్షా వాచ్యావగమన శక్తిరభిధాశక్తిః (పుట 62)

ఈదృష్టిలో నూత్నార్థములభిధవలననే సాధ్యము అన్వితాభిధానవాదులు25 శరమువలె అభిధదీర్ఘదీర్ఘ వ్యాపారము కలిగినదని సూచించిరి లోచనము కావ్య శబ్దముకభిధాత్వము పట్టదనెను (చూ పుట 188)

శబ్దములేనిచోట చేష్టాదుల మూలమున సంగీతము నందువలె అవాచకము లందును అర్థవిశేష ప్రకాశన ప్రసిద్ధియుండుట వలన అభిధాశక్తి పరిమితమని వ్యంగ్యార్థమనంతమని ఆలోక సిద్ధాంతము

వాచ్యోహ్యర్థః సాక్షాత్ శబ్దస్యసంబంధీ తదితరస్తు అభిధేయ
సామర్థ్యాక్షిప్తః సంబంధీ అవాచకస్యాపి గీతశబ్దాదే, రసాది
లక్షణార్థో అవగమదర్శనాత్ అశబ్దస్యాపి చేష్టాదేః
అర్థవిశేష ప్రకాశన ప్రసిద్ధేః (ధ్వ ఆ పుటలు, 417 4'6-47)

కావున అభిధావాదము శాబ్దికము మాత్రమే

## 2 5. 1 తాత్పర్యవాదము

తాత్పర్య (పర్‌పోర్ట్) మును విశ్లేషించుటయందును నైయాయిక మీమాంసక మతములు భిన్నమార్గములు త్రొక్కినవి గంగేశోపాధ్యాయుడు (తత్త్వచింతామణి) విశ్వనాథుడు (సాహిత్యదర్పణము) తాత్పర్యము వాక్యార్థావగాహనలో నాల్గవ అంశమనిరి (ఐ టి ఎం పుట 181). మూడంశములు ఆకాంక్ష యోగ్యత సన్నిధులు ఈదృష్టితో తాత్పర్యము వక్తృవివక్షాసంబంధి సిద్ధాంత ముక్తావళి (పుట 303)లో ఈ మూటిని ఆవరించినది తాత్పర్యమని (తాత్పర్య గర్భాచాసత్తి - విశ్వనాథ పంచాననుడు చూ ఐ టి ఎం పుట 182) చెప్పబడినది

మీమాంసకులు తాత్పర్యము ప్రమాణసిద్ధమనిరి ప్రమాణములు ఆరు ఇవియే షడ్లింగ ప్రమాణములు—ఉపక్రమోపసంహార అభ్యాస అపూర్వత ఫల అర్థవాద, ఉపపత్తులు. వక్తృవివక్షతో తాత్పర్యమునకు పనిలేదు, ఇది కేవలము శబ్దశక్తి యని వీరి యభిప్రాయము

వాక్యమున ఉద్దేశ్య విధేయములని రెండు భాగములు మొదటిది సిద్ధము రెండవది సాధ్యము తాత్పర్యము రెండవదానియిందుండును

'యదేవ విధేయం తత్రైవ తాత్పర్యమ్'

—కావ్యప్రకాశము (7-51)

అవిమృష్ట విధేయాంశమను దోషమాలంకారికులు చర్చించిరి (చూ. సాహిత్య దర్పణము 1-2 8-4) సంస్కృతమున పదక్రమమునకు వాక్యమున ప్రాధాన్యము లేదు కాని మీమాంసకులు తాత్పర్యమును విధేయాంశమని అంగీకరించుటవలన ఉద్దేశ్యము చెప్పియే విధేయము చెప్పబడవలయున

వాదించిరి. పదదశయందు అభిధావృత్తిని వాక్యదశయందు తాత్పర్యవృత్తిని ప్రతిపాదించిన మీమాంసకులు కొందరు గలరు కావ్యప్రకాశమున నీచర్చ గలదు (పుటలు 10-18)

పదార్థానాం సమన్వయే తాత్పర్యార్థో విశేషవపురపదార్థోఽపి
వ్యక్తార్థః సముల్లసతీత్యభిహితాన్వయ వాదీనాంమతమ్
(ధ్వ ఆ 2-6 క్రింద)

దీనినే కొందరు సంసర్గమర్యాదయని పిలుతురు 26 వాక్యార్థము పృథక్పదార్థముల కన్న విలక్షణముగ నుండుటకు కారణము తాత్పర్యశక్తి వాక్యదశకు చెందిన దనుటయే ఇచ్చట లక్షణ'యు అంగీకరింపబడినది అనగా పదములు అభిధామూలకములై లక్షణ ద్వారమున తాత్పర్యమును బోధింపగల్గుచున్నవని యర్థము ఇది భాట్ట మీమాంసకుల వాదము.

## 2 5 2 ఆలంకారికులు — తాత్పర్యవృత్తి.

ఆలంకారికులలో అభినవగుప్తపాదులవారే వాక్యాన్వయమును నిర్ధరించు ప్రమాణముగ తాత్పర్యము నంగీకరించినవారు 27

'తదన్యథానుపపత్తి సహాయార్థావబోధనశక్తిస్తాత్పర్యశక్తిః'
— లోచనము (పుట 62)

వాక్యమునందలి పదముల నడుమ అన్వయమును బోధించుశక్తి తాత్పర్యమని భావము అది శబ్దశక్తియే

ఆనంధవర్ధనుడు 'తాత్పర్య'మను మాట వాడలేదు కాని వాక్యార్థ పదార్థన్యాయము నంగీకరించినవాడు కావుననే

యథాపదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే (ధ్వ ఆ 1-10)

అనినాడు ఆయన దృష్టిలో శబ్దవ్యాపారములు మూడే

'త దేవం శబ్దేవ్యవహారేత్రయః ప్రకారః—వాచకత్వం గుణవృత్తిః ర్వ్యంజకత్వంచ (ధ్వ ఆ 3-33 క్రింద)

అభినవులు మాత్రము నాల్గింటిని అంగీకరించిరి అదనముగ తాత్పర్యము

ఆలంకారికులలో భోజుడు తాత్పర్యమును ప్రత్యేక దృష్టితో చూచినవాడు 28

తాత్పర్యమేవ వచసి ధ్వనిరేవ కావ్యే' అని అతని సిద్ధాంతము

ఇతని దృష్టిలో తాత్పర్యము మూడు దశలు కల్గినది—వాచ్య ప్రతీయమాన, ధ్వనిరూప దశలు

వాక్యాన్వయ విషయమున పైరెండు వాదములు చెప్పనరీతినిగాక అనుభయవాదమును భోజుడంగీకరించినాడు—ఈవాదము తాత్పర్యశక్తికి సంహత్యకారిత'ను ప్రతిపాదించినవి 29

దశరూపక వ్యాఖ్యాత ధనికుడు ధ్వని తాత్పర్యమున భాగమనినాడు ఆనందవర్ధనుడు వాచ్యవ్యంగ్య సంబంధమును ఘటప్రదీప న్యాయమనినాడు ధనికుడు ఇది దోషమనియు, కావ్యరస సంబంధము వాచ్యవాచక లక్ష్యలక్షణ సంబంధమనినాడు ఈవాదము ధనికుడు చేయుటకు ఆనందవర్ధనుడు తృతీయోద్ద్యోతమున చేసిన ప్రసంగము హేతువు పదార్థద్వారమున వాక్యార్థగ్రహణము జరుగునట్లు వాచ్యార్థపూర్వగ వ్యంగ్యానుభవముండునని ఆనందవర్ధనులు ప్రథమోద్ద్యోతమున చెప్పి, మూడవ యుద్ద్యోతమున

'నచపదార్థ వాక్యార్థన్యాయో వాచ్యవ్యంగ్యయోః (ధ్వ ఆ పుట 419) అనినాడు ఘటతదుపాదానన్యాయము — వాక్యార్థపదార్థమువంటిది అది వ్యంగ్యానుభవ విషయమున కుదరదు కారణము వ్యంగ్యానుభవమున్నపుడును వాచ్యార్థము దూరీకృతము కాదు కావున ఘటప్రదీపన్యాయమనినాడానంద వర్ధనుడు (పుట, 420)

ధనికుని విమర్శ ఈఅంశముపైననే—వాచ్యవ్యంగ్య సంబంధమునుకూడ తాత్పర్యమే వివరింపగలదని—

ఏతావత్యేవ విశ్రాంతిస్తాత్పర్యస్యేతి కింకృతమ్
యావత్కార్య ప్రసారిత్వాత్ తాత్పర్యం న తులాధృతమ్ 30

ఇక్కడి తర్కమిట్లున్నది వాచ్యవ్యంగ్యముల నడుమ ప్రాధాన్య వివక్ష యున్నది వ్యంగ్యము ప్రధానమైనపుడు ముఖ్యార్థమదియే అపుడది వాచ్యముతో సమానమే అపుడు మొదటి వాచ్యార్థమే తర్వాతి తాత్పర్యమునకు సాధనముగ నున్నదని అంగీకరింపవలయును (శృంగార ప్రకాశము పుట 149) ఇట్లు వ్యంగ్యసద్భావమనాదరింపబడుచున్నది

ఆనందవర్ధనుని సమాధానము చాల ప్రధానముగ గుర్తింపదగినది ఒక వాక్యమునకు వాచ్యార్థము పదవాక్యాంతర్గము దీనిని శబ్దవ్యాపారమగు తాత్పర్యము' బోధింపవచ్చు కాని అర్థాంతర ప్రతీతి వాచ్యార్థము31 నుండి పుట్టును కాని పదవాక్యపరిమితమగు 'తాత్పర్యము'నుండి కాదు—అనగా శబ్దార్థోభయ ద్వారముననని. (పుట 423)

వాచ్యము ప్రధానమైనచోటనే తాత్పర్యవాది వాదము చెల్లును వ్యంగ్యము ప్రధానమైనచోట శబ్దములు తత్పరములు కావుకదా। అపుడు తాత్పర్యమను మాటయే చెల్లదు

ఈదృష్టితోడనే ఆనందవర్ధనుడు అర్థమును

| | |
|---|---|
| ∧ వాచ్యమని ǀ<br>ǀ ప్రతీయమానమని ∨ | ∧ ప్రధానమని ǀ<br>ǀ అప్రధానమని ∨ |

భావించినాడు

ఇట్లనుటవలన ఒక వాక్యమునకొకే యర్థముండవలయునను తాత్త్విక విషయము భంగింపబడుటలేదు వాక్యైకత్వము ఖండింపబడుటలేదు 'ఉపసర్జన' మను పరిభాష ఇందులకే వాడబడినది

కావున ఆనందుని మతము ననుసరించి తాత్పర్యశక్తివాచ్యముతో ముగిసిపోవునది 32 అర్థాంతర ప్రతీతి శబ్దార్థోభయద్వారమున సాధ్యము కావున తాత్పర్యవాదముకూడ శాబ్దికమే

## 2 6 లక్షణా — భాక్తవాదము — అర్థదృష్టి

విశిష్టార్థకల్పనము లక్షణ అర్థమున ముఖ్య భాక్త (గౌణ) భేదములను పాటించువారు మీమాంసకులు భాక్తము చాల ప్రాచీనమగువాదము — (పదార్థేన ప్రసిద్ధతయా ఉత్ప్రేక్ష్యతే ఇతిభక్తిర్ధర్మః తతః అగతో లాక్షణికోఽర్థః — లోచనము పుట 28) శంకరుడు బ్రహ్మసూత్రములందును శౌనకుడు బృహద్దేవతయందును ముఖ్య గౌణార్థ ప్రసంగము గావించిరి 33 భాట్ట మీమాంసకులు వాక్యార్థము లక్షణమూలముగ తెలియుననిరి 34 నైయాయికులు ఉపచారమను పేరిట ద్వితీయార్థకల్పనము ఎట్లు సాధ్యమగునో వివరించుటకు ప్రయత్నించిరి గౌతమ న్యాయసూత్రము లిందుకు నిదర్శనములు 35

గౌతముడు సహచరణ - స్థాన - తాదర్థ్య వృత్త - మాన - ధారణ - సామీప్య యోగ- సాధనాధిపత్యములను విశిష్టార్థహేతువులుగ భావించినాడు 36

అభిధావృత్తి మాతృకయందు లక్షణ పంచవిధములుగ చెప్పబడినది (పుట 17) [37] అభిధేయ సంబంధము, సాదృశ్యము, సమవాయము, వైపరీత్యము, క్రియాయోగము ఈలక్షణములను పరిశీలించినచో లక్షణను గుర్తించుటలో నాల్గుదృష్టులు కనిపించును

1) రెండు వస్తుభావముల నడుమ ఔపమ్యము—గౌణీవృత్తి
2) వస్తువుల నడిమి సంబంధము
3) వస్తువుల నడిమి భేదమున తారతమ్యములు
4) ప్రయోజనము

## 2 6 1 లక్షణ--ముఖ్యార్థము

బృహద్దేవతయందు పదములు పంచవిధములని చెప్పబడినది (2-101)—ధాతుజములు, ధాతుజాజ్జాతములు, సమస్తార్థజములు వాక్యజములు, వ్యతికీర్ణములని పంకజ వంటి శబ్దములు యోగరూఢములు 'అశ్వగంధ వంటివి యౌగిక రూఢములు నిరూఢలక్షణ[38] యను మరియొక వర్గమును జగదీశుడీ సందర్భమున జెప్పినాడు (శబ్దశక్తి ప్రకాశిక పుట 16) [39] కుశల ప్రవీణ ద్విరేఫ వంటివి నిరూఢలక్షణచే అర్థబోధ కల్గించును అనగా ముఖ్యార్థమువలె వర్తించు లక్ష్యార్థములని అర్థము లక్షణను వర్గీకరించుటలో ఇది మూడవ పద్ధతి ఆలంకారికులు లక్షణకు లక్షణము నేర్పరచుటలో లక్ష్యార్థమునకుగల నిరూఢత్వము (యూసేజ్) ఒక ముఖ్య ప్రమాణమయినది

లక్షణా ఇతి చేద్వరం లక్షణా నకల్పితా, నయాగాభిధానం లౌకికీహ
లక్షణా హరోఽప్రసిద్ధకల్పనా'[40]

అని శబరభాష్యము (1 4-2) లక్ష్యార్థము రూఢిమూలకమే కాని గుర్తింప

బడనంతగా వ్యవహారముతో కలిసిపోయియుండును ఎవరో శాస్త్రజ్ఞుడు గుర్తించును

కుమారిలభట్టు నిరూఢలక్షణలు కల్పితములు కావనెను రూఢి అన్నిటికిని లభింపదనెను (తంత్ర వార్తికము పుట 683)[41] మమ్మటాచార్యుడును అంగీకరించెను (శబ్దవ్యాపారవిచారము పుట 7)[42] ప్రతిభాషయందలి పదములలో అధికభాగము లాక్షణికార్థము కలిగినవే, కాని రూఢములై ముఖ్యార్థమువలె ప్రవర్తించును కావుననే ముఖ్యార్థము అభిధమూలముగ మాత్రమేకాక లక్షణమూలముననుఎద్ధించునని భాట్టమీమాంసకులు చెప్పుట[43] (చూ వాక్యపదీయము 2 168)

## 2 6 2 ఆలంకారికుల -- లక్షణ

భాక్తమాహు స్తమన్యే (1-?) అను కారికయందలి భాక్తము లక్షణకు మరియొక పేరు లోచనమున లక్షణకిచ్చిన నిర్వచనమిది

ముఖ్యార్థబాధాది సహకార్యపేక్షార్థ ప్రతిభాసన శక్తిర్లక్షణాశక్తిః (పుట 62) ముఖ్యార్థబాధాది లక్షణములు లక్షణకు చెప్పిన ఆలంకారిక సంప్రదాయమున్నది ఆనందాభినవుల గ్రంథములనుబట్టి లక్షణకు వారుభావించిన లక్షణములు మమ్మటాచార్యునియందు ప్రతిఫలించుచున్నవి

> ముఖ్యార్థబాధే తద్యోగేరూఢితో ఽథప్రయోజనాత్
> అన్యోఽర్థో లక్ష్యతే యత్సా లక్షణారోపితక్రియా
> (కావ్యప్రకాశము 2 9)

ముఖ్యార్థమునకు నిర్వచనము భర్తృహరి చెప్పినాడు

> శబ్దస్యోచ్చారణే స్వార్థః ప్రసిద్ధో యస్యగమ్యతే
> స ముఖ్య ఇతి విజ్ఞేయో రూపమాత్ర నిబంధనః
> (వాక్యపదీయము 2 263)

గౌణమునకు భర్తృహరి

అర్థప్రకరణాపేక్షో యోవాశబ్దాంతరైః సహ
యుక్తః ప్రత్యాయయత్యర్థం తంగౌణమపరేవిదుః (2-261)

అని నిర్వచనము చెప్పినాడు గౌణ, ముఖ్యప్రకల్పనము సిద్ధ్యసిద్ధుల నాధార ముగ జేసినదని వాక్యపదీయము (2-263) నిమిత్తము ముఖ్యార్థమని నిమిత్తి గౌణమని (2-261) ఈరెంటి నడుమ తాత్త్వికభేదము సూచింపబడినది

ఆనందవర్ధనుడు వాడిన 'భాక్త' పదము మీమాంసకులకు సంబంధించినదే కాని నైయాయికులకు కాదందురు[44] వాక్యపదీయమందలి వివరణము ముఖ్య గౌణభేదములను నిరూపింపగలుగుచున్నది లక్షణామూలధ్వని యున్నదనుటవలన ధ్వని భాక్తముకాదని చెప్పుటయే ఆనందుల దృష్టితప్ప అసలు భాక్తము లేదనుట కాదు కావున అభిధకంటె భిన్నమగు లక్షణను ఆనందవర్ధనుడు గుర్తించినాడు

లోచనము లక్షణము చెప్పినది

అర్థప్రతిభాసన శక్తిలక్షణ' అని (పుట 62)

ఈఅర్థము సహకార్యపేక్షము ముఖ్యార్థబాధవలన నేర్పడునది కావున వీరు లక్షణనుకూడ ఒక ధ్వని భేదముగ గ్రహించిరి ప్రతిభాసనశక్తి యనుట నిదర్శనము అభిధను అవగమనశక్తి అని తాత్పర్యమును 'అవబోధశక్తి అని అనుటలోను వీరి తాత్పర్యము వ్యంజనము వీనిలో అన్నిటను అంత స్స్యూత్రమని నిరూపించుట [45]

ఈదృష్టితో జయరథుడు చూపించిన (లక్షణానుమితిద్విధా) అనుటను పరి శీలించినచో లక్షణలోని జహదజహత్స్వార్థములను రెండు భేదములే ధ్వనికి విప్రతిపత్తులని చెప్పగలము అవివక్షితావాచ్యమను ధ్వని ప్రభేదముక్రింద జహత్స్వార్థము పరిహరింపబడినది (2 1)

'లక్షితలక్షణ'మను విభేదము వ్యసనమాత్రమని ధ్వనికది లక్షణము కాదని లోచనము నిరసించినది (లోచనము పుట 61/149). అజహత్స్వార్థ మగునది లక్షణ యెట్లగును ? కావున 'ముఖ్యార్థబాధ' అనగానేమియను విషయమున భిన్నాభిప్రాయములు పెరిగినవి

ముఖ్యార్థబాధ వ కాక్యార్థానుపపత్తియా ?

తాత్పర్యానుపపత్తియా ?

ఆలంకారికుల సమాధానము వాక్యార్థానుపపత్తియని తాత్పర్యము లక్షణకు సంబంధించినదికాదు (చూ లోచనతాత్పర్యనిర్వచనము) వాక్యార్థానుపపత్తి రూఢిప్రయోజనములచే నియమితమగుచు లక్ష్యార్థమును ప్రతిభాసంపచేయుచున్నది కావున ఇది ప్రాథమికముగా అర్థవ్యాపారము 46 కావున మమ్మటాచార్యుల నిర్వచనమునకిట్లు అర్థము చెప్పవచ్చును ముఖ్యార్థ బాధవలనగాని, ద్వితీయార్థముతోడి యోగమువలన గాని లేక రూఢివలననో, ప్రయోజనము వలన గాని ద్వితీయార్థారోపణము చేయుట లక్షణ పైన నిరూపింపబడిన అంశములలో పేర్కొనబడనిది ప్రయోజనము ఆలంకారికులు లక్షణ'ను గురించి నైయాయిక మీమాంసకుల కన్నను భిన్నముగా ఈఅంశమునే పరిశీలించిరి

ఆనందవర్థనుడే దీనికిని ఆద్యుడు—లక్షణ ద్వితీయార్థబోధన సమర్థమయినను ఆ యర్థము రసభావ సమర్పకమా ! కాదా ! అని తేల్చునది వ్యంజన వ్యాపారము మాత్రమే (లోచనము పుట 140) కావ్యప్రకాశము దీనిని విశదపరచినది

ప్రయోజనం హి వ్యంజనా వ్యాపారగమ్యమేవ (2-15-16)

ఈదృష్టితోడనే మమ్మటుడు ప్రయోజనవతీ లక్షణను ఒక ప్రభేదముగ గుర్తించినాడు (2-9-10)[47] దీనికొక ప్రసిద్ధమగు నుదాహరణము పరిశీలనీయము

'గంగాయాం ఘోషః' అను వాక్యమున్నది ఇందు గంగాగతశీతలత్వ పావనత్వములు వ్యంగ్యములని నిరూపింపవచ్చును కారణములివి

1) గంగ అను పదమునకివి వాచ్యార్థములు కావు
2) ముఖ్యార్థబాధాది హేతువులు లేవు

ఒక సమయము గంగాయామ్ అనునపుడు విభక్తిప్రత్యయము అసమన్వితమని అనుకొన్నచో ఆవాక్యమునిట్లు వ్రాసినను భావవ్యంజనకు నష్టములేదు

'గంగాతటే ఘోషః'

కావున ఇది ప్రయోజనము కల్గిన లక్షణవ్యాపారము ఇట్టిచోట్ల ధ్వని చెప్ప బడును (చూ జయరథుని అలంకార సర్వస్వవ్యాఖ్య పుట 11) నిరూఢ లక్షణ పనిచేయుచోట్ల భావవ్యంజకత చెప్పుటకు కుదరదు కారణము అవి వాచకమాత్రములుగ వ్యవహరించుట

## 2 6 3 లక్షణ – అభిధాపుచ్ఛభూతము —

(లోచనము పుట 151)

ముఖ్యార్థము నిర్ధరించిన తరువాతనే గౌణార్థపరిశీలన సాధ్యము స్వరము నకు ముఖ్యార్థము సంగీతమునందులేదు

'వాచకత్వాశ్రయేణైవ గుణవృత్తిర్వ్యవస్థితా' (ధ్వన్యాలోకము 1-10) ముఖ్యార్థముండని చోటనే లక్ష్యార్థము చెప్పుట కుదురును కాని అజహత్స్వార్థ లక్షణలో ముఖ్యార్థ బాధలేదు ఇది పూర్వులు గుర్తించిన విషయమే

వ్యంజన వాచ్య వ్యంగ్యముల నేకకాలమున ననుభవింపజేయును అసం లక్ష్యక్రమ వ్యంగ్యమనుట ఇందుకే

గీతధ్వనీ నామం వ్యంజకత్వమ స్తిరసాది విషయమ్
నచతేషాం వాచకత్వం లక్షణావా కథంచిల్లక్ష్యతే
(ధ్వ. ఆ పుట 194)

లక్షణ 'అర్థము నాధారముగా గలది కావున వస్తువును మాత్రము ద్యోతకము చేయగలదు వ్యంజనమూలమున వస్త్వలంకారరసములు మూడును వ్యంగ్యములని ముందు చూపబడినది వ్యంజన శబ్దార్థవ్యాపారమగుట కారణము

లక్షణ వ్యంగ్యానుభవమునకు ద్వారము కావుననే లక్షణను స్ఖలద్గతి 48 కలిగినదని ఆనందవర్ధనులు వ్యవహరించిరి

ముఖ్యాం వృత్తిం పరిత్యజ్యగుణవృత్త్యార్థదర్శనమ్
యముద్దిశ్యఫలం తత్ర శబ్దోనైవ స్ఖలద్గతిః' (ధ్వ ఆ 1-17)

కావున లక్షణతో ధ్వనిని నిర్వచించిన అతివ్యాప్త్యవ్యాప్తి (ధ్వ ఆ 1-18 క్రింద) దోషములు తప్పవు

## 27. వ్యంజన—చతుర్థకక్ష్య [శబ్దార్థదృష్టి]

రోచనకారుడు వ్యంజననిట్లు నిర్వచించెను

'తచ్ఛక్తిత్రయోఽర్ధజనితార్థావగమ మూలజాత—తత్ప్రతిభాస పవిత్రతత ప్రతిపత్తృ ప్రతిభా సహాయార్థద్యోతనశక్తిః ధ్వని ర్వ్యాపారమ్' (పుట 62-63)

ఇంతదనుక చూపబడిన శక్తిత్రయావగమనముచే నేర్పడు అర్థములే మూలము లగ, ఆయర్థముల ప్రతిభానముచేత పవిత్రితుడైన ప్రతిపత్తయొక్క ప్రతిభా సహాయమున అర్థద్యోతనముసేయు వ్యాపారము ధ్వని

ఇంతదనుక శ్రోతకు ప్రాధాన్యము లేదు 49 వక్తృవివక్షకు ప్రాధాన్య మిచ్చుటచ్చట ఉన్నది కాని ఇచ్చట ఇరువురికిని ప్రాధాన్యమున్నది వక్త కవియని, శ్రోత సహృదయుడని భావించినచో నా యిరువురి నడుమ ప్రతిభా సమానత లేకపోయినచో 'వ్యంజన కనిపించదు కావున 'ధ్వని' (వ్యంజన వ్యాప్రక్రియచే కల్గు అర్థాంతర ప్రతీతి) అభిధా తాత్పర్య. లక్షణలకంటె భిన్న మగుచున్నను ఇవి క్రమముగ ఒకట మరియొకదానియందు పర్యవసించెడి లక్షణము కలవి కావున అభిధా మూలవ్యంగ్యమున్నది

లక్షణా మూలవ్యంగ్యమున్నది

కావ్యనీ అభావవాదమ లందు సభావతలో ఒకదానికంటె నొకటి గుణవంతము లగుచున్నవని పండితులు గుర్తించిరి 50 ఇట్టిమూడు [అభిధ—లక్షణ—వ్యంజన] మాత్రమే శబ్దార్థవ్యాపార సంబంధులు శక్తిభక్తివ్యక్తి గంగా యమునా గూఢనిర్ఝరాః 51 అని—ఇంకనే ఆశాధరభట్టు (త్రివేణికి) పోలిక చెప్పినాడు

## 2 8 అనుమితి — శబ్దార్థవివేకదృష్టి - అర్థాపత్తి

అనుమానమనగా లింగలింగిజ్ఞానము సాధనసాధ్య సంబంధమని అర్థము. ధూమాగ్ని న్యాయముదాహరణము వ్యాప్త్యక్షముకని ప్రమాణము ననుమాన మందురు ఇది నైయాయికుల దృష్టి అనుమానము రెండురకములు— స్వార్థానుమానము పరార్థానుమానమని మహిమభట్టు (1100 A D) సర్వ వ్యంజన భేదములను అనుమానాంతర్భావితములుగ నిరూపించినాడు

అనుమానేంతర్భావం సర్వస్యైవ ధ్వనేః ప్రకాశయితుమ్
(వ్యక్తివివేకము (వ్య వి 1-1)

అనినాడు ఇతడును కాశ్మీరీయుడు కావుననే పరావాక్కునకు నమస్కరించినాడు 52

'వ్యక్తివివేకం కురుతే ప్రణమ్య మహిమా పరాంవాచమ్' (వ్య వి 1-1)

వ్యక్తి (వ్యంజన) వ్యాపారమునగల యుక్తాయుక్త విచారము చేయుట ఇతని దృష్టి ఇదియే అతని 'వ్యక్తివివేకము[53] అతనికి రసము కావ్యాత్మ యనుటలో నమ్మకమున్నది కాని అతని ప్రశ్నమంతయు 'వ్యంజన వ్యాపారము మీద - అనగా ద్యోతన ప్రక్రియ మీద

కావ్యస్యాత్మని సంజ్ఞిని రసాదిరూపే కస్యచిద్విమతిః
సంజ్ఞాయాం సా కేవలమేషాం వ్యక్త్యయోగతోఽన్యకతః
(వ్య వి 1-16)

కావున రసము వ్యంగ్యము కాదు—అనుమానితమనుట ఇతని దృష్టి[54] ఇతని శబ్దార్థదృష్టి అనుశీలనీయము

ఇతడు వ్యుత్పత్తివాది (ఎటిమొలాజికల్ సైంటిస్ట్) శబ్దమును కేవలము వ్యవహారసాధనముగ గ్రహించినాడు ఇతరులకు అభిప్రాయములను నివేదించుటకే శబ్దోపయోగము కావలసివచ్చుచున్నదని ఇతని దృష్టి (చూ వ్యం సూ 1 5 1-5) (ఆలంకారికులలో ఈసాధ్యసాధనదృష్టి సాధారణముగ కనిపించదు)

శబ్దప్రయోగః ప్రాయేణ పరార్థముపయుజ్యతే
నహా తేన వినా శక్యో వ్యవహారయితుం పరమ్ (వ్య వి 1 37)

ఇది సరిగా ఆనందవర్ధనుని సిద్ధాంతమునకు విరుద్ధమైనది వ్యక్తావ్యక్తములందంతటను నిండిన పరావాక్స్వరూపము ఆనందునికి ధ్యేయము నైయాయిక మార్గానుయాయిగా[55] శబ్దముల స్వతంత్రస్థితిని ఇతడును అంగీకరించలేదు అన్వితాభిధానపక్షమే తాత్పర్య విషయమున ఇతనిదియును ఈ దృష్టితోడనే నామశబ్దములకు క్రియాజన్యత్వము నంగీకరించినాడు అనగా జాతిగుణక్రియాద్రవ్యవాచకముల కన్నింటికిని మూలముగ ఒక క్రియ యుండునని అర్థము
(వ్య వి 1-10)

ఈ సృష్టితోడనే ఘటపటాది శబ్దముల మీమాంస చేసినాడు,

ఘటతీతి ఘటో జ్ఞేయో నాఘటన్ ఘటతామియాత్
అఘటత్వా విశేషణ పటోఽపి స్యాద్ఘటోఽన్యథా (వ్య వి 1-8)

(ఘటమును ఘటమని ఎందుకందుము? ఘటనక్రియ అంతర్గతముగ నుండుటవలన లేనిచో పటమునుకూడ ఘటమనవచ్చును)

అందువలననే
యథాహ్యశ్వతి బాలేయ ఇత్యతోర్థః ప్రతీయతే
అశ్వత్వ మాసాద్యతి ఖర ఇత్యర్థర పునః (వ్య వి 1-13)

గాడిద గుర్రమువలె పరుగిడుచున్నది' అను వాక్యమునకు క్రియామూల మైన గార్దభత్వము 'అశ్వత్వమును పొందినదనెడు అర్థము ప్రతీయమానమగును అనగా గార్దభ క్రియాకలాప మశ్వమువలె నున్నదని కావున అర్థమును తెలుపునది శబ్దమునందలి సత్త (క్రియామూలకశక్తి) (వ్య వి 1-14)

తస్మాన్నామ పదెభ్యోయః కశ్చిదర్థః ప్రతీయతే
నస సత్తా మనా సాద్య శబ్దవాచ్యత్వ మర్హతి (వ్య వి, 1- 8)

కావున పదము లన్నింటియందును అస్తి భూధాతువు లంతర్నిహిత ములు 56 అట్లుకాని పాకాది క్రియలు విశేష క్రియలు (వ్య వి 1-20)

ఇట్లు శబ్దమతని దృష్టిలో రెండేభేదములు కల్గినది (ద్వివిధోహా శబ్దః పదవాక్య భేదాత్) (వ్య వి పుట 22)

1 క్రియామూలమైన పదము 2 వాక్యము

వాక్యమేక ప్రకారమే దానికిని క్రియయే మూలము

'వాక్యమేక ప్రకారః క్రియాప్రాధాన్యాత్ తస్యాశ్చైకత్వాత్ (వ్య వి పుట 38)

ఇట్లు వాదించుటలో ఎదార్థవాక్యార్థములనడుమ సాధనసాధ్యభావము సాధించుట అతని దృష్టియనుట స్పష్టము క్రియసాధ్యము కావున శబ్దము సాధనము ఇట్లర్థశబ్దములనడమ సాధ్యసాధన సంబంధము

ఇది ప్రణాళికగా అర్థముని తడిట్లువిభజించినాడు వాచ్యము, అనుమేయముఅని

ఇది వాచ్యప్రతీయమానములను ఆనందవిమార్గమునకుసరిగా వ్యతిరేకము 57

శ్రుతిమాత్రవ్యవస్థితార్థము వాచ్యము - అదియే ముఖ్యము యత్తోపపాదితార్థము - గౌణము

తతఏవ అనుమితాద్వాలింగభూతాద్ యిదర్థాంతరమనుమీయతే సోఽనుమేయ (వ్య వి పు 39-40)

అనుమితార్థము మూడువిధములు వస్త్వలంకారరసార్థములని మొదటి రెండును వాచ్యమాత్రసిద్ధములు మూడవది మాత్రమే అనుమేయము కావున పదార్థము కేవలమువాచ్యము వాక్యార్థముకేవలమనుమేయము. కావున సాధ్యసాధనభావము కేవలము వాక్యమునందేయుండును. స్వార్థానుమానమునగానిదియే

ఆనందుల పదధ్వని నిరూపణమునకిది ప్రతిబాధకము అట్లయ్యు విధేయాంశ సాపేక్షనిరపేక్షభావము నాధారముగ వాక్యార్థమున మరల వాచ్యానుమేయ భేదద్వయమును మహిముడంగీకరింపక తప్పలేదు 58

ప్రాయశః అలంకారికులనుమానము నేకబుద్ధి విషయముగ నంగీకరించుటలో సార్థక్యమిచ్చుటగలదు కాని మహిముడు సాధ్యసాధనభావము వాక్యమునసేకాక సర్వవాఙ్మయమునను నిరూపింపదలచినాడు

ఒక ఉదాహరణము

అయాచితారం నహిదేవమద్రిః సుతాం ప్రతిగ్రహయితుంశశాంక
అభ్యర్థనాభంగభయేన సాధుర్మాధ్యస్థమిష్టేఽవ్యవలంబతేఽర్థే
(కుమార సంభవము)

పై శ్లోకమున వేదప్రమాణాదిశాస్త్ర పరిజ్ఞానమిచ్చుట అర్థము ననుమీయ మానము సేయుచున్నదని మహిమభట్టువాదము కారణము ప్రదర్శింపబడుచున్నది

అయాచితానిదేయాని సర్వద్రవ్యాణిభారత
అన్నం విద్యాతథాకన్యా అనర్థిభ్యోనదీయతే

ఇది శాస్త్రప్రమాణము కార్యకార్య విచక్షణకు శాస్త్రమేప్రమాణము కావుననే హిమవంతుడు శంకరుడువచ్చి అర్థించుదనుక కన్యనివ్వరాదనినిలిచెను ఇది కార్యకారణభావముకాదా! అని మహిముని అనుమానము ఈదృష్టితో అతనిధ్వనిఖండనము ప్రసక్తనీయము యత్రార్థః శబ్దోవా - [1-13] అన్న ధ్వని కారికలో మహిముడు కొన్నిదోషములు గుర్తించినాడు 59

1 అర్థముపసర్జనీకృతమగుననుటలో నిష్ఫలత
2 శబ్దపదోపాదనానుపాదేయత
3 అర్థపదమున అనిశ్చితాభిప్రాయము
4 తమర్థమ్ - లోని తత్పదపుల్లింగాభిధానము
5 వా' వకార సంభవప్రయోగము
6 'వ్యంక్తః' అనుటలో ద్వివచనానుపపత్తి
7 వ్యక్తి సిద్ధిలో దోషము
8 'కావ్య విశేషమనుట
9 ధ్వని అను పదమువాడుట
0 సూరిభిః అని బహువచన నిర్దేశము

ఇవి క్రమముగ నిర్దేశింపబడుచున్నవి

1 'ఉపసర్జనీకృతస్వార్థ' మనుటలో విశేషణవిశేష్యభావములేదు దీనికి రెండు ఉదాహరణములు -

నీలకమలము - ఇందు 'నీల సార్థకవిశేషణము కారణము శ్వేతరక్త కమలములుండనగును కావున -

'ఉష్ణఅగ్ని' అనుటలో సార్థకతలేదు కారణము శీతాగ్నిలేదు కావున ఇది సంభవవ్యభిచారిభావసత్త అని నైయాయిక మతము ఉపసర్జనీకృతము కాని స్వార్థములున్నచోట్లను గుణీభూతవ్యంగ్యము చెప్పబడినందున ఇట్లనుట నిష్ఫలము (వ్యక్తివివేకము 1 29) (చూ లో 1-13 క్రింద పుట 193)[60]

2 'శబ్దపదమనావశ్యకము' కారణము శబ్దము స్వార్థాభిధానాతిరిక్త వ్యాపారాంతర సమర్థముకానందున అర్థమును ప్రకాశింపజేయుటవరకె శబ్దము జేయగల్గినది దీపమువంటిది శబ్దము ప్రకాశమువంటిది అర్థము దీపము ప్రకాశాంతరమునెట్లు బోధించును! అనుకార్యవశముగ ఒక్కొక్కసమయము సార్థకము, నిరర్థకము, కావచ్చును ప్రతీయమానార్థప్రతీతి ఇట్టిదికాదు అది వాచ్యముచేత సాధ్యము అనగా అర్థమర్థాంతరప్రతీతికి సాధనము అంతియకాని శబ్దముకాదు కావున 'శబ్ద' మనుట అనవసరము [1-28]
(చూ లో 3-1 క్రింద పుట 209)

3 ఆనందునికి అర్థమనుపదమునందు నిశ్చితాభిప్రాయములేదు వాచ్య లక్ష్య వ్యంగ్యములని ధ్వన్యాలోకానుసారముగ మూడర్థములుగలవు లక్షణ శ్లోకమున వాడబడిన అర్థ పదము ఏ అర్థమునవివక్షితము?

వాచ్యార్థమను అర్థముగ్రహించినచో 'ఏవంవాది నీత్యాది (ధ్వ అ 2-22) కు ఋ రసంభవశ్లోకమున వ్యంగ్యాభివ్యక్తి వాచ్యార్థమూలమున జరుగుటలేదు

ఆనందవర్ధనుడు అర్థశక్తి మూలవ్యంజనమనినాడు ఇచ్చట అపుడు ధ్వనిలక్షణ ప్రవ్యాప్తదోషగ్రస్తమనవలెను ప్రహేళికలయందు అర్థాంతరప్రతీతి వ్యంగ్య భూతమైయున్నది అచ్చటకావ్యాత్మకత్వమును ఆనందాదులును అంగీకరించలేదు 6। (వ్య వి 1 21 22) అపుడు అర్థపదార్థమేమి? (చూ లో 2-1 పుట 166)

4 తం - పః అనబడినది పుంలింగమునే ఎందుకు వివక్షింప వలెను? సర్వనామమెపుడును పూర్వప్రకాంతపరామర్శకము కావున సర్వనామ మునకు లింగవచనభేదము పూర్వోక్త సంజ్ఞాపదములందువలెనే వివక్షనీయము తత్పదమను ప్రయోగముగల ఈకారికకు ముందున్నకారికయందున్న 'ప్రతీయ మానమ్' శబ్దము నపుంసకము ఇచట పుంలింగమున వివక్షించుట ఎట్లు?

(చూ లో పుట 105)

అట్లుగాక సరస్వతీస్వాదుతదర్థవస్తు ఇత్యాది కారికయందు పుంలింగ వివక్ష చెప్పనచో పాఠవిపర్యయమగుటవలన పర్యాయప్రక్రమదోషము సంభ వించును కావున పుంలింగ వివక్షతప్పు (లో 1-6 క్రిందపుట 11)

5 వా శబ్దప్రయోగము అటు సముచ్చయమును, ఇటు వికల్పమును రెండిని బోధింపసమర్థముకాకున్నది పక్షాంతరాభావమున వికల్పమసంభవము సముచ్చయమనినచో వ్యంక్తః అనుటలో ద్వివచనము దోషయుక్తమగును

(లో పుట 104)

6 'వ్యంక్తః' అనుటలో ద్వివచనమెందులకు? 'అంజ్' ధాతువునకు అంజూవ్యక్తిమ్రక్షణకాంతిగతిషు అని అర్థములు పెక్కులుగలవు ఇట ఏఅర్థమున గలవు? కారికయందు కర్తృస్థానమున శబ్దార్థములున్నవి రెండును వా చే విడదీయబడియున్నవి ఉపుడు క్రియలో బహు వచనమెట్లువచ్చును? అపుడు వ్యంక్తః అనుట భ్రాంతిమూలకము (లో పుట 423)

7 'వ్యంజన' నిర్దేశమున దోషముగలదు ‹వ్యంక్తః' అను పదము 'వ్యంజన' ను బోధింపనెట్లు సమర్థము ? (చూ లో పుట 62)

8 కావ్యవిశేషమనుట ఏమి? విశిష్టత కేవలము వ్యంజవలననే సిద్ధించు చున్నదా! మరి రసము మాట ఏమి ? (కావ్యస్యాత్మాసఏవార్థః-ధ్వ ఆ 1-5) ఇత్యాది కారికలో వివక్షింపబడినది రసాదికాదా! అపుడు ధ్వని కావ్యవిశేషమగుట ఎట్లు ? (చూ లో పుట 16)

9 'ధ్వని' పదప్రయోగము - వ్యర్థము అశ్వారూఢుడై రాజు వచ్చు చున్నాడని తెలిసినవెంటనే అధ్వగులు రాజు 'ఫలానా' వాడని చెప్పబడక పోయి నను గుర్తించినట్లది 'ధ్వని అని గుర్తింతురు - దానికి పేరేల ?

(చూ లో పుట 10)

10 సూరిభిఃకథితః - అనుటయుదోషమే - అవాచ్యవచనము కారణము కారికావాక్యముననే ఆయర్థమంతర్గతము (చూ లో పుట 10)

ఇన్ని దోషములను ఎత్తిచూపి మహిమభట్టు ధ్వనికారికను సంస్కరించి ఇట్లు తిరిగివ్రాసినాడు

వాచ్యస్తదనుమితోవాయత్రార్థోఽర్థాంతరం ప్రకాశయతి
సంబంధతః కుతశ్చిత్ సాకావ్యానుమితిరిత్యుక్తా (వ్య వి 1-24)

వాచ్యముకాని తదనుమితార్థకము కాని అర్థాంతరప్రతీతి ఎచ్చటకల్గించునో అది కావ్యానుమితి

ఇచ్చటను 'ప్రకాశ' మను పదముకలదు కాని అప్రకాశముద్యోతితము కాదు - 'అనుమానితము' 62

ఇచ్చటనే పరార్థానుమానమునకు వివరణముచెప్పినాడు

ఏతచ్చేవానుమానస్యైవ లక్షణంనాన్యస్య యుక్తంత్రిరూపలింగాఖ్యానం పరార్థానుమితి కేవలం సంజ్ఞాభేదః (1 24 వృత్తి)

కావున ఆనందవర్ధనుని ధ్వని మహాముని పరార్థానుమానము ఈ అనుమితి ద్వయము వ్యంజన సూత్రబాధకము. శబ్దము స్వతంత్రితలేనిదనుట మొదటి దశలో - శబ్దార్థముల సహకారిత్వములేదనుట రెండవదశలో

అందుకే మొదట ఇతడు ప్రాథమికముగా లాక్షణికవాది అని చెప్పబడినది అర్థదృష్టికల్గినవాడు కావున కాని అనుమానమున లక్షణను, వ్యంజనను రెంటిని భాగముగ తలచుట ఇతనివిలక్షణత - కారణము 'రస' ప్రతీతిని ఇతడును అంగీకరించుట

ఆనందవర్ధనులు ఇట్లనుచున్నారు -

'వ్యంజకత్వం శబ్దానాంగిమకత్వం తచ్చలింగత్వం అతశ్చ
వ్యంగ్యప్రతితిర్లింగ ప్రతీతిరేకేతి లింగలింగ భావ ఏవ
తేషాం వ్యంగ్య వ్యంజక భావోనాపరఃకశ్చిత్ (ధ్వ అ పుట 448)

కావున ఇచని అనుమానవాదమంతయు శ్రోతృముఖముగ సాగినది, వక్తకు ప్రాధాన్యములెదు అభినవులు ఖండింపగలుగుటకీలోపమే హేతువు

వాచ్యవ్యంగ్యానుభవములు పరస్పరపోషకములనుచు ఆనందవర్ధనుడు ఘట ప్రదీపన్యాయమును చూపినాడు ఈ అన్వై కాంతి కత్వమును లోచనమిట్లు వివరించినది

'ప్రదీపలోకాదౌ లింగలింగి భావశూన్యేఽపిహివ్యంగ్యవ్యంజక భావోఽస్తి (పుట 449)

వాచ్యవ్యంగ్యములనడుమ దశాంతరమొకటి స్థాపింపబడినగాని లింగలింగి సంబంధమునుచెప్పుట కుదరదని తాత్పర్యము 63

## 2 8 1 అర్థాపత్తి—అనుమితి –

అనుమితివాదమున గల సమస్య అర్థాపత్తి' ద్వారమున పరిష్కరింప బడినది. ఆసమస్య వాచ్యవ్యంగ్యముల నడిమిదశ తాత్పర్యవాదులు ప్రతిపాదించిన 'సంసర్గమర్యాద' ఇదియే - నైయాయికులిట్లుఅందురు, భాట్టమీమాంసకులు దీనిని లక్షణభేదముగ గ్రహించిరి లుప్తపదాంశవాక్యము (ఎలిప్టికల్ సెంటెన్స్) లలో అర్థావగాహన 'శ్రుతార్థాపత్తి' వలన సాధ్యమని వీరువాదింతురు చరితాస్తిక్రియను గురించిన వాక్యపదీయ ప్రతిపాదనమిట్టిదే (చూ 2-270) ఇచ్చటశ్రోత ఒక అర్థమును ఆపాదించుననుట గ్రాహ్యము సామాన్య వ్యవహారమున గల వాక్యములం కర్థనిర్ణయము చేయుటలో 'అర్థాపత్తి' సమర్థమయినను కావ్యార్థావగాహనలో అసమగ్రమని ఒక సమాధానము 64 కాని ఇట్లుచెప్పుటలో ఒక చిక్కున్నది ధ్వన్యాలోకము కేవలము కావ్యభాషకు సంబంధించినదని చెప్పునచో 'వాగ్వ్యాపార'మ ను సిద్ధాంతము భాషాప్రక్రియగా చెప్పుటకుదరదు, దీనికి పరిష్కారమిది

అర్థాపత్తి కేవలము శ్రోతకు సంబంధించినది వ్యంజన వక్తృశ్రోతృ సంబంధి దీనికి నిదర్శనము లోచననిర్వచనము (ఇచ్చట ప్రధానమనునంశము భావద్యోతనము).

'అర్థద్యోతనశక్తిధ్వనివ్యాపార' మనుట (పుట 62) ద్యోతనమనగా ప్రకాశము - వ్యక్తీకరింపబడుట - ఉద్ద్యోతనము పైకి ప్రకాశించుట-అభివ్యక్తి అని అర్థము, (ధ్వన్యాలోకమున నాల్గధ్యాయములున్నవి అవి ఉద్ద్యోతములనబడినవి )

## 2 9 ఆలంకారికులు — వాచ్యవాచక సంబంధము.

ధ్వని వికల్పములుగా జయరథుడు ప్రదర్శించిన అలంకారవాదములు

1 సమాసోక్త్యాద్యలంకారములు

2 తంత్రము (శ్లేషాద్యలంకారములు)

ఆనందవర్ధనులే మొదట పూర్వపక్షములను ప్రదర్శించి తరువాత ధ్వని కారికను వ్రాయుచున్నారు వికల్పములు మూడురకములుగముంచి చెప్పబడినవి ఆందభావవాదులు అలంకారవాదులు అనగా వాచ్యవాచక సంబంధముకన్నను ఇతరమైనది మరియొండులేదని వాదించువారు వీరిలో మూడభిప్రాయములు ఆనంచులచే గుర్తింపబడినవి

1 శబ్దార్థమయచారుత్వ హేతువులగు అనుప్రాస — వర్ణసంఘటనా - మాధుర్య - ఉపనాగరకాదివృత్తి - వైదర్భ్యాదిరీతి ప్రభృతులకన్న విలక్షణమగు ధ్వని ఏది ?

2 కేవలము సహృదయులని తమకు తామేర్పరచుకొని చేసెడివాదము ధ్వనియున్నదనుట సకలవిద్వన్మనోగ్రాహితావలంబిత దీనికిలేదు

3 ఉన్నను అపూర్వముకాదు చారుత్వహేతువులుగ పూర్వోక్తము లయిన విషయములందే అంతర్భావించును (ధ్వ ఆ పుటలు 1°-25) మరియు మనోరథకవిదైన ఒకశ్లోకమునుదాహరించిరి

యస్మిన్నాస్తి నవస్తుకించనమనః ప్రహ్లాదిసాలంకృతి
వ్యుత్పన్నైరచితం చనైవవచనైర్వక్రోక్తి శూన్యంచయత్
కావ్యంతద్ధ్వనినా సమన్వితమితి ప్రీత్యాప్రశంసన్ జడో
నో విద్మోఽభిదధాతికిం సుమతినాపృష్టః స్వరూపంధ్వనేః

(పుటలు 26-27)

ఈ అభావవాదులీ లక్షణములే కావ్యమున గుర్తింతురు సాలంకృతిత్వము మనఃప్రహ్లాదిత శబ్దాలంకార రచనము (వ్యుత్పన్నే లోచనము పుట 28) వక్రోక్తి ఉత్కృష్టసంఘటన - లోచనవ్యాఖ్య) - ఇవన్నియు శూన్యములయ్యు జడులు గతానుగతమైన అనురాగముచే ధ్వనిప్రశంసచేయుదురు కాని దాని స్వరూపమేమని పండితుడడిగినచో సమాధానమేది? అని వారిప్రశ్న

డా రాఘవన్‌గారు తమ గ్రంథమున భామహునిమొదలు దండివరకుగల పండితులు చేసిన వాదములను సమీక్షించియున్నారు 65

'శబ్దార్థసాహిత్యము'ను కావ్యమున మొదటగుర్తించి సూత్రించినవాడు భామహుడు 66 శబ్దార్థముల సహితత్వము వక్రతవలన సిద్ధించుచున్నదని భామహామతము 67 శబ్దార్థములనడుమ ఇతనిచే అంగీకరింపబడినది కేవల మభిధావ్యాపారమే

2 9 1 కాని అలంకారములందన్నిటను వాచ్యవాచకసంబంధము నియతముకాదు ఉదాహరణమునకు సమాసోక్తి భామహాలక్షణమిది

యత్రోక్తేగమ్యతే౽న్యోఽర్థస్తత్సమానవిశేషణః
సాసమాసోక్తిరుద్దిష్టా సంక్షిప్తార్థతయాయథా

(కావ్యాలంకారము 2 79)

ఒక అర్థమునకు సమానవిశేషణత గలిగిన అన్యార్థముగమ్యమగుటను సమాసోక్తిగా భామహుడుచెప్పినాడు అతని ఉదాహరణమిది

స్కంధవానృజురవ్యాలః స్థిరో౽నేకమహాఫలః
జాతస్తరురయం చోచ్చైఃపతితశ్చనభస్వతా

(కా అ 2-80)

ఇక్కడ ఉపమింపబడిన మహాపురుషుని పతనము గమ్యమానముగుచున్నది ఇట్లు జరిగెడి అన్యార్థప్రతీతిని ధ్వనిగా (అలంకారము గమ్యమానమైనపుడు అలంకారధ్వనిగా)[68] ఆనందవర్ధనుడు గుర్తించెను

కావున భేదమిది భామహాదులన్యార్థప్రతీతినికూడా గుర్తించినను వాచ్య వ్యంగార్థములనడుమ ప్రధానాప్రధానతలను గ్రహింపలేదు ధ్వన్యాలోకము దీనినే ఇట్లు స్పష్టముచేసినది

వ్యంగ్యప్రాధాన్యేహిధ్వనిః నచైతత్సమాసోక్త్యాదిష్వస్తి (ధ్వ ఆ పుటలు 108-9) ఈ ప్రాధాన్యమును[69] నిర్ధరించునది చారుత్వోత్కర్ష

చారుత్వోత్కర్ష నిబంధనాహి వాచ్యవ్యంగ్యయోః ప్రాధాన్యవివక్ష (పుట 11) కావున సమాసోక్త్యాద్యలంకారములందు వాచ్యప్రాధాన్యమే యుండుటవలన నివి ధ్వనికి విషయములు కావని ఆనందవర్ధనుని నిరూపణము

2, 9 1 2 తంత్రము అనగా శ్లేషయని అలంకారపక్షముగ ఆనంద వర్ధనుడు వాడలేదు[70] ఆనందుడు ఖండించిన అలంకారములందిదిలేదు కాని పండితులు జయరథుని కాలమునకు దీనిని విప్రతిపత్తిగా చెప్పుచుండిరికాబోలు

రుయ్యకుని శ్లేషనిర్వచనమిది

విశేష్యస్యాపి సామ్యేద్వయోర్వోపాదనేశ్లేషః

(అలం సర్వ పుట 121)

శ్లేషయందు వివక్షింపబడిన రెండర్థములను సమప్రాధాన్యముకలిగినవి వాచ్య వ్యంగ్యములనడుమ ప్రధాన అప్రధానతలను ఆశ్రయించినది వ్యంజన కావున శ్లేషయు వాచ్యవాచకపరిధియందే యిమిడిపోవునది

రెండవ యుద్ద్యోతమున శబ్దశక్తిమూలధ్వనిని గురించి ప్రస్తావించుచు ఒక శబ్దమునకుగల విశిష్టార్థప్రతిపాదక శక్తివలన గర్భితమైన అలంకారము ప్రతీయమానమైనపుడు అది వ్యంజనమూలమని అట్లుగాక సమప్రాధాన్యము కల రెండుభావములు వ్యక్తములగుచున్నపుడు అదికేవలము శ్లేషయని ఆనంద వర్ధనుడు ప్రతిపాదించినాడు

'యస్మాత్రిదలంకారో నవస్తుమాత్రం యస్మిన్కావ్యేశబ్దశక్త్యా ప్రకాశతేస శబ్దశక్త్యుద్భవే ధ్వనిరిత్యస్మాకంవివక్షితః వస్తుద్వయేచశబ్దశక్త్యా ప్రకాశమానేశ్లేషః
(ధ్వ ఆ 2 21 క్రిందపుట 23)

## 2 9 1 3 గుణవృత్తి — ధ్వనిమార్గము

'తధాపిగుణవృత్త్యా కావ్యేషువ్యవహారం దర్శయితా ధ్వనిమార్గో మనాక్ స్పృష్టః (ధ్వ ఆ పుట 31)

అని ఆనందులు వ్రాసిరి లోచనమిట్లువివరించినది

'భట్టోద్భటవామనాదినా' అని

అనగా ఉద్భటుడును వామనుడును గుణవృత్తినంగీకరించిరని అర్థము, గుణవృత్తి లక్షణకు మరియొకపేరు అనగా వీరుభాక్తవాదులని లోచనతాత్పర్యము

భామహుని కారిక ఒకటున్నది

శబ్దశ్ఛందోఽభిదానార్థా ఇతిహాసాశ్రయాకథాః
లోకోయుక్తిఃకలాశ్చేతి మంతవ్యాకావ్యమైఖరీ (కా అ 1-9)

ఈకారికను వివరించుచు ఉద్భటుడు (భామహ వివరణమున) 'శబ్దానాం అభిధానం అభిదావ్యాపారః ముఖ్యోగుణవృత్తిశ్చ' అని వ్రాసెను

అభిధానమను పదముచే ముఖ్య (అభిధా) గుణవృత్తి (లక్షణ) - ఇవి రెండును వివక్షింపబడినవని ఉద్భటుడు వ్రాయుటచేత భామహమతమునను భాక్తవాద లక్షణములు లోచనముచే దర్శింపబడినవని అంగీకరింపవలయును. భామహుడు వివక్షింపకపోయినను ఉద్భటుడుచేసిన వివరణ ననుసరించినను అందు ముఖ్యగౌణవృత్తులు గుర్తింపబడినవనుట ముఖ్యవిషయము. అందు వలననే 'మనాక్స్పృష్టః' అని అనందవలనుట. వామనుడు (కావ్యాలంకార సూత్రవృత్తి 4-3 8) కూడా

సాదృశ్యాల్లక్షణా వక్రోక్తిః అని అంగీకరించినాడు71 (చూ లోచనము పుట 32) అనగా వక్రోక్తిలో సాదృశ్యమూలమైన లక్షణాసరివృత్తి యున్నదనుట శబ్దార్థములనడుమ ఇట్లు వాచ్య వాచక సంబంధమును భావించి వీరియందును అర్థాంతర ప్రతీతి గుర్తింపబడినదనుట గమనింపదగిన అంశము

## 2 9 2 కుంతకుడు - - ఉపచార వక్రత 72

రుయ్యకుడు భామహాదుల వాదమును ప్రస్తావించినాడు

వక్రోక్తిజీవితకారః పునర్వైదగ్ధ్యభంగీభణితి స్వభావాం
బహువిధాం వక్రోక్తిమేవ ప్రాధాన్యాత్కావ్య జీవితముక్తవాన్
వ్యాపారస్యప్రాధాన్యంచ కావ్యస్యప్రతిపేదే, అభిధాప్రకార
విశేషాఏవచాలంకారాః సత్యపిత్రిభేదే ప్రతీయమానే
వ్యాపారరూపే భణితిరేవకవిసంరంభగోచరః ఉపచార
వక్రతాదిభిః సమస్తోధ్వని ప్రపంచః స్వీకృతః కేవల
ముక్తివైచిత్ర్య జీవితం కావ్యం, నవ్యంగ్యజీవితమితి
తదీయం దర్శనం వ్యవస్థితం, (అలం సర్వ పుటలు 9-10)

అని వ్రాసినాడు జీవితమితి - అనుప్రాణకమ్ అని జయరథవ్యాఖ్య (పుట 9) కావ్యము వక్రోక్తి[73] నాశ్రయించి ప్రాణవంతమగుచున్నది ఇది ఆనందవర్ధనుని ప్రతిపాదనమగు వ్యంజకవ్యంగ్యసంబంధమునకు ప్రతిబాధకము కాకున్నను సంబంధితముకాదు కారణము వక్రోక్తికారుడు కవి వ్యాపారముఖ ముగ పరిశీలించియుండుట వ్యాపారము కవి ప్రతిభోల్లిఖితకర్మము వక్ర స్వభావముకల్గినది, కావున ప్రతీయమానత్రైవిధ్యమున వ్యాపారరూపమగు భణితి'[74] యే కవిసంరంభగోచరమగునది ఇది ఉక్తికి[75] సంబంధించినది

అయినపుడు ప్రతీయమానమున కుంతకునికి అనాదరమున్నదనికాదు (జయరథుడు పుట, 10) ఉపచారవక్రతాదులయందు ధ్వని అంతర్భవించు చున్నదని కుంతకుని అభిప్రాయము

'తదిత్థం లక్షణామూల వక్రోక్తి మధ్యాంతర్భావాత్ ధ్వనే
రేవతత్త్వం ప్రతిపాదితం' (పుట 10)

కుంతకుని శబ్దార్థదృష్టి

శబ్దోవివక్షితార్థైక వాచకో-న్యేషు సత్స్వపి
అర్థః సహృదయాహ్లాదకారి స్వస్పందసుందరః

(వ జీ 1-9)

కావ్యమున శబ్దము వివక్షితార్థైక వాచకము[76] మాత్రమే అర్థము సహృదయాహ్లాదకారి శబ్దార్థములనలంకరించునది వక్రత, (1 10) అనగా చాతుర్య పూర్ణభంగిమతో చేయబడిన కథనస్వరూపముగను, కావ్యమంతటను వ్యాపించిన శబ్దార్థాలంకారాతిశాయి కవికౌశల్యవ్యాపారముగను 'వక్రత'ను కుంతకుడు వివక్షించినాడు

ఉపచార గ్రహణము

లోకమున వాచకము శబ్దము, అభిధేయమర్థము. ద్యోతక వ్యంజకములు శబ్దసంభవములు అర్థప్రతీతికారిత్వసామాన్యలక్షణముచేత వాచకములే ద్యోత్య వ్యంగ్యములందుగల అర్థప్రత్యేయత్వ లక్షణముచేత వాచ్యములే 77 ఈవాచక వాచ్యత్వముపచారము వలన సిద్ధించుచున్నది (వ జీ పుట 34)

ఉపచారమనుమాట గౌతమన్యాయసూత్రమునందలిది నైయాయికులు ఉపచారము నిట్లు గ్రహించిరి

తత్సంబంధాత్ ఫలనిష్పత్తేషు ఫలవదుపచారః' (4-1 54)

(ఫలము (result) సుఖమునిచ్చును పుత్రఫల (fruit) ములును సుఖ మునే యిచ్చును కావున తత్సంబంధము (conjunction) చేత పుత్రఫలము లును ఫలములనబడుచున్నవి )

నైయాయికులు లక్షణను నిర్వచించుటలో గుణసామ్యప్రతీతి నాధార ముగ గ్రహించిరనుట పూర్వనిరూపితము, జయరథుని వ్యాఖ్యయందును,

లక్షణామూలవక్రోక్తి మధ్యాంతర్భావాత్'

అనియుండుటవలన 'ఉపచార మనుమాట నైయాయికమార్గమునుండి గ్రహింపబడినదనుట స్పష్టము

ఉపచార వక్రత - కుంతకుడు గ్రహించిన షడ్విధవక్రతలలో రెండవది పదపూర్వార్థవక్రత.78 అందుతొమ్మిది విభాగములు అందు మూడవది ఉపచార వక్రత

యత్రదూరాంతరేఽన్యస్మాత్సామాన్యముపచర్యతే
లేశేనాపి భవేత్ కాంచిద్వక్తుముద్రిక్తవృత్తితామ్ (వ జీ 2-13)

(ఎచ్చట అతిశయరూప వ్యాపార (ధర్మ) మును ప్రతిపాదించుటకు అత్యంత భిన్నపదార్థములందు విద్యమానమగుచున్న కించిన్మాత్రసాధారణ ధర్మము నారోపించుట యుండునో అచ్చట ఉపచారవక్రత)

| | |
|---|---|
| మూర్తిమంతములందమూర్తత్వాపేక్ష, ద్రవములందు ఘనత్వాపేక్ష, చేతనము లందచేతనత్వాపేక్ష- | ఉ ఈ 'ఉపచారము' వలననే ఎద్దించును |

మేఘసందేశమునుండి యుదాహరణము 80

సూచిభేద్యైస్తమోభిః' అను వాక్యమున ఉపచారవక్రతయున్నది మేఘ మమూర్తపదార్థము తమోబాహుళ్యముచేత ఘనత్వలక్షణమైన సూచీభేదత్వము ఉపచరిత మగుచున్నది

ఇట్టి ఉదాహరణము మరియొకటి.81

మత్త నిరహంకార లక్షణములు చేతన ధర్మములు మేఘములందవి ఆరోపింపబడుట ఉపచారముచేతనే

ఇదే యుదాహరణమునొసంగి ఆనందవర్ధనులు ఇది అత్యంత తిరస్కృత వాచ్యమునకు నిదర్శనమనిరి 82 లక్షణమూలముగ ఎద్దించునది అవివక్షితవాచ్యమే కాని ఉపచారమున్నచోట్లన్నిటను వక్రత చెప్పుటకువీలులేదు

'గౌర్వాహీకః' అను వాక్యమున్నది 'సింహో మాణవకః' వలె

ఇచ్చట ఉపచారమున్నది కాని వక్రతలేదు కారణము సరసోల్లేఖము కానందున (వ జీ పుట 221)

ఇట్లనుటవలన వక్రత్వమును కుంతకుడు కవి మనోవ్యాపారముగనే గ్రహించెననుట స్పష్టము

'శబ్దార్థౌసహితౌ వక్ర కవి వ్యాపారశాలిని (వ జీ 1-7)

అని అతని సిద్ధాంతము ఈదృష్టితోడనే ఆనందవర్ధనులొసగిన యుదాహరణములను కవి వ్యాపారముఖముగ నిరూపించినాడు

'స్వేచ్ఛాకేసరిణః' (ధ్వ ఆ 1-1) - ఆనందవర్ధనుని మతమున వస్త్వలంకార రసధ్వనులకిది యుదాహరణమని అభినవనిరూపణము

దీనినే కుంతకుడు 'క్రియావైచిత్ర్య వక్రత అనినాడు (వ జీ పుట 78)

తదాజాయంతేగుణాః (ధ్వ ఆ 2-5 క్రింద) - అర్థాంతర సంక్రమిత వాచధ్వని అని ఆనందుడు

కుంతకాభిమతమున ఇది 'రూఢివైచిత్ర్యవక్రత' కు నిదర్శనము (వ జీ పుట 195) కావున కుంతకుని పరిశీలనమానందునికన్నను కవి వ్యాపారమను నీవిషయమున భిన్నము (శబ్దార్థ ప్రధానాప్రధానతలమీద నాధారపడినది వ్యంజన సూత్రము అది వక్తృశ్రోతృప్రతిభా సహృనత నాశ్రయించిన ద్యోతన వ్యాపారము)

ధ్వన్యాలోక కారికల నుదాహరించి కుంతకుడు తన మార్గమును స్థాపించు కొన్న చోట్లున్నవి. ఒక యుదాహరణము

ప్రతీయమానం పునరన్యదెవ (ధ్వ ఆ 1-4) అను కారికనుదాహరించి ఆనందులు వాచ్యవాచక లక్షణ ప్రపంచాపయవాతిరిక్తమైన ప్రతీయమానార్థమునే ఈదృష్టాంతిముచే సాధించిరి ఆ లావణ్యము కేవలము సహృదయ గోచరము కాని కావ్యజీవితము బంధ సౌందర్యము. ఈకారణముగనే

శబ్దార్థములవ్యుత్పన్నునికిని శ్రుతిమాత్రముచే హృదయహారిత్వములై ఆస్వాద్యము లగుచున్నవి (పుట 120)

సుప్తిఙ్వచనాది (ధ్వ ఆ 3 16) వ్యంజకతగా ఆనందవర్ధనులు భావించిన దానిని అన్యులు సుబాదివక్రతగా విశ్లేషించినారని అభినవులు నాట్యశాస్త్రవ్యాఖ్యానమున గుర్తించిరి [83]

మహిమభట్టు కుంతకుని ఆసంఖని సమానముగనే ఖండించియున్నాడు. ధ్వని వక్రోక్తులు రెండును అనుమానమున భాగములనియే అతని అభిప్రాయము

అభేదో బహుతానస్యాఽక్తేర్మార్గాంతరాగ్రహాత్
తేనధ్వనివదేషాం వక్రోక్తిరనుమానకిమ్

(వ్య వి 1-73)

శబ్దాభివ్యక్తి యందనుమానమభిదకంటె మరియొక వ్యాపారమునంగీకరింపదు. వక్రకవి మనోవ్యాపారము నంగీకరించిన వక్రోక్తిమార్గముకూడా మార్గాంతరమును సమ్మతించినది కావున ధ్వనివలె నదియు అనుమానాంతర్భవము కావలెనని మహిమునివాదము

## 2 10 కేచిద్వాచాం స్థితమవిషయే (ధ్వన్యాలోకము 1-2)

ఇది ఆనందవర్ధనులమాట ధ్వనిమాటలకందనిదని కొందరందురని వృత్తిలో 'ఇట్టివారు లక్షణకరణ శాలీనబుద్ధు లని ఆనందవర్ధనుని యధిక్షేపణము ఆలోకమునందు వీరెవరో స్పష్టముగా చెప్పబడలేదు అనువాదకులు అనాఖ్యేయతావాదులు వాచ్యలక్ష్య వ్యతిరిక్తమగు ధ్వనినంగీకరింతురుగాని అది లక్షణపురస్సరముగా తెలియరానిదిగా చెప్పుదు'రని చెప్పిరి [84] కాని వారెవరో పేరును స్పష్టము చేయలేదు

'నోవిద్యోఽభిదధాతికిం సుమతినా పృష్టః స్వరూపం ధ్వనేః
(1-2 కారికావృత్తిలో మనోరథునిశ్లోకము)

అనుటయందును అనిర్వచనీయతా లక్షణమున్నది. పరిశీలింపగా అభావ భాక్తవాదు లందరును అనిర్వచనీయతాలక్షణము కల్గినవారే. అనగా లక్షణము చెప్పనివారే. కాని ధ్వనితత్త్వము వాక్కులకగోచరమన్నవారుకారు.[85]

సమకాలికులలో ఎవరుండిరో తెలియదుకాని వాగ్వ్యాపారదృష్టితో పరిశీలనము చేయుచున్నందున ఈ అంశము చాలప్రధానము.

1 ఆ యన్నవారు ధ్వనితత్త్వము తెలిసినవారు కావలెను

2 వారు ధ్వని వాగ్వ్యాపారమన్న సిద్ధాంతమును నమ్మినవారు కావలెను

అట్టివారెవరున్నారు? భాషాశాస్త్రజ్ఞులలో ఇట్టి వారెవరును కనిపించరు. కారణము ధ్వనితత్త్వమునుగురించి సిద్ధాంతీకరించిన వారెలేరు. కావున ఉన్నను శబ్దార్థసమన్వయ దృష్టిలేని వారలయినందున అభావవాదివర్గములో చేరుదురు.[86] భాక్తవాదులలో కొందరు భాగమగుదురు.[87] - వీరర్థదృష్టితో శబ్దమును విచారించెడివారు. వీరందరి దృష్టియు భర్తృహరి వ్రాసిన కారికయందంతర్భవించుచున్నది.

నసోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే
అనువిద్ధమివజ్ఞానం సర్వంశబ్దేనభాసతే
(వాక్యపదీయము 1-124)

జ్ఞానముతో శబ్దము అనువిద్ధతనుకల్గినది. కావున శబ్దాతిరిక్తమగు జ్ఞానముండదు. ప్రాయికముగ వైయాకరణాలంకారికులందరును దీనినంగీకరింతురు.[88]

2 10 1 పూర్వాధ్యాయమున ఆధునిక, తార్కిక, వేదాంతులదృష్టులు ప్రదర్శింపబడినవి - భాషా విషయముగ (చూ పుట 71) వీరి దృష్టియందు

స్పీచ్ అన్న పదమునగల విశిష్టార్థత (శబ్దార్థసమాహారమగుట) సంభావ్యముకాదు అందువలననే Wittgenstein[89] Bergson[90] మున్నగువారు నిశ్శబ్దమునుగూర్చి భావించిరి భావము మాటలకందనిదనువాదము వీరు మాత్రమేచేసిరి అనాఖ్యేయత అనగా నిదియే Blumberg (1976) అభిప్రాయము పూర్వాధ్యాయమున ప్రదర్శితము ఆధునిక తాత్త్వికులు అవ్యక్తమగు భావమును గుర్తించిరి కాని వ్యక్తమగు శబ్దము ధానిని బోధించుటలో అందెడిదశలను గురించి భావింపరైరి మనకు తెలిసినంతవరకు కాశ్మీరశైవాగమమున మాత్రమే వాక్కునకీదశలు భావింపబడినవి వీని వివరణము ముందుచూపబడును Otto Jesperson (1933) చెప్పిన Suggestion is impression through suppression — అను వాదమునందును ఇదే అభిప్రాయము గలదనుట గుర్తింపదగినది[91]

2 10 2 అభావవాదులుగ చెప్పబడిన వారందరును అనాఖ్యేయతావాదులుగనే అధినవులచే పరిగణింపబడిరనుచు కె క్రిష్ణమూర్తిగారిట్లనుచున్నారు

The view of treating Dhvani as something ineffable may be taken either in a complimentary way or as a criticism

(Dhvanyaloka p 304, 1974)

## 2 11 వాగ్దర్శనము -

ధ్వన్యాలోకము[92] ను భిన్నదృష్టులతో పరిశీలింపవచ్చును అవిస్థూలముగ మూడు[93]

1 వాఙ్ నిర్మాణదృష్టి
2 వాగ్వైచిత్ర్యదృష్టి
3. వాక్ తత్త్వదృష్టి

మొదటిదృష్టి వాక్స్వరూపమునకు సంబంధించినది రెండవది వాగ్వికల్ప మునకు (ఉపయోగమునకు) మూడవది వాక్తత్త్వమునకు సంబంధించినది

ఆనందవర్ధనుడు 'వ్యంజన సూత్ర' మని ఎచ్చటను పేర్కొనలేదు ధ్వనిని గురించి సిద్ధాంతము చేసెను వ్యంజకశబ్దము, వ్యంజకార్థము, వ్యంగ్యార్థము వ్యంజనవ్యాపారము ధ్వనికావ్యము - అను నీ ఐదింటికిని 'ధ్వని' అను పేరు చెల్లునని ఆనందాభినవులు స్థాపించిరి (ఉక్తప్రకార ఇతి పంచస్వర్థేషు యోజ్యమ్- శబ్దే అర్థే వ్యాపారే వ్యంగ్యే సముదాయేచ - ధ్వ. అ 1-13 క్రింద) ఇన్నిటను అంతర్గతముగనున్న సూత్రము 'వ్యంజన' (suggestivity)[94] కావున ఇట ఆనందుని భాషా సిద్ధాంతము 'వ్యంజన ప్రక్రియాదృష్టి'తో పరిశీలింపబడును

## 2 11 1 వాఙ్నిర్మాణము

ఆనందవర్ధనునిది కాశ్మీరదేశము దాక్షిణాత్యులకంతగా పరిచయములేని కాశ్మీరశివాద్వైతమచ్చటి ఆలంకారిక సంప్రదాయమునకు మూలమనుట ప్రథమాధ్యాయమున సూచింపబడినది (చూ వ్యం సూ పుటలు 8-9). లోచనవ్యాఖ్యాతయైన అభినవులు శైవాగమ సంప్రవర్తకులలో అగ్రగణ్యుడు. కౌలగురువు తంత్రాలోకమను గ్రంథమునితడు రచించెను ఆనందవర్ధనుడే 'తత్త్వాలోక' మును రచించినాడని అభినవులే చెప్పుచున్నారు.[95] కాశ్మీర సంప్రదాయమున శివాశివుల అనువిద్ధత పరమోదారముగ సిద్ధాంతితమైనది. 'వాక్కు' ను సంభావించుటలో ఆనందవర్ధనుని దృష్టి శైవాగమమునే అనుసరించినదని చెప్పుటకు నిదర్శనము[96] ___

సరస్వతీస్వాదు తదర్థవస్తు నిష్యందమానా మహతాం కవీనామ్
అలోకసామాన్యమభివ్యనక్తి పరిస్ఫురంతం ప్రతిభావిశేషమ్ (1-8)

ఉన్న ఆలోకకారిక (మరియు ఊా 4 17) 97 అభినవులిచ్చటనే సరస్వతీతి - వాగూపాభగవతీత్యర్థః అని వ్రాసిరి (లోచనము పుట 91) అభినవులు ధ్వన్యాలోకమునగల నాల్గుద్యోతములందును ప్రారంభాంతములందు మంగళశ్లోకములువ్రాసిరి ఉద్యోతాంతశ్లోకములందు వరుసగా పరాపశ్యంతీ మధ్యమావైఖరీవాక్కులను స్తుతించిరి

1 యదున్మీలన శక్త్యైవ విశ్వమున్మీలతిక్షణాత్
స్వాత్మాయతన విశ్రాంతాం తాంవందే ప్రతిభాంశివామ్

[ధ్వ ఆ పుట 172 1965 ప్రతి]

2 ప్రాజ్యం ప్రోల్లాసమాత్రం స్యాద్భేదనాన్మాత్రయాతేయయా
వందేఽభినవగుప్తోఽహం పశ్యంతీం తమిదంజగత్

[అదే పుట 310]

3 అసూత్రితానాం భేదానాం స్ఫుటతాపత్తిదాయినీమ్
త్రిలోచనప్రియాం వందె మధ్యమాం పరమేశ్వరీమ్

[అదే పుట 556]

4 స్ఫుటీకృతార్థవైచిత్ర్య బహిః ప్రసరదాయినీమ్
తుర్యాం శక్తిమహం వందే ప్రత్యక్షార్థనిదర్శినీమ్

[అదే పుట 603]

ఆలోకమున ప్రథమోద్యోతమున ధ్వనికిరసము పర్యవసానమని ప్రతిపాదింపబడినది (1-12) నాల్గవయుద్యోతమున రసాదిమయత్వమే కావ్యమునగల వ్యంగ్య వ్యంజక భావమునకు సార్థక్యమని నిరూపింపబడినది (4-5) ద్వితీయ తృతీయములు వ్యంగ్య వ్యంజక ముఖముగ ధ్వనినిరూపణము చేసినవి మొదటిది స్వాత్మాయతనవిశ్రాంతి నాల్గవది ప్రత్యక్షార్థనిదర్శనము రెండవది ఉల్లాస మాత్రభేదము మూడవది అసూత్రితభేదములకు స్ఫుటతాపత్తి ఇట్లు నాల్గుద్యోతములందును గల విషయసర్వస్వమునకు వాఖ్యానమిలీ మంగళశ్లోకములు నాల్గవది బహిఃప్రసరణము - కావున తురీయము (వైఖరి) ఇట

రసము శబ్దార్థ (వాక్)రూపమును పొందుచున్నది ద్వితీయ తృతీయములు భేదస్ఫోటనములు వ్యంగ్య భేదములను ప్రదర్శించుచున్నవి ఇదిపశ్యంతీదశ, వ్యంజకములై భేదములను నిరూపించుచున్నవి మధ్యమాదశ మొదటిది ఉన్మీలనము ప్రతిభా (పరా) దశ వ్యంజకసామగ్రి (వాక్కు) రసోన్మీలనమందుచున్నది శివాశివుల అభేదమీదశ శబ్దార్థములిట భిన్నములుగ లేవు - కావున రసమొక్కటే

'ఇదంజగత్' అనుటకు కావ్యపరముగచెసిన వ్యాఖ్యానమిది ౦8 కేవలము తత్త్వముఖముగ చేసినచో కాశ్మీరశివాద్వైతమగును అక్కడ ప్రతిభవిశ్వోన్మీలనములు వ్యంగ్యవ్యంజకములు ఇక్కడ రసము వాక్కు (కావ్యము) - వ్యంగ్య వ్యంజకములు ఆలోకమునకు లోచనమునే కాక నాట్యశాస్త్రమునకు అభినవభారతిని ప్రసాదించిన అభినవులు వాక్కు ' ను గూర్చి చేసిన సిద్ధాంతమునకు నిరూపణము నాట్యశాస్త్రమునిటేగలదు

వాఙ్మయానీహశాస్త్రాణి వాఙ్నిష్ఠానితథైవచ
తస్మాద్వాచః పరంనాస్తి వాగ్ఘి సర్వస్యకారణమ్

(వాచికాభినయము - 750)

శాస్త్రములన్నియు వాఙ్మయములు, అన్నియు వాఙ్నిష్ఠములు వాక్కే సర్వమునకు కారణము లోచనకారుడే ఇట్లువ్యాఖ్యానించినాడు

సైవేయముపయోగినీ కింతుచతుర్థగోపాయభూతా పరమ
పురుషార్థస్వభావా విశ్వకారణభూతా భగవతీ భారతీ (అభినవభారతి)

ఇచ్చటనే అభినవులు వాగేవవిశ్వాభువనాని అను శ్రుతిని ఉదాహరించిరి వాచిఫలరూపాయాం నిష్ఠాయేనామ్' మహాసరస్వతీ సామ్రాజ్యమునందు శాస్త్రములన్నియు వాఙ్మయములు వాఙ్నిష్ఠములు, వాగ్రూపములు ఫలరూపమగు వాక్కునందే శాస్త్రములకు నిష్ఠ - స్థితి యున్నది 99 వాక్కును దేవీరూపముగ భావించుట

ఋగ్వేదమున నేగలదు నిరుక్తము వాక్కువ్యక్తమును అవ్యక్తమును కావచ్చు ననుచు, వేదప్రమాణమును చూపినది 100

చేవీంవ చమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవోదంతి
సానోమంద్రేష మూర్జదుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు
(ఋగ్వేదము 8-100 11)

యాస్కుని వ్యాఖ్యానమిట్లున్నది వ్యక్తవాచశ్చావ్యక్తవాచశ్చ సానోమద నార్థంచ రసంచ దుహానా ధేనుర్వాగస్మానుపైతుసుష్టుతా - చేతనాచేతనము లందంతటను వాక్కు పరివ్యాప్తమైయున్నది

యద్వాగ్వదంత్యవిచేతనాని రాష్ట్రీ దేవానాం నిషసాదమంద్రా
చతస్త ఊర్జందుదుహే పయాంసిక్వసిదస్యాః పరమంజగామ
(ఋగ్వేదము 8-10 -10)

కావుననే విశ్వమంతయు వాగ్వ్యాప్తము నిత్యగమనశీలముగలది వాక్కున కనువిద్ధమగు ప్రయోజనమున్నది అది అర్థము

మహో అర్ణః సరస్వతీ ప్రచేతయతి కేతునాధియోవిశ్వావిరాజతి'
(ఋగ్వేదము 1 3-12)

సరస్వతిప్రచేతయతి ప్రజ్ఞాపయతి కేతునాకర్మణా ప్రజ్ఞయావా -
ఇమానిచసర్వాణి ప్రజ్ఞానాన్యభిర్విరాజతి - వాగర్థేషువిధీయతే -
తస్మాన్మాధ్యమికాం - వాచం మన్యంతే. 101

వాగ్ ధర్మము ప్రచేతనము 102 కావున వ్యక్తావ్యక్తములకు లంకె వాక్కు అందువలన మాధ్యమిక (మీడియమ్) మనిరి. కావుననే వాక్కువ్యక్తమగు వైఖరిగను, వ్యక్తావ్యక్తములగు మధ్యమా పశ్యంతులుగను, అవ్యక్తమగు పర

రూపముగను నున్నదని దేవీవాదులు భావింతురు దేవివిమర్శాంశయని స్వామి ప్రకాశాంశయని భావించుటలో నియద్వైతము స్ఫుటమగుచున్నది 103 ఒకటి ప్రవృత్తి మరియొకటి నివృత్తి. ఈ రెంటి ఆవృత్తిని వారు 'వ్యంజన మని వ్యవహరించిరి [మా చిత్రము III పుట 188]

అందులకే మహోపాధ్యాయ కుప్పుస్వామిశాస్త్రిగారు ఉపలోచనమును

పరస్పర సమాస్వాదప్రథమ- ననతత్త్వయోః
కవితాబుధయోర్యోగం నమామి శివయోర్యథా

అని ప్రారంభించిరి 104 మానవునియందలి ప్రతిభ రసము (భావము) పురుషతత్త్వము నిత్యగమనశీలత - స్పందము - వాక్కు - స్త్రీతత్త్వము కావున వాక్కును దేవీరూపముగ భావించుట అభినవుల మంగళశ్లోకము ఏతన్నిరూపకము

తంత్రాలోకమున స్థూల సూక్ష్మ సృష్టితత్త్వములు వ్యాఖ్యానింపబడినవి సూక్ష్మసృష్టి పరాపర విసర్గమనియు (ః) స్థూలసృష్టి అపరవిర్గమనియు (హ) దీనినే హంస ప్రాణ వ్యంజన, స్పర్శశబ్దములతో వ్యవహరింతురనియు అభినవగుప్తపాదులు సూచించిరి

(తంత్రాలోకము 2-144-146)

విసర్గను స్వరములందును, హాకారమును వ్యంజనములందును చేర్చుట వైయాకరణ సంప్రదాయము కాదిహాంతములైన హల్లులస్వభావము అచ్చులందే నిక్షిప్తమై యున్నదని తంత్రాలోకము నిరూపించుచున్నది 105 అచ్చులందును అ, ఇ ఉ, ఋ తప్ప తక్కినవి సంయుక్తస్వభావము కల్గినవి కావున చిత్ ఇచ్ఛా ఉన్మేషములను మూడు ప్రాథమికములగు శక్తులీయచ్చులందు గలవు

మొదటిది పరాపరవిశేషము - చిద్రూపము (అనుత్తరము) రెండవది ప్రవృత్తి (ఇచ్ఛా) ముఖము మూడవది నివృత్తి (ఉన్మేష) తత్త్వము ఈ పద్ధతిని అనుసరించుటచే కౌలపద్ధతిని 'త్రిక' మందురని నిరూపించియున్నారు [106]

చిత్రము I




అకారము (చిత్) యొక్క ఊర్ధ్వగమనము (ఇచ్ఛ) ఇకారము ఇకారము ఉకారముద్వారమున ఉన్మేషమునందును (అకారమున పర్యవసించును)[107] ఇట్లు చూచినచో వ్యంజనమనగా - వ్యక్తమగుట, ప్రకాశించుట అచ్చుహల్లుగా అభివ్యక్తమగుచున్నది కావున హల్లు వ్యంజకము అచ్చు వ్యంగ్యము అజ్ఝల్ సహవాసముచే అక్షరము వ్యంగ్యము [108] ఇచ్చట అచ్చు, హల్లు - ఈరెండును వ్యంజకములు. ఈప్రక్రియ వ్యంజన

దీనిని భాషానిర్మాణమునందంతటను పరచి పరిశీలించవచ్చును గుప్తమగు అర్థము శబ్దరూపమున వ్యక్తమగుచున్నది కావున శబ్దము వ్యంజకము శబ్దము వర్ణ పద - వాక్యములలో నేదైనను కావచ్చును అర్థముకూడ ఉన్మేషస్థితి యందు వ్యంజకము దీనినిట్లు చిత్రించవచ్చు

చిత్రము II



కావ్యమునగల వాగ్వ్యవహారమును నిరూపించుటకు చిత్రము II నుపయోగించినచో

ఎ] — రసముగను
బి] — వాక్కు [శబ్దార్థసమాహారము] గను
సి] — భావము [కావ్యము = వ్యంజనప్రక్రియ] గను
అర్థము చేసికొనవచ్చును

రసమే శబ్దరూపమునందున్నది శబ్దమే రసార్థమును వ్యంజించును కావున శబ్దము వ్యంజకము అర్థముకూడ భావముగ పర్యవసించుటలో వ్యంజకమే కావున అర్థమును వ్యంజకము వ్యంగ్యమగుభావము (స్థాయి) రసమును వ్యంజించును కావున ఈరెంటిని బంధించు వ్యాపారముకూడ వ్యంజకమే ఇట్లు శబ్దార్థవ్యాపారముఖముగ కావ్యము (వ్యంజనవ్యాపారము)ను పరిశీలించుట ఆనందవరసుని యభిమతము

ఈపద్ధతి మరి ఏ ఇతర శాస్త్రజుష్టమును కానందున నిర్దుష్టముగ ఇది త్రికపద్ధతియందావిర్భవించుచున్నది కానిచో అభినవులు వ్యాఖ్యానించి యుండెడివారు కారు దీనికి ప్రమాణము ఆనందవర్ధనుల అర్థవిశ్లేషణ

యోఽర్థః సహృదయశ్లాఘ్యః కావ్యాత్మేతివ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌతస్య భేదావుభౌస్మృతౌ (ధ్వ. ఆ 1-5)

అర్థమువాచ్యమని ప్రతీయమానమని రెండు విధములని ఆలోకకర్త భావించుటలో ఈ వ్యంగ్య (సజెస్టెడ్), వ్యంజక (సజెస్టర్) సంబంధమున్నది

వ్యంగ్య వ్యంజకదృష్టితో వాగ్వ్యవహారమున నాలుగుదశలున్నవి

1 మొదటి దశలో శబ్దము వ్యంజకము అర్థము వ్యంగ్యము వర్ణాదుల వ్యంజకత[109] ఈదశకు సంబంధించినది అసంలక్ష్యక్రమము ఇచ్ఛారూపము

( ఎ —> బి )

2 రెండవదశలో అర్థము వ్యంజకము అర్థాంతరము (భావము) వ్యంగ్యము

( బి —> సి )

ప్రతీయమానము వాచ్యార్థపూర్విక నుండుననుట (ధ్వ ఆ 1 10)[110] దీనికి నిదర్శనము వాచ్యమువివక్షితమయినపుడు అర్థాంతర సంక్రమితముగనో, అత్యంత తిరస్కృతముగనో యుండునను (ధ్వ ఆ 2-1)[111] విభజనమున ప్రతీయమానార్థము అర్థవ్యంజకతచేత సిద్ధించునది ఈ భేదములు అజహల్లక్షణ జహల్లక్షణ భేదములక్రింద ఆవిర్భవించునని పండితులు గుర్తించియుండుటలో (చూ ఐ టి ఎం పుట 306) సార్థక్యమిటనున్నది. కావున ఉన్మేషశక్తికి సంబంధించిన వ్యంజనమిది

( సి —> ఎ )

3 వాచ్యము వివక్షితమయినపుడు పైమూడుదశలు సాధ్యము

(ఎ —> బి), (బి —> ఎ), ( ు —> ఎ )

కావున శబ్దార్థతదుభయ సాధ్యమగు ప్రతీయమానార్థస్ఫురణముండును దీనినే సంలక్ష్యక్రమ వ్యంగ్యమని ఆనందవర్ధనులు పేరుచేసిరి[112] (ధ్వ ఆ. 2 2 4) [చూ ఐ టి ఎం - అదేపుట]. ఇందు ఇచ్ఛోన్మేషములు రెండునుగలవు

4 వాగ్వ్యవహారమున ఒక యావృత్తి పూర్తిఅయినపుడు (కావ్య నాటకాలంబువలె) కల్గెడిది అర్థాంతర ప్రతీతికాదు ఆ ఆవృత్తి లక్షణము ఇట్లుండును.

[ఎ —> బి —> సి — > ఎ]

ఇది అర్థవ్యంజకత వలన ఏర్పడునదికాదు సంలక్ష్యక్రమమగు అలంకార వస్త్వతిశయ రూపమగు అనుభవము అసంలక్ష్యరూపము[113] - [ధ్వ ఆ 1 12]

కావ్యమున నీయనుభవము కవి సహృదయుసంబంధి స్ఫురణారూపము. ఇక్కడ కావ్యమంతయు వ్యంజకము రసము [భావము] వ్యంగ్యము [ఐ టి ఎం - పుట 306].

ఇచ్ఛోన్మేషములు చిత్ పర్యవసానము పొందుదశయిది రేఖామాత్రముగ [బి —> సి] అని చూపించుచున్నను శబ్దార్థములనువిద్ధములైనవి [114]

ఈయనువిద్ధత భావమునుండి యావిర్భవించు శబ్దార్థములు భావముననే తిరోభవించుటలోగలదు ఈవాగ్వ్యాపార సర్వస్వమునిట్లు సంకేతింపవచ్చు

చిత్రము III




[పై చిత్రమునగల భావము పరాదశకు, వాక్కు పశ్యంతీ దశకుచెందినవి, అర్థము మధ్యమాదశ (+) ను, శబ్దము వైఖరీదశ (—) ను, సూచించును విరిగిన గీతల బాణముఖములు గమనదిశనుసూచించును గురుబిందువు లఘుబిందువుల సమాహారమనుటకు వానిపరిమాణములు సూచకములు]

వ్యంగ్య వ్యంజక సంబంధ నిబంధనతయాధ్వనేః
వాచ్యవాచక చారుత్వహేత్వన్తః పాతినః కుతః

(ధ్వ ఆ 1 13 పరికరశ్లోకము)

ఆనందవర్ధనుడు శబ్దార్థములను వ్యంజక - వ్యంగ్యదృష్టితో చూచినవాడు కావుననే ఆధునిక విమర్శకులను కొందరు, ఆనందవర్ధదృష్టియందు 'శబ్దార్థములకు విశాలార్థమున్నదని గుర్తించిరి శబ్దమనగా కేవలము పదములుకాక వక్తృశ్రోతృ సందర్భములు, శబ్దము కల్గించుప్రతిక్రియలు గ్రాహ్యములు అర్థమనగా అభిధాలక్షణామూలములగు అర్థములేకాక రసభావములు తాత్త్వికార్థములు అలంకార కృతాలంకార వ్యంగ్యములు ఇన్నియు గ్రహింపబడవలయును 115

## 2 11 2 వాగితరాంశములు — అభినయము

వ్యంజకాభినయౌ సమౌ' అను నైఘంటిక నిర్వచనము ప్రథమాధ్యాయమున చూపబడినది (పుట 21) అభినయము చతుర్విధమని, వాచికాభినయమందొకటని భరతమహర్షి ఆదేశము

'ఆంగికో వాచికశ్చైవహ్యాహార్యః సాత్త్వికస్తథా
చత్వారోఽభినయాహ్యేతే విజ్ఞేయానాట్యసంశ్రయాః

(నాట్యశాస్త్రము 6-24)

భావాభివ్యక్తియందు శబ్దార్థములు మాత్రమేకాక - చేష్టలు (ఆంగిక మానసికములు), వస్త్రధారణాది సామగ్రి - అంతయును వ్యంజకములుగ నుండుటను భరతుడు గుర్తించి అభినయ చతుష్కమును నిర్ధరించినాడు ఆనందవర్ధనుడును చేష్టాదికమును వ్యంజకసామగ్రిగ గ్రహించినాడు 116 కావ్యమున ఈ అభినయ సామగ్రి సర్వమును వాగ్రూపమును పొందియుండును కావున 'వాగ్వ్యాపారమని

ద్ధాంతీకరించుటకు వీలయినది నాటకమున అభినయము కావ్యమున వ్యంజనము 117 ఆనందవర్ధనుని వాజ్ నిర్మాణదృష్టిలో వాగ్రూపము పొందని వ్యంజకసామగ్రిలేదు (ఇంటి నిర్మాణదృష్టి కేవలము రూపాశ్రితముకాదు భావాశ్రితము ఇదియే ఆధునిక భాషాశాస్త్రదృష్టికన్నను నిట భిన్నమగు నంశము అనగా శబ్దార్థములు భావముగ పరిణమించెడి ప్రస్థానములోని శబ్దార్థస్వరూప విశ్లేషణము అతనిధ్యేయము )

## 2 11 3 వాగ్వైచిత్ర్యదృష్టి- వ్యంజనాసూత్రత్వము -

ఆనందుని పూర్వమున్న ఆలంకారికవాదములు మీమాంసక నైయాయిక వాదభూయిష్ఠములు అభిధావ్యాపారమునకు దీర్ఘదీర్ఘత్వమును నమ్మి కొందరాలంకారికులు వాగ్వికల్పము లనంతములనిరి 118 అనగా వానిని నిర్వచించుట కసాధ్యమని ఆనందవర్ధనుని ప్రధానధ్యేయము ధ్వనిస్వరూపము చెప్పుటయే అనగా వికల్పము లనబడుటలోని అనిర్వచనీయతను తొలగించుట, కావున సర్వ వాఙ్మయమునగల వ్యంగ్యవ్యంజక భావమునుగూర్చి ప్రతిపాదించినాడు 119 ఇదియే అతని ఆత్మ పరిశీలనమునకు ప్రమాణము ఇందే వ్యంజనాసూత్రత్వమున్నది

కావున అతనికి వ్యంజనసూత్ర ప్రతిపాదనమున ప్రమాణములుకాని అంశములు కొన్నియున్నవి అవి ఆధునిక భాషాశాస్త్ర పరిభాషననుసరించి భిన్నములైన భాషోపయోగములకు సంబంధించినవి ఇవియే వాగ్వైచిత్ర్యములు అభిధాప్రకారవిశేషములు

1 గ్రాంథిక వ్యావహారిక భేదములు
2 గద్యపద్య భేదములు
3, రచనా భేదములు
4 వాగ్రూపవ్యవహారము లేఖనము

5 దోషాదోషములు - ఔచిత్యము
6 శాస్త్రబద్ధత - స్వతంత్రత
7 మతదృష్టి - ప్రక్రియాదృష్టి

ఇందు మొదటిది సాంఘికదృష్టితో నేర్పడునది భాషానిర్మాణ గతముగ నున్న భేదములను చారిత్రక వివరణమునకు లోబడినవి కావున వ్యంజనకు విషయములు కావు రెండవది భావతీవ్రతకు అభ్యాసమునకు సంబంధించినది మూడవది వాక్యనిర్మాణమునగల అన్వయపై చిత్రికి సంబంధించిన విశేషము నాల్గవది నాగరికతాసంబంధి కడపటి మూడును సందర్భాశ్రితములు, బాహ్యావరణములు ఇవి క్రింద వివరింపబడును

## 2 11 3 1 గ్రాంధిక వ్యావహారిక భేదములు

భాషాశాస్త్ర దృష్టితో వ్యావహారికము (colloguial language) అనగా అశిష్టజన / శిష్టజన వ్యవహారము 120 జానపదవాఙ్మయ (folk – literature) ను గురించిన మీమాంస అంతయు సాంఘికమైన ఈభేదము నాశ్రయించియే వృద్ధి అయినది 121 మనస్తత్వ దృష్టితో ఈవిభాగమసత్యమని నేడు నిరూపించు చున్నారు అనగా జానపదత్వము మానసిక దశాభేదమని నేడు పండితులంగీకరించుచున్నారు 122 అలంకారికుల దృష్టితో 'వార్త' అనబడునది నేడు భావింపబడుచున్న వ్యావహారికము / గ్రామ్యముకావు 123 ప్రమాణము భామహుడు 124 ఆనందవర్ధనుడు ఆలంకారిక దృష్టికల్గినవాడు కావుననే జానపదసాహిత్యమని నేడు నవ్యులచే వర్గీకరింపబడిన గాధాసప్తశతి నుండి ప్రథమోదాహరణము చూపినాడు

'భమధమ్మిఅ వీసత్థోసోసుణఓ అజ్జమారిఓదేణ
గోలాణఇకచ్ఛకుడుఙ్గ వాసణాదరిఅసీహేణ'

[ధ్వ. ఆ 1-4 క్రిందపుట 52]

సంచరింపుము ధార్మిక శంకవిడిచి
అల్లకునకమ్ము నిప్పుడే ఆంతమొంద
జేసె గోదావరీ తటస్థలభాకు
డుంగమునను న్న దృప్తమౌ ఎంగమదియె. 125

పై పాకృతమానాటి వ్యావహారికము పైని తెలుగినాటి గ్రాంధికము ఈ రెండును సాంఘికములగు శైలీభేదములే. రెంటనుగలది ఒకేలక్షణము

వాచ్యము విధిరూపముగ నుండుట

వ్యంగ్యము ప్రతిషేధరూపమున నుండుట (ధ్వ అ 1-4 క్రింద)

ఇట్టి ఆంగ్లవాక్యము ప్రథమాధ్యాయమున ప్రదర్శితము (పుట 94)

కావున ఆనందవర్ధనుడు పై ప్రాకృతశ్లోకమున గల శబ్దార్థముల ఉపసర్జనత్వమును గురించి పరిశీలించుట ధ్యేయముగా కల్గినవాడుతప్ప ఆవ్యవహర్తల సాంఘిక స్థితిగతులతనికి ప్రమాణములుకావు 126

ఈ అభిప్రాయమునే లోచనమిట్లు స్పష్టముచేయునది

పూర్వేషాంతు ముక్తకాదీనాం భాషాయామనియమః

(లో పుట 324)

కాని నాటకములందు పాత్రోచితిభాష యున్నదికదా! అని ప్రశ్నము పుట్టవచ్చు అది వక్త్రౌచిత్యము ననుసరించిన నియమము భిన్నపాత్రలుండుట వలన ఆయా పాత్రలస్వభావములకవి వ్యంజకములుకావచ్చు అంతియకాని భాషాప్రక్రియా సంబంధి కాదు - దీనికి నియమము భావము తద్వ్యక్తీకరణము పాత్రనాశ్రయించి భిన్నశైలులలో జరుగవచ్చు శైలులును వ్యంజకములుకావచ్చు.

(ముందు చూపవాపు గుణాలంకారవ లవలె) కాని యిచ్చట ఆనంచని ప్రయత్నము విధిరూపవాక్యము నిషేధరూపార్థమునెట్లు ప్రతీయ-నము చేయుచున్నట నటనుగూర్చి అందులకే 'కావ్యాత్మ నిరూపణమునకు' గాథ ను గ్రహించినాడు వస్త్వలంకారరసనిరూపణము లోచనమున సుదీర్ఘముగ చేయబడినవి (మా లో పుటలు 52-70) 'అనగా స్వస్థానభాషకు రసమునకు విరోధములేదని యర్థము అంతమాత్రమేకాదు ఎక్కువ సన్నిహితత్వముగలదియని కూడ అర్థము ఒక భాషయందలి పలుకుబడి, కాకువు, దుఃఖాదిభావము కల్గినపుడు జనముసహజముగ నుపయోగించెడి మాటలు మొదలైనవన్నియు రసస్ఫోరకములై యుండును జాల కొపము, ప్రేమ, దుఃఖము మొదలైన వానిని పొందినపుడు భిన్నజాతీయులు, భిన్నభాషీయులు భిన్నముగా వారి భాషలోనున్న శబ్దములతో తమ భావములను వ్యక్తముచెయుదురు ఆశబ్దములాజాతికి సహజములు ఆభాషకు సహజములు వానిని వదలిపెట్టినచో ఆభాషలో రసస్ఫూర్తి కలుగుట దుర్లభము అంుచేత రసప్రధానమైన కావ్యము వైకృతభాషలను పరిత్యజింపలేదు (కావ్యానందము - భాష, పుటలు 6-16) అని ఒక కవివిమర్శకుడు అభిప్రాయపడినాడు. కల్పవృక్షావతారికలో అయనే (బాలకాండము ఫుట 10 1976 ప్రతి) నాడి వ్యవహారభాష సుందరము శైలి అనియు వ్రాసినారు 127 కావున కేవలము వార్త కాని వ్యావహారికము' - కావ్యత్వము నందున అనగా 'ఉక్తి వైచిత్రిని గురించి అలంకారిక మీమాంసజరుగునని యర్థము

'స్వభావోక్తి గ్రామ్యమైనచో వార్త
వార్త అగ్రామ్యమైనచో స్వభావోక్తి 128

'గతోస్తమర్కః' (ధ్వన్యాలోకము) ఇత్యాది వాక్యములు 'వార్త' లని భామహుడు 'భమధమ్మిఅ' కావ్యమని ఆనందవర్ధనుడు మొదటిదానియందు ఉక్తివైచిత్రిలేదు రెండవదానియందున్నది కావున అది కావ్యవాక్యదినినే వార్త రసభావ ప్రదర్శకము కానేరదనుటలో కృష్ణచైతన్య భావించిరి 129

కావున గ్రాంథిక వ్యావహారికములు వ్యంజకములైనను వ్యంజనసూత్ర ప్రతిపాదనకు ప్రమాణములు కావు

## 2 11 3 2 గద్యపద్యభేదములు

ఆనందవర్ధనుడు ఛందోవ్యంజకతను గురించి ఎచ్చటను తనయాలోకమున చెప్పలేదు ఛందోవ్యంజకతను గురించి ఆధునికులు కొందరు పరిశీలించిరి పాటిబండ మాధవశర్మగారు

'ఛందమనగా ఇచ్ఛ. ఆదిసృజనాత్మకమైన చైతన్యస్పందము వక్తృచైతన్యస్పందమే వాక్యోత్పత్తికి గారణము కారణగుణములు కార్యమున లగింపబడును వాక్యము వక్తృవ్యాపరతంత్రము కావున వక్తృచ్ఛందమే వాక్యచ్ఛందము. ఛందమందలి యక్షరములు, వానిగౌరవలాఘవములు, సంఖ్యాక్రమములు - సర్వము వక్తృచిత్తవృత్తి వివర్తములు కనుకనే తచ్చిత్తవృత్తివ్యాప్తములై తద్వ్యంజకములగుచున్నవి'[130] (ఛంద శిల్పము, పుట 29) అని వ్రాసిరి పీరె భారతమునగల ఛందోఽలంకార రసశిల్పసమన్వయము చేయుచు నిట్లనిరి

'ఒక ఛందమనేక భావములకు, అనేకఛందములొకే భావమునకు కవిత్రయము వాడిరి ఈపద్యమునందీయాశ్వాసమునందది రసమనికాని, ఈరసమునకిది ఛందమనికాని నిష్కర్షముచేయుట అసాధ్యము ఒకప్పుడు చెప్పనచో నీపద్యమునందిది స్థాయియైనభావము, ఇదిస్థాయియైన చందము అని కొంతవరకు చెప్పవచ్చును' (అదే గ్రంథము, పుట 174) దీని యర్థమిది

వాక్కు వ్యంజకమను ఆలోకసూత్రమునకు వాక్కునాశ్రయించిన సర్వాభినయములను (ఛందమొక అభినయము కావున) వ్యంజకములనియే అర్థము 'కావ్యస్యాత్మాసఏవార్థ ... శోకఃశ్లోకత్వమాగతః' (ధ్వ అ 1-5) అను కారికయే ఆనందవర్ధనాదులు దర్శించిన రససిద్ధాంతరహస్యమునకు నిదర్శనమని

శర్మగారి అభిప్రాయము (అదే పుట 35) ఈ దృష్టితోనే ద్రుతవిలంబితాది అక్షరవృత్తుల రసవ్యంజకతనుగూర్చి ఛందోదృష్టితోవారు వ్రాయున్నారు కాని వ్యంజనసూత్రప్రతిపాదనకు ఛందోనియమము ప్రమాణముకాదు కారణము వ్యంజన శబ్దార్థసమన్వయవ్యాపారమగుట

## 2 11 3. 3 రచనా భేదములు

భామహునితో మొదలయిన అలంకారప్రాధాన్యవాదము ఆనందుల ఆలోకమున విశ్రాంతినందినది అలంకారములు కటకాదులవలె అలంకారములు 131 అనగా నాట్యమున ఆహార్యమువంటిది కావున అలంకారమును వ్యంజకము కావచ్చును 132 కాని అదియే ఒక ప్రమాణముకాదు దండితో మొదలైన గుణవివాదమునకు వ్యంజకత నాపాదించినదియు ధ్వన్యాలోకమే సంఘటనకు విషయనియమము లేమిచే,133సంఘటన గుణానుసారికామిచే134 గుణము రసాశ్రయమని ఆనందులు సాత్త్వికాభినయము గుణాశ్రయము 135 ఇట్లు గుణమును వ్యంజకమైనది ప్రమాణము కాలేదు.

## 2 11 3 4 వాగ్రూప వ్యవహారము - లేఖనము

వ్యంజన ప్రతిపాదనమునకీ ప్రమాణములేదు కాని ధ్వని వ్యగ్వ్యాపారముగ గుర్తించుటలో లేఖనపద్ధతి ఒక యడ్డముగా తయారగును ఆధునికులు సాహిత్యమున లిఖిత - అలిఖిత భేదములను పాటించుచున్నారు 136

ప్రాచీన కాలమున సాహిత్యము ప్రాథమికముగ మౌఖిక ప్రచారమునే కల్గినది గురువుద్వారమున శిష్యుడు, పౌరాణికునిద్వారమున శ్రోతలు, నటులముఖముగ ప్రేక్షకులు ప్రత్యక్షముగ శబ్దప్రభావమునకులోనగు నవకాశముండిన దశయందు వాగ్వ్యాపారమననేమో అనుభవమునకు వచ్చునంతగా లిఖితగ్రంథము ను చూచునపుడురాదు

ఒక్కొక్కసారి లేఖనము కూడ వ్యంజకమే ఆంగ్లమున క్వొటెడ్ లెటర్, వ్యవహారము (He లేఖనము) ఇట్టిది ఆధునిక వచనకవిత్వమునను వార్తాపత్రిక, చలనచిత్రాది ప్రచారసాధనములందును లేఖనప్రాధాన్యమును చూడవచ్చును ఆధునిక భాషాపరిశీలకులిట్టి సంకేతములకు గల వ్యంజకత్వమును గూర్చి వ్రాయుచున్నారు [137]

ఆనందవర్ధనుని కాలమునకు లేఖనసంప్రదాయమున్నది కాని అతని వాదము వ్యవహారమునందున్న వాక్కును ప్రమాణముగ సాగినది అభినయాదులు వాక్కును అనుసరించుట / వ్యతిరేకించుట అనుభవసిద్ధము ఈ వాగ్రూప వ్యవహారము వ్యక్తావ్యక్త విషయబోధకము / స్ఫోరకము కావున వ్యంజనము రెండువిధములనుండును

1 వస్తువు (object / notion) ను వ్యంజించు మొదటిదశ.

2 రసము (feeling) ను వ్యంజించు రెండవదశ

(అలంకారము వస్తువుతో పాటు త్రిభేదమును కల్గినది కావున వ్యంజన ప్రధానముగ రెండేదశలు కల్గినది )[138]

నిత్యవ్యవహారమున వస్త్వలంకారముల బోధయుండును అవి తావన్మాత్ర పర్యవసితములు

కావ్యవ్యవహారమునందట్లుకాదు, రసపర్యవసానము కల్గియుండును అనగా ఆవస్త్వలంకారములును రసవ్యంజకములుగ మారుననిభావము

ఈకారణముగా ఆనందవర్ధనుడు లేఖనమును ప్రమాణముగ గుర్తింపలేదు.

(ముందు చూపబోవు గుణాలంకారములవలె) కాని యిచ్చట ఆనంద ని ప్రయత్నము విధిరూపవాక్యము నిషేధరూపాన్యార్థమునెట్లు ప్రతీయ - మనుచేయుచున్న దనుటనుగూర్చి అందులకే 'కావ్యాత్మ నిరూపణమునకు' గాథ ను గ్రహించినాడు వస్త్వలంకారరసనిరూపణము లోచనమున సుదీర్ఘముగ చేయబడినది (చూ లో పుటలు, 52-70) 'అనగా స్వస్థానభాషకు రసమునకు విరోధములేదని యర్థము. అంతమాత్రమేకాదు ఎక్కువ సన్నిహితత్వముగలదియని కూడ అర్థము ఒక భాషయందలి పలుకుబడి, కాకువు, దుఃఖాదిభవము కల్గినపుడు జనముసహజముగ నుపయోగించెడి మాటలు మొదలైనవన్నియు రసస్ఫోరకములై యుండును జాలి కోపము ప్రేమ, దుఃఖము మొదలైన వానిని పొందినపుడు భిన్నజాతీయులు, భిన్నభాషీయులు భిన్నముగా వారి భాషలోనున్న శబ్దములతో తమ భావములను వ్యక్తముచేయుదురు ఆశబ్దములాజాతికి సహజములు ఆభాషకు సహజములు వానిని వదలిపెట్టినచో ఆభాషలో రసస్ఫూర్తి కలుగుట దుర్లభము అందుచేత రసప్రధానమైన కావ్యము వైకృతభాషలను పరిత్యజింపలేదు (కావ్యానందము భాష, పుటలు 6-16) అని ఒక కవివిమర్శకుడు అభిప్రాయపడినాడు. కల్పవృక్షావతారికలో అయనే (బాలకాండము పుట 10 1976 ప్రతి) నాడు వ్యవహార భాష సుందరము శైలి అనియు వ్రాసినారు [127] కావున కేవలము వార్త కాని వ్యావహారికము' - కావ్యత్వము నందును అనగా 'ఉక్తి వైచిత్రిని గురించి ఆలంకారిక మీమాంసజరుగునని యర్థము

'స్వభావోక్తిగ్రాహ్య మైనచో వార్త
వార్త అగ్రాహ్యమైనచో స్వభావోక్తి [128]

'గతోస్తమర్క ' (ధ్వన్యోదాహృతము) ఇత్యాది వాక్యములు 'వార్త లని భామహుడు 'ధమధమ్మిఅ' కావ్యమని ఆనందవర్ధనుడు మొదటిదాని యందు ఉక్తివైచిత్రిలేమి రెండవదానియందున్నది కావున అది కావ్యవాక్య - దీనినే 'వార్త రసభావ ప్రదర్శకము కానేరదనుటలో కృష్ణచైతన్య భావించిరి [129]

కావున గ్రాంథిక వ్యావహారికములు వ్యంజకములైనను వ్యంజనసూత్ర ప్రతిపాదనకు ప్రమాణములు కావు

## 2 11 3 2 గద్యపద్యభేదములు

ఆనందవర్ధనుడు ఛందోవ్యంజకతను గురించి ఎచ్చటను తనయాలోకమున చెప్పలేదు ఛందోవ్యంజకతను గురించి ఆధునికులు కొందరు పరిశీలించిరి పాటిబండ మాధవశర్మగారు

'ఛందమనగా ఇచ్ఛ ఆదిసృజనాత్మకమైన చైతన్యస్పందము వక్తృచైతన్యస్పందమే వాక్యోత్పత్తికి కారణము కారణగుణములు కార్యమున లగింపబడును వాక్యము వక్తృవ్యాపరతంత్రము కావున వక్తృచ్ఛందమే వాక్యచ్ఛందము ఛందమందలి యక్షరములు, వానిగౌరవలాఘవములు, సంఖ్యాక్రమములు - సర్వము వక్తృచిత్తవృత్తి వివర్తములు కనుకనే తచ్చిత్తవృత్తివ్యాప్తములై తద్వ్యంజకములగుచున్నవి'130 (ఛంద శిల్పము, పుట 29) అని వ్రాసిరి పిరె భారతమునగల ఛందోఽలంకార రసశిల్పసమన్వయము చేయుచు నిట్లనిరి

'ఒక ఛందమనేక భావములకు, అనేకఛందములొకే భావమునకు కవిత్రయము వాడిరి ఈపద్యమునందీయాశ్వాసమునందది రసమనికాని, ఈరసమునకిది ఛందమనికాని విశ్కర్షముచేయుట అసాధ్యము ఒకప్పుడు చెప్పనచో నీపద్యమునందిది స్థాయియైనభావము, ఇదిస్థాయియైన ఛందము అని కొంతవరకు చెప్పవచ్చును' (అదె గ్రంథము, పుట 174) దీని యర్థమిది

వాక్కు వ్యంజకమను ఆలోకసూత్రమునకు వాక్కునాశ్రయించిన సర్వాభినయములను (ఛందమొక అభినయము కావున) వ్యంజకములనియే అర్థము 'కావ్యస్యాత్మాసఏవార్థః ... శ్లోకఃశ్లోకత్వమాగతః' (ధ్వ అ 1-5) అను కారికయే ఆనందవర్ధనాదులు దర్శించిన రససిద్ధాంతరహస్యమునకు నిదర్శనమని

శర్మగారి అభిప్రాయము (అదే పుట 35) ఈ దృష్టితోనే ద్రుతవిలంబితాది అక్షరవృత్తుల రసవ్యంజకతనుగూర్చి ఛందోదృష్టితోవారు వ్రాసియున్నారు కాని వ్యంజనసూత్రప్రతిపాదనకు ఛందోనియమము ప్రమాణముకాదు. కారణము వ్యంజన శబ్దార్థసమన్వయవ్యాపారమగుట

## 2 11 3. 3 రచనా భేదములు

భామహునితో మొదలయిన అలంకారప్రాధాన్యవాదము ఆనందుల ఆలోకమున విశ్రాంతినందినది అలంకారములు కటకాదులవలె అలంకారములు 131 అనగా నాట్యమున ఆహార్యమువంటిది కావున ఆలంకారమును వ్యంజకము కావచ్చును 132 కాని అదియే ఒక ప్రమాణముకాదు దండితో మొదలైన గుణ వివాదమునకు వ్యంజకత నాపాదించినదియు ధ్వన్యాలోకమే సంఘటనకు విషయ నియమము లేమిచే,133 సంఘటన గుణానుసారికామిచే134 గుణము రసాశ్రయమని ఆనందులు సాత్త్వికాభినయము గుణాశ్రయము 135 ఇట్లు గుణమును వ్యంజక మైనది ప్రమాణముకాలేదు.

## 2 11 3 4 వాగ్రూప వ్యవహారము - లేఖనము

వ్యంజన ప్రతిపాదనమునకీ ప్రమాణములేదు కాని ధ్వని వ్యంగ్యవ్యాపారముగ గుర్తించుటలో లేఖనపద్ధతి ఒక యడ్డముగా తయారగును ఆధునికులు సాహిత్యమున లిఖిత - అలిఖిత భేదములను పాటించుచున్నారు 136

ప్రాచీన కాలమున సాహిత్యము ప్రాథమికముగ మౌఖిక ప్రచారమునే కలిగినది గురువుద్వారమున శిష్యుడు, పౌరాణికునిద్వారమున శ్రోతలు, నటుల ముఖముగ ప్రేక్షకులు ప్రత్యక్షముగ శబ్దప్రభావమునకులోనగు నవకాశముండిన దశయందు వాగ్వ్యాపారమననేమో అనుభవమునకు వచ్చునంతగా లిఖితగ్రంథములను చూచునపుడురాదు

ఒక్కొకసారి లేఖనముకూడవ్యంజకమే ఆంగ్లమున క్యాపిటల్ లెటర్స్ వ్యవహారము ( He లేఖనము) ఇట్టిది ఆధునిక వచనకవిత్వమునను వార్తాపత్రిక, చలనచిత్రాది ప్రచారసాధనములందును లేఖనప్రాధాన్యమును చూడవచ్చును ఆధునిక భాషాపరిశీలకులిట్టి సంకేతములకు గల వ్యంజకత్వమును గూర్చి వ్రాసియున్నారు [137]

ఆనందవర్ధనుని కాలమునకు లేఖనసంప్రదాయమున్నది కాని అతని వాదము వ్యవహారిమునందున్న వాక్కును ప్రమాణముగ సాగినది అభినయాదులు వాక్కును అనుసరించుట / వ్యతిరేకించుట అనుభవసిద్ధము ఈ వాగ్రూప వ్యవహారము వ్యక్తావ్యక్త విషయబోధకము / స్ఫోరకము కావున వ్యంజనము రెండు దశలనుండును

1 వస్తువు (object / notion) ను వ్యంజించు మొదటిదశ

2 రసము (feeling) ను వ్యంజించు రెండవదశ

(అలంకారము వస్తువుతో లంక్ష్య-త్రిభేదమునుకల్గినది కావున వ్యంజన ప్రధానముగ రెండేదశలు కల్గినది )[138]

నిత్యవ్యవహారమున వస్త్వలంకారముల బోధయుండును అవి తావన్మాత్ర పర్యవసితములు

కావ్యవ్యవహారమునన్నట్లుకాదు, రసపర్యవసానము కల్గియుండును అనగా అవస్త్వలంకారములును రసవ్యంజకములుగ మారుననిభావము

ఈకారణముగా ఆనందవర్ధనులు లేఖనమును ప్రమాణముగ గుర్తింపలేద

## 2 11 3 5 దోషాదోషములు - ఔచిత్యము

ఆలంకారికులనేక దోషములు చెప్పియుండగా - రసభంగమగునదె దోష మనియు అనౌచిత్యముకన్నను రసభంగకారణము - మఱియొక్కటిలేదనియు ఆలోకసిద్ధాంతము - కావున వ్యంజన దోషాదోషముల నాశ్రయించినది. కా. (మా ధ్వ. ఆ 3-14 క్రింద)

## 2 11 3 6 శాస్త్రబద్ధత - స్వతంత్రత

శాస్త్రమున శబ్దము నియతార్థకముగ ప్రయుక్తమగునని ప్రథమాధ్యాయ మున చెప్పబడినది కావ్యశబ్దము ఏతద్విరుద్ధప్రయోజనము నపేక్షించి సృజింప బడును ఈ స్వేచ్ఛ కవి వ్యాపారరూపిణి అపారేకావ్యసంసారే (ధ్వ ఆ 3-43 క్రింద) ఇత్యాది కారికలిందుకుద్దిష్టములు కేవలము శాస్త్రత్వసంపాదనేచ్ఛతో సృజింపబడు కావ్యముపాదేయముకాదని - రసావిష్కరణము కవిధ్యేయమని - కవిప్రతిభచే అల్పాల్పదోషములు - వ్యుత్పత్తి దారిద్ర్యమున సంభవించునవి - ఆచ్ఛాదింపబడునని, కావ్యమున శబ్దార్థముల ఆనంత్యమునకు, ఫలితముగ ధ్వని స్వరూపమును నిర్ధరించుటకు తార్కికప్రమాణము లేకపోవుటకు, హేతువు కవి ప్రతిభాగుణమని ఆనందుల తర్కము

> ధ్వనేరిత్థం గుణీభూత వ్యంగ్యస్యచ సమాశ్రయాత్
> నకావ్యార్థ విరామోఽస్తి యదిస్యాత్ప్రతిభాగుణః
>
> (ధ్వ ఆ 46)

స్వేచ్ఛాస్వాతంత్ర్యరూపవర్తినియగు వాక్కు కవిచే వివక్షితమును - అనుద్దిష్టమును అగు అర్థవిశేషములను నిత్యనూత్నములుగ అందించుచుండును ఈ ప్రచేతనము వాగ్లక్షణము

దృష్టపూర్వా అపిహ్యర్థాః కావ్యేరసపరిగ్రహాత్
సర్వేనవా ఇవాభాన్తి మధుమాస ఇవద్రుమాః

(ధ్వ ఆ 4 4)

కావున వ్యంజనవ్యాపారము వాక్కునకు గల స్వతంత్ర ప్రతిపత్తి వల్ల సాధ్యము, దేనిచో వక్తృశ్రోతృకాలదేశకాలాదులు నియమించెడి అర్థములు 'అవగమితములు' కావలయును కాని వ్యంగ్యార్థములను వ్యాకరణాది శిక్ష నేర్పవు - తర్కాది శాస్త్రములు విధింపవు - వాగ్వ్యాపారదృష్టి ప్రధానమగుటయే ఈవ్యాకరణశాస్త్రాది నిరాసమునకు హేతువు కావుననే 'ప్రథమేహి విద్వాంసో వైయాకరణాః' (ధ్వ ఆ 1-13 క్రింద)

అనినవాడు ,

శబ్దార్థశాసన జ్ఞానమాత్రేణైవ నవేద్యతే'

(ధ్వ, ఆ 1 ()

అనియు వ్రాసినాడు

కావున వ్యంజన శాస్త్రబద్ధతనాశ్రయించినదికాదు

## 2 11 3 7. మతదృష్టి - ప్రక్రియాదృష్టి

వ్యంజనసూత్ర ప్రతిపాదనకు ఆధారముఖమైన మతమును ప్రమాణము కాదు అందువలననే వ్యంజన సూత్రాంతర్గతముగ పండితులు కొందరు విశిష్టాద్వైత లక్షణమున్నదని,139 కొందరు అద్వైతమే యున్నదని,140 మరి కొందరు కాశ్మీరశైవాగమ141 మున్నదని భావించుట జరుగుచున్నది

భాషావ్యాకరణదృష్టితో లోకమును పరిశీలించినవారు కేవలము భర్తృహరి 'స్ఫోట' నుండి వ్యంగ్య వ్యంజక భావమును ఆనందవర్ధనుడు గ్రహించినట్లు వ్రాయయున్నారు 142 ఆనందవర్ధనుడు వైయాకరణ సంప్రదాయమునుండి ప్రత్యక్షముగ నీసూత్రము గ్రహింపబడినదని చెప్పినట్లు నిదర్శనము చూపగలము.

అథైవాన్యైస్తన్మతానుసారిభిః సూరిభిః కావ్య
తత్త్వార్థదర్శిభిర్వాచ్యవాచక సమ్మిశ్రః శబ్దాత్మా కావ్యమితి
వ్యపదేశ్యో వ్యంజకత్వసామ్యాద్ ధ్వనిరిత్యుక్తః
(ధ్వ ఆ 1 13 క్రింద)

ఆనందవర్ధనుని అభిప్రాయమును లోచనమిట్లువ్మీలించినది - ఇట్లు వాదించిన శబ్దబ్రహ్మవాదులననుసరించి మేమును ప్రసిద్ధశబ్దవ్యాపారములగు అభిధా తాత్పర్యలక్షణ రూపములకంటె అతిరిక్తమగు వ్యంజనధ్వనియని చెప్పుచున్నాము. (లో పుట 134)

అభినవుడు ఆలోకహృదయమును నింతగా వివరించుచుండగా అందు ప్రత్యభిజ్ఞాసూత్రము లేదనుటయుదోషమే కారణము వృత్తికారునిదృష్టి కేవలము వాక్‌తత్త్వముపైన అంతియకాని బాహ్యమగు తంత్రముపైనకాదు మూలకారుని యభిప్రాయములను ప్రయోగదృష్టి (practical aspect) తో వివరించుటకే 'లోచనము' ప్రసారింపబడినది. కావున ఇందుమతదృష్టిలేదు కేవలము వాక్‌తత్త్వదృష్టయున్నది 143

## 2 11 4 వాక్తత్త్వము

ధ్వన్యాలోకము 'కావ్యాత్మ' గా ధ్వనిని పరిశీలించినది 'ఆత్మ' ను గురించిన మీమాంసచేయు వారాస్తికులు. చార్వాకులొక్కరు దీనిని నిరసింతురు (చార్వాకైరివ ఆత్మ పృథగ్భావే లో పుట 45) తత్త్వాలోకమను గ్రంథమున

ఆనందవర్ధనుడేమి ప్రతిపాదించెనో తెలియదుగాని రెండుచోట్ల అభినవులు ఆ గ్రంథమునుగూర్చి ప్రస్తావించిరి.

యేఽప్యవిభక్తం స్ఫోటం వాక్యంతదర్థంచాహుః తైరప్యవిద్యాపతితైః సర్వేయమనుసరణీయా ప్రక్రియా తదుత్తీర్ణత్వేతు సర్వపరమేశ్వరాద్వయం బ్రహ్మేత్యస్మచ్ఛాస్త్రకారేణ నవివిదితం తత్త్వాలోకగ్రంథం విరచయతేత్యాస్తాం (లో పుట 67)[144] అవిద్యాపదమనగా వ్యవహారమార్గమని, యే...ప - అనబడిన వారు స్ఫోటవైయాకరణవాదులని 'బాలప్రియ అర్థము చెప్పినది భర్తృహరి 'శబ్దబ్రహ్మ వాది ఆనందవర్ధనుడు 'వాగ్రూపయగు భగవతి' ని సమర్థించిన వాడు ఈమార్గమెక్కడిది? దీనికి సమాధానము మరియొకచోట అభినవులు సూచించిరి "ఏవమనుక్రమణీ నిర్దిష్టవాక్యేన భగవద్వ్యతిరేకిణః సర్వస్యాన్యస్యానిత్యతాం ప్రకాశయతా మోక్షలక్షణ ఏవైకఃపరః పురుషార్థః శాస్త్రనయే, కావ్యనయేచ తృష్ణాక్షయ పరిపోషలక్షణః శాంతోరసో మహాభారతాంగిత్వేన వివక్షిత ఇతిసుప్రతిపాదితమ్' - (ధ్వ ఆ 4 5 క్రింద)

ఆస్వాద యోగాభావమున పురుషార్థ (మోక్ష) మని
చమత్కార యోగమున రస (శాంత) మని

తత్త్వాలోకమున ఆనందవర్ధనుడు నిరూపించెనని లోచనవ్యాఖ్య (పుట 133)

కావున ఆనందాభినవులిరువురును శివాద్వయవాదులే శివాద్వయవాదులకు శివరసముల మధ్యభేదములేదు

స్థాయీ ప్రబుద్ధ్యారుచియే వ్యభిచారిభూతః
కామాకులాసు జనతాసు మహానుభావః
అంతర్విభావ విషయోరస మాతృమూర్తిః
శ్రీమాన్ ప్రసన్నహృదయోఽస్తుమమత్రినేత్రః - అభినవభారతి

'ఉపాస్య హెస్వానుభవైకవేద్యం స్వచ్ఛంద మానందసముద్రమీశం
ఇహ హికశ్చిత్ నిజంతేనాశివాసనా సంజ్ఞనవాయచ
దుర్హృదయో ద్వేజిత సహృదయసముదాయ సముత్తేజితః
శ్రీమదభినవగుప్తపాదోపదిష్టః ధ్వన్యాలోకలోచనే
మంగళం వివృణోతి' - లోచనము 145

ఇవి ఏమనితెలుపును • ఆనందవర్ధనుడు శివాద్వయవాది కానిచో అభినవులు లోచనము వ్రాయుయుండరని తెలుపును ఆలోకమందలి 'సః' అన్న పుంలింగ వివక్షకు (1-13) ఇంతకన్నను హేతువు మరియొకటి ఏమిగలదు ?

కావుననే ఆలోకమున 'ఆత్మ స్థానీయముగ కావ్యమునకు 'రసధ్వని ప్రతిపాదింపబడియున్నది అభినవులు 'రసఏవహా వస్తుతఆత్మా ఇత్యాదిగ వస్త్వలంకార ధ్వనులు రసపర్యవసాయులని వివరించిరి. (లో పుట 52)

కాశ్మీర శైవాగమమున చిదానందరూపుడైన మహేశ్వరుడీజగత్తునకు 'ఆత్మ' స్థానీయుడుగ ప్రతిపాదింపబడినాడు చైతన్య మాత్మా -' చిత్త మాత్మా అని రెండు నిర్వచనములు శివసూత్రములందు చెప్పబడినవి 146

కావుననే ప్రత్యభిజ్ఞేయౌ (ధ్వ. ఆ 1-8) అని ఆలోకముచెప్పనచోట అభినవులు ప్రత్యభిజ్ఞాదృష్టితో వ్యాఖ్యానము చెప్పిరి కావున ఆనందవర్ధనుల వాక్తత్త్వము రసమే శృంగారము పరప్రహ్లాదనరసమను ఆనందవర్ధనుల మాటలు (ధ్వ ఆ 2-6) శివాద్వయసమర్థనమే

భగవత్యా సహశంభునాథఏకః ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుమ్ అను కైవల్యోపనిషత్తును తంత్రాలోకముదహరించుటలో నిదిస్పష్టము

ఆనందవర్ధనుని దృష్టిలో కావ్యమున సూత్రమొక్కటియే అది రస సూత్రము వ్యంజనద్వారమున రసమభివ్యక్తిని పొందును కావున వ్యంజన సూత్రమని అతడనలేదు.

'రామాయణేహి కరుణోరసః స్వయమాదికవినాసూత్రితః (ధ్వ ఆ 4-7)అని అనియుండుట దీనికి పరమప్రమాణము రసము కావ్యమున వ్యంగ్యము కావున కావ్యమంతయు వ్యంజకము వస్తువు భావమునకువ్యంజకము ఇదిఎట్లు?

'శైవమతానుసారికి స్వాత్మజ్ఞానము వస్తువువలన కలుగును'147 (శివదృష్టి) అనగా వస్తువునకు వస్తుజ్ఞానమును కల్గించుధర్మమేకాక ఆత్మజ్ఞానమును కల్గించు ధర్మమునుగలదని అంగీకరింపవలయును శబ్దార్థములకీసూత్రమునన్వర్తించి నచో వాచక, వ్యంజక వ్యాపారములను రెంటిని కల్గియుండుటలోని సార్థక్యము తెలియును

ఈ కారణముగనే శబ్దార్థవ్యాపారములను లోచనము అవగమన ద్యోతన దృష్టులతో పృథక్కరించినది

ప్రత్యభిజ్ఞ కవి సహృదయులందుగల సమానానుభవప్రతిభాసనముగా అనం లు వివరించియే వ్యంగ్యప్రాధాన్యమును నిర్ధరించిరి శాస్త్రమున ప్రత్యభిజ్ఞ ఇట్లు నిర్వచింపబడినది

స్మరణానుభవారూఢా సామాన్యాధికరణ్యధీః
సంస్కారేంద్రియజన్యాచ ప్రత్యభిజ్ఞాప్రకీర్తితా 148

ప్రత్యభిజ్ఞ సంస్కారద్వారముననూ, ఇంద్రియద్వారముననూ నొకేసారి జరుగును ఇట్లు స్మృత్యనుభవముమీద నాధారపడిన వ్యక్తివిషయిక బోధ ప్రత్యభిజ్ఞ 149

2 11 4 1 ఆధునిక భాషాశాస్త్ర పద్ధతియందు చెప్పనచో వ్యవహర్తల నడుమగల సాంఘికార్థికవిద్యావయోగౌరవాదిభేదములనతిక్రమించి జీవులు'గా వారియందుగల సమానానుభవము నాధారముగా స్థాపింపబడిన తాత్త్వికసూత్రము ప్రత్యభిజ్ఞ

ఆనందాభినవుల భాషాసిద్ధాంతము ఈ సూత్రముపై ఆధారపడినది

2 11 4 2 కడపట నొక్క విషయము ఆలోకమున సహృదయ శ్లాఘ్యమగు అర్థము ద్వివిధమనుచు నొక్క కారిక యున్నది

యోఽర్థః సహృదయ శ్లాఘ్యః కావ్యాత్మేతివ్యవస్థితః
వాచ్యప్రతీయమానాఖ్యౌతస్యభేదావుభౌస్మృతౌ

(ధ్వ. ఆ 1-2)

ఇక్కడ ఒక సమస్యయున్నది. వాచ్యమును ప్రతీయమానమును రెండును ఆత్మలే అయినచో - ఆత్మ ఒక్కటియా ? రెండా ?150

లోచనమీసమస్యను పరిష్కరించినది

' తదాహ సహృదయశ్లాఘ్య ఇతిసఏక ఏవార్థోద్విశాఖతయా వివేకిభిర్విభాగ బుద్ధ్యావిభజ్యతే' అని (పుట 42)

వాచ్యప్రతీయమానములు రెండును శ్లాఘ్యములే కాని ఇవి భేద - అంశమాత్రములు. అనుభవమున నొక్కటియే

దీనికి హేతువు -

'వాచ్యేన సమశీర్షికయాగణనం తస్యాఽన్యనపహ్నవనీయత్వం ప్రతిపాదయితుం' (లో. పుట 43)

స్వాత్మజ్ఞానము వస్తుమూలమున కలుగుట అనగా నిదియె 'వాచ్యార్థపూర్వక వ్యంగ్యానుభవ మను సిద్ధాంతమునకిది ప్రమాణము

ఇది ఆనందాభినవుల వాక్పరమేశ్వర దర్శనము

## 2 12 ఆనందాభినవులు – భాషాసిద్ధాంతము

ఇక్కడ ఆనందాభినవుల వాగ్దర్శనమును భాషాసిద్ధాంతముగ వ్యాఖ్యానించుట ప్రయత్నము [151] అనుషంగికముగ వ్యంజన వాగ్వ్యాపారమని నిర్ధరించుటలో వారు ప్రమాణముగ గ్రహించిన అంశములు పరిశీలింపబడును వీరి భాషాపరిశీలనమునకు భావవ్యక్తీకరణ దశావైవిధ్యము (లెవెల్స్ ఆఫ్ కమ్యూనికేషన్) ప్రాణభూతాంశము

ఇటు ఆధునికభాషాశాస్త్రముకాని, అటు ప్రాచీన నైయాయిక మీమాంసక వాదములు కాని 'భాష'ను ఒక సాధనముగ గ్రహించినవి మహిమభట్టు వాదమును ప్రస్తావించుచు ఈవిషయము చెప్పబడినది

ఆధునికులలో బార్తెస్‌వంటివారు ప్రతిపాదించుచున్నట్లు భాష నొక 'ఆర్గానిక్ సెమియాటిక్ సిస్టమ్'గా అంగీకరించుట ఆనందాభినవుల ఉపజ్ఞ ఈదృష్టితో భాషలో గల భౌతిక మానసిక సంబంధము ప్రధానము భావ వ్యక్తీకరణదశలు మానసికమునైన దశావైవిధ్యములు ముఖ్యాంశములు ఈదృష్టితోడనేపరాత్రింశిక వివరణమున అభినవులు సామాన్యముగ వ్యవహారభూమియందు భాషలోగల హేతుబద్ధత (లాజికల్‌పాజిటివిటీస్) కావ్యవ్యవహారమునసుండదను అభిప్రాయము వెలువరించినారు [152]

సాహిత్యమునగల ఈఅహేతునియామకత భావవ్యక్తీకరణదశలో మూడవ దశను చెందినది మొదటి రెండుదశలు అర్థావగమకత, అర్థాంతర ప్రతిభాసకత

మొదటిదశలో 'కాగ్నిషన్', రెండవదశలో 'ఇంటలెక్ట్' మూడవదశలో 'ఇంట్యూష‌న్' ఈ అభిజ్ఞకున్న భిన్ననామములు 153

శిశుభాష పశుపుల అరపులనుండి మానవుని శబ్దసంకేతములను వేరు చేయుచున్న అంశము మొదటిదశ 154

చిన్నపిల్లలభాషలో ఈదశ ఉండదు

ఆవు 'అంబా' అని అరచును.
శిశువు 'అమ్మా' అని పిలుచును

ఈదశలో శిశువుభాష పశువుల అరపులతో సమానము కావుననే 'children act in so for as they speak' అని మాలినోవ్‌స్కీ చెప్పుట 155 శిశుపశువులు సమానముగ సంగీతము ననుభవించుటకు హేతువు ఇదియే ఇది ఇంట్యూషన్' దశకు సంబంధించినది బుద్ధి వికసనముతోపాటు శిశుభాషలోని ధ్వన్యనుకరణ గుణము పోవును

| పిల్లల భాష | నైఘంటిక పదములు |
|---|---|
| బ్యాక | మేక |
| లాలి/ల | నీళ్ళు |
| బజ్జి | మజ్జిగ |

వయసుతోపాటు శిశుభాషలో నైఘంటిక పదజాలముపెరుగును ఇట్లే వ్యాకరణాంశములను గురించిన పరిజ్ఞానమును సామ్యదశనుదాటి నియమదశను చేరుకొనును పెద్దలు ఇదితప్పని, ఇట్లుచెప్పవలెనని, పిల్లల భాషా వ్యవహారమును సరిదిద్దుట దీనికి నిదర్శనము

| సామ్యదశ | నియమదశ |
|---|---|
| 1 బియ్యంలు | బియ్యం (నిత్యైకవచనాంతముగా) |
| 2 బిడ్డలు | బియ్యాలు (1 ము —> $\phi$ / —లు) |
| | 2 అ —> ఆ |
| (2 యొక్క నిర్మాణ సామ్యము కారణముగ 1 ఏర్పడినది.) | (1 2 సూత్రములు క్రమముగా భాషా వ్యవహర్తలో నియమరూపమున వ్యక్తీకృతములగుచున్నది ) |

ఇట్లే శిశుభాషలో లేని లాక్షణిక ప్రవృత్తి[156] (వాచ్యార్థమునగాక లక్ష్యార్థమున వాక్యములను పదములను అర్థముచేసికొనుట), అభిధానియామకత (ఏశబ్దమును ఏసందర్భమున వాడవలెననుట), 8 10 సంవత్సరములనడుమ అభివృద్ధి యగును కావున శిశుభాషలోని ప్రత్యేకలక్షణము శబ్దమునుండి (అర్థముతో సంబంధము లేకుండ) సాక్షాత్తు భావము గ్రహింపబడుట (direct perception from sound) ఈగుణము పెద్దలభాషలో చాలవరకు నశించును కావున 'యత్రార్థః శబ్దోవా (1-13) ఇత్యాదికారిక పెద్దలభాషకు వ్రాయబడినది

కావ్యసర్జనలో శబ్దార్థములు పొందెడి మార్పులను నిర్దేశించు సూత్రము కావున శిశుభాషను అతడు భావించినరీతిని వ్యతిరేకముగ నిరూపించవలసివచ్చినది

దీనికి నిదర్శనము అన్వయవ్యతిరేకముఖముగ వర్ణవ్యంజకతను నిరూపించియుండుట

(చూ. వ్యం సూ 2 - 13 - 2)

శిశుభాషతో సమానముగ సాక్షచ్ఛబ్ద నివేదితగల మరికొన్నిభావవ్యక్తీకరణ సాధనములున్నవి

1 గీతము (music, i e., intonation, pitch rhythm etc )

2 చేష్ట (movement of various limbs i e, winking of the eyes nodding of head, raising of hands, fisting weeping laughing keeping silent etc)

ఆనందాధాభినవులిరువురును వాచ్యవ్యంగ్యములనడుమ దశాంతరములేదని స్థాపించుటకు ఘటప్రదీపన్యాయమును వాడుకొనిరి చాలచోట్ల ముఖార్థముతెకుండగనే సంగీతమువ భావవ్యంజకత యున్నదని వివరించిరి కాకువును వ్యంజకముగ గ్రహించుటలోను ఇదిస్పష్టము (ధ్వ ఆ 3 2)

ఆనందులే ఒకచోట 'స్వరశ్రుత్యాదిలక్షణమివాప్రగీతానామ్ 157 (1 7క్రింద) అని వ్రాసిరి గీతచేష్టాదులను ఆధునికులలో కొందరు భాషాంతరములుగ గుర్తించుచుండుట ప్రథమాధ్యాయమున వివరింపబడినది

(చూ వ్యం 1-3 & 1-12-3)

గీతమునగల సాజాత్యబుద్ధి నివేదిత క్రింద వివరింపబడును భిన్నరాగములున్నవి ఒక్కొకరాగము ఒక్కొకభావమును158 ప్రదర్శించుటకు సమర్థకమని సంగీతగ్రంథములు చెప్పుచున్నవి. ఈనియమమెట్లు పుట్టినది?

ఉదయమున భూపాలము మధ్యాహ్నమున వసంతము, సాయంత్రమున హిందోళము రాత్రిశహనాయిలు ప్రసిద్ధములైన రాగములు

శృంగారమున కల్యాణి శోకమునతోడి, వీరమున బిలహరి సర్వభావములకు మాయామాళవగౌళ ప్రశస్తములు ఆరంభమున హంసధ్వని, అంతమున సౌరాష్ట్రిలు సంగీతమున సంప్రదాయములు ఇవి యాదృచ్ఛిక నియమములనుటకు వీని విపర్యయములు అసమర్థములగుట ప్రతిబంధకము కాని మహా గాయకుడొక్కడు ఈరాగములను తన ఇచ్ఛవచ్చిన భావమును ప్రదర్శించుటకుపయోగించుకొనును రాగములేకాక తాళములునింతియే ఆదితాళమున త్రిపుటగతిని, అటతాళమున ఝంపెతాళగతిని ఒకడుచూపును రాగతాళముల

కిట స్వార్థము లేదు స్థాయిభేదములనిట్టివే. మంద్రమున ఉదాత్తరసములు, తారమున ఉద్ధతరసములు పాడుటనియమము కాని ప్రతిభావంతుడైన గాయకు డీలక్షణమును విపరీతముగ వాడగలడు

కావున గీతాదులకు ముఖ్యార్థములేదు 159 కాని వ్యంజకమగు స్థాయి యున్నది గీతమునగల స్థాయియే కావ్యమునను స్థాయియనబడినది ఆదిభావము. చేష్టలు మౌనము మొదలు పడిలేచుటవరకు అన్నిదశలందునుగలవు.

ఒక శిశువు ఏడ్చును

వేళనుబట్టి శిశువువయసునుబట్టి ఆరోగ్యమునుబట్టి తల్లి గుర్తించును. ఆకలనియో - మొండితనమనియో - రుజాహేతువనియో - కాని

ఒక యువకుడు ఏడ్చును

తల్లియు భార్యయు వానిరోదనమునకు హేతునిదియని చెప్పలేని సందర్భ ముండును అనగా పెద్దల చేష్టలకు ముఖ్యార్థము నిర్ణయించుట అసాధ్యమని దీనికంతయు కారణము వృద్ధత్వము మానవుని 'బుద్ధి'కి సన్నిహితుని చేయు చుండుట 'హృదయము'నకు సన్నిపాతముగ ఎప్పుడో ఒకప్పుడు పెద్దలు చరింతురు

కావున గీతచేష్టాదులందుగల సహజభావబోధకత పెద్దలభాషలో పూర్తిగా కాకపోయినను చాలవరకు నశించును. ఈదృష్టితో భాషలో రెండు ప్రధాన భావవ్యక్తీకరణదశలున్నవి



అటు వేదశబ్దములుకాని ఇటు పామరులభాషకాని, శిశువుల భాషకాని, స్వచ్ఛత (ప్యూరిటీ) కు నిలయములు - కారణము సాక్షాత్తు హృదయజన్యము లగుట లోకము మనఃప్రధానము అనగా నీచోచ్చతలు, పవిత్రతాపవిత్రతలు - అన్న భేదముతో కూడినదని అర్థము అప్పుడు శబ్దముకూడ ఈభేదద్వయమును పొందుచున్నది దీనినే భాషయందు 'ఎడిలిటీ' నశించుటయని ప్లాటో భావించినాడు

(చూ వ్యం సూ పుట 41)

అప్పుడేమగును ? శబ్దము అభిప్రాయనివేదనమునకును, గోపనమునకును సాధనమగును. గోపనము శబ్దానివేదితచేత సిద్ధించుచున్నది - కావుననే ధ్వనిలో రెండుభేదములు గుర్తింపబడినవి




అను మౌలికభేదమును ఆనందవర్ధనులు ప్రతిపాదించిరి వీని కంతర్గతముగ గల లక్షణములు రెండు **160**

1 ప్రతిపాద్యత (communicability)

2 అనుమానము (inference)

భాషాశాస్త్రమునగల నిర్వచనములన్నియు అనుమానమును ప్రాణముగ గల్గినవే మహామభట్టు ఈవాదము చేసినవాడు కావుననే 'శబ్దనివేదిత' న గ్రహింపడాయెను.

అభినవులు దీనికి సమాధానము చెప్పుటకే వాక్య- శబ్దార్థసమాహారమను ప్రతిపాదనము చేసినాడు

అనగా వివక్షితదశలో శబ్దార్థములు అనువిద్ధములుగనున్నవి అవివక్షిత దశలోఆసంబంధము బుద్ధిచేత త్రెంపబడుచున్నది అదియే భావగోపనమనగా ఆలోక (1-13) ధ్వనికారికావిర్వచనము ఈదశకు వ్రాయబడినది కావున స్థూలముగ లౌకిక ప్రపంచమున శబ్దార్థములనడుమ గమ్యగమక భావమేయున్నను భావద్యోతకములగు దశలో శబ్దార్థములు స్వార్థములను త్యజించును బుద్ధినుండి హృదయముపైపు శబ్దార్థములుచేయు ప్రస్థానము ఇందుసూత్రింపబడినది ఈ అభిప్రాయమునే కృష్ణచైతన్యగారు ఇట్లు స్పష్టపరచినారు

Words are the hardest material of art because they are at the same time linguistic symbols as well as art symbols (S P ) P 139)

నిత్యవ్యవహారమున గల శబ్దార్థములే కావ్యమున ప్రయుక్తములగుచున్నను అవిరెండు ప్రయోజనములను నిర్వర్తించుచున్నవి అవియే ఆనందవర్ధనులు పైనచెప్పిన ప్రతిపాద్యత - అనుమాన ప్రయోజనములు, ఇట్లు కావ్యమున శబ్దార్థములు బోధించెడి కథయొకటి ఉండగా ద్యోతకముచేయు భావమొకటి కనిపించుచున్నది

The life reference of linguistic behavior, thus is never allowed to be forgotten The Dhvani theory related suggestion basically to the living context of the utterance and used the perception of that context to decode the exact suggestion from the expression What is there for the senses, the sensuous resonance of words, can not conceal the expressed meaning, but it can help in the transcendence of the expressed sense

and it should do so in delicately orchestrated poetry But the transcendence is also willed, the poetic power operating at its farthest reach beyond the intimations of the pure sound and the direct meaning though utilising both (Italics mine H S B)

(S P p 142)

ఆనందుల వ్యంజనసూత్రమును కావ్యముఖముగనే పరిశీలించుటలోని సామంజస్యమిది భావవ్యక్తీకరణదశలలో అన్నియును కావ్యముననేగలవు మరి ఎచ్చటను ఇంతదశావైవిధ్యములేదు అనగా కావ్యమున వ్యవహారమున్నది శాస్త్రమున్నది సంకేతమున్నది మీదుమిక్కిలి అనుభవ భావనీయకశక్తియున్నది ఇన్నింటిని సమన్వయించు వ్యాపారముగా వ్యంజనను ఆనందవర్ధనులు భావించిరి కావున వ్యంజనసూత్రప్రతిపాదనమున ప్రధానప్రమాణము భావవ్యక్తీకరణ దశావైవిధ్యము

## 2 12 2 ఘటప్రదీప దృష్టాంతము

మూడవ యుద్యోతమున 33వ కారిక[16] క్రింద వాచ్యవ్యంగ్యముల నడుమ గల సంబంధమునుగూర్చి ప్రసంగించుచు ఆనందవర్ధనులు ఘటప్రదీప సామ్యమును జూపిరి

> 'నత్వేషవాచ్యవ్యంగ్యయోర్న్యాయః నహివ్యంగ్యేప్రతీయమానే వచ్య
> బుద్ధిర్దూరీభవతి, వాచ్యావభాసా వినాభావేన తస్యప్రకాశనాత్ -
> తస్మాత్ ఘటప్రతీతా వుత్పన్నాయాం నప్రదీప ప్రకాశోనివర్తతే
> తద్వ్యంగ్య ప్రతీతౌ వాచ్యావభాసః
>
> (ధ్వ ఆ. పుటలు 420-21)

లోచనకారుడు.

'ఏవం పదార్థవాక్యార్థన్యాయం తాత్పర్యశక్తిసాధకం ప్రకృతేవిషయే నిరాకృత్యాభిమతాం ప్రకాశశక్తిం సాధయితుం తదుచితం ప్రదీప ఘటన్యాయం ప్రకృతే యోజయన్నాహ' (పుట 421)

ఘటప్రదీపముల సంబంధమెట్టిది

ప్రదీపద్వారమున ఘటప్రతీతి కలుగునపుడును ఆప్రదీపప్రకాశమెట్లు నివర్తింపదో అట్లే వ్యంగ్యము ప్రకాశించునపుడును వాచ్యస్ఫురణము నివృత్తము కాబోదు. (వేదాలవారి అనువాదము పుట 511)

ఈఘటప్రదీప సామ్యమును భిన్నదార్శనికులు భిన్నదృష్టులతో నుపయోగించుకొనిరి భర్తృహరిని, విద్యారణ్యుని, శంకరుని పరిశీలింతము

భర్తృహరి వాక్యపదీయమున ముఖ్యగౌణార్థ ప్రతిపాదనము చేసినతరువాత ముఖ్యద్యోతక - వివక్షితావివక్షిత విమర్శచేయుటకుముందు శబ్దార్థముల ముఖ్యార్థనాంతరీయకార్థ[162] విచారణ జరుపు సందర్భమున జ్ఞాపక కారక దృష్టాంతములను రెంటిని సహాయముగ గొనినాడు. ముఖ్యద్యోతక నిరూపణకొరకు ఘటప్రదీప ప్రసక్తి జ్ఞాపకముగ స్వీకృతము

ఘటాదిషుయథా దీపో యేనార్థేన ప్రయుజ్యతే
తతోఽన్యదప[163] సాచివ్యాత్ సకరోతి ప్రకాశనమ్ (2-296)

'ఘటాదివిషయమున నుపయుక్తమగు దీపముద్దిష్టమగు ప్రయోజనము కంటె భిన్నమగు ప్రకాశనమునుకూడ నాంతరీయకత్వముచే ఎట్లుచేయునో అట్లే (దార్ష్టాంతికముగా)

'సంసర్గిషు తథార్థేషు శబ్దోయేన ప్రయుజ్యతే
తస్మాత్ ప్రయోజకాదన్యాం ప్రత్యాయయత్యసౌ (2 299)

శబ్దము స్వసంసర్గమువలన బోధించెడి అర్థములను మాత్రమేగాక భిన్నార్థములను కూడబోధించును 164 దీనియర్థమేమి ?

భర్తృహరి సంసర్గస్థానమున ఘటమును, శబ్దస్థానమున దీపమును వాడుట వలన ఆనందవర్ధనుడు భావించిన కోణమునుండి ఘటప్రదీపములను చూడలేదనుట స్పష్టము ఆనందుని దృష్టిఎట్లు భిన్నము

వ్యంగ్యార్థమున్నప్పుడును వాచ్యార్థము దూరీకృతముకాదనుఅంశమున- భర్తృహరి దృష్ట ముఖ్యదోత్యార్థములనడుమ నాంతరీయకతాగుణము కలదని నిరూపించుటయందు

'ఘటాదిషు' అనుటకు ఆనందుడు భావించిన అర్థమేమి? 'ఘటమునందుంచ బడిన 165 'ఘటమును వ్యక్తము చేయుచున్న 166 అను రెండర్థములు పండితులు భావించుచున్నారు

కె కృష్ణమూర్తిగారు రెండవది సమంజసమనిరి 167

ఆనందవర్ధనుడు ఘట' శబ్దమును 'వ్యంగ్య' మను అర్థమున వాడెను 'దీప మును 'వాచ్య'మను అర్థమునవాడెను అట్లువాడుటకుముందె ప్రమాణము చూపినాడు

ఆలోకార్థీ యథాదీపశిఖాయాం యత్నవాన్ జనః
తదుపాయతయా తద్వదర్థే వాచ్యేతదాదృతః (ధ్వ ఆ 1-9)

అనగా వాచ్యమును 'దీప' మని ముందుగనే యుపమించియున్నాడు. వాచ్య వ్యంగ్యముల అవిభక్తతనుకూడ ముందుగనే సూచించి యున్నాడు 168 అందు వలన ఘటప్రదీపములను వ్యంగ్యవాచ్యములకు లక్ష్యకములుగ గ్రహించినాడు ఆలోకకర్త

ఘట శబ్దతత్త్వవిచారము ప్రసక్తనీయము ఘటమును చిదాభాసముగ విద్యారణ్యులు గ్రహించిరి 'వేదాంతపంచదశి' యందు 'కూటస్థదీప'మను ప్రకరణమున 'త్వమ్' పదార్థమునకు లక్ష్యార్థమున 'కూటస్థుడని' వాచ్యార్థమున 'జీవు'డని వ్యాఖ్యానము చేసిరి

'ఘటైకాకార ధీస్థాచిద్ఘటమేవావభాసయేత్
ఘటస్యజ్ఞాతతాబ్రహ్మ చైతన్యేవావభాసతే

(శ్లో 4 పుట 305)

ఘటముఖ్యాకారముగల బుద్ధియందు వర్తిల్లెడి చైతన్యము (చిదాభాసుడు) ఘటము నొకదానినే ప్రకాశింపజేయును ఘటజ్ఞాతృత్వమనెడి ధర్మము - ఘటకల్పనాధిష్ఠానమైన బ్రహ్మచైతన్యముచేత ప్రకాశింపచేయబడుచున్నది (అదేపుట) 169 దీనిని వాచ్యవ్యంగ్యముల దృష్టితో పరిశీలింతము

వాచ్యార్థము కేవలము బుద్ధిచేత అవగమితమగునది అది దీపమునుబోలినది ఈబుద్ధి చిదాభాసము

వ్యంగ్యార్థము (ఘటజ్ఞానము) హృదయమున ప్రతిభాయించునది. అనగా బ్రహ్మచైతన్యముచేత ప్రకాశించునది (దానిని 'ప్రతిభ'యని - 'పర' యని దేవీవాదులనిరి) చిదాభాసము ను కూడ 'ఆత్మ' సదృశముగ భావించినవారు కావున (చూ. పుట 201) ఆనందాదులు వాచ్యార్థ ప్రతీతి దూరముకాదనిరి ఆత్మత్వమును అంగీకరించిరి

శంకరులు 'నానాచ్ఛిద్రఘటోదరే' త్యాది దక్షిణామూర్తిస్తవమున భావించి నట్లు ఘటము మాయావృతమైన దేహము చిల్లులుకల్గినది అంటున్న మహాదీప ప్రభజ్ఞానము (వివరణమునకు చూ వ్యాసాంతము) ఇచ్చటను ఘటము చిదాభాసమే 170 ఛిద్రములు పృథగ్భావవాసితలైన వాచ్యార్థములు అంతర్గతమగు మహాదీపప్రభ (వ్యంగ్యము) వాచ్యార్థముల మూలమున బహిఃస్పందనమును పొందుచున్నది ఇచ్చట వాచ్యవ్యంగ్యముల వ్యక్తావ్యక్తతలు స్ఫురింపజేయబడినవి ఈయర్థమున ఆనందాభినవుల దృష్టిలో భాష పునర్నిర్వచింపబడుచున్నది (చూ వ్యం. సూ 2-13-4)

## 2 12 3 స్వప్నసన్నివేశ సామ్యము

భాషాశాస్త్రమున వింతదనుక వాగ్వ్యవహారదశలకు స్వప్నసిద్ధాంతములతో సమన్వయించిన ప్రయత్నము మృగ్యము.171 అభినవులు లోచనమున నీ సామ్యమును కూడ శబ్దశక్తిదృష్టితో చర్చించియున్నారు కావ్యభాషలోని 'వక్రోక్తి వ్యాపారమును శబ్దముఖముగ కాక అర్థముఖముగను పరిశీలించినచో వ్యావహారికముగ అసంభవములగు అర్థములు కావ్యప్రపంచమున సంభవములగుట - అని అర్థము చెప్పుకొనవలెను

ఇట్టి అర్థము కావ్యార్థము - అనగా రసధ్వని అది స్వప్నమునందును స్వశబ్దవాచ్యముకాదు - లౌకిక వ్యవహార పతితముకాదు అనిలోచనాభిప్రాయము (పుట 51)

ఖమఙ్ఖాదతి ఖండితమీక్షతే
నిజశిరోనయనేన కరార్పితమ్
కిమపి దుర్ఘటమన్యనవిద్యతే

'శూన్యాకాశము భుజింపబడినట్లు, తనశిరము ఖండితమై తన కనులముందు తనచేత యుంచబడినట్లు స్వప్నము చూపును. కావున 'స్వప్నమఘటనఘటనా పటీయసి (చూ పరిభామతి పుటలు 98-99 సం-1)

ఆధునిక మనస్తత్త్వవిజ్ఞానులు 'స్వప్న' ప్రమాణముగ వైశ్వానర, తైజస, ప్రాజ్ఞములను జీవుని త్రివిధత్వమును నిరూపించిరి 172 దీనికిహేతువు లౌకికానుభవవైరుధ్యము స్వప్నభావమున నుండుటయే స్వప్నమున రెండంశములు గుర్తింపబడినవి

మేనిఫెస్ట్ డ్రీమ్ (అభివ్యక్తస్వప్నము)

లెటెన్ట్ డ్రీమ్ కంటెంట్ (స్వప్నాంతరార్థము)

ఇక్కడ గుర్తింపదగిన అంశమేమనగా - వాగ్వ్యవహార మీ మూడు దశలందు వ్యాఖ్యానించుటకు వీలున్నదనుట 173 ఒకడు ప్రశ్నింపగా సమాధానము చెప్పుట వైశ్వానరదశ (కాన్షియస్‌స్టేట్) అంతర్నిహితభావము శబ్దరూపమున అప్రయత్నముగ వ్యక్తమగుట తైజసదశ (సబ్‌కాన్షియస్‌స్టేట్) కావ్యరచనము అనుభూతి ఈదశకు సంబంధించినవని మానసిక శాస్త్రవేత్తలనుచున్నారు 174

తంత్రభాష సంధ్యాభాషయనియు యోగభాష సమాధి భాషయనియు, వ్యవహారభాష బౌద్ధికమనియు తంత్రవాదులు చెప్పుదురు 175 సంధ్యరెండు విరుద్ధభావములకు అన్వయముచూపును అవి చీకటి వెలుగులు 'రచన' మన బడునది ఎప్పుడును అంతర్నిహితభావమభివ్యక్తమగుట - లయించుట అను నీదశకే చెందినది 176 ఇదియే 'వ్యంజన' మునకు ప్రాణము

దేశకాలములతో నిమిత్తములేక అవిచ్ఛిన్నజ్ఞానము శబ్దార్థములరూపము నొందు దశ మరియొకటున్నది 177 వేదమునందలి ప్రతీకాభాష ఇట్టిది - కావుననే

అచ్చట వ్యావహారికములగు 'అభిధా ప్రమాణములుకాని తార్కికములగు భాక్త ప్రమాణములు కాని పనికిరావు ఇది ప్రాజ్ఞదశ (అరవిందదర్శనమిట్టిది)

ఈమూడు దశలను వాగ్వ్యవహారమున భాగములుగ గ్రహించుట కతిగహనమగు ప్రణాళిక కావలసియున్నది

అదిభాషను అనుభవముతో వ్యంజక వ్యంగ్యసంబంధము కల్గినదానిగ నిరూపించుటలోనే యుండును అదియే వ్యంజనసూత్రమునకు మరియొక ప్రమాణము అప్పుడే వాచ్యము విధిరూపమునను ప్రతీయమానము నిషేధ రూపమునను నుండుటయనగా నేమియో అర్థమగును.

## 2 12 4 శబ్దార్థప్రమాణములు

ఆధునిక పరిశీలకులలో, కుంజున్నిరాజావంటివారు శబ్దార్థములకు ఆనంద వర్ధనుని దృష్టిలోగల విశేషార్థములను చెప్పియుండుట పూర్వమే చూపబడినది (చూ వ్యం సూ 2-11-1) విభావరసములకు వ్యంజక వ్యంగ్యసంబంధమును భావించిన అతని దృష్టియందు - వాక్కు = విభావము = expression

భావము = రసము = experience

దీనినిట్లు చిత్రించవచ్చు.

| | వక్త / శ్రోత <---> శబ్దము (+ చేష్టాదులు) | శ్రోత / వక్త అర్థము | |
|---|---|---|---|
| (ఎ) విభావము | 1 వర్ణము<br>2 పదము<br>3 వాక్యము<br>కావ్యము | 1. వాచ్యము<br>2 లక్ష్యము<br>3 వ్యంగ్యము | (బి) రసము |

ప్రతివక్త యు శ్రోతయే కావున (ఎ) —> (బి) గా మారుట అర్థము చేసుకొనుట (బి) —> (ఎ) గా మారుట మాట్లాడుట (ఎ) (బి) లను కలుపుచున్న అంశము 'సందర్భము' - ఇది సాంఘికమని వైయక్తికమని రెండు రకములు భాష నీరెండు దృష్టులతోను పరిశీలించినచో మన ప్రయోగము సమగ్రమగును

రిచర్డ్స్ ఒకచోట ఇట్లనినాడు 178

Language is a social fact as well as a part of personal experience (Philosophy of Phetoric, p 54 – 1936)

ఈదృష్టితో భాష సాంఘికముగ నిర్వచింపబడుట మాత్రమే బాషాశాస్త్రజ్ఞులలో ఇంతదనుక నిర్మాణవాదము ననుసరించువారు సాధించినది భాష వైయక్తికముగ నిర్వచింపబడుటమాత్రమేకాక సాంఘికముగా అది పొందు వైవిధ్యమునకు, సాంఘిక వైయక్తిక భేదము అనుభవ మున సమన్వయ మొందుటకు సమాధానమొక వ్యంజనసూత్రమే కారణము వ్యంజన వక్తృశ్రోతృ సంబంధ శబ్దార్థప్రమాణములును వక్తృశ్రోతృముఖముగనే ఇటస్వీకరింపబడినవి

## 2 13 వ్యంజనసూత్ర ప్రతిపాదనము

ధ్వనిని నిర్వచించుచున్న కారిక (1-13) ముందే చూపబడినది (వ్యం సూ పుట 137) లోచన వ్యాఖ్యానసారాంశమొక్క మాటలో చెప్పవలయునన్నచో

'అర్థద్యోతన శక్తివ్యంజన'మని (చూ పుట 157) చెప్పవలయును, ధ్వనికారికలో గల శబ్దార్థపదములకుగల విశేషార్థములు ముందుచూపబడినవి తమర్థమ్' అనుపదమునకు అభినవులును బాలప్రియాకారుడుచేసిన వ్యాఖ్యానములు పరిశీలించినచో

శబ్దార్థములు - వాగ్రూపయగు భగవతియని
తమర్థమ్ - వస్త్వలంకారరూపమగు రసమని
వ్యంక్తిః - వ్యంజించుటలో వాక్కు
(శబ్దార్థము) నకు స్వయంకర్తృత్వము గలదని

అర్థము చేసికొనవచ్చును ఇచ్చటనే పరిస్ఫురంతి' అనుపదమున కర్థమభినవులు చెప్పిరి

ప్రతిపత్తౄన్ (సహృదయులకని బాలప్రియ) ప్రతి సాపప్రతిభా
నానుమీయమానా - అపితు తదావేశేన భాసమానేత్యర్థః

(పుట 92)

ఇది అనుమితి వాదమునకు సమాధానము ప్రతిభాసితమగు భావానుభవమున వ్యంజనయుండును లేక వ్యంజనము క్రమముగా ఆభాసానుభవముండును. ఇది వ్యంజన స్వభావము. గుర్తించుట ఎట్లు ?

లోక వ్యవహారము / కావ్యమున 'అనుభవము' దీనికి ప్రమాణము వక్తృ / శ్రోతృ ప్రతిక్రియ ఒక నిదర్శనము ప్రతిక్రియమానము కావచ్చు చేష్టకావచ్చు వాగ్రూపముగను ఉండవచ్చు ఇవి పరిశీలకుని దృష్టితో చెప్పబడినవి 179

అనగా లిఖితాధారములననుసరించియో పరోక్షానుకృతి (indirect speech) నాధారముగనో, 'వ్యంజన మును నిరూపించుటకు ఒక నియమమున్నదని అర్థము. కృష్ణచైతన్యులా నియమమునే ఇట్లు చెప్పిరి

'The Dhvani Theory related suggestion basically to the living context of the utterance' (S P p 79)

' The living context of utterance — అను నియమము చాల ప్రధానమైనది ఈదృష్టితోడనే ధ్వనికారిక (1 13) రచింపబడినది 'యత్ర' అని మొదలుపెట్టుటలోని అంతర్యమిదియే

'యత్ర అనుటకు లోకమున దేశకాలాదులు కావ్యమున 'రసానువిష్టత' నియమములు దీనివిషయము 2 - 13 - 2 లో చర్చింపబడును )

ఈనియమమునకు బద్ధములైన శబ్దార్థములెట్లు ప్రవర్తించునో పరిశీలించుట తరువాత ప్రయత్నము

1 శబ్దము అర్థావగమకముగ ప్రవర్తించును
ఇచ్చట పదముమాత్రమే ప్రమాణము (వర్ణములకు అర్థములు లేవు కావున.)

2 అర్థము అర్థాంతర ప్రతిభాసకము,
ఇదియు పదదశయందే (వాక్యార్థముగపర్యవసించుటవలన)

3 శబ్దార్థములు భావద్యోతకములు ఇందు రెండుదశలు

(ఎ) వర్ణములీదశయందు గ్రాహ్యములు పదవాక్యములందును నీ పర్యవసానధర్మము కలదు

(బి) 1, 2 లు ఇందుసమన్వయమొందుట

పై మూడుదశలను సమన్వయించి శబ్దార్థభావసంబంధము నిట్లుచెప్పవచ్చును

4 (ఎ) శబ్దార్థములు తమరూఢ్యర్థములను నిలుపుకొనియుండుట

(బి) భావము ముందు రూఢ్యర్థములప్రధానమగుట

1 2 లు సాంఘికములగు భాషా ప్రయోజనములు 3 వైయక్తికములు వర్ణగత అనుభవములు 3 లో ఎ బి లు సాంఘిక ప్రయోజనము వైయక్తికానుభవముగమారుట పైగలమూడుదశలందును శబ్దార్థవ్యాపారములు ప్రక్రియా భేదములనందుచున్నవి మొదటిది అభిధ రెండవది లక్షణ మూడవదితాత్పర్యము ఇన్నిటను వ్యాపించిన వ్యాపారము (4) వ్యంజన

అభిధ - అవగమనమనుటలో లింగలింగ సమన్వయము కుదురుననుట 180

లక్షణ - ప్రతిభాసమనుటలో వాచ్యార్థబాధ ఉన్నప్పుడే సమన్వయము పొందుననుట

వ్యంజన - ద్యోతనమనుటలో వాచ్యార్థములేనపుడు (వర్ణాలందు) ను వాచ్యార్థమున్నపుడు (పదవాక్యదశలందును) స్ఫురితమగు అర్థ విశేషమున్నదనుట

ఇవి అభినవులు సూత్నముగ స్థాపించిన విషయములు ప్రస్తుతసిద్ధాంత వ్యాసమున ఈనిరూపణముల నాధారముగ వ్యంజన పై రెండుదశలందు వివరింపబడుచున్నది

1 అర్థనిరపేక్షములగు వర్ణాదులు భావద్యోతకములు 181

2 అర్థసాపేక్షములగు పదవాక్యములును ప్రత్యక్షముగనో అప్రత్యక్షముగనో భావద్యోతకములే అగుచున్నవి

(ప్రత్యక్షముగ వివక్షితముగ
అప్రత్యక్షముగ అవివక్షితముగ)

కావున శబ్దార్థప లు భావద్యోతకములు.

ద్యోతనమనగా అభివ్యక్తి[182] - కావున ఇది వ్యంజనసూత్రము

2 13 1 ఇచ్చట ఒక ప్రశ్న శబ్దార్థములెందుకు భావద్యోతకములు? ఈప్రశ్న ప్రాచ్యదృక్పథమునలేదు కారణమిచ్చట భావమే శబ్దార్థరూపమందు చున్నదను ప్రాథమికసిద్ధాంతమున్నది (దీనిని ఆస్తిక్య / ప్రాచ్య / వైదిక తాత్త్వికదృష్టియనిన దోషములేదు) అందుకే రసప్రాధాన్యమును కావ్యమున గుర్తించుటలో విప్రతిపత్తిఎవరికినిలేదు. సమస్య వీని సంబంధముపైన

నవీన భాషాశాస్త్రజ్ఞులలో చాలమంది శబార్థములు భావమున సమన్వయ మొందునను ఊహ (assumption) యున్నవారుకారు కారణము భాషనుకేవలము సాంఘికవస్తువుగ పరిగణించుట - శబ్దార్థములకు భావముతో ఎట్టి సంబంధమున్నదో పరిశీలింపకపోవుట - ఇవి హేతువులుగ భాషకు బుద్ధికి గల సంబంధమునుగూర్చి ఛామ్స్కి అభిప్రాయము పూర్వమే ప్రదర్శింపబడినది

(చూ వ్యం సూ పుట 81)

పూర్వాధ్యాయమున వివరింపబడిన విషయములిట అనుసంధించుకొన్నచో వ్యతిరేకముఖముగను వ్యంజనసూత్రమును నిరూపించవచ్చును.

'బార్తెస్' హాక్స్ మొదలైనవారు సూచించినట్లు శబార్థములు అర్థాంతర ములకు వ్యంజకములుగ ఉన్నవనుట గుర్తించితిమి

వర్ణములు అర్థవిభేదనశక్తికలిగినవని భాషాశాస్త్రజ్ఞులు భావించుటను చూచి తిమి అనగా అర్థశూన్యములనియే వారిభావము కారణము పదాంశమును మాత్రమే అర్థవంతముగ భావించియుండుట

కాని పూర్వోదాహృతమైన చామ్స్కిమాటలలో (వ్యం.సూ పుట 81) 'ఫీలింగ్'ను 'ఎక్స్‌ప్రెస్' చేయుటలో భాష ఎట్లు ఉపయుక్తమగు చున్నదను ప్రశ్నకు[183] సమాధానము చెప్పవలెనన్నచో

వర్ణాయిలు భావ (ఫీలింగ్) వ్యంజకమని అంగీకరించకతప్పదు భాషా భావములకు వ్యంజక వ్యంగ్యసంబంధమును గుర్తించక పోవుటయే చామ్స్కీ ప్రశ్నకు కారణము

## 2 13 1 2 భావద్యోతనత్వము – భరతాభినవులు

మొదటిసారిగా ఈసిద్ధాంతవ్యాసమునందే భావద్యోతనత్వ' మను పరిభాష వాడబడుచున్నది దీనికి కొంత వివరణ అవసరము

అభినవులు అర్థద్యోతనశక్తిగనే వ్యంజనను నిర్వచించిరనుట చూచితిమి కాని అచ్చట శబ్దార్థములు విశేషపరిధియందు వాడబడియుండుటవలన ఆలంకారికుడు అర్థముచేసికొనవచ్చు. చామ్స్కీమున్నగువారు సందేహాస్పదముగా వదలివేసిన సమస్యకు పరిష్కారము చూపబడుచున్నది అదియే 'అర్థమగుట

ప్రథమముగ భరతాచార్యుడు భావమునుగూర్చి చెప్పినవాడు విభావానుభావ వ్యభిచారీభావములు స్థాయిని వ్యంజించునవి అతని రససూత్రము స్థాయియు ఒక భావమే అభినవులు రెండు వ్యుత్పత్తులు చూపిరి

1 భవంతి ఇతి భావాః (పుట్టునవి)

2. భావయంతి ఇతి భావాః (అనుభవింప చేయునవి)

(నాట్యశాస్త్రము 7వ అధ్యాయము, పుటలు 62-63)

భట్టనాయకాదులు భోజకత్వవ్యాపారమునుగూర్చి చెప్పుటకు రెండవ నిర్వచనము కారణము 'వాగంగసత్వోపేతాన్ కావ్యార్థాన్ భావయంతీతి భావాః అని భరతుని మతము ఆలోక లోచనములే శబ్దార్థములనుండి భావము పుట్టుటను చెప్పినవి 184

ఈ ప్రసంగము నిష్కర్షము చేసికొనవచ్చు భావను రెండుముఖములుగా నుండును 1 శబ్దార్థములందు 2, వక్తృ / శ్రోతృగతముగ

కావ్యనాటకముల కన్వయించినచో ప్రేక్షకుని / శ్రోతయందుగల భావమును వ్యక్తీకరించగల (expr ss) 'భావము'ను కావ్యమునగల శబ్దార్థములు 'నిష్పన్నము (derive) చేయుచున్నవి ఇదియే అర్థమగుట అనగా.185

నిత్య సంభాషణములందును నీప్రక్రియ యున్నది నాకర్థమయినది' అనుటయు, 'మాటలుచాలవు అనుటయు దీనికి నిదర్శనములు

యాంత్రిక వాదలీవిషయమును గుర్తించుటలో ఒక ఇబ్బంది' గలదు అప్పుడు శబార్థములు భావనిష్పాదకములని అంగీకరించవలయును అప్పుడు భాషనుసాధనసూత్రముగ నిర్వచించుట కుదరదు పరిశీలనలోని ఈయాంత్రికతయే ఇట్లంగీకరింప వోవుటకు హేతువు

కావున భావద్యోతనము రెండుముఖముల నుండును

1 శబ్దార్థములచే ఒక భావము నిష్పన్నమగును (భవతి)

2 శ్రోతయందలి భావమును పైది వ్యపదేశించును (భావయతి)

ఈప్రస్థానము (transcendence) నే హాక్స్, బార్తెస్‌వంటి అధునాతను లును దర్శించిరి వీరిదర్శనము మొదటిదశకు సంబంధించినది

ధ్వన్యాలోకమునను వీరెండు ప్రస్థానములున్నవనుటకు నిదర్శనము చూచి నచో నిదిస్పష్టమగును

1 శబ్దార్థములు వ్యంజకములనుట నిరూపించుట

2 కావ్యమున నీవ్యంజకత రసతాత్పర్యము కల్గినదనినిరూపించుట.186

ఈరెండవ యంశమును విశదపరచినది అభినవులే మహిమాదులకీ అంతర్యము బోధపడనందునసనే ధ్వనికారిక (1-13)లో తమర్థమ్ అనుటలో తమ్ అనుటకు అర్థమనిశ్చితిమనిరి

'తమ్ అనుటకు కవిముఖముగ కావ్యార్థము సహృదయముఖముగ స్థాయీభావము - ఈ రెంటిని గ్రహించినగాని వ్యంజన సూత్రమునందు గల సమగ్రత అర్థముకాదు

దీనికిని లోచనముననే నిరూపణమున్నది

'తమర్థమ్ అనుపదమును వ్యాఖ్యానించుచు 'సరస్వతీస్వాదుతదర్థ వస్తు ఇతియదుక్తమ్' అని అభినవులుచెప్పిరి (కారిక 1 6 చూ పుట 141)

లోచన వ్యాఖ్యానము

'సరస్వతీతి - వాగ్రూపాభగవతీత్యర్థః - వస్తుశబ్దేనచవస్తుశబ్దం వ్యాచష్టే

అని బాలప్రియదీనిని వివరించినది

అర్థేషు - వస్త్వలంకార రసేషు - వస్తు - సారభూతమర్థవస్తు తదర్థవస్తిత్యనస్య ఫలితమర్థమ్ కర్మకృత్వా - నిష్యందమానేత్యేతద్వ్యాచష్టే దివ్యమిత్యాది'

(పుట 92)

పైన గీతలుగీచినచోట్ల వాగ్వ్యాపారమునకే రసప్రస్రవణశక్తి యున్నదని నిరూపించునవి భవంతి ఇతిభావః దశఇది, ధ్వని వాగ్వ్యాపారమను సమన్వయ మింతవరకే, రసానుభవమున వాగ్రసముల కభేదము ఇచ్చటనే 'పరిస్ఫురంతి 'అభివ్యనక్తి' అనుపదములకు లోచనము వ్యాఖ్యానము చెప్పనది 187 భావయంతి ఇతిభావః దశ ఇదీ కావున భావద్యోతినత్వము శబ్దార్థములకు సంబంధించినదే

## 2 13 2 వ్యంజక సామగ్రి

ఆనందులు పరిశీలనము సంస్కృత ప్రాకృతములకు పరిమితము. ముక్తక ములగు గాథల మొదలు మహాభారతమువరకు గల కావ్యసామగ్రి అంతయు వ్యంజకముగ నిరూపింపబడినది ఇంతటను 'వాక్యము' ప్రమాణముగ గ్రహింపబడినది

1 వాక్యమును వాచకముగను 2 పదమును ధ్వనిప్రకాశముగను 3 వర్ణమును వ్యంజకముగను - నిర్ధరించుటవలన విదిస్పష్టము 188 (ధ్వ ఆ ఉద్యోతము 3)

ఆనందవర్ధనులు వ్యంజకసామగ్రి నిరూపణమును విలక్షణముగాచేసిరి

3 వర్ణవ్యంజకత - అన్వయ వ్యతిరేకముఖముగ వర్ణములు వ్యంజకము లనుట నిరూపింపబడినది,

శృంగారమున ర్మ ర్ష, ఢలు అనుపయుక్తములు
ఇవియే భీభత్సమున ప్రయుక్తములు (ధ్వ ఆ 3-3)189

2 పద (పదాంశ) వ్యంజకత సుబంతములు, తిజంతములు వచన విశేషములు సర్వనామ కారక - కృత్తద్ధిత సమాస నిపాతోపసర్గ కాలములన్నియు రసాదిద్యోతకములు (అదే -1 ) పదవ్యంజకత వాక్యమున పర్యవసించును

1 వాక్యవ్యంజకత, అవ్యతిరేకముఖముగ నిర్దేశింపబడినది వర్ణములు నిమిత్తమాత్రములు (లో పుట 303) వాక్యములు విభావాది సమ్మేళనరూపములు (పుట 304) వాక్యపరిమాణము సంఘటన

దృష్టితో పరిశీలింపబడినది సంఘటనకు నియత విషయము లేనందున అల్పమధ్య దీర్ఘ సమాసఘటనము భిన్నరసములందు గుర్తింపవచ్చు నని (లో 209 - 223) ఆనందుల నిర్దేశము.

ఇక్కడ గుర్తింపదగిన అంశము - పదవాక్యములు

1 అవివక్షితములై 2 సంలక్ష్యక్రమాన్వితములై - రెండువిధముల వ్యంజకములు కాగలవు కాని వర్ణములు మాత్రము అసంలక్ష్యక్రమముగనే వ్యంజకములు వర్ణములర్థశూన్యములు కావున అవివక్షితవాచ్యతలేదు పదమనగనే అర్థమున్నది కావున వివక్షితావివక్షిత భేదములున్నవి కావున పదములు ధ్వని ప్రకాశకములు - అని ఆనందుల సిద్ధాంతము పృథక్పదార్థములచే వాక్యార్థము వాచ్యమగుచున్నది (1-10) కావున వాక్యము వాచకము వ్యంజకమును

ఈమూడును శబ్దవ్యంజకతాసామగ్రి పదవాక్యదశలందు వాచ్యలక్ష్య తాత్పర్యార్థములు మూడును అత్యంత తిరస్కృతవాచ్యములై అర్థాంతర సంక్రమితములై వ్యంజకములగుచున్నవని ఆనందుల నిర్దేశము

(ధ్వ ఆ 2-1 క్రింద లో )

ఈమూడును అర్థవ్యంజకసామగ్రి కావ్యమునను వాక్యప్రమాణమే ఆధారముగ గ్రహింపబడినది

భారతమున రసధ్వని నిర్ణయముచేయుటకు 'భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః' - 'సహాసత్యమ్' అను వాక్యములను వ్యంజకములుగ గ్రహించినాడు (ధ్వ ఆ పుట 431)

వర్ణాత్మకభాషకు సంబంధించినవరకు ఇది వ్యంజకసామగ్రి (కాకువును సంఘటనను అలంకారమును గుణాది - సకల కావ్యాలంకార సామగ్రిని వ్యంజకములుగనే ఆనందులు భావించిరి )[190]

## 2 13 3 వ్యంగ్యార్థముల ఆనంత్యము

ఏవంధ్వనేః ప్రభేదాః ప్రభేదభేదాశ్చ కేనశక్యన్తే
సంఖ్యాతుందిఙ్మాత్రం తేషామిదము క్తమస్మాభిః (ధ్వ ఆ. 3-45)

వ్యంజనసూత్రముపై పరిశోధనము చేయుటలో ఒకసమస్య వ్యంగ్యార్థముల ఆనంత్యమును గణించుట, వ్యవహారమున సమస్యాజనకముకాని 'వ్యంజన' శాస్త్ర రూపమున నిబంధింపబడుటకు క్లిష్టమగుటకు హేతువునుకూడ ఆనందవర్ధనులే చెప్పియున్నారు 19।

'ఎరస్వాదానేచ్ఛా విరతమనసో వస్తునుకవేః
సరస్వత్యైవేషా ఘటయతి యథేష్టం భగవతీ' (ధ్వ ఆ 4-17)

శివశక్తులనంతములైనట్లు సారభూతార్థవస్తువులును అనంతములే,

యథాయథా నిరూప్యతే తథాతథానలభతేన్తః కావ్యార్థానామ్
నతచ్ఛక్యేమపోహితుమ్' (చూ. ధ్వ ఆ. 4-8)

వాచస్పతియును క్రొత్త శబ్దములను, అర్థములను సృష్టింపలేడు (4-14వృత్తి)
కాన జగత్తున ప్రకృతివలె నిత్యము నియమింపబడు ప్రయత్నము జరుగుచున్నను
కావ్యము నిత్యనూత్నార్థములచే స్ఫురింపజేయుచుండును (4-10)

ఈ ఆనంత్యమునకు ప్రతిభయే హేతువు (4-1,& 6)

కావున దృష్టపూర్వములగు అర్థములను కావ్యమున మధుమాసమున ద్రుమములవలె రసపరిగ్రహణమువలన నవత్వమును పొందుచుండును (4-4)

కావ్యనియమము కాని కావ్యమున వ్యంగ్యార్థములకు విశ్రాంతి స్థానము రసము. కవి రసాదిమయావధానవాక్కు కావలయునని ఆనందులనిర్దేశము (4 5) ఇట్లనుట వ్యంగ్యార్థములు కావ్యమున భిన్నములు కావనియు, స్ఫురణాను భవమున కేవలము ప్రధానముగ నొక్కటియే భాసించుననియుచెప్పుట నిత్యవ్యవ హారమునవలె దేశకాలాది విశేషహేతువులచే వాచ్యార్థములే అనంతములుగ నుండును (4-7)

వ్యవహారమున వ్యంగ్యార్థమును నియమించుచున్నది - శ్రోతృప్రతిక్రియ కాని కావ్యమున మాత్రము శ్రోతృప్రతిక్రియను గుర్తించినంత మాత్రమున చాలదని ఆనందులే ఒకచోటచెప్పిరి [192] (3-6 క్రింద)

## 2 13 3 1 అపవాదయుక్తి

ఆనందుల యూహ్మేక్షికకు విదర్శనముగ కడపట రెండంశములు గుర్తింప వలయును

1. ఒక శబ్దమునకు సంబంధించిన అనుభవము స్మృతిరూపమున - వక్తృశ్రోతృగతముగ నుండుననుట - ఆస్మృతిలేనివానికి ఆశబ్దము అందించెడి అనుభవముండదు కావున వ్యంజనశక్తికిదియొక నియమము

(ధ్వ ఆ పుటలు - 358 - 59)

నిదర్శనము తట శబ్దము తట శబ్దము లింగత్రయమున వ్యాకరణ సమ్మ తిని కల్గినది కాని సహృదయులు స్త్రీలింగమునందే వివక్షింతురు. కావున సహృదయత్వాధీనము శబ్దసౌందర్యము (పుట 359).

2 వ్యంజనము సర్వపదసాధారణముకాదు [193] నిత్యవ్యవహారమున వాచకమగునది కావ్యమున వ్యంజకముకావచ్చు కావ్యమున వాచకము - వ్యవహార

మున లక్ష్యకము కావచ్చు ఇక్కడ నియమించుచున్నది'రసానుభవము (ఆచేపుట)

కపాలి' శబ్దమట్టిది కపాలముకలవాడని వాచ్యార్థము ...యావటు సంభాషణము ఆదివ్యంజకము - శోచనీయతకు (కుమారసంభవము 5-71)

## 2 13 4 భాషా నిర్వచనము - ఒకప్రతిపాదన

ఈసిద్ధాంత వ్యాసమునకు పార్యంతికముగ ఒక ప్రతిపాదన చేయబడు చున్నది ఆది భాషానిర్వచనమునకు సంబంధించిన ఆనందవర్ధనుని దృష్టి భాష నిర్మాణ(వాక్కు), ఉపయోగ (అభిధాప్రకారములు), తత్త్వ (శబ్దార్థసమన్వయము) దృష్టులతో మూడురీతుల నిర్వచింపదగియున్నది ఈ మూటినికలిపిన దృష్టితో ఒక నిర్వచనమాలోక లోచనముల సారాంశముగ ప్రతిపాదింపబడుచున్నది




వ్యాపారత్రైవిధ్యము పూర్వము దర్శితము. వ్యాపారముచే శబ్దార్థములు బంధింపబడుచున్నవి (బార్త్రైప్ ప్రతిపాదన సరిగా ఇట్టిదని పూర్వాధ్యాయమున తెల్పబడినది )

అట్లుగాక భాష సంకేతములసమాహారమని అంగీకరించుట శబ్దార్థసమన్వయమును గుర్తింపలేమని చెప్పుట

భాష వ్యవహారమునకు మాధ్యమికమని అనుటలో 'వ్యవహారమును అవిశ్చితార్థకముగ వదలిచేయుట

పై నిర్వచనములవంటివెన్నియు అధునిక విజ్ఞాన (సైన్స్) సాంఘిక (సోషియాలజీ) శాస్త్రముల దృష్టితో భాషను నిర్వచించినవి. మానవునికి భాషతోగల అంగిక సంబంధమును పూర్తిగ త్రెంచి ఆలోచించినవి (మహామభట్టువంటి నైయాయికాద్వైతియు భాష కేవలము 'ఇతరుల కొఱకనినాడు కావున ఇక్కడ వాక్కుకు మానవునితోగల మానసిక, భౌతిక సంబంధదృష్టితో నిర్వచనము చేయబడును)

పూర్వము ప్రతిపాదించినట్లు

'వాక్కు (శబ్దార్థము) భావద్యోతకమని నిర్వచించుట భాషాతత్త్వఏకకు చెందినది కాని ఇందే నిర్మాణోపయోగములును విభిదముగనున్నవి శబ్దార్థములు నిర్మాణసంబంధులు. అర్థ - అవగమన - ప్రతిభాసనములు ద్యోతనమున భాగములగుననుట పూర్వమే చూపబడినది ఇవి ఉపయోగ సంబంధులు కావున ఆనందుని అభిమతమున 'వాక్కు' అనగా 'భావము శబ్దార్థముల ద్వారమున పొందు అభివ్యక్తి' అని చెప్పవలయును. అభినవగుప్తశ్రీపాదులు తమ దివ్యలోచనమున వాక్తత్త్వమును ఇట్లే దర్శించిరి ఇది 'భాషా' తత్త్వసంబంధి నిర్వచనము

అధునికులలో మానసికతత్త్వవేత్తలు కొందరు భౌతికపదార్థములు పరిణామక్రమమునకులోబడినట్లే మానసిక భావములును వేలకొలది సంవత్సరముల నుండియు పరిణామక్రమ సంపన్నతను పొందియున్నవని నిరూపించుచున్నారు.[104] ఇట్టిభావములను 'ప్రైమోర్డియల్ ఇమేజస్'అని, 'ఐడియాస్'అని ఎ జి యూంగ్ వివరించుచు ఇట్లనినాడు [105]

A primordial image is always collective it is atleast common to entire nations or epoch It is a recapitulatory expression of the living process (p 555)

'The idea is unity split up into multiplicity by virtue of the temporal and spatial form of our intuitive apprehension (p 560) – C G Jung, Psychological Types (1953)

అతని నిర్వచనములను పరిశీలించినచో కావ్యము భావము నెందు కందీయ గలుగుచున్నదో తెలియును. సర్వమానవులనడుమ సమానముగనున్న భావములనగా నేమియో అర్థమగును ఈదృష్టితోడనే వాక్స్వరూపమును గూర్చిన పరిశీలనము సాధ్యము ఆలంకారికులీమార్గ ప్రవర్తకులు 196

శంకరులస్తవము (ప్రథమపుటయందు చూపబడినది)తో, ఈనిర్వచనమునకు సమన్వయము వ్యవహార సౌందర్య తాత్త్విక దశలందు చేయుటతో ఈవ్యాస పరిసమాప్తి ఇది సరిగా 'యస్మిన్మిల' నేత్యాది గుప్తపాదులవారి మంగళశ్లోక ముతో సంవదించుచుండుట మరువరానిది వీరిలో శివశక్తులను ఒకరు జ్ఞాన స్వరూపముగా మరొకరు ప్రకాశవిమర్శాత్మకముగా భావించినారు సమర్పించినారు

ఈదేహము ఘటము చక్షురాదులు చిల్లులు ఆత్మమహాదీపము చక్షురాదులు చేయు సకలక్రియలకును అంతరస్పందమాత్మయందె అంగములకుగలపరిస్పందము బాహ్యము మాత్రమే

శబ్దార్థములు రెండును చిల్లులు మానవుడే ఘటము భావము మహాదీపము, శబ్దార్థముల వికల్పములకు మిట ఆభావమే ఆభావస్పందమే బాహ్యముగ వాగ్వికల్పమగుచున్నది

కవియున్నాడు అతడుఘటము వ్యుత్పత్తివ్యాఖ్యానములచే సంక్రమించు శబ్దార్థపరిజ్ఞానములు రంధ్రములు అంతరమగు ప్రతిభ వాని నాశ్రయించి బయటి కుబుకుచున్నది 197 అనగా 'భావము' కావ్యదశయందు విశ్వజనీనము (universal) వ్యవహారదశయందు వైయక్తికము (individual)

అట్లే మానవుని ఆశ్రయించి భిన్నభావములుపొందు అభివ్యక్తికృతులై శబ్దార్థవికల్పములు అన్ని దశలందును అవ్యక్తము వ్యంగ్యము వ్యక్తము వ్యంజకము ఇట్లు గుర్తించుట భాషాతత్త్వము తెలుగుటకు పరాకాష్ఠ శబ్దార్థములు భావమునే ఎందుకు బోధించుచున్నవనుటకు సమగ్రహేతుకల్పనము

ఇదివ్యక్తావ్యక్త విషయసమన్వయ సూత్రము

'ఇతి శుశ్రుమధీరాణాం యేనస్తద్ వ్యచచక్షిరే

What I have sought is to understand what has been said 198

## సూత్రీకరణ సారాంశము

సూత్రీకరణమనుటకు ఆనందవర్ధనునిదృష్టియందరతర్లీనతత్త్వమని యర్థము సమన్వయమను అర్థమున ఇట వివక్షింపబడినది ఆనందునిపూర్వము అనంతరము వచ్చిన ధ్వనివాదములందంతటను అభిధా లక్షణ తాత్పర్యవాదము లంతస్స్రోతములుగ నుండుటను మొదటగుర్తించి వ్యంజనను అర్థద్యోతన ప్రక్రియగా నిర్వచించి వాగ్వ్యాపారవైవిధ్యమును వ్యంజనతో సమన్వయింపచేసిన వారు అభినవగుప్తపాదులు ఈకారణమువలన ఆనందవర్ధనుని వాగ్దర్శనము నిర్మాణోపయోగతత్త్వదృష్టులతో పరిశీలింపబడినది కాశ్మీరశైవాద్వయ వాదములలో ప్రసిద్ధమయిన వాక్చతుష్టయమును స్తుతించుచు అభినవులువ్రాసిన మంగళశ్లోకముల

సాధారముగ ధ్వన్యాలోకమున నాల్గుద్యోతములందును గల రసధ్వని, వ్యంగ్య, వ్యంజక వాగ్వికల్పవిషయములనడుమ సమన్వయము చూపబడినది శబ్దార్థములు భావమునుండి పుట్టి భావములో లయించుచుండుటవలన కావ్యమును శబ్దార్థవ్యాపార ముఖముగ పరిశీలించుట ఆనందవర్ధనుల అభిమతమని సూచింపబడినది రసకావ్య ముల నడుమగల వ్యంగ్యవ్యంజక సంబంధమును మొదటిసారిగ భర్తృహరి నాధారముగ ప్రతిపాదించినది ధ్వన్యాలోకమని నిరూపింపబడినది, వ్యంజనసూత్ర ప్రతిపాదనమున ఆనందులకు ప్రమాణములుకాని అంశములును, ప్రమాణములైన అంశములును ప్రతిపాదింపబడి శబ్దార్థములు భావద్యోతకము' లను సూత్రము వ్యంజన సూత్రముగ నిర్దేశింపబడినది భరతాభినవుల ననుసరించి భావద్యోతన మనగా నేమియో వివరింపబడినది ఆనందులు గుర్తించిన వ్యంజకసామగ్రి వ్యంగ్యార్థానంత్యము, అపవాదయుక్తి ప్రదర్శింపబడినవి భాషను తాత్త్విక దృష్టితో నిర్వచించుట ప్రయత్నముగా భావము శబ్దార్థముల ద్వారమున అభి వ్యక్తినిపొందుట' అని యొకభాషానిర్వచనము చూపబడినది

## వ్యాఖ్యలు

1 Logically the p inciple is the central concept the basis of a system, and the generalisation and extension of some proposition to all the phenomena in the field from which the principle is abstracted

— Dictionary of philosophy p 361

2 Consciousness reflects in words like the sun in a drop of water A word is related to cousciousness like a small to a big one, like a living cell to the organism It is a small world of consciousness The meaningful word is the microcosm of human consciousness

— L S Vigotsky p, 535 (1934)

జ్ఞాపికా వివృతి

1 నిర్వచనమనగా లక్షణము, సూత్రీకరించుట యని అర్థము (చూ క్రింద అ సూ 4). ధ్వని సిద్ధాంతార్గతమగు 'వ్యంజన' మిట సూత్రీకరింపబడు చున్నందున తద్వికల్పప్రసక్తి ఆవశ్యకమగుచున్నది అనిర్వచనీయతావాదులు 'వికల్ప'మును సమ్మతింతురు cf f n 15 below నిర్వచనీయత - 'వాగ్వ్యాపార దర్శనసంబంధి (formalization)

2. చూ కె కృష్ణమూర్తిగారి ధ్వన్యాలోకపత్రి (ఆంగ్లము, 1974) పుట 303

3 చూ వ్యం సూ 2-1.

4 సీవ్యంతేఖిరితి సూత్రాణి షప్ తంతుసంతానే (గురుబాలప్రబోధిక పుట (10) సూత్రంతు సూచనగ్రంధే - (విశ్వకోశము పుట 234) సూత్రమ్ శాస్త్రాదిసూచన గ్రంథః - స్వల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్ - అస్తోభ మనవద్యంచసూత్రం సూత్రవిదోవిదుః- (హలాయుధకోశము పుట 717) ఇది సూత్రమునకున్న శాస్త్రార్థము స్వరూపనిర్ణయము కాని సూత్రమునకున్న తాత్త్వికార్థము ఆత్మ తత్త్వ-మని గీతానిర్వచనమిది

మయిసర్వమిదం ప్రోతం సూత్రేమణిగణా ఇవ (జ్ఞాన - 7)

పైంగలద్వితీయాధ్యాయమిట్లు సూత్రాత్మను వివరించినది

'ఈశాజ్ఞయా సూత్రాత్మా - వ్యష్టిసూక్ష్మశరీరం ప్రవిశ్య మన అధిష్ఠాయ తైజసత్వమగమత్ '

ఈశ్వరుని ఆజ్ఞచేత సూత్రాత్మ వ్యష్టియగు ప్రతిసూక్ష్మశరీరమునందును ప్రవేశించి, మనస్సునాధారముగా చేసికొని తైజసుడయ్యెను (పంతులవారి అనువాదము ఉపనిషత్ సముచ్చయము (చూ పుటలు 14- 5 1961)

వ్యక్తావ్యక్త విషయములకనుసంధానను సూత్రమని భావము కావుననే ఆత్మను నిర్వచించుచు విశ్వమిట్లుచెప్పనది

'ఆత్మాబ్రహ్మమనోజీవ దేహబుద్ధింద్రియాదిషు'

ఆత్మ (consciousness- sciousness = చైతన్య C f - Jayadev Singh p 5 1977) రెండు విధములు చివాత్మ - పరమాత్మ మొదటిది వైయక్తికము రెండవది విశ్వాత్మకము ద్వైతాద్వైతమార్గము లీరెండు సంబంధమును గూర్చి చెప్పుటయందే వివాదగ్రస్తము లగుచున్నవి వాగ్వ్యాపారము దీనిని సమర్థించునో చూచుట ఇచ్చటముఖ్యవిషయము కావున శబ్దబ్రహ్మవాదియగు భర్తృహరిదృష్టినిపరికింతము

ఆత్మరూపం యథాజ్ఞానేజ్ఞేయరూపంచ దృశ్యతే
అర్థరూపం తథాశబ్దే స్వరూపంచ ప్రకాశతే (వా ప 1-50)

పై 'అర్థరూపమ్ అనగా వ్యావహారికముకాని స్ఫోటాత్మకమగుశబ్దబ్రహ్మము' అక్షితత్త్వము

అనాదినిధనం బ్రహ్మశబ్దతత్త్వం యదక్షరమ్
వివర్తతేఽర్థభావేన ప్రక్రియాజగతోయితః (వా ప. 1-1)

పై శ్లోకమునకు (1 1) భర్తృహరి స్వోపజ్ఞటికయందీ శ్లోకద్వయమున్నది

యథావిశుద్ధమాకాశం తిమిరోపప్లుతోజనః
సంకీర్ణమివ మాత్రాభిశ్చిత్రాభిరభిమన్యతే
'తథేదమమృతం బ్రహ్మ నిర్వికారమవిద్యయా
కలుషత్వమివాపన్నం భేదరూపం వివర్తతే

(చూ లిమాయే & అభ్యంకర్ వా. ప్ర ప్రతి పుట. 352)

పైనిగీట్లు గీచినచోట్లు బ్రహ్మాద్వయవాదసమర్థకములని పండితులతలంపు పైని 1 59 శ్లోకమున దృశ్యతే - బదులు భాసతే అని అభినవగుప్తపాదుల ఈశ్వర ప్రత్యభిజ్ఞావిమర్శినీ వివృతి (ఈ ప్ర వి వి ) (vol II p, 248 Cf లిమాయే & అభ్యంకర్‌పుట 204) దీనిపై అభినవులవిమర్శనమిట్లున్నది

గ్రాహ్యత్వం గ్రాహకత్వంచ ద్వేశక్తీ తేజసోయథా తథైవసర్వ శబ్దానాం ఇతిచ ఏతదేవస్ఫుటయతి జ్ఞానశబ్ద ఇత్యాదినాగ్రంథేన ' సోమానందుడును ఇట్లే 1-1 ని గురించివ్రాయుచు

ఇత్యాహుస్తే పరం బ్రహ్మ యదనాది తథాక్షరమ్
అదక్షరం శబ్దరూపం సాపశ్యంతీపరాహివాక్

(శివదృష్టి 2 2)

ఉత్పలదేవుని వ్యాఖ్య ఇట్లున్నది

'తథాచత ఏవమాహుః యదనాది అనంతం చపరం బ్రహ్మచిద్రూపం తదక్షరం నిర్వికారం శబ్దరూపం, సాఏవచపశ్యంతీ సంజ్ఞాపరావాక్ వాగ్రూపతాం వినాపరబ్రహ్మఖ్యః చిత్ప్రకాశోఽపినప్రకాశతే, సాహిప్రత్యవమర్శినీ ప్రత్యవ మర్శన మేవచ ప్రకాశనముచ్యత ఇత్యాహుస్తే,

దీనికి సాక్ష్యము వాక్యపదీయమే

'వాగ్రూపతా చేదుత్క్రామేత అవబోధస్యశాశ్వతీ
నప్రకాశః ప్రకాశేత సాహిప్రత్యవమర్శినీ (వా ప 1 124)

వైయాకరణ మార్గనిరాసమిట్లున్నది

అసత్యవిభక్తాన్యరూపోపగ్రాహితా వివర్తః తన్యాస్తద్వివర్తతేయతో వివర్తనాత్ ప్రక్రియా భావభూతభువనాది విన్యాసవైచిత్ర్యమితి - ఉక్తంచ 'మూర్తి క్రియావివర్తౌ అవిద్యాశక్తి ప్రవృత్తిమాత్రమ్ తౌ విద్యాత్మని తత్త్వాన్యత్వాభ్యామ నాఖ్యేయౌ ఏతద్ధి అవిద్యాయా అవిద్యాత్వమ్ (ఉత్పలదేవుని వ్యాఖ్యానము శివదృష్టి 2-8 క్రింద)

శబ్దము వివర్తమనుట - అసత్యమనుట శివాద్వయవాదికి సత్యముకాదు. శివదృష్టి ఇంకను ఇట్లు వ్యాఖ్యానించినది.

శబ్దస్య విషయాఖ్యస్య మిశ్రత్వేనేంద్రియస్యతు
సర్వదర్శనవిజ్ఞాన శూన్యతా పదవేదినామ్ (2-80)
'యస్మాదనాది నిధనం శబ్దతత్త్వం పరాహివాక్
పశ్యంత్యావర్ణమానత్వేహస్తే గ్రాహ్యైకతాపతేత్ (2-81)

విషయరూపత్వేన కర్మతయాయస్య అఖ్యాప్రతీతిః - శబ్దస్య - తస్య ఇంద్రియస్యచకారణతయా ప్రసిద్ధస్య వాగ్రూపస్య మిశ్రత్వేన ఏకీకరణేన యస్మాత్తైరుక్తం అనాదనిధనం - ఇత్యాదికం అభేదాభిదాయితయోః తస్మాత్ తేనమిశ్రీకారేణ సర్వదర్శనాజ్ఞానతా పదవేదినాం - వైయాకరణానాంప్రాప్తా నహ్యాక్వచిదపి సాంఖ్యా-దర్శనేషు వ్యావహారికయోః ఇంద్రియాది విషయోః అభేదః ఇష్టః ఏవంచ వాశబ్దస్య పరత్వేన అనాదినిధనత్వేన అద్వయవాదాద్వైక్యేన

ఎర్యమానత్వే హస్తేఽకర్మేంద్రియే తద్గ్రాహ్యేణ విషయేణవికత్వాప్రసజ్యేత'
(చూ లిమాయే & అభ్యంకర్ (సం) వా. ప పుట 354)

ఈ ప్ర వి వి లో అభినవులీ శబ్దాద్వయవాదమునందుగల క్రియారహాత్వమునుగూర్చి ఇట్లనినారు

న అత్రదేశక్రమే క్రియాఉపయుక్తా సా అస్తుమావాభూత్
(Vol III p 14)

మరియొకచోట రామకంఠుడు స్పందకారికావ్యాఖ్యానమున ఈ రెండుమార్గముల నడిమిభేదమునిట్లుస్పష్టపరచినాడు (చూ పైగ్రంధము పుట 198)

'శబ్దాద్వయవాదే సామాన్యేన శబ్దార్థోభయరూపో అపర్యంతావాంతరభేదో యోఽయ మీశ్వరస్య శక్తిప్రసరః తం వివర్తవాచోయుక్త్యా వ్యవహరతిస్మ'
(వా ప I 1 ఇచట ఉదాహృతము)

అది బ్రహ్మముయొక్క వివర్తమన్నను శక్తిప్రసరమన్నను అందరును గుర్తించినది వైదికమగు 'వాగేవవిశ్వాభువనాని ఇత్యాదిశ్రుతిని

భర్తృహరిపాదుడీరహస్యమునిట్లు గ్రథించినాడు

'శబ్దస్య పరిణామోఽయం ఇత్యామ్నాయవిదోవిదః
ఛందోభ్య ఏవప్రథమమేతద్విశ్వం వ్యవర్తత' (వా ప 1-120)
నసోఽస్తి ప్రత్యయోలోకః యఃశబ్దానుగమాదృతే
అనువిద్ధమివం జ్ఞానం సర్వంశబ్దేన భాసతే' (అదే. 1-123)

కావున 'వాక్కే' ఈయాత్మతత్త్వము, గుహానిహితము గూఢమని యర్థము శబ్దార్థరూపబహిస్పందన ధర్మముగలది భావోస్మిలన వ్యాపారముగలది

కాయక మానసిక వాచికచేష్టారూపమై (చూ అభినవభారతి 14-3, 20-26) వ్యక్తా వ్యక్తముల ననుసంధించు సూత్రము - ఆలంకారికులకీమార్గము ధ్యేయము.

'యదేతద్వాఙ్మయం విశ్వం అర్థమూర్త్యావివర్తతే
సోఽస్మి కావ్యపుమానంబ పాదౌ వందేయతావకే'

(చూ పుత్రంతే సృజామి ఇత్యాది కావ్యమీమాంసాకారుని వాక్యములు
(తృ అ పుట, 33)

పై చర్చయందుగల 'గూఢ' తత్త్వమనవ్యక్తమనుటలోగల శాస్త్రీయతాదృష్టి ఇచట పరిశీలనీయము - అస్పష్టపదార్థములుగలదని, అంకురమువంటిదని, - బీజ మందు వృక్షము వలె సకలతత్త్వసముదాయముగలదని - అర్థముతప్ప- అసత్యమని, ఊహాజన్యమని, అర్థముకాదు

'సూక్ష్మమలింగమచేతన మనాధనిధనం తథాప్రసవధర్మిచ
నిరవయువ మేకమేవహా సాధారణమేతిదవ్యక్తమ్'
(సాంఖ్యసప్తశతి మా కామకలా విలాసము, పుట 54)

కావున 'ఆత్మవా ఇదమగ్ర ఆసీత్, సదేవసౌమ్యేదమగ్ర ఆసత్' - ఇత్యాది శ్రుతివాక్యములందుగల ఈప్రథమ చేతనావిర్భావము నాత్మయనవచ్చును దాని ధర్మముప్రచేరనము అది వేదకము అనగా తెలియుసది. దానిచే తెలియదగినది భాషావ్యవహారమున శబ్దార్థరూపమగు వాక్తత్త్వమే ఇట్టివేదకసంజ్ఞను పొంద గల్గినది (Cf f n 102, 103 & 196)

కేనేషితం వాచమిమాంవదంతి'

అని కేనోపనిషత్ ప్రశ్నము (1-1)

దీనికి సమాధానమిది

శబ్దేనావ్యాపృతాక్షస్య బుద్ధావప్రతిభాసనాత్
అర్థస్యదృష్టావివతదనిర్దేశ్య సవేదకమ్‌

(ఈ ప్ర వి వి Vol III p 239)

కావున విశ్వమానవ మనోగతమైన వాఙ్మయాధీన ఉచ్చారణప్రచేతన రూప లక్షణము ఆత్మ'. అన్ని భాషాపరిశోధన రంగములను ఈతత్త్వవిచికిత్సతోడనే పరిశీలనలు జరుపుచున్నవి.

5 చూ భోజుని శృంగారప్రకాశము రాఘవన్ (సం) (ఆంగ్లప్రతి) పుటలు 142-'43

6 స్వార్థానుమితి, పరార్థానుమితి,యను అనుమితిద్వయము వ్యక్తివివేక మున స్థాపింపబడినది. చూ వ్యం. సూ 2 8

7, కుప్పుస్వామిశాస్త్రిగారు 'వక్రోక్తి' అలంకార పక్షాంతరమనిరి ధ్వని ఖండనము కాదని వారి అభిప్రాయము. ఆపక్షమున ఈపందొమ్మిదవ మతమునిర్వచ నీయతావాదము కావలెనని రాఘవన్‌గారి వివరణము (శృ ప్ర పుట. 143)

8 పింతకుని వక్రోక్తి సిద్ధాంతమునకు నేపథ్యముగనున్న స్పందవాద ప్రమాణ పరిచయమునకు చూ రాధేశ్యామ్‌మిశ్రిగారి హిందీ ఉపోద్ఘాతము (వక్రోక్తి జీవితము పుటలు. 54 64, 1967)

9 చూ వ్యం సూ 2-10

10 వ్యక్తివివేకమున గల అధ్యాయములు 'విమర్శ లనబడినవి.

11 ధ్వన్యాలోకమను పేరిట్లుసార్థకము ఆత్మతత్త్వము దిర్శనసాధ్యము తప్ప అనుమేయముకాదని అర్థము కారణము స్ఫురణముద్ద్యోతనయా౦ము కాఽనసే ఆలోకముని ప్రతిఅధ్యాయమునకు ఉద్ద్యోతి మని పేరు

12 వక్రోక్తి జీవితమునసాలుగు 'ఉన్మేషము' లున్నవి 'విమర్శ,ఉద్ద్యోత ఉన్మేషము లను సీపరిభాష ఆయాసైద్ధాంతిక నెపథ్యమును వ్యంజించుచున్నది

13 చూ కృష్ణచైతన్య S P p 253

14 (Cf f n 4 above) పరిభాషాసమన్య Meaning అనుమాట చాలా flexibility కల్గినపదము వ్యక్త, వ్యక్తావ్యక్త, అవ్యక్తములను మూడు దశలు అర్థమునకున్నవి అర్థ తాత్పర్య - భావములను పదమువీదశలను సూచించును వ్యక్తి (వ్యంజన) శబ్దాభివ్యక్తికి సంబంధించినది తాత్పర్యము శబ్దబోధకు సంబంధించినది భావము శబ్దమూలము. అది అవ్యక్తమనగా-వ్యక్తము కానిదని - అనగా వ్యక్తిదశలో ప్రథమపరిచ్ఛేదమని - మనస్తత్త్వ పరిభాషలో 'archetype అని అర్థము, Cf Myth of Meaning in the works of C G Jung Aniela Jaffre, pp 21-22 1970) గుప్తమన్నను, అవ్యక్తమన్నను ఒకటే తెలియని దనుట ప్రపంచార్థము

15, మీమాంసక నైయాకులలో కొందరుస్ఫురణా బుద్ధియున్నవారు వీరు రూఢిభగవత్కల్పితమనిరి వైశేషకులు సాంఘికమనిరి (చూ ఐ. టి ఎం పుటలు 22 23) బౌద్ధులుమాత్రమే శబ్దపునసత్యమనువాదముచేసిరి శబ్దము బోధించునది అర్థమును కాదని - వస్తుభావ వికల్పములనని వీరిసిద్ధాంతము దీనినే 'అపోహ' సిద్ధాంతమందురు దిఙ్నాగుని క్రింది ప్రతిపాదనముష్టిఅపోహకు సూత్రీకరణము వికల్పయోనయః శబ్దావికల్పాః శబ్దయోనయః (Q from Stcherbatsky, Buddhist Logic II p 405 n Cf I T M p 78)

"The meaning of a word is a conceptual image (vikalpa) whose essence is the negation of all its counter - correlates (anyaapoha) (I T M ibid )

శబ్దము కల్గించునది ప్రత్యక్షముగ వస్తుభావమునుకాదు తదితరమగు వస్తుభావప్రపంచమును (అన్యాపోహ) ఫలితముగాకల్గునది - శబ్దవ్యాపారజనితమైన వస్తుభావబోధ అనుటలో బౌద్ధులకు సందియములేదు - కాని శబ్దముతో భావము అనపాయిత్వము - సామాన్యత్వము కల్గినదనుటలో వ్యంజనసూత్రమీ అపోహ నిరాసమునకే విన్యస్తమయినది. బౌద్ధుల ఈదృష్ట ససూర్ ప్రతిపాదనలకు సన్నిహితమని రాజాగారి అభిప్రాయము (I T M pp 85 86- ఫర్త్ అన్నట్లు ఇది భారతీయతత్త్వశాస్త్ర పరిచయముతో ససూర్ చెప్పిన అభిప్రాయమైనను కాకపోయినను మనకు ఇబ్బందిలేదు. బౌద్ధము (intellectualism) విశ్వజనీనలక్షణము కావున - ibid p 86 fn 2) [ససూర్ ఒకవైపు శబ్దభావనిత్యత్వము సంకేతగతముగా అంగీకరించుచు నిర్మాణగతముగా శబ్దార్థభేదములనే ప్రమాణముగా గ్రహించెననుట పూర్వాధ్యాయ పరిదర్శితము చూ. వ్యం సూ పుట 56)

అనిత్యత్వవాదులగు బౌద్ధులయినను అంగీకరించిన అంశమిది.

'The connotation of a word is a concept subjective in fact, though objective in reference' (Q S Mookerjee The Buddhist Philosophy of Universal Flux 1935 p 137) Cf I T M p 93)

తాత్త్వికులందరును ఈ విషయమునంగీకరించినను విభేదించుచోటు ఇది

The external reality is nor presented in the conceptual knowledge but a volitional urge towoids the real thing can be created by the conceptual images because of the mental makeup of the human beings' (ibid)

ఛామ్స్కీ అంగీకరించిన 'second mind (చూ వ్యం సూ పుటలు 78 80) విషయముకూడా దీనికి సన్నిహితముగానున్నది కాని బౌద్ధతర్కము వివరింపలేకపోయిన అంశము కావ్యానుభవము అది సాక్షివనవబోధమైన అనుభవము అనగా అనుమియమానము'కానిది శబ్దశక్తిని అంగీకరించుటయే కావ్యానుభవస్వరూపమునకు objective interpretation భర్తృహరి దీనిని ప్రారంభించినాడు (చూ వా ప 1-124) స్ఫోట - ధ్వనులమధ్యగల సంబంధమిచ్చటిది

16 ఆధునిక భాషాశాస్త్రమున వస్త్వాశ్రియత నిరూపణక్షమత్వములు ప్రాణభూతాంశములుగ గుర్తింపబడినవనుట పూర్వాధ్యాయ ప్రదర్శితము ఆధునిక విజ్ఞానతత్త్వము (scientific philosophy) లోని అసమగ్రతను, మానవకాదీతర శాస్త్రములనది ప్రభావితము చేసిన తీరును Herbert Read ఒకవ్యాసము (The Limitations of a Scientific Philosophy in The forms of things unknown', pp 15 – 32) న వివరించుచు 'Objectivity is a perception అన్న Everett knight మాటను సమర్థించినాడు ఒకసాహిత్యమే సత్యమును ప్రతిపాదింపగలదని, సత్యమనగా మనము చూచునది కాదని మన యనుభవముననున్నదని నిరూపించినాడు, Owen Barfield కూడా సమకాలికముగా విజ్ఞానశాస్త్ర ప్రభావితులైన భాషాశాస్త్రజ్ఞుల తర్కపరిధులను తనగ్రంథ ఉపోద్ఘాతమున సమీక్షించినాడు (See Poetic Diction, preface, p 22)

17 Cf I T M pp 6-7

18 ibid pp 189–227

19 See Gaurinatha Sastry 'The Philosophy of Word and Meaning', pp 3–5 (1959)

20 చూ నాట్యవేదము, భావచక్రము', పుటలు 249-50.

21 సౌమానందునితో వాక్ చతుష్టయ సమర్థనము మొదలయినది క్రమపద్ధతిలో పరాపశ్యంతులనడుమ 'సూక్ష్మ' మను మరియొక భేదము గుర్తింప బడినది ఈదృష్టిలో వాక్కు పంచవిధములు See K C Pandey Abhinava Gupta pp 493 9, (1963)

22 See I T M pp 6-7

23. సంయోగో విప్రయోగశ్చ సాహచర్యం విరోధితా
అర్థః ప్రకరణంలింగం శబ్దస్యాన్యస్యసన్నిధిః
సామర్థ్యమౌచితీదేశః కాలోవ్యక్తిః స్వరాదయః
శబ్దార్థస్యానవచ్ఛేదే విశేషస్మృతిహేతవః (వా ప 2-315 & 16)

24 యథాప్రణిహితం చక్షుర్దర్శనాయోపకల్పతే
తథాఽభినంహాతః శబ్దోభవర్యర్థస్యవాచకః
(అదే 2-401)

25 ప్రాభాకర దర్శనములోనిది అన్వితాభిధానవాదము తోచనమిక్లే చెప్పుచున్నది పుట 188.

26 See, Kuppuswami Sastry, The Highways and By-ways etc p 22

27 See K Krishnamoorthy Tatparya and Dhvani in A O R I, p 21 (1975) ఆలంకారికులు వాడెడి 'తాత్పర్య' మను పదము వైయాకరణులదికాదని, తార్కికులదని కృష్ణమూర్తిగారి ప్రతిపాదన.

28 See Raghavan (ed) pp 161-68 (1963)

29. సంహత్యకారితకు cumulative effect అని కుంజున్ని రాజా గారి యనువాదము (చూ. ఐ. టి. ఎం పుట 215) ఎంప్లేవ్‌వంటి తార్కికుల దృష్టి యిట్టిదేయనుట పూర్వప్రదర్శిత విషయము చూ వ్యం సూ. పుట 60.

30 ధనికుని 'కావ్యనిర్ణయము' నందలిగా 'శృంగారప్రకాశము (రాఘవన్ ప్రతి 1963) లో ఉదహృతము పుట 147

31 ముందటి అధ్యాయమున ప్రదర్శితములైన ఎంప్సేన్ (వ్యం సూ పుటలు 60 61), లిచ్ (పుట 65), బార్తెస్ (పుటలు 106-107) వంటివారి పరిశీలనము లిట అనుసంధనీయములు

32 భోజాదులు తాత్పర్యమును విశేషపరిధియందు గ్రహించినను ఆనందులఖండన మానాటి తార్కికులపైననేయనుట గ్రహింపదగిన యంశము

33 చూ కె కృష్ణమూర్తి ధ్వన్యాలోక ప్రతి (ఆంగ్లము 1974) పుట 304

34 చూ ఐ టి ఎం పుట 187

35 తత్సంబంధాత్ ఫలనిష్పత్తేస్తేషుఫలవదుపచారః

— గౌతమన్యాయసూత్రము 4-1-54

Cf The meaning of the word 'upachara' Hardatt Sarma in P O 1-1 pp 26-33 (1936)

36 గౌతమన్యాయసూత్రము, 2-2-64

37 చూ, ఐ టి ఎం పుట 238

38 భారతీయులు చారిత్రక పరిణామ దృష్టితో చెప్పిన అర్థవిపరిణామ (semantic change) మిది యొక్కటి (నిరూఢలక్షణ = faded metaphor) యే అని రాజాగారు గుర్తించినారు, చూ ఐ టి, ఎం పుట 10

39 Q from I T M p 63
40 ibid p 262
41 ibid 262
42 ibid p 263

43 పదదశయందుగల నిరూఢలక్షణను గురించిన చర్చకు చూ రీడ్ (1928), ఫాస్ (1949), లూకాస్ (1955), భాషాశాస్త్రపరిధిలో జరిగిన పరిశీల నకు చూ. అధసూచిక 72 వ్యం సూ పుట 125 See Lehrer (1974), బ్రహ్మానంద 'సమాసనిర్మాణం-లక్షణ స్రవంతి 25 6 పుటలు 37 41 (1978)

44. గౌతము'డుపచార మునకు లక్షణము చెప్పినాడు భాట్టమీమాంస కులు 'భాక్త/గౌణ పదములలో లక్షణను వ్యవహరించిరి ప్రాభాకరమీమాంసకులు లక్షణ నంగీకరింపలేదు వారి దృష్టిలో అభిధ ఒక్కటియే- లక్ష్యార్థములనుకూడ బోధింపగల్గినది 'తత్సంబంధవశప్రాప్తస్యాన్వయాలక్షితామతా అని శాలికనాథుని మతము (వాక్యార్థమాతృకావృత్తి పుట 13) చూ ఐ టి ఎం పుట 259

45 సర్వేషాం ప్రాయశోఽర్థానాం వ్యంజకత్వమపీష్యతే

— కావ్యప్రకాశము 2 6 (పుట. 18)

46 W B Stanford (1936) అర్థవ్యాపారమనుటనే 'stereoscope of ideas అనినాడు దీనిపై విమర్శనమునకు చూ Wimsatt W K pp 119–30 (1970 ed ) I A Richards (1936) కూడా 'metaphor' ని గురించి పద' దృష్టికన్నను 'అర్థ' (సందర్భ) దృష్టి సమగ్రమనినాడు

47 దండి కావ్యాదర్శమున ఇట్టిలోకసీమానురోధములైన అన్య ధర్మా ధీనతను సమాధిగుణమనిపిలిచినాడు (కావ్యాదర్శము 1 93) వామనుడు సాదృశ్య కారణమున నేర్పడు ఇట్టి లక్షణలు వక్రోక్తు' లనినాడు (కావ్యాలంకార సూత్ర వృత్తి. 4-3-8)

48 చూ కావ్యప్రకాశము 2-13-18, సాహిత్యదర్పణము 2-15

49 ఆధునిక సాహిత్యవిమర్శనా సంప్రదాయములందీనాడు 'శ్రోతృ పారక' ప్రాధాన్యము మిక్కిలి ప్రధానమగునంశము వివరములకు చూ M H Abrams 'The Mirror and the Lamp, pp 17-21 (1976 ed) సాహిత్యవిమర్శ సిద్ధాంతములకు భాషాశాస్త్రదృక్పథ పరిణామములకు గల సంబంధమునకు చూ Hawkes Structuralism and Semiotics pp 156-160

50 See Raghavan (ed) p 142 (1963) లోచనము పుట 34

51 వ్రజ్ మోహన్ చతుర్వేది, 'మహిమభట్ట' (హిందీప్రతి (1961) నుండి ఉద్ధృతము, పుట 103 (శక్తి = అభిధ, భక్తి = లక్షణ, వ్యక్తి = వ్యంజన)

52 చూ క్రింద అ సూ 55 సామ్యవాదసిద్ధాంతము నంగీకరించు వారందరును భౌతికవాదము నంగీకరింపవలయునను నియమములేనట్లే (Cf Marxism on Vedanta articles by Bani Deshpande pp (61-107) & S A Dange pp 289-290 1976) పరావాక్కును గుర్తించినంతమాత్రమున వ్యంజనా వ్యాపారమునంగీకరింపవలెననిలేదు ఇది సైద్ధాంతిక భేదదృష్టి అభిలషణీయవిషయము భట్టనాయకుడును ఇట్టివాడే వైపు ధ్వనినంగీకరించుచు మరి ఒకవైపు వ్యంజనావ్యాపారమును తిరస్కరించినాడు అభినవభారతియందీ అభిప్రాయఖండన ప్రసక్తియున్నది చూ నోలి పూర్వోదాహృతగ్రంధము, పుట 12

53 మహిమభట్టును గురించి ఈవ్యాసమున చేసిన ప్రతిపాదనలకు ఆధారము వ్రజ్ మోహన్ చతుర్వేదిగారి (1965) 'మహిమభట్ట' (హిందీప్రతి) పుటలు 22-24

54 తార్కికానుమానమునకును కావ్యధ్వనికి గల భేదమును Prescott F C స్పష్టముగ వింగడించినాడు (Poetic Mind, New York 1922) దీనిపై చర్చకు చూ Krishna Moorthy, pp 20-51 (1951), Prescott స్వప్నదశలతో కావ్యార్థావగాహనమును అన్వయించియు పరిశీలించియున్నాడు See S P p 146 (1965) also infra pp 130, 270 & 358

55 కె ఎ పాండేగారు - ఇతడును కాశ్మీర శివాద్వైతియని - భర్తృహరి వైయాకరణమత (శబ్దబ్రహ్మవాద) అనుయాయుడని ప్రతిపాదించియున్నారు - అనగా కేవలమునైయాయికుడు మాత్రమేకాడని వారియభిప్రాయము పరావాక్ స్తుతి (వ్య ఎ 1-1) ని నిదర్శనముగా పేర్కొనియున్నారు Cf Comparative Aesthetics, p 325, 1959 also Vraj Mohan chaturvedi op cit pp 26-28 & Cf fn 62 below

56 ఇది భర్తృహరి సిద్ధాంత ప్రభావమనుటకు 'చరితార్థక్రియా' (copula) గా భూధాతువును భర్తృహరి గురించియుండుట నిదర్శనము చూ, వాక్యపదీయము 2-270

57 'ద్వివిధో విషయః శబ్దానాం - అనుమేయః ప్రతిపాద్యశ్చ తత్రాను మేయో వివక్షాలక్షణః - నశబ్దవ్యవహారాంగం - ప్రతిపాద్యస్తు ప్రయోక్తురర్థప్రతిపాదన సమీహావిషయో కృతో ఽర్థః - సచద్వివిధః వాచ్యోవ్యంగ్యశ్చ - ధ్వ ఆ, పుట 449

58 కాపున ఇతడు ప్రాభాకర, భాట్ట మీమాంసకులందెవరిని అనుసరించినట్లు చెప్పలేము భర్తృహరి మతానుయాయుడనుటకిది ఒక ప్రమాణము

(Cf Vraj Mohan Chaturvedi, op cit p, 28)

59 అర్థస్యవిశిష్టత్వం శబ్దః సవిశేషణస్తదః పుంస్త్వమ్
ద్వివచనవాశబ్దాచ వ్యక్తిర్ధ్వనిర్నామ కావ్యవైశిష్ట్యమ్
వచనంచ కథనకర్తుః కథితాధ్వనిలక్ష్మణేఽదశదోషాః
యేత్వన్యేతద్భేదప్రభేద లక్షణగణానతేగణితాః

(వ్య. వి. 1-23 & 24)

60 1, 6 అంశములపై లోచన సమర్థనమిట్లున్నది Also Cf fn 69

(1) స్వశబ్ద ఆత్మవాపి స్వశ్చార్థశ్చలౌస్వార్థౌ తౌగుణీకృతౌ తాభ్యాం యధాసంఖ్యేనతేనార్థౌ గుణీకృతాత్మా, శబ్దోగుణీకృతాభిధేయః' (పుట 1॥)

(6) 'వ్యంక్త ఇతిద్వివచనేనేదమాహ - యద్యప్యవివక్షితవాచ్యే శబ్ద ఎవవ్యంజకస్తథాప్యర్థస్యాపి తత్ప్రయతి, అన్యథా అజ్ఞాతార్థోఽపి శబ్దస్తద్వ్యంజకః స్యాత్ వివక్షితాన్యపరవాచ్యేచశబ్దస్యాపి సహకారిత్వం భవత్యేవ విశిష్టశబ్దాభిధేయతా వినాతస్యార్థస్యావ్యంజకత్వాదితి సర్వత్రశబ్దార్థయోరుభయోరపి ధ్వననం వ్యాపారః (అదేపుట) భట్టనాయకుడు ద్వివచనమనవసరమనుట 'గజనిమీలిక చేతనని అభినవుల అధిక్షేపణము. ఇట్టిసమర్థనము తక్కిన ఎనిమిది యంశము లకును గలవు వానిసారాంశము 'వ్యంజన నిస్సందేహముగా వాగ్వ్యాపారమేనని వ్యంగ్యార్థము అనుమానితముకానేరదని,

61 చూ ధ్వ ఆ 2-4 & 5

62 అనుమానితమగు 'ప్రకాశ' స్వరూపముండునాయను ప్రశ్నము రావచ్చును భర్తృహరి మార్గానుయాయియగు మహాముని దృష్టిలో 'బ్రహ్మము ప్రకాశమయముమాత్రమే విమర్శాంశ అందుగుణీభూతము తత్సమాన ప్రతిపత్తి లేనిది అప్రకాశతనువే వైయాకరణమార్గమున పరావాక్కు అది ప్రణవ నాదాఖ్యము అనాదినిధనము (మా వాక్యపదీయప్రకీర్ణశ్లోకములు. Cf బ్రజ్ మోహన్ చతుర్వేది పుట 26)

63 ఈదశాంతర ప్రసక్తి వాగ్వ్యాపార దృష్టితో చాలాప్రధానము కళా రూపములలో ప్రపంచానుకరణము (model) నిరూపింపజాలని సందర్భము లున్నవి సాహిత్యమునను అట్టిచోట్లుగలవు అచటనే కవి భావవ్యక్తీకరణము manifestation of the poet s idea) ను గుర్తింపవలసి వచ్చుచున్నదని విమర్శక ప్రముఖులందరును అంగీకరించుచున్నారు. (See Avner Zis Foundations of Marxist Aesthetics, pp 125 – 138, 1977)

నిత్యవ్యవహారమునను నిట్టిసందర్భములున్నవని నిరూపించుటయే ఈవ్యాసమున నుద్దిష్టమగు నంశము శిశువాక్కు పిచ్చివారిమాటలు, జానపదుల వాగ్వ్యవహారము స్వప్నభాష - ఏతన్నిరూపకములు

64 See I, T M p 295

65 ఆనందవర్ధనుని కాలముననే అవగమన ప్రతీతి వ్యంజనాది శబ్దములకు విమర్శయందు ప్రాచుర్యము కలిగినదని రాఘవన్‌గారి నిరూపణము చూ శృంగారప్రకాశము. పుటలు 138-141.

66. శబ్దార్థౌసహితౌ కావ్యం గద్యం పద్యంచతద్ద్విధా
సంస్కృతం ప్రాకృతంచాన్యదపభ్రంశ ఇతిత్రిధా
(కా. అ 1-16)

67 వక్రాభిధేయ శబ్దోక్తిరిష్టా వాచమలంక్రియా
(కా. అ 1-36)

68 అలంకారాంతర వ్యంగ్యభావే ధ్వన్యంగతాంభవేత్
చారుత్వోత్కర్షతో వ్యంగ్యప్రాధాన్యం యదిలక్ష్యతే
(ధ్వ ఆ 2-30)

69 ఇచ్చటనే ఆనందులు ఉపసర్జనీకృతస్వార్థౌ అనుట (1-13) లోని ఔచిత్యమును పునరుద్ఘాటించినారు 'అర్థోగుణీకృతాత్మా గుణీకృతాభిధేయః శబ్దోవా యత్రార్థాంతర మభివ్యనక్తి సధ్వనిరితి' (పుట 108)

'70. చూ, శృంగారప్రకాశము పుటలు 22 729, 732, 734,838 దండి వ్రాసిన ద్విసంధాన కావ్యమునుగూర్చి భోజుడు తంత్ర' శబ్దముచే వ్యవహరించెనని రాఘవన్ వివరణము తంత్రశబ్దమునకు వామనుని వివరణమిది

అనేకోపకారి సకృదుచ్చారణమ్ - సధర్మేషు తంత్రప్రయోగః శ్లేషః

(కావ్యాలంకార సూత్రవృత్తి, పుట 120 చూ కా అ పుట 60)

71 'మనాక్స్పృష్ట ఇతి - తైస్తావద్ ధ్వనిదిగున్మీలితా, యథాలిఖిత పాఠకైస్తు స్వరూపవివేకం కర్తుమశక్నువద్భిస్తత్స్వరూప వివేకోనకృతః (లో పుట 32). రానట్లు చదువుట ఒకమార్గమట అట్టివారికి ధ్వని మార్గము బోధపడదు. 'అభగ్ననారికేళవత్' అనిపోలిక వాచ్యార్థభేదనము టెంకాయను పగులగొట్టుటవంటిదని

72 భామహుడు 'వక్రత' ను గురించిచేసిన ప్రతిపాదనములనుగూర్చి కుంతకుని 'వక్రతా విశ్లేషణముపై వానిప్రభావమునుగూర్చి పరిచయమునకై చూ తుమ్మపూడి కోటీశ్వరరావు, 'వక్రతా సిద్ధాంతము - భామహుడు' పుటలు 1-22 (1970)

73 వక్రోక్తి = a striking mode of speech (Ref I T M p 302) కాని వక్రోక్తికివెనుక కవి మనోవ్యాపారరూపమగు స్పందము (movement) చాలప్రధానము స్పంద సిద్ధాంతమునకు వక్రోక్తితో గల సంబంధమునకు చూ, రాధేశ్యామ్ మిశ్రగారి పీఠిక పుటలు 54-61 (1967) వేద పరిభాషయైన క్షోభ తో ఈచలనమునకుగల సంబంధమును కోణ (angle) ముఖముగా నిరూపించి 'ఉచ్చూన మనగా క్షుబ్ధమగు శాంతాత్మయొక్క తరంగాయమాన స్థితియని తుమ్మపూడి కోటీశ్వరరావుగారి వ్యాఖ్యానము చూ కుమార భారతి - పీఠిక - ఎటొక్కాణాలు పుట XXXVIII (1981).

74 భణ్, భణితి (expression) - విషయము ప్రస్తావితపూర్వము చూ వ్యం సూ పుటలు 10 109 & 135

75. సంకేతిపదమునకు అర్థవిజ్ఞానమునకును గల ఈమౌలిక దృక్పథ భేదము ఇంకను ఎరిగోధితవ్యమగు నంశమే చూ వ్యం సూ పుట 135 ఆ సూ.146 జాణ్ణుడి-నుడికారము మున్నగు మాటలందలి 'నుడి' vocabulary కి సంబంధించినదికాదు ఒక్కొక్క జాతిప్రజలు భావప్రపంచమును వర్గీకరించు కొని భాషనుపయోగించు 'categorization కి సంబంధించినది ధ్వనితార్థమున కున్న సాంఘిక అస్తిత్వమిదియే ఆధునిక కవిత్వములందును ప్రాచీన ప్రతీకలు నిలిచిపోవుటకీ హేతువే ప్రధానము

76. వివక్షితార్థమనుటమాట తాత్పర్యవాదులు వాడునది. వాచ్యలక్ష్య వ్యంగ్యాద్యర్థములకంటె భిన్నమైన తాత్పర్యమును భోజాదులు భావించిరి శారదా తనయుడు వివక్షితార్థ ప్రకాశన సమర్థములగు ఆరుహేతువులను ప్రదర్శించినాడు వర్ణము, పదము పదద్వయము అనేకపదములు, వాక్యము, వాక్యార్థము (చూ భావప్రకాశము. 6-295, 96 పుటలు 362-63) వివక్షితార్థమొకొక్కప్పుడు కారకమున మరొకపుడు తద్ధితసమాసములందు, ఇంకొకపుడు ధాతుకాకూప సర్గములందు భాసించునని అతనినిరూపణము, వివక్షితార్థమునకు వివక్షితము / అభిప్రాయము / ఫలము/భావము/ప్రయోజనము / తాత్పర్యము-లు పర్యాయములు అందువివక్షితలక్షణమిది,

యోఽర్థో బుద్ధిస్థితోఽభీష్టో వక్తృవాక్యేనగమ్యతే
తద్వివివక్షితి మిత్యుక్తం దర్పణాదేముఖాదివత్
(అదే. 6-303)

బుద్ధిస్థమైన యభీష్టార్థము దర్పణాదికమున ముఖాదులవలె గమ్యమైనచో (if understood) (పాఠకుని బుద్ధిగతిమైన భావమే కావ్యమునందలి వక్తవాక్య మున భాసించినచో) అది వివక్షితమనదగును. ఇట్టి వివక్షితార్థైక గోచరమగు దానిని మాత్రమే శబ్దముగా కుంతకుడు గ్రహించెను (వివక్షితావివక్షిత వాచ్య

ములను అనందుడును గ్రహించెననుట తరువాత నిరూపింపబడుచున్నది) - కాని శబ్దము సహృదయాహ్లాదకారి స్వస్పందసుందరముగ నుండునపుడు 'ప్రత్యభిజ్ఞా' బలముచే వివక్షితార్థైకగోచరమగును కుంతకుడు కావ్యశబ్దమును పరావాక్ పరిస్పందముగా భావించినాడు అర్థః శంభుః శివావాణీ' - అని దేవీవాదులదృష్టి ఈదృష్టి సామాన్యముగ భావింపబడు మీమాంసక వాచ్య - వాచక సంబంధము కన్నను విలక్షణము చూ రాధేశ్యామ్‌మిశ్రగారి వక్రోక్తిజీవితపీఠిక 1967)

77 ఈయభిప్రాయమును సామాన్యమీమాంసకార్థమున గ్రహించియే కృష్ణచైతన్య ఇట్లువ్రాసిరి

'Vakrokti indirect utterance is sometimes used by Kuntaka to stand for all figures of speech and ultimately for poetic utterence which even dispenses with figures in fact all poetry In that we need not even move onto puport from denotation (S P p 124)

78, షడ్విధవక్రతలివి వర్ణవిన్యాస, పదపూర్వార్ధ క్రియావైచిత్ర్య, వాక్య ప్రకరణ, ప్రబంధవక్రతలు

79 తొమ్మిది విభాగములివి రూఢివైచిత్ర్య పర్యాయ, ఉపచార, విశేషణ, సంవృతి, పదమధ్యాంతర్భూత, వృత్తివైచిత్ర్య, భావవైచిత్ర్య లింగవైచిత్ర్య - వక్రతలు

80. గచ్ఛంతీనాం రమణవసతిం యోషితాంతత్రనక్తమ్
రుద్ధాలోకే నరపతిపథే సూచిభేద్యైస్తమోభిః
సౌదామిన్యా కనకనికషస్నిగ్ధయాదర్శయోర్వీ
తాయోత్సర్గస్తనిత ముఖరో మాస్మభూర్విక్లవాస్తాః
(మేఘసందేశమ్ 2-46 వ జీ పుట 220)

81 గగనంచ మత్తమేఘం ధారాలులితార్జునానిచవనాని
నిరహంకార మృగాంకా హరంతినీలా అపనిశాః
(అదే 2-47 వ జీ అదే పుట)

82 పై శ్లోకము ధ్వ ఆ 3-1 క్రింద ఉదాహృతము

83 చూ మిశ్రాగారి వ. జీ పీఠిక పుట 12, నాట్యవేదము - 2 సం పుట 493 లో, శర్మగారును ఈఅన్యుడు 'కుంతకుడే యని అభిప్రాయపడినారు

84 ఉదాహరణమునకు చూ పంతులవారి అనువాదము ధ్వ ఆ సం 1 పుట. 60 (1958)

85. 'అగోచర మనుమాట అర్థముకానిదను యాథ్యర్థముకలిగినది ధాత్వర్థ విచారణమునల్పినచో మాటలకందనిదనుట తెలియును (న+గో+చరము— 'గో' అను పదము వాక్' అను అర్థమును కలిగినదిగా వైదికపరిభాష గణానాం త్వాగణపతిగ్ం హవామహే ఋ II 2 3 1) ఇట్టి ఋక్కులందు గల 'గో' శబ్దము వాగర్థకము. వైదిక పరిభాషయందిట్టి ధాతువులు దాదాపు 150 వరకు కవిపించుచున్నవని విశ్వబంధుమహాశయుని నిరూపణము (See Vedic Textuo Linguistic Analysis p 68 f n 1968)

86. చూ పృథక్కరణ సారాంశము వ్యం సూ పుట 113

87 అదే పుట 114

88 అంగీకరింపని శబ్దార్థసంబంధవాదులను ధ్వన్యాలోకము ఒకచో స్మరించినది, లోచన వ్యాఖ్యానమున వారు నైయాయిక సౌగతాదయః' తార్కికులు, బౌద్ధులు) అని తెల్పబడినారు చూ లో పుట 444 Cf C I ewis On the modes of meaning, in Semantics and

Philosophy of language, P 50 Also Gaurinartha Sartry, The Philosophy of Word and Meaning, p 6 (1954)

89 Tractutus Cf. I T M p 292

90 Introduction to Metaphysics – Cf I T M p 293

91 భాషలోని వాక్యములు మూడువిధములని Jesperson వివరణము. ఉచ్చరితములు (articulate), అర్ధోచ్చరితములు (semiarticulate) అనుచ్చరితములు (inarticulate)

'Only bores want to express everything Not only is the writer s art rightly said to consist largely in knowing what to leave in the ink – stand, but in the most everyday remarks, we suppress a great many things which it would be pedantic to say expressly—much is left to the sympathetic imagination of the hearer

(Cf p 305 & See 309-10, The Philosophy of Grammar, 1958)

92 సహృదయాలోకమని, కావ్యాలోకమని నామాంతరములు కనిపించుచున్నవని కె కృష్ణమూర్తి (చూ ధ్వ ఆ pp XVI–XVIII 1974 ప్రతి) వివరములకు చూ. అనుబంధము I.

93 ఈప్రణాళికతో భారతీయ భాషాశాస్త్రముపై వ్రాసినసమీక్షావ్యాసమునకు చూ బ్రహ్మానంద 'భారతదేశంలో భాషాశాస్త్రం', ఆ ప ఉ సం 1978 పుటలు 82-83 )

94 సజెషన్/సజెస్టివిటీ అను రెండు అనువాదములను కె కృష్ణమూర్తి గారు వరుసగా తమ 1955, 74 ప్రతులలో సమ్మతించినారు.

95 ఈ గ్రంధమలభ్యము చూ వ్యం సూ 2 II-4 లోచసమే మనకు మిగిలినసాక్ష్యము ఆలోక' శబ్దము కావ్య శాస్త్ర ఉభయతారకముగా అనందువి ఎద్దాంతము

96 సరస్వతిని దేవీస్వరూపముగ సమర్చించుట శైవాగమముననే గల వైదికమార్గచ్ఛాయ వివరములకు చూ కుమారభారతి పీఠిక, పుటలు XIV–XV

97. సరస్వత్యేవేషాఘటయతి యథేష్టం భగవతీ - ధ్వ ఆ పుట. 55॥ దేవిని స్వాతంత్ర్య పూర్ణ ప్రథగా భావించుటయు శైవాగమమునవె గలదు (లలితా సహస్ర కామకలా విలాసాది గ్రంథములందీచర్చ విస్తృతముగనున్నది)

98. అభినవుల తంత్రాలోక, పరాత్రింశికావివరణములందును జయ రథుని అలంకార సర్వస్వవ్యాఖ్యయందును గల వాక్చతుష్టయమునకు సంబం ధించిన యంశములింకను సమ్యక్ పరిశీలనీయములు See Brahmananda Vaagdarsana (1981)

99 చూ నాట్యవెదము సం. 2 పుటలు. 48ు 86

100 లక్ష్మన్ సరూప్‌గారి (సం) 'నిఘంటు అండ్ నిరుక్త' నుండి ఇచ్చటి వేదమంత్రములుద్ధృతములు అధ్యాయము-11 పుటలు 198-201 (1967) Cf P S Sastry 'Rgvedic theory and treatment of Rasa and Dhvani, P O IX p, 3 & 4 pp 111-120

101 Cf John Woodroffe, 'Garland of letters', Ch Dhvani pp 218-26 (1959)

102. ఈ ప్రచేతనలక్షణమును దేవీసూక్తము ఇట్లు వివరించినది

యయాసో అన్నమత్తి యోవిపశ్యతియః ప్రాణితి యఈశృణోత్యుక్తమ్
అమంతవోమాంత ఉపక్షీయంతి శ్రుధిశ్రుతం శ్రద్ధివంతేవదామి
అహమేవస్వయమిదంవదామి జుష్టం దేవేభిరుతమానుషేభిః
యంకామయే తముగ్రంకృణోమి తంబ్రహ్మాణంతమృషింతంసుమేధామ్

శివాద్వయవాదమున సంభావించెడి శక్తిప్రాధాన్యమునకు వైదికప్రమాణమిది ఇచ్చటగల I అనునది విశ్వగతమైన సృజనేచ్ఛ - అదియే వాక్కునగల పరిచేతన లక్షణము (Cf Bhashya Sangraha, Deva Raj Chanana (ed) pp 266-72 (1972) also cf fn 196 below

103 సకల భువనోదయస్థితిలయమయ లీలావినోదనోద్యుక్తః
అంతర్లీనవిమర్శః పాతుమహేశః ప్రకాశమాత్రతనుః
(కామకలావిలాసము సూత్రమ 1)

సాజయతిశక్తిరాద్యా నిజసుఖమయ నిత్యనిరుపమాకారా
భావిచరాచరబీజం శివరూపవిమర్శనిర్మలాదర్శః
(అదే సూత్రము 2)

నశివేన వినాదేవీ దేవ్యాచనవినాశివః
నైతయోరంతరంనాస్తి చంద్ర చంద్రికయోరివ
(చూ అదే పుట 11)

శ్రీవిద్యామార్గమున 'త్రికోణరూపిణీ శక్తిర్బిందురూపశ్శివస్మృతః' (పుట 29)




'అకారస్సర్వవర్ణాగ్ర్యః ప్రకాశః పరమశ్శివః
హకారోఽంత్యః కలారూపో విమర్శాఖ్యఃప్రకీర్తితః
(అదే పుట 16)

ఇది సంవిన్మాత్మక కేంద్రముగల త్రిభుజము
అ-ఇ ఉలకు సంబంధించినదికౌలమార్గము,
Cf fn 106

104 See Highways and By ways p 1 (1945)

105 ఈపద్ధతి వైయాకరణమార్గప్రసిద్ధముకాదు. అకుహవిసర్జనీయానాం కంఠః' (చూ లఘుసిద్ధాంతకౌముది 1-1-9 క్రింద వృత్తి) అచ్చులనువీడి హల్లులెభాషయందును పలుకబడవు కావున శ్వాసనాదభేదము శాస్త్రీయముతప్ప వ్యవహారమున ధ్వనులన్నియు నాదాత్మకములే ఈపరిశీలన తంత్రాలోకమున మిక్కిలి సూక్ష్మముగ చేయబడినది (2-74, 81, 82) 'అక్షరాణామకారోఽస్మి అనిగీతావాక్యము (విభూతి - 33) కాశ్మీరశైవసంప్రదాయమున 'అ' కారము పరమేశ్వరాత్మకముగ, 'ఇ' కారముదేవ్యాత్మకముగ భావింపబడును వివరములకు చూ పాండేగారి అభినవగుప్త పుట 654

106 ' these three powers are recognised to be represented by three letters A, I and U, are called Anuttara, Icchaa, and Unmesa ' Q Pandey, opcit p 598

ప్రపంచమున ఎక్కువభాషలందీ అచ్‌త్రయ (ఇ ఉ, అ ) నిర్మాణమే కనిపించుచున్నదని C F Hockett, Cf 'A Manual of Phonologry pp 42 56 (1955)

107 'సృష్టిని ఉన్మేషమందురు జ్ఞానమును ఉన్మేషమే అవ్యక్తము వ్యక్తమగుటఒక ఉన్మేషము నేను వ్యక్తస్వరూపుడనని తెలిసికొని వ్యక్తమునవ్యక్తమునందలయించుట మరొక ఉన్మేషము' (చూ తుమ్మలపూడి కోటీశ్వరరావు, 'స్పందసౌందర్యము', పుట 26, 1974)

108 అచ్చు హల్లులు - ఈరెంటియందును నాదగుణము (sonority) ఉన్నది దాని ఆధిక్యతవలన అక్షర (syllable) స్వరూపమేర్పడుచున్నది నాదగుణ న్యూనాధిక్యతల వలన అచ్చులు హల్త్వమును హల్లులు అచ్త్వమును పొందుచున్నవి అన్నిధ్వనులందును అ' కారము మిక్కిలి నాదగుణము కల్గినది అక్షరములలోగల అజ్ఝల్ సహవాసము (patterning) ను గూర్చి

ఈవ్యాసకర్త మేఘాలయలోని 'ఖస' భాషయందు పరిశీలించియున్నాడు అంతర్గతమగు అక్షర నిర్మాణము అజ్ఝల్‌క్రమముచే వ్యక్తమగుచున్నదని అందునిరూపింపబడినది (See Syllabics in Khasi ch 2, 1975)

109 శషౌసరేఫ సంయోగౌఢకారశ్చాపి భూయసా
విరోధినః స్యుః శృంగారే తేనవర్ణారసచ్యుతః (ధ్వ ఆ 3 3)

110 యథాపదార్థద్వారేణ వాక్యార్థః సంప్రతీయతే
వాచ్యార్థపూర్వికా తద్వత్ప్రతిపత్తస్యవస్తునః (అదే 1-10)

111 అర్థాన్తరే సంక్రమితమత్యన్తంవాతిరస్కృతమ్
అవివక్షిత వాచ్యస్యధ్వనేర్వాచ్యం ద్విధామతమ్ (అదే 2-1)

112 క్రమేణ ప్రతిభాత్యాత్మాయోఽనుస్వాన సంనిభః
శబ్దార్థశక్తి మూలత్వాత్సోఽపి ద్వేధావ్యవస్థితః (అదే 2-21)

113 తద్వత్సచేతసాంసోఽర్థో వాచ్యార్థవిముఖాత్మనామ్
బుద్ధౌతత్త్వార్థదర్శిన్యాం ఝుటిత్యేవావభాసతే (అదే 1-12)

ధ్వనిభేదపరిగణనమిది




(See I T M p 306 (1977)

114 వాగర్థావివసంపృక్తౌ తమర్థమివభారత్యా - మున్నగు కాళిదా సోక్తులను పండితు లీయభిప్రాయమునకుపపత్తిగా చూపుదురు భిన్నభారతీయదర్శనములందు గల ఈశబ్దార్థనిత్యత్వచర్చపై - భర్తృహరి మార్గములో గల 'స్ఫోట'తో దీనికిగల సంబంధమునుగూర్చి విశేషచర్చలకు చూ శబ్దాద్వైతవాదః - అయోధ్యానాధశాస్త్రి A I O C, proc Vol, III pp 177-183 (1968)

(ఈయనువిద్దతను (వ్యావహారికదశయందలి పృథక్త్వమును) సూచించుటకే పుట 188 లోని చిత్రమున 'వాక్కు నటునిటు ఆవరించిన అర్ధచంద్రాకార సంకేతములు [ ) ( ] ఉంచబడినవనుట గమనార్హము.)

115 See Kunjunni Raja 'Vyanjana-suggestive function of language Annals of Oriental Institute, pp. 58-60 (1975)

116. చేష్టాదికమునగల expressive' లక్షణము పూర్వాధ్యాయ దర్శితము చూ వ్యం సూ 1-3 & 1-12-3

117 «అంగనైపథ్యసత్వములు వాక్యార్థమును వ్యంజించుటకే ప్రవర్తిల్లుచున్నవి కనుక, వాక్కు నాట్యమునకు తనువువంటిదికనుక, నిర్మాణ సమయమున కవియు, అభినయ సమయమున నటుడును వాక్కున మిక్కిలి ప్రయత్నవంతుడు కావలయునని భరతముని ఆదేశము (నాట్యశాస్త్రము 14-2) నాట్యమునందే వాక్కునకంత ప్రాధాన్యముండగా తన్మయమైన కావ్యమున దాని ప్రాధాన్యమెట్టిదో చెప్పనక్కరలేదు కావ్యమున ఛందమంగాభినయస్థానీయము అలంకారమాహార్యాభినాయస్థానీయము గుణము సాత్త్వికాభినయస్థానీయము ఈసర్వమును కావ్యతనుమైన వాక్కునాశ్రయించి కావార్థమయిన రసమును వ్యంజించును ' (చూ పాటిబండ మాధవశర్మ, ఛంద శిల్పము, పుట 6, 1967)

118 చూ ధ్వ ఆ. 1-1 క్రింద వృత్తి పుట. 25

119 'ధ్వని రసజ్ఞుని ప్రజ్ఞాధీనమని నిర్వచనీయం కాదనితేలింది రసజ్ఞుడే 'తత్వవేత్త' (చూ శేషేంద్రశర్మ, 'స్వర్ణహంస, పుట 136) ధ్వనుల ఆనంత్యమునకు నిర్వచనీయతకు సంబంధములేదు. ధ్వనిభేదసంఖ్యాగణన ప్రయత్నము సాహిత్యదర్పణాది గ్రంథములందున్నది విశ్వనాథవారొకప్రసంగమున' సుధాసాగర' రచయిత 6 లక్షలధ్వనులున్నవని చెప్పినాడనిరి (చూ 'ధ్వని ప్రస్థానము', ఆకాశవాణి ప్రసంగము, సుబ్బరామశాస్త్రి (సం) (1970)

120 See Ferguson, Diglossia in Dell Hymes (ed) 'Language in Culture and Society, pp 429–39 (1964)

121 చూ ఆర్. వి. ఎస్ సుందరం జానపదసాహిత్యస్వరూపం', పుటలు 1-8, (1978)

122 Cf Alan Dundes, The Study of Folk-Lore pp 1-22 (1963)

123 గ్రామ్యము, వ్యావహారికములు భిన్నములు కావని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి అభిప్రాయము చూ జానపదకళాసంపద, ఉపోద్ఘాతము, పుట. (1977)

124 గతోస్తమర్కః భాతీందు ర్యాంతి వాసాయపక్షిణః
ఇత్యేవమాది కింకావ్యం వార్తామేనాం ప్రచక్షతే
(కా అ. 2-87)

125 పంతులక్ష్మీనారాయణశాస్త్రిగారి అనువాదము చూ ఆంధ్రధ్వన్యాలోకము సం 1 పుటలు 103-104.

126 అంచువలన ఆనందవర్ధనునికి సాంఘికస్థితిగతుల అవగాహనము 'బొత్తిగా' లేదని అర్థముకాదు. కళావ్యాపారము త్రైకాలిక మానవ మనస్తత్వ

ప్రతిబింబనము అందు సాంఘికాస్తిత్వము అంగభూతవిషయము కావున అనందువిధ్యేయము వాగ్వ్యాపారమునగల కళాసూత్రవ్యాఖ్యానము

Any work of art encompasses the past, present and future regardless of whether it is dedicated to the past, future or present This supra – historical character of a work of art is conditioned by the specifics of art as an artistic and objetive relationship (Q from K Dolgov Artistic Creativity and Lenin s Theory of Reflection, pp 30-40, 1976)

127 'కావ్యభాష, శిల్పభాష, వాడుకభాష, వెడుకభాష. ఈరెండు భాషలు కలియుట ఎప్పుడు జరుగదు కాని వాడుకభాషలోనున్న సర్వశబ్దములు గ్రాంథిక భాషలోనుండును మరియు కొన్ని నిఘంటు శబ్దములుండును శబ్దములు భాషకాదు వాక్యరూపమున వచ్చునప్పటికి భాషయందొక్కొక్కప్పుడొక శబ్దమే వాక్యార్థబోధకమై వాక్యముగాభాసించును శబ్దములు వాక్యదశకువచ్చినప్పటికి వాక్యగత బహుశబ్దములు భిన్నభిన్నస్థానములుపొంది భిన్నభిన్నార్థములు భాసింప జేయునప్పటికి కావ్యభాషప్రారంభించు చున్నది. మనము లోకమునందు శబ్దము వాడుటకంటె గావ్యమునందు ప్రయోజనాధిక్యాపేక్షచేతవాడుదుము, అందులోని తొలుతటి ప్రయోజనము పాఠకునిమనస్సునుదాత్తవీధులయందు సంచరింపచేసి వానికొక యుత్కృష్టమైన మహార్థము భాసింపజేయుటకో, రసవీధులయందు సంచరింపజేయుటకో చేయుదుము'- ఇది కావ్యప్రయోజనము' (ఆంధ్రసాహిత్య పరిషత్ పత్రిక సం 45 'బ్రాహ్మీమయమూర్తి' పుటలు, 189-192 1976, ల నుండి యుద్ధృతము)

128 తుమ్మపూడి కోటీశ్వరరావుగారి సూత్రీకరణమిది చూ భామహుడు - వక్రతాసిద్ధాంతము' ఎస్ వి. యు ఓ జర్నల్, పుట 20 (1 70).

129 'Feeling cannot be communicated through a propositional statement' – S P p 119

130 చూ భారతిము - ఛందఃశిల్పము (పూర్వోదాహృతము)

131 తమర్థమవలంబంతే యేఒంగినః తే గుణాః స్మృతాః
అంగాశ్రితాస్త్వలంకారాః మంతవ్యాః కటకాదివత్
(ధ్వ ఆ 2-6) చూ (అదే id 3-5)

132 శరీరకరణం యేషాం వాచ్యత్వేన వ్యవస్థితమ్
తేఒలంకారాః పరాంఛాయాంయాంతి ధ్వన్యంగతాంగతాః
(అదే 2-28) మరియు చూ (2-29 & 30)

133 సంఘటన (texture or composition) అసమాస, మధ్యమ సమాస, దీర్ఘసమాస భేదములన్ త్రివిధము అది మాధుర్యాదిగుణముల నాశ్రయించి రసవ్యంజకమగును తన్నియామకమగునంశము వక్తృవాచ్యగతౌచిత్యము (ధ్వ ఆ 2-7 & 6) దీనికుపపోషకముగ శృంగారము దీర్ఘసమాసకముకావచ్చు నని లక్ష్యపూర్వకమగు హేతువుప్రదర్శించి విషయ నియమములేదనినాడు చూ ధ్వ ఆ 2-6.)

134 తస్మాన్నసంఘటనాస్వరూపాః, నచసంఘటనాశ్రయాగుణాః
(అదే 3-5 వృత్తిలో)

135 'ననుయది సంఘటనాగుణానాం నాశ్రయస్తత్కిమాలంబనా ఏతే పరికల్ప్యంతామ్ ఉచ్యతే ప్రతిపాదితమేవైషామాలంబనమ్' (ధ్వ ఆ 2 6) (అదే వృత్తిలో) గుణముశబ్దాశ్రయ (శబ్దధర్మ) మనుటలోని ఔపచారత్వ లక్షణమునిట్లు తెల్పిరసాశ్రయమని నిరూపించినాడు.

'గుణాస్తువ్యంగ్య విశేషావభాసివాచ్య ప్రతిపాదన సమర్థశబ్ద ధర్మాఏవ న్యాయ్యసంఘంటితాః శబ్దా అర్థవిశేషప్రపాద్య రసాద్యాశ్రితానాం గుణానామవాచత్వాదాశ్రయాభవంతి నైవంవర్ణపదవ్యంగ్యత్వస్య రసాదీనాం ప్రతిపాదితత్వాత్
(అదే వృత్తిలో)

136 శాస్త్రీయముగ ఈభేదములను లిఖిత ఆశుసాహిత్యభేదములుగ విశ్లేషించుటలో వెల్చేరు నారాయణరావుగారు విలక్షణత ను కనబరచిరి మౌఖిక ప్రచారములోనుండిన పురాణఎరన జానపదగేయ నృత్యప్రదర్శనములందు గల ఈప్రత్యక్షానుభవమునుగూర్చి వారు వ్రాయుయున్నారు చూ తెలుగులో కవితా విప్లవాలస్వరూపం' పుటలు, 1-50 ముఖ్యంగా పుటలు 25-38, (1977)

137 See Poger Fowler 'Linguistics and Novel, pp 68 69 (1977)

138 ఇది బ్రాహ్మణ శ్రమణన్యాయమని లోచనము పుట, 51

139 చూ ఖాశిపాళ శ్రీరామమూర్తిగారు 'నిర్మాణమార్మికత' (విశ్వశ్రీ పుటలు 76-80, 1954) అన్నవ్యాసమున ఇట్టి అభిప్రాయమును ధ్వని సిద్ధాంత పరముగ వ్యక్తముజేసిరి పేరాలవారికిని ఇట్టి అభిప్రాయమున్నది. చూ. ఆంధ్ర ధ్వన్యాలోకము పుట, 667

140 చూ కృష్ణమూర్తి ధ్వన్యాలోక' (ఆంగ్లప్రతులు ఉపోద్ఘాతము లలో 1955, 1974)

141 చూ. స్టాల్ మాటలు (వ్యం. సూ పుటలు 8 9) శ్రీపంతులవారును లోచనానువాదమున దీనిని పాటించిరి చూ సం 1 పుటలు 191-194

142 కుంజున్నిరాజాగారి దృష్టి ఈవైయాకరణమార్గమునకే పరిమితము చూ ఐ టి ఎం పుట 278

143 Unlike the Vedic systems, this school of thought (Pratyabhijna) knows no caste restriction, as Q in 'Iswara Pratyabhijna vimarsini 2-276, Cf K C Pandey 'Abhinava Gupta', p 297 (1963)

144 'తదుత్తీర్ణత్వేతుసర్వపరమేశ్వరాద్వయం బ్రహ్మేత్యస్మచ్ఛాస్త్రానుసారేణ విదితం తంత్రాలోకగ్రంథం విచారయ' అని పాఠాంతరముగా చూ పాండే అభినవగుప్త పుట 39

145 అభినవభారతీ లోచన సారాంశమగు నీవిషయముపై చర్చకు See S P Bhattacharya Corner stones of Rasa Ideology and The Saiva Darsana of Kashmir, pp 50-53 (1964)

146 చైతన్యము = universal consciousness చిత్తము = individual consciousness అని జయదేవ్‌సింగ్‌గారి అనువాదము వాచ్య ప్రతీయమానములు రెండును ఆత్మలని ఆలోకము ప్రతిపాదించుటలోని రహస్యమింమిగలదు చూ ప్రత్యభిజ్ఞాహృదయము (ఆంగ్లప్రతి) పుట 62 (1977)

147 Cf S P Bhattacharya op cit p 53

148 భాస్కరకంఠునిదిగా ప్రత్యభిజ్ఞాహృదయ మున నుదహృతము శివశంకర అవస్థి (సం) వాందీప్రతి పుట, 2 (1970)

149 Prati + abhi + jna = Pratyabhijna Prati means Pratiipam, i e contrary in other words though known now appearing as forgotten through delusion Abhi means 'facing i e, close at hand 'Jna means illumination or knowledge So Pratyabhijna means recognition of the real self — Q from Jayadevsingh op cit p 117 (1977)

150 చూ పైన అ సూ 146

151 Linguistic theory is a metatheory dealing with the properties of linguistic descriptions of natural languages In particular linguistic theory is concerned with whatever such descriptions have in common with universals of linguistic description

— The structure of language, p 19 (1964)

152. Cf Gonda J 'The Vision of the Vedic Poets p 182 (1963)

153 Cf S P op cit p 253

154 ibid p 134

155 చూ వ్యం. సూ 1 6. 1, పుట, 72 (మారినొవ్స్కీ మాటలు)

156. చూ బహ్మానంద శిశువాక్కు - లక్షణావృత్తి' (1981)

157 న్వలక్షణమిప, ప్రగీతానామ్ అనుపాఠాంతరములున్నవి (చూ కృష్ణమూర్తి, పుట 1, 1974 ప్రతి) అభినవులు 'ప్రగీత పాఠము నంగీకరించిరి విద్యాప్రారంభదశలో ఉన్నవారని లోచన తాత్పర్యము 'ప్రకృష్టంగీతం-గానం యేషాంతే ప్రగీతాః, గాతుంవా ప్రారబ్ధా ఇత్యాదికర్మణీక్తః, ప్రారంభేణ చాత్రఫలపర్యంతాలక్ష్యతే సప్తస్వరములను 22 శ్రుతులను, ఆదిశబ్దముక్రింద జాత్యంశ, గ్రామ, రాగ, భాషా, విభాషా, అంతరభాషా దేశిమార్గములను లోచనము పేర్కొన్నది వాక్యనిర్మాణము నాధారముగా అప్రగీత పాఠమును కృష్ణమూర్తి సమర్థించినాదు (చూ పుటలు 317 18 1974 ప్రతి అనుబంధము)

158 కె ఆనందకుమారస్వామిగారు 'రాగమాల' అను అధ్యాయమున రాగశబ్దమును గూర్చి ఉపన్యసించియున్నారు రాగములేకాక రాగిణులు గలవనియు ప్రతిరాగము నిర్దిష్టమగు భావము (sentiment) కల్గినదనియు, రాగము పాడుటకు కాలనియమము గలదనియు రాగనామము లన్వర్థములనియు నిరూపించియున్నారు గీతగోవిందమును రాగిణులందు పాడుదురని భైరవి శివార్చనమున, ఖంబావతి బ్రహ్మార్చనమున, హిందోళ రాధాకృష్ణప్రణయకథనమున, ప్రశస్తములనివారు చెప్పియున్నారు (Cf Rajput Painting ch 6, Ragamalas pp 65 68 (1975ed )

వీరే మరియొకచోట సంగీతమున శ్రుతికి గల తాత్త్వికార్థమును వివరించి భారతీయ సంగీతము యోగమని నిరూపించియున్నారు (Cf Dance of Siva ch Indian Music p 76 (1956) కాశ్మీర తాంత్రికాద్వైత మున సంగీతమునకు గల ప్రాముఖ్యముపై Cf K C Pandey comparative Aesthetics, ch Art of Music pp 516–78 (1959)

159 స్వరశ్రుత్యాది లక్షణమునుగూర్చిన విశేషప్రసంగమునకు చూ లోచనము, పుటలు 94-93 అభినవులు వైణికుడని ప్రసిద్ధము (చూ పాండే అభినవగుప్త పుట 1)

160 'ద్వివిధో విషయః శబ్దానామ్ - అనుమేయః ప్రతిపాద్యశ్చ తత్రానుమేయో వివక్షాలక్షణః - వివక్షచ శబ్దస్వరూప ప్రకాశనేచ్ఛా శబ్దేనార్థ ప్రకాశ నేచ్ఛేతి ద్విప్రకారాః తత్రాద్యానశబ్దవ్యవహారాంగం ప్రతిపాద్యస్తు ప్రయోక్తురర్థ ప్రతిపాదన సమీహావిషయీకృతోఽర్థః సచద్వివిధః - వాచ్యో వ్యంగ్యశ్చ (ధ్వ ఆ 3-33 క్రింద పుట. 149) చూ కృష్ణచైతన్య S P pp 134 139 & 141

161 రసాద్యనుగుణత్వేన - వ్యవహారోర్థశబ్దయోః
ఔచిత్యవాన్యస్తాఏతా - వృత్తయోవివిధాఃస్మృతాః
(ధ్వ ఆ 3 33)

162. ఒక వస్తువుతో కలిసియుండుట - వేరుగా ఉండకపోవుటయని యర్థము

163 తతోఽన్యస్యాపి - అని పాఠాంతరము చూ. వా ప తెలుగు అకాడెమీ ప్రతి, పుట 304 (అధస్సూచిక) 1974 మరియు చూ కృష్ణమూర్తిగారి ధ్వన్యాలోక ప్రతి (ఆంగ్లము) పుట 377, (1974).

164. వివక్షితావివక్షితార్థ నిరూపణమునకు కారకహేతువు సయుక్తము చూపబడినది చూ వా ప. 2-300 & 301.

165 Cf Krishnamoorthy Dhvanyaaloka pp 376-77(1974)

166 The metaphor identifies the two factors of suggestion as the suggester and the suggested The lamp is the stated meaning (vaacyaartha) the jar is the suggested meaning (vyangyaartha) which it illuminates and reveals — The jar was already there, the lamp only revealed it

(Krishna Rayan, 'Suggestion and Statement in Poetry' pp 52-58, 1972)

167 Krishnamoorthy opcit (f n 165 above) 'ఘటము నందుంచబడిన' అను అర్థమును భావించుట నైయాయికమార్గమని, G A Jacob ఇట్టిదృష్టితో' The simile of a lighted lamp inside a vessel' అని అనువదించిరని కృష్ణమూర్తి చెప్పుచున్నారు కృష్ణమూర్తి, కృష్ణరాయన్ గార్లు ఘటమును వ్యక్తము సేయుచున్న అను అర్థమునే సమ్మతించిరి Cf G A Jacob, Laukika Nyaayaanjali P II p 26, (1909)

168 తద్వత్సచేతసాం సోఽర్థోవాచ్యార్థ విముఖాత్మనామ్
బుద్ధౌ తత్త్వార్థదర్శిన్యాం ఝటిత్యేవావభాసతే
(ధ్వ అ 1-12, పుట 102)

169 ఇది లక్ష్మీనారాయణామాత్యుల అనువాదము (వావిళ్ళప్రతి.)

170 'Existence is all-pervading Therefore, the pot was also always permeated by Existence But the existence' of the pot was lying veiled behind my ignorance of it when

the intelligeuce in me, passing through the sense organs reaches the place of the pot (ghata desa), it only removes the ignorance that veiled it

— Chinmayananda, Hymn To Dakshinamurti, p 67 (1972)

ఇది జ్ఞానాజ్ఞాన వివేకదృష్టి కాని శివ ద్వయము కర్తృగ్రహణతాదృష్టులతో సంవిత్తత్త్వమును పరిశీలించును. మొదటిది కేవలభావప్రధానము. రెండవది మిధ్యారవాత భావాభాసము (Reflection of Reality) ను సూత్రముగా కలిగినది,

నిదర్శనము

అస్థాస్యదేకరూపేణ వపుషాచేన్మహేశ్వరః
మహేశ్వరత్వం సంవిత్త్వం తదత్యక్షద్ ఘటాదివత్
(తంత్రాలోకమ్ 3-100)

'If the Highest Reality did not manifest in infinite variety but remained cooped up within its solid singleness it would neither be the Highest Power nor Consciousness but something like a jar – Tr Jayadev Singh, p 6, (1977)

171 Cf op cit p, 96 & f n 115 p, 130

172. చూ. జి వి కృష్ణారావు స్వప్నశిల్పము-ధ్వని 'నవ్యతోరణం లో' పుటలు 87-89 (1971)

173 అదేవ్యాసము స్వప్నార్థములలోగల క్లుప్తీకరణ మిలితీకరణ, సంకేతీకరణ, వ్యత్యయీకరణ, విపర్యయీకరణములను ధ్వన్యర్థ విభాగములతో సమన్వయించుటకొక ప్రయత్నమిందు కనిపించును పుటలు 87-96, (1971).

174 As Freud s impression Q in On Creative Thinking in 'Creativity and Intelligence, Getzals and Jackson p 77 (1962)

175 Cf Agahenanda Bharati The Tantric Tradition (1970)

176 Cf f n 174 above

177 'Primordial vision is the symbolic expression – the expression of something existent in its own right, but imperfectly known – 'C G, Jung,' Modern Man in Search of a Soul p 187 (1933)

178 (a) 'A statement may be used for the sake of the reference, true or false which it causes–This is the scientific use of language But it may be used for the sake of the effects in emotion and attitude produced by the reference it occasions This is the emotive use of language I A Richards 'Principles of Literary Criticism, p 211 (1970 ed)

(b) The real danger of dictionary meaning is that it so easily prevents us from perceiving the limitations of our understanding — In addition to directing a fairly precise thought, most language simultaneously endeavours to excite some refinement of feeling' (Q f I A Richards 'Practical Criticism p 327, cf Part III, ch 1 'The four Kinds of Meaning (pp 179–188 – 1970 ed)

179 'పరిశీలకుడు అనగా ఇక్కడ భాషాశాస్త్రజ్ఞుడనియర్థముకాదు ప్రథమ పురుషలోని వ్యక్తి అని అర్థము వాగ్వ్యవహారమెప్పుడును మధ్యమోత్తమ పురుషలనడుమ నుండును. అనుభవమువీరియువురికి సంబంధించినది ప్రథమపురుషలోని వ్యక్తి పరిశీలించుటకు పైనచూపబడిన మౌనాదిప్రమాణముల మూలమున విద్యమానమగుచున్న అర్థాంతరము దోహదముచేయును.

180. తాత్పర్యము బోధారూపమనుట పూర్వనిరూపితము చూ వ్యం సూ. 2-5

181 'If poetry has favoured the way of the ear and has given itself zealously to the tuneful ordering of sounds it is because, sense was conveyed by sound before words were invented and this primitive power still survives in life aswell as in letters' — Raleigh Style p 9 (1898) Cf S P p 137

182 Cf R A Gnoli (1968) pp XLVIII — XLIX

183. భావద్యోతకములనుటను For the free expression of thought and feeling అనువాక్యమున సంభావించుటకు వీలున్నదా: ధ్వాన్యా- మాటలందవి ప్రశ్నములు - ఎట్లు ద్యోతకములని॰ అనగా ద్యోతకములనుటలో సందేహములేదని అర్థము ఎట్లను ప్రశ్న శబ్దార్థసంబంధ యాదృచ్ఛికతకు, భావద్యోతనత్వమునకు నడుమగల బాహ్యవై రుధ్యమునుండి పుట్టు సందిగ్ధతకు నిదర్శనము.

184 What the artist aims at is to awaken in us the same mental constellation as that which in him produced the impetus to create – as of Freud in Modes of Michael Angelo Cf L S Vigotsky Thought and speech , p 203 (1966ed)

185 తేనశబ్దార్థచింతాసు నసావస్థా నయః శివః
(స్పందకారిక నిష్యంద II VV 34)

చితిరేవచేతన పదాదవరూఢాచేత్య సంకోచినీచిత్తమ్
(ప్రత్యభిజ్ఞాహృదయమ్, జయదేవ్‌సింగ్ (సం) చూ పుటలు, 58 & 59)

186 కృష్ణనై తన్య ఈప్రస్థానద్వయమునే General Theory & Special Theory అని విభజించిరి Cf S P p 119

187 వాగ్ధేనుదుగ్ధ ఎతంహిరసంయద్ బాలతృష్ణయా' - అనుభట్టు నాయక మతమును లోచనముదాహరించినది. ఆగోవు ప్రతిభారూపయగు పరా నాగ్ధేనువన్ని వాక్కునకిచట స్వయంకర్తృత్వాపాదనము గర్భితమని బాలప్రియ వివరణము చెప్పినది (లో పుట 92)

188 వర్ణవ్యంజకతకు రసాభివ్యక్తిలో ఉన్న నియమములనుగూర్చి లోచనము స్పష్టపరచినది 'తేనవర్ణానామంశ్రుతిసమయోపలక్ష్యమాణార్థాన పేక్ష్యం శ్రోత్రైకగ్రాహ్యో మృదుపరుషాత్మా స్వభావోంసాస్వాదే సహకార్యేవ నతువర్ణైవరసాభివ్యక్తిః. విభావాదిసంయోగాద్ధిరసనిష్పత్తిరిత్యుక్తంబహుశః
(చూ. లో 3-3 & 4 క్రింద)

189. సోక్రటీసుప్లాటోలకన్నను భిన్నమగు చిన్నియంశమిచట యొక టున్నది అది ఆనందుడు అన్వయవ్యతిరేకముఖ తర్కము నాశ్రయించి వర్ణాదుల వ్యంజకతను నిరూపించియుండుట భావము అన్వయవ్యతిరేక తర్కములకు లొంగునదికాదు అర్థముకంటె భావమివిషయమున వెరగుచున్నది దీనిపై చర్చకు చూ బ్రహ్మానంద 'ఆలంకారకుల వాక్తత్త్వదర్శనం' ఆం ప ఉ సం పుటలు 44 56 (1981)

190 ఆనందవర్ధనుడు శబ్దార్థశక్త్యుద్భవములగు ధ్వని ప్రభేదములను సంలక్ష్యక్రమములుగా చర్చించియున్నాడు (చూ ధ్వ ఆ 2-22, 23) ఒక శబ్దమునుగాని అర్థమునుగాని విన్నపుడేవిశేషమును భాసించకపోవచ్చు కాని ఆ శబ్ద / అర్థములు భిన్నవాక్యములనడుమ ప్రయుక్తమై శ్రోతృహృదయమున అనుస్వాన (resonance) రూపప్రభావమునుజూపును ఇది స్వతస్సంభవి వ్యభి చారీభావాదులు ప్రబంధదశయందసంలక్ష్యక్రమ వ్యంగములైనను వాక్యదశయందు సంలక్ష్యరూపములే కావున శబ్దార్థశక్త్యులకు సంబంధించిన మీమాంసవాక్యదశకే పరిమితము ఆనందుడు కవి ప్రౌఢోక్తిని, కవినిబద్ధవక్తృప్రౌఢోక్తిని ఆధార

ముగా ఈచర్చచేసియున్నాడు For detals, See Krishnamoorthy Indian Poetics and T S, Eliot s Three Voices of Poetry , H Y J M U XV-1 pp 15-18 (1954)

191 ఇట్టిపరిశోధనములందు 'కమ్యూనికేషన్' అంతయు సామగ్రియే యగును Control'able data అను శాస్త్రనియమము నిచ్చట ఈయర్థముననే చూడదగును, ఇన్ని భాషాశాస్త్రసంప్రదాయములను భాషానిర్మాణ నిర్ధారణమునకే అసమర్థములగుచున్నవి అందులకే 'అనుభవ' ప్రమాణమును, 'వాగ్' దశను ఆనందుడు గ్రహించుట, కావ్యమునాధారముగధ్వనిగతమగు వ్యంజనను నిరూపించుట అనగా జనుల సంఘము చరిత్ర, సంస్కృతి, భావనేపథ్యము వీనితోకూడిన వాగ్వ్యవహారమనిఅర్థము కేవలము వర్ణపదవాక్యములుకావు 'Since this is so then one ought rathar to compare art with speech, not with language (Dolgov op cit p 40 1976) సందర్భవశముగా 'speech వాక్కును అర్థమునవాడబడినది

192 సామాన్య వ్యవహారమునందువలె శ్రోతృప్రతిక్రియను పృథక్కరించుట కావ్యమునకుదరదు కావ్యధ్వని సముదాయమునుండి ఏకదేశమునకు పృథక్కరింపబడునది అనగా రసధ్వని ననుసరించి ఇతరములగు భేదప్రభేదములను నిరూపింపవలయునని అర్థము

193 ఈనాటిమనవలె, పదోచ్చారణములందుగల మాండలిక భేదములను కూడ ఆనందుడు గుర్తించియుండుట అత్యంతాసక్తికరవిషయము ప్రతి నియత భాషల (individual dialects) లో భిన్నోచ్చారణములందును అపుడుపు అర్థభేదములు కలుగుచుండును ఆనందవర్ధనుడు తానేవ్రాసిన ఒకప్రాకృత శ్లోకమునగల 'మహుమహు' (మధుమథ)అను ఉచ్చారణమునకు రెండుభిన్నమూల రూపములు గుర్తించినాడు ఈకారణమున శ్లేషసిద్ధించుచున్నది ఆయాప్రాంతములందాయాఅర్థములైయున్నవి వారివారి కాయా అనుభవము కల్గుచున్నది ఆశ్లోకమిది

'మహుమహు ఇతిభణంతహో వజ్జదికాలోజణస్స
తోణణదేవు జనర్దణుగో అరిభోదీమణస్స

(ధ్వ. ఆ 4-7 క్రింద)

సైంధవభాషలో ఈ ఉచ్చారణ భేదమున్నదని లోచనము (పుట 544) నాది నాది' యను నర్థమున 'మమ మమ', విష్ణువను నర్థమున 'మధుమథ అను సంస్కృత పదములు 'మహా మహా' అను ఉచ్చారణమునుకల్గి శ్లిష్టార్థకములగు చున్నవని ఆలోక పరిశీలన

194 'In the physical structure of body we find traces of earlier stages of evolution, and we may expect the human psyche also to conform in the make-up to the law of phylogeny C G Jung, 'Modern Man in Search of a Soul p 189 (933) భావవస్తువులనడుమ గతితార్కిక సంబంధమెట్టిది? ఇది మిక్కిలిక్లిష్టమగు సమస్య శివాద్వయమందలి 'ఆభాస ను Dolgov (op cit, 1976 ) ప్రతిపాదన మందలి'Reflection తో సమన్వయించుచు తుమ్మపూడికోటీశ్వరరావుగారిట్లన్నారు

'డాల్గోవ్‌వాదం ప్రకారం - పదార్థజన్యం భావం, హెగెల్ ప్రభృతులు భావప్రాధాన్యవాదలు ఈరెండూ కేవలవిరుద్ధధ్రువాలు డాల్గోవ్ - అంటే - లెనిన్ ప్రకారం - నీవు పొందేభావం జ్ఞానం పదార్థజన్యమే నీకు కొత్తగా తెలిసింది కాబట్టి ఇది నీ ఆలోచనాజన్యం. కాబట్టి భావమే ముందనటానికివీల్లేదు ఆభావంకూడా పూర్వమే పదార్థగతిద్వారా నీకభివ్యక్తమౌతున్నది కాబట్టి నీభావం పూర్వగతమే గుప్తపాదులమతంలో ఈరెంటికి వైరుధ్యంలేదు భావమే తత్త్వమే - ఘనీభూతమై పదార్థమవుతున్నది కాబట్టి సృష్టి తత్త్వస్వరూపమే దీని బహిరాకృతే అది .

— 'రష్యాసాహిత్య విమర్శమార్గం సంప్రదాయం', సాధన 15 5/6 పుట 55 (1981)

చూ క్రింద ఆ సూ 196.

195. వైయక్తికభావమునకు, కళానుభవమునకు నడుమగల భేదమునకు See Krishnamoorthy 'The Indian Theory of Dhvani and its parallels to the Western Literary Criticism pp 22-23 (1948)

196 పై అ సూ. 103 లో చూపినటుల శివాద్వయ మార్గమునందలి ప్రధానసూత్రము ప్రకాశవిమర్శాత్మకముగు 'సంవిత్ తత్త్వావిష్కరణమనుట మరువరానిది అదికేవలము జడభావముకాదు. జడచైతన్యమునుకాడు (యది నిర్విమర్శఃస్యాత్ అనీశ్వరోజడశ్చప్రసజ్యేత - పరాప్రావేశిక పుట 2) అది జ్ఞానరూపమైన క్రియాశీలశక్తి ఇవిరెండును విభక్తములుకావు ఇంచుకే K C Pandey మహాశయుడు

'There can be no self without consciousness nor can there be consciousness without self' – Comparative Aesthetics, Vol 1 Indian Aesthetics, p 102 (1959)

అని సూత్రప్రాయముగా సెలవిచ్చినారు అలంకార శాస్త్రపరిశీలనకు శాస్త్రీయమార్గ మిదియొక్కటియే అని వారి అభిప్రాయము - శబ్దార్థసాహిత్య మనగా నిదియే

అంచులకే వాక్కునీసంప్రదాయమునిట్లు ఒకచోనిర్వచించినారు

వక్తి విశ్వమభిలపతి ప్రత్యవమర్శనేన ఇతివాక్'

— భాస్కరీ, 1-253 చూ కె సి పాండే పుట 630 (1963)

197, 'The artist is the mouthpiece of the secrets of his time'

— C G Jung 'Psychogical Reflections p 182 (1945)

198 Tr V S Agrawala 'Vision in Long Darkness p 1 (1963) పూర్వేషామ్ అనిపా ఇట్లంగకరించువారు ధీరులు (The Wise) అనగా తత్త్వవేత్తలనియర్థము

— o —

# అనుబంధము 1.

## ధ్వన్యాలోక లోచన పూర్వాపరములు

I భారతదేశ భాషాశాస్త్రజ్ఞులు శబ్దార్థవిషయ మీమాంసచేసిన భారతీయ పరిశోధకులచరిత్ర ఇట స్థూలముగ సమీక్షింపబడును। ఇందుప్రస్తకనీయులు

1) వైయాకరణులు 2) మీమాంసకులు 3) నైయాయికులు
4) తాంత్రికులు[2] 5) ఆలంకారికులు

(1-3) వీరు విభాగజ్ఞులు (4-5) వీరుతత్త్వజ్ఞులు వైదికఋషి సంప్రదాయమున, సంహితా, బ్రాహ్మణ శిక్ష, ప్రాతిశాఖ్య, ఉపనిషత్తులందీ మార్గము లకు మూలములున్నవి[3] శంకర, భర్తృహరి, అభినవులవంటి దార్శనికులు వాక్తత్త్వప్రతిపాదకులు

1 వైయాకరణులు నిఘంటు నిరుక్తకారుడు పాణినికి పూర్వుడు పాణినికాలము క్రీ పూ 4వ శ సంస్కృతభాషానిర్మాణ విశ్లేషణము అష్టాధ్యాయి కాత్యాయనుడు (క్రీ పూ 300) వార్తికములు పతంజలి (క్రీ పూ 150) మహాభాష్యము భర్తృహరి (క్రీ శ 450) వాక్యపదీయము, మహాభాష్యవ్యాఖ్యానము కైయటుడు (క్రీ శ 1000) మహాభాష్యముపై ప్రదీపవ్యాఖ్యానము లఘు, పరమలఘుమంజూషలు నాగేశభట్టు (నాగోజీభట్టు) (క్రీ శ, 1670-1750), వైయాకరణ భూషణసారమును (స్ఫోటనిర్ణయమిందలిది) కొండభట్టు వ్రాసెను (క్రీ శ 1600) (నాగేశభట్టు 'స్ఫోటవాద మున పతంజలి యోగ సూత్రములందు స్ఫోటసమర్థనమున్నది శంకరుడు వ్రాసిన భాష్యమునందు స్ఫోటమీమాంసగలదు)

2. మీమాంసకులు: వేదమంత్రములను యాజ్ఞిక ప్రక్రియాముఖముగ వివరించుటకై జైమిని మీమాంసపూత్రములు (క్రీ. పూ. 300) వ్రాసెను దీనిపై శబరభాష్యము (క్రీ శ 200) వచ్చినది. కుమారిలభట్టు భాట్టమీమాంసక వర్గమునకు (క్రీ శ 6వ శ చివర), ప్రభాకరుడు ప్రాభాకరవర్గమునకు ప్రతినిధులు శబరభాష్యమును భిన్నముగ వ్యాఖ్యానించుకొనిరి. కుమారిలుడు శ్లోక, తంత్ర వార్తికములు వ్రాసినాడు ప్రభాకరుడు బృహతీవ్యాఖ్య' వ్రాసెను భాట్టులలో పార్థసారథిమిశ్రుడు (క్రీ శ,1050) శాస్త్రదీపిక' న్యాయరత్నమాలలు రచించెను సోమేశ్వరుడు (క్రీ శ, 1200) 'న్యాయసుధ' ను వ్రాసెను ప్రాభాకరులలో శాలికనాథుడు (క్రీ శ 700) ప్రకరణ పంచికను వాక్యార్థమాతృకావృత్తిని వ్రాసినాడు వాచస్పతి మిశ్రుడు 'తత్త్వబిందువును' (క్రీ శ. 850), నారాయణ భట్టు (క్రీ శ 1600) 'మానమేయోదయము' ను రచించెను.

అద్వైత వేదాంత శాఖీయులు భాట్టులననుసరించిరి మధుసూదన సరస్వతి 'అద్వైతసిద్ధి (క్రీ. శ 1600), ధర్మరాజాధ్వరి (క్రీ. శ. 1600) 'వేదాంత పరిభాష, మండనమిశ్రుని (క్రీ. శ 800) 'స్ఫోటసిద్ధి ప్రసిద్ధములు - ఇవి మీమాంసక బౌద్ధవాదములను ఖండించి స్ఫోటను సమర్థించినవి.

3 నైయాయికులు భారతీయ తర్కమంతయు గౌతమాక్షపాదుని (క్రీ శ 100) 'న్యాయసూత్రములతో ప్రారంభమయినది వాత్స్యాయనుడు (క్రీ. శ 300) దీనిపై 'న్యాయభాష్యము వ్రాసెను ఉద్ద్యోతకరుడు (క్రీ, శ 600) 'న్యాయవార్తికము' రచించెను వాచస్పతి మిశ్రుడు (క్రీ. శ 850) న్యాయవార్తిక తాత్పర్యటీకను వ్రాసెను. జయంతభట్టు (క్రీ.శ.1000) 'న్యాయమంజరి వ్రాసెను సమకాలికుడైన ఉదయనుడు 'న్యాయ కుసుమాంజలి' వ్రాసినాడు. బౌద్ధతార్కికులలో దిఙ్నాగుడు (క్రీ. శ 450) 'ప్రమాణసముచ్చయము'ను, ధర్మకీర్తి (క్రీ శ. 600) 'ప్రమాణవార్తికము'ను,

శాంతరక్షితుడు (క్రి శ 750) 'తత్త్వసంగ్రహమును, ఆతని శిష్యుడు కమల శీలుడు 'పంజిక' వ్యాఖ్యానమును వ్రాసెరి రత్నకీర్తి (క్రి శ 1000) వ్రాసిన 'అపోహసిద్ధి' బౌద్ధుల అపోహసిద్ధాంత గ్రంథము

నవ్యన్యాయ సంప్రదాయమునకు చెందిన గ్రంథములలో గంగేశోపాధ్యాయుడు (క్రి. శ 1200) వ్రాసిన 'తత్త్వచింతామణి' ముఖ్యము దీనిపై వ్యాఖ్య లున్నవి 'శబ్దశక్తిప్రకాశిక' ను జగదీశుడు వ్రాసెను (క్రి. శ 1700) గంగాధరుడు (క్రి శ. 1700) శక్తి, వ్యుత్పత్తివాదములనుగూర్చి వ్రాసినాడు విశ్వనాథ పంచాననుని (క్రి. శ 1600) 'సిద్ధాంతముక్తావళి అన్నంభట్టు(క్రి. శ. 1600) వ్రాసిన 'తర్కసంగ్రహము' పాఠ్యగ్రంథములు.

4 తాంత్రికులు కాశ్మీర శివాద్వయవాదుల త్రికదర్శనము ప్రసిద్ధము, ఇందు ఆగమ, స్పంద, ప్రత్యభిజ్ఞామార్గములుమూడుగలవు మాలినీవిజయాది తంత్రములు, 'శివసూత్రములు' వానిపై భాస్కరాదులవృత్తులు స్పందకారికలు, రామకంఠాదుల వృత్తులు ప్రధానముగా వాగభివ్యక్తి సిద్ధాంతములే. పుణ్యానందుని 'కామకలావిలాసము దీనాడా అక్షరతత్త్వవ్యాఖ్యానమే సోమానందు [8వ శ]ని 'శివదృష్టిపై ఉత్పలదేవుని ఈశ్వరప్రత్యభిజ్ఞ, అభినవుల ప్రత్యభిజ్ఞావిమర్శిని, వివృతివిమర్శిని, తంత్రాలోకము [12 వం] 'పరాత్రింశిక వివరణము' లు వాక్తత్త్వసిద్ధాంతములే, క్షేమరాజు [క్రి శ 1100] 'ప్రత్యభిజ్ఞాహృదయము ఈమార్గసారము

5. అలంకారికులు భరతుడు కాళిదాసుకు పూర్వుడు (క్రి.పూ 4వ శ) 'నాట్యశాస్త్రము' న నాట్యమునుగూర్చిన వాచిక, భాషాప్రభేదచర్చ విస్తారముగ కలదు. భామహుడు (క్రి. శ 600) 'కావ్యాలంకారము' న, దండి (క్రి శ 650 700) 'కావ్యదర్శము' న, వామనుడు (క్రి శ 800) 'కావ్యాలంకార

సూత్రవృత్తి' యందు, ఉద్భటుడు (క్రీ శ. 800) 'కావ్యాలంకార సారసంగ్రహము' నందు - ముఖ్యగౌణార్థ ప్రసంగములను వాచ్యవాచక దృష్టితో మొదలిడిరి. భర్తృహరి మతము నాధారముగ శైవసంప్రదాయమునగల వాక్తత్త్వదృష్టితో వ్యంజన వ్యాపారము పరిశోధించి, భరతుని రససూత్రముతో సమన్వయ పరచిన వాడు ఆనందవర్ధనుడు (క్రీ. శ 850) 'ధ్వన్యాలోక' రచయిత ఆలోకమును ఖండించిన మహిమభట్టు (1000 A D) 'వ్యక్తివివేకము' ను వ్రాసెను కుంతకుడు (1000 A D) 'వక్రోక్తి జీవితము' నందు ప్రత్యభిజ్ఞాస్పంద సిద్ధాంతములను శబ్దార్థస్పర్ధాసూత్రములుగా వృద్ధిచేసెను అభినవగుప్తపాదులు (1100 A D) ధ్వన్యాలోక 'లోచనము న 'నాట్యశాస్త్రాభినవభారతి' యందును, 'తంత్రాలోక' 'పరాత్రింశిక వివరణము లందును సాహితీ సూత్రములతో పాటు శబ్దార్థవ్యాపార పరిశీలనమును కూడ వ్యంజన - అభివ్యక్తి సిద్ధాంతములుగా స్థిర పరచినాడు ధనంజయుడు (976-96 A D) 'దశరూపకమున' న, భోజుడు (1000 A D) 'శృంగారప్రకాశము న, మమ్మటుడు (1050-1100 A D) కావ్యప్రకాశము' న, శబ్దవ్యాపారవిచారము' న, విశ్వనాథుడు (1300 A D) 'సాహిత్యదర్పణము న, విద్యానాథుడు (1300 A D) 'ప్రతాపరుద్రీయము'న శారదాతనయుడు (14 C A D) 'భావప్రకాశము'న విద్యాధరుడు (1350 A D) 'ఏకావలి యందును, అప్పయదీక్షితుడు (1500 A D,) 'కువలయానందము న, 'వృత్తివార్తికము న జగన్నాథుడు (1600 A D) 'రసగంగాధరము న, ఆనందాభినవుల మార్గములనే మార్గాంతరముల విమర్శించిరి సమర్థించిరి ఒక్క ధ్వన్యాలోకముననే అటు ప్రాచీనులు, ఇటు తరువాతివారు సమన్వయము పొందిరి (దేశీయముగజరిగిన భిన్నపరిశోధనలను- తొల్కాప్పియ, కవిరాజమార్గ కావ్యాలంకారసంగ్రహేత్యాది అలంకారగ్రంథములు, చింతామణ్యాది వ్యాకరణములు - పై ఐదు మార్గములలో ఏదో ఒకదానిని ఆధారముగ జరిగినవి).

## II ధ్వన్యాలోక ముద్రణము

1877 లో మొదట జి బ్యూలర్‌గారిచే ధ్వన్యాలోకము గుర్తింపబడి 1890 లో వారి సంపాదకత్వమున ప్రచురింపబడినది 1902 లో హెర్మన్‌జాకొబీ గారిచే జర్మను భాషలోని కనువదింపబడినది తరువాత ప్రొ రామఎషరోతి గారి ఆంగ్లానువాదము రెండుద్ద్యోతములకు మాత్రము జరిగినది 1935 లో వాసు దెవలక్ష్మణ్‌శాస్త్రి పన్‌షికర్‌గారి ఆంగ్లానువాదము రెండుద్ద్యోతములకు మాత్రము జరిగినది 1935 లో వాసుదేవలక్ష్మణ్‌శాస్త్రి పన్‌షికర్‌గారి ఆంగ్లానువాదము వచ్చినది కేరళలోని ప్రతులసాయమున రామశారకులు వ్రాసిన 'బాలప్రియ'తో కూడిన ధ్వన్యాలోక లోచనములు 1940 లో ముద్రితమైనవి పట్టాభిరామ శాస్త్రిగారు సంపాదకులు.

1944 లో మ మ కుప్పుస్వామిశాస్త్రి పరిశోధనసంస్థ (మద్రాసు) వారు ధ్వన్యాలోక లోచనములను ఉత్తుంగోదయుని (15వ శ) 'కౌముదీ (లోచనవాఖ్య) వ్యాఖ్యానము'తో ప్రచురించిరి శాస్త్రగా రుపలోచనము' వెలువరించిరి, ఇది మొదట ఉద్ద్యోతమునకు మాత్రము పరిమితము.

కె కృష్ణమూర్తిగారి ఆంగ్లనువాదము 1955 లో వచ్చినది (మరల 1974 లో ప్రచురింపబడినది)

ఆంగ్లటీకతో టి భట్టాచార్యగారు, హిందీటీకతో శ్రీరామసాగర్‌త్రిపాఠీ గారు ప్రచురించిరి శ్రీ జగన్నాథపాఠక్‌గారి హిందీ వ్యాఖ్యానము కూడ యున్నది (1965).

దేశమంతట (నేపాల్, బ్రిటన్‌లలోకూడ) లిఖిత పుస్తకభాండాగారము లందు శారద, గ్రంథ మలయాళ, తెలుగు, నేవారి కన్నడలిపులలో వ్రాత ప్రతులున్నవి

1973లో కె కుంజున్నిరాజాగారు ధ్వన్యాలోక సంగ్రహ మును ప్రకటించిరి ఇది మొదటి రెండుద్యోతములకు పరిమితము

III ఆంధ్ర ధ్వన్యాలోక ప్రతులు

తెలుగు దేశమున 20వ శతాబ్దమున ధ్వన్యాలోక రచనములను ప్రాచుర్యమునకు తెచ్చిన మనీషి కీ శే మ మ తాతాసుబ్బరాయశాస్త్రిగారు మొదటి సమగ్రాంధ్ర అనువాదము కీ శే పంతుల లక్ష్మినారాయణశాస్త్రిగారి ప్రభామతీ వ్యాఖ్యానయుతము (1934-44) ఇంకను నాల్గవ ఉద్యోతము ప్రచురింపబడలేదు అంతకుముందు అవ్వారి వాసుదేవశాస్త్రిగారు సూత్రములను మాత్రము పద్యములలో వ్రాసిరి బందరువారు ఒక ఉద్యోతమును మాత్రమే గద్యవ్యాఖ్యముగా వ్రాసిరి 4

1950లో వేదాల తిరువేంగళాచార్యులవారి ఆంధ్రానువాదము (సమగ్రము) ముద్రితమైనది

IV. ఆంధ్రసాహిత్యమున ధ్వనిసిద్ధాంత గ్రంథము

సంపూర్ణముగ ధ్వని సిద్ధాంతము ననువదించిన సాహిత్యశాస్త్ర గ్రంథములు తెలుగునలేవు ఒక్క కావ్యాలంకార సంగ్రహము (16వ శ.) న శబ్దార్థవ్యాపారములు, ధ్వని ప్రభేదములు చర్చింపబడినవి 20వ శతాబ్దముననే అనువాదములు మొదలైనవి (చూ అహోబల పండితీయము పుటలు 46-75 (1965)

V ధ్వని సిద్ధాంత పరిశోధన - ఆంధ్రులు

పై చూపిన అనువాద గ్రంథములుగాక ధ్వని సిద్ధాంతమునుగూర్చి ప్రత్యేకముగ జరిపినపరిశోధనలున్నవి జమ్ములమడక మాధవరామశర్మగారు నాట్యవేదము ధ్వనిసారము, కావ్యప్రకాశము, భావప్రకాశము ఏకావళిమున్నగు గ్రంథములను

అనువదించి అందుగల ధ్వనిసిద్ధాంత విశేషములను విశేషముగ ప్రపంచించి యున్నారు ౨ వ్యములకు ధ్వనిసిద్ధాంతమును సమన్వయించు పరిశోధనలలో రెండు వర్గములున్నవి విశ్వనాథ తమవిమర్శలందును, నవలాది సర్వప్రక్రియలందును రసధ్వని ప్రాధాన్యమును బహుధాప్రస్తుతించి యున్నారు వారి 'ప్రసన్న కథా కలితార్థయుక్తి', 'శాకుంతలముయొక్క అభిజ్ఞానతా' ఈ దృష్టితో వ్రాయబడిన విమర్శలు 5

## VI ధ్వన్యాలోక రచనాకాలము

ఆనందవర్ధనుడు అవంతివర్మచే సన్మానితుడు (855 83 A D) నృసింహ భక్తుడు దేవీశతక, విషమబాణలీల తత్త్వాలోకాది బహుగ్రంథకర్త ధ్వన్యాలోకము రచింపబడిన కాలము నిర్దిష్టముగా తెలియుటలేదు. లోచనకర్త అభినవుల చరిత్ర విస్తారముగ తెలియుచున్నది (కె ఎ పాండేగారి పరిశోధన మంతయు అభినవులకొఱకే వినియుక్తమైనది). ఇతడు కౌలగురువు మహామహేశ్వరాచార్యుడు ఇతని కాలము 11వ శతాబ్దము (1050 A D) అభినవులు దాదాపు 44 గ్రంథములు రచించెను తంత్రాలోకము, పరాత్రింశికావివరణము, లోచనము, అభినవ భారతి, భగవద్గీతా సంగ్రహము, ఈశ్వర ప్రత్యభిజ్ఞావిమర్శిని వివృతి విమర్శిని, దేవీస్తోత్ర వివరణము మున్నగునవి అందుకొన్ని

## VII ధ్వన్యాలోక నామాంతరములు

ముద్రిత ప్రతులలోతప్ప వ్రాతప్రతులలో ఎక్కడను 'ధ్వన్యాలోక' మనుపేరు కనిపించుటలేదని కె కృష్ణమూర్తిగారి పరిశీలనము వారుగుర్తించిన నామాంతరములు కావ్యాలోకము, 2 సహృదయాలోకము, 3 సహృదయహృదయాలోకము, 4. సహృదయావలోకము, 5 ధ్వన్యాలోకము (కె కుంజున్నిరాజాగారి ధ్వన్యాలోక సంగ్రహము ప్రచురింపబడిన తరువాత), 6 ధ్వని 7 ధ్వనిశాస్త్రము బాలప్రియలో 'ధ్వని సంకేత' మని పిలువబడినది

## VIII ధ్వన్యాలోక కారికలు - వృత్తులు

ధ్వన్యాలోకమున 4 ఉద్యోతములున్నవి. ప్రథమోద్యోతమున 19, రెండవ యుద్యోతమున 33 మూడవ యుద్యోతమున 47 నాల్గవ యుద్యోతమున 17 కారికలున్నవి [మొత్తము 116] ప్రతికారికకువృత్తి అందుసంక్షేప పరికర శ్లోకములున్నవి. కారికలు ఛందోబద్ధములు వృత్తివచనమునమున్నది కారికను ధ్వని అని వృత్తిని ఆలోకమని ఆనందవర్ధనుడు వృత్తికారుడు మాత్రమే యనెడు కర్తృద్వయ వాదమపాస్తపూర్వ విషయము 6 ఆలోకమున కాళిదాస బాణ పుండరీక భట్టోద్భట భామహ మనోరథ సర్వసేన శాతివాహన ధర్మకీర్తిప్రభృత కవి పండితాలంకారికులుదాహరింపబడిరి

## IX ప్రసిద్ధధ్వనిమార్గ పండితులు

ధ్వని సిద్ధాంతగత 'వ్యంజన' మార్గావిష్కరణమునకు బాటలువేసిన పండితులలో ప్రాతఃస్మరణీయులు John Brough K C Pandey K Kunjunni Raja మున్నగువారు వీరిలో కాశ్మీర శివాద్వయనేపథ్యమును గూర్చి వ్రాసినవారు పాండేగారుమాత్రమే ఈసిద్ధాంత వార్తిసమునకు ప్రాణమిచ్చినట్టిదే ఇంకను ఈమార్గ వైదికచ్ఛాయలనుగూర్చి John Woodroffe వ్రాసిన అంశములున్నవి వివరములకు See Brahmananda Vaag Darsana (1981)

— ౦ —

# అనుబంధము 2

## ద్రావిడ ధ్వని సిద్ధాంతచ్ఛాయ

తమిళమున ఆదిగ్రంథము 'తొల్‌కాప్పియం' కర్త 'తొల్‌కాప్పియర్' అందు మూడధికారములు మూడవది 'పొరుళతికారం' అందు శబ్దార్థసంబంధ మీమాంసగలదు అహత్తిణై అను విభాగము క్రింద ధ్వని' సిద్ధాంతముతో పోల్చదగిన చర్చయున్నది ఆలోకముతో పోల్చదగినది కాకపోయినను - ఇందు పంచవిధములగు ప్రతీయమానార్థభేదములు గుర్తింపబడియుండుట వలన పరిశీలనీయము. తరువాతి వ్యాఖ్యాతలందీ భేదములను గుర్తించుటలో భిన్నాభిప్రాయము లున్నవి. తొల్‌కాప్పియం గ్రంథము నాంగ్లములోని కనువదించిన పి యస్ సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పరిశీలనము ననుసరించి 'ఉడనురై - వస్తుధ్వని, ఉవమం- ఉపమాధ్వని, శుట్టు - అర్థాంతరన్యాసధ్వని, నహై - భావధ్వని', గా తెలియు చున్నది.[1] (పుట 132)

తొల్‌కాప్పియకారుడు అలంకార ప్రభేదముగా ధ్వనినిగూర్చి ఆలోచించి నాడు ఉపమాలంకారమునందు ఉవమై, ఉళ్ళురై అను రెండు భేదములు గుర్తించినాడు, ఇతని దృష్టిలో మొదటిది అలంకారముకాగా రెండవది అన్యార్థ ప్రతీతికి సంబంధించినది కావుననే 'ఉళ్ళురై'ని మరల విశ్లేషించి 'ఇఱైచ్చి' అను భేదమును గుర్తించినాడు కేవలము శృంగారేతివృత్తములందు మాత్రమే ఈ అన్యార్థప్రతీతి గుర్తింపబడియుండుట ఇతని పరిశీలనమున విలక్షణము

తొల్‌కాప్పియం నందుగల పంచవిధములివి

1 ఉడనుఱై, 2 ఉవమం, 3 శుట్టు, 4 నహై, 5 శిరప్పు

ఇవి క్రమముగా పరిశీలింపబడుచున్నవి

1 ఉదనుత్తై ఒక భావము వ్యక్తమగుచు తత్సంబంధిత భావాన్యము గమ్యమగుట ఒకతోటయందు పొన్నచెట్టున్నది నాయికతల్లి పెంచినదది చెట్టుక్రింద నాయికానాయకులు కలిసికొందురు నాయకుడు పెండ్లిని వాయిదా వేయుచున్నాడు నాయిక ప్రియునితో ఇట్లుచెప్పెను

నా చెల్లెలువలె నున్న ఈచెట్టుముందు నిలబడుటకు నాకుసిగ్గుగానున్నది'

(తొందరగా వివాహమాడవలెనని తాత్పర్యము కేవలము విషయము ఇట వ్యంగ్యము)

2 ఉపమం / ఉపమాపోల్చి, ఇది ఐదురకములు - క్రియా, ప్రభావ, భావ, గుణ, అభిజాత్య భేదముల ననుసరించి

2 1 క్రియ వేశ్యాసంగతినుండి అప్పుడే తిరిగివచ్చిన నాయకునితో నాయిక యిట్లనును

'చెఱకుగడలు పెంచదగిన తోటలోని కలువలతో రమించు మొనగాడా! ప్రసవవాసనతోడి నన్ను కౌగిలించుకొనకుము గంధపుపూతతో అందగించిన నీమేని సువాసనవ్యర్థమగును' (ఇక్కడ కలువలు వేశ్యలు వారితేనె సులభ గ్రాహ్యము ఇది వేశ్యాసంగతి నాయిక చెఱకు తోట అపంటపండినది అది ప్రసవవాసన గృహిణీధర్మము )

2 2 ప్రభావము 'చెఱకుగడలనడుమ పెరిగెడి 'వేలా' పుష్పములు చూచి ఆనందించు ప్రియుడా? నేను నీదుష్ప్రవర్తన సహింతును కాని చూడుము - నాబాహువులలసిపోయినవి (వేలాపుష్పములు - వేశ్యలు)

2 3 భాగములు నాయిక తనను 'వేంగై' చెట్టుతో పోల్చుకొనును. ఆచెట్టు విరిగి నేలపడుదశలో ఒక పూవు పూసినదని వర్ణించును

(బంధువులు తమ వివాహము కాదు - కూడదనిరి ఇంతకాలము విరహము పరిస్థితి విషమించినది ఇప్పుడామెకొక ఆలోచన తట్టినది ప్రియునితో లేచి పోవలెనని ఆ ఆలోచన పువ్వు)

2. 4 గుణము. నాయికా గుణమును కవి వర్ణింపవలయును ఆమె శీతలత్వమును (శైత్యోపచారములా ) కవి ఇట్లు వర్ణించును

శీతల జలమయ సరస్సున నాయిక స్నానమాచరించినది

2 5. అభిజాత్యము నాయిక తన అభిజాత్యములోని ఔన్నత్యమును ప్రదర్శించుకొనుటకు వేశ్యను చిరుచేప తో తన భర్తను దానిని భక్షించు క్షుద్ర జంతువు (otter అని ఆంగ్లానువాదము) తో పోల్చును

3 ఇట్టు వక్త్రభిప్రాయము చేష్టాదికము ద్వారమున వ్యక్తమగుట

(నాయిక తన కంఠహారమును, చిక్కిపోయిన తన బాహువులను, చిగురు పాదములను చూచుకొనునట్లు వర్ణన )

కష్టపడినచో హారము నేలబడునని అవయవములు కష్టమున కోర్చవని - తాత్పర్యము

4 నహై భావమభివ్యక్తమగుట [ఇక్కడను చేష్టాదికమే)

'నేనామెను చూచుచుండగా ఆమె నవ్వుచున్నది ఆమెకు నాపైన అనురాగమున్నదా అన్నట్లు ఆమె నగవున అందమున్నది'.

5 శిరప్పు ఉపమలుప్తమై పైచెప్పబడిన ఉవమాపోలి ప్రధానమైనచో ఆది శిరప్పు.

తొల్కాప్పియ వాఖ్యాతలలో ప్రధానులుముగ్గురు అందరును 11వ శ. తరువాతి వారే తొల్కాప్పియర్ భావములనుసమగ్రముగా అందించిన వ్యాఖ్యానములేదు 2

తొల్కాప్పియం నాట్యశాస్త్రముకన్నను ముందుటిదని తమిళపండితులు అభిప్రాయ పడుచున్నారు తొల్కాప్పియకారుని ఉపమాదృష్టిని ఆధారముగా ఇతని ప్రాచీన తను భామహానికన్నను ప్రాగ్దశలకు చెపఁటకు ఆలంకారికశాస్త్ర దృష్టితో వీలగుట లేదు ఒక్కవామనుడే ఉపమాప్రాధాన్యమును చెప్పినాడు (క్రీ శ 8వ శ) ఈదృష్టితో తొల్కాప్పియర్ శబ్దార్థపరిశీలన దృష్టి వాచ్యవాచకముఖముగనే సాగినదనుట స్పష్టము కాని వాచ్యార్థము నతిశయించిన అర్థప్రతీతిని అతడు గుర్తించియే 'ఉళ్ళురై' అను నామధేమఔడినాడు కావున సీమార్గము స్వతంత్ర పరిణామము.

ఉళ్ళు (ఒళ్ - లోపల) ఇది ద్రావిడ సగోత్రపదము 'లోన ఉన్నది' అని అర్థము 'ఉరై అనగా అర్థము, అనగా 'గర్భితార్థము కావలయును దీనినే ఆంగ్లమున 'కన్నొటేషన్' అనిరి (చూ డి ఇ. డి 557 600)

గర్భితార్థము కేవలము వస్తుమాత్రమైనపుడు 'ఉడనురై' అని వ్యవహరించినాడు, ఉడన్ (ఒడన్ - తోడన్) తోడుగ నుండునది అనిఅర్థము (చూ డి ఇ డి. 798)

అలంకారముచే అలంకారము ప్రతీయమానమగునపుడు 'అంతర్గతోపమ' ను ఆలంకారికులు గుర్తించినట్లు ఉవమాపోలి' ని అతడునుగుర్తించినాడు.

పోలి (పోలిక - అనుకరణము) (చూ డి ఇ డి. 3758)

భావము ప్రత్యక్షముగా నిర్దేశింపబడుచున్నప్పుడు శుట్టు అని పిలిచినాడు. చుట్టు (సూటి) (చూ డి ఇ డి 2167)

ప్మతాదులందు వ్యక్తమగు భావమును 'నహై' అనిఎలిచినాడు

(v h v < v-g-v < v-k-v)

v = vowel

నకు (నగు - నక్కు-) (చూ డి ఇ డి 2944) { k—> g—> h/v-v }

రెండర్థములందు ప్రధానమైనదానిని శిరప్పు' అని వ్యవహరించినాడు.

శిరప్పు 'వైభవము', ప్రాధాన్యము (చూ డి ఇ డి 2131)

తమిళ ధాతువును ఆధారముగ పరిశీలించుటలో ఒకదృష్టియున్నది. శబ్దమును శాస్త్రకారుడు పరిభాషగా మలుచుకొనును పై శబ్దములన్నియు ఈనాడును వ్యవహారమున నున్నవి కాని శాస్త్రమున అవి లక్ష్యార్థమున ప్రయుక్తములగుచున్నవి విమర్శకులకు సమస్యాజనకమైన అంశము - తొల్‌కాప్పియర్ ఉళ్ళురై అని ఒకచోట, 'ఇఱైచ్చి' అని మరొకచోట ఒకే అర్థమున ఎందుకువాడెనని రెండవదానియందు వక్త్రభావ ప్రతీతియున్నది మొదటిదానియందు కేవలవిషయప్రతీతి కావ్యమున అనుభవ ప్రాధాన్యమును అతడును గుర్తించెననుటకు ఇఱైచ్చి' ని మకుటాయమానముగా గుర్తించియుండుట నిదర్శనము ఇఱై అనగా 'సంభోగము సుకుమార భావోదయము అని అర్థము (చూ. డి ఇ డి 429) ఈదృష్టితో ఉళ్ళురై ' కేవల గర్భితార్థమును వివక్షించునదిగా తొల్‌కాప్పియర్ వాడెనని చెప్పవచ్చును.

ఈ ధ్వని సిద్ధాంతచ్ఛాయ దేశీయమని సంస్కృత ప్రభావజన్యముకాదని పండితులందరు ఆనందపడ్డనుడు. ఈగ్రంథమును చూచియుండినచో ఎంతయు

సుత్తేజితుడై యుండునని కొందరు వ్రాసిరి [3] కాని వ్యంగ్యవ్యంజక సంబంధమును కావ్యరసములనడుమ భావించి, వాచ్యవాచక సంబంధములను శబ్దార్థములనడుమ నిరసించిన ఆనందవర్ధనునికి ఈసిద్ధాంతముతో ప్రమేయములేదు కేవల శృంగార సంబంధిగా ధ్వనిని అతడు చూడలేదు అసంపూర్ణమైన దేశీయరచనములెన్నియో అలంకార శాస్త్రాభివృద్ధితో వెనుకబడినవి 11వ శతాబ్దివరకు తొల్కాప్పియర్ గ్రంథవ్యాఖ్యానము రాకపోవుట నిదర్శనము ఇట్లేకన్నడమున కవిరాజమార్గమున అలంకారచర్చలో భాగముగా అర్థాంతర ప్రతీతి గుర్తింపబడినది కావున పూర్వ నిరూపిత మార్గమున ఆలంకారికసిద్ధాంతము భరతమతముతోడనే ఆరంభమయిన దనుట తర్కసహము తొల్కాప్పియకారుని తాత్త్వికదృష్టి నిరూపింపబడు వరకు ఈమార్గమును స్వతంత్ర పరిణామముగ గ్రహించుటయే యుక్తము [4]

— ० —

# అనుబంధము 3

## వ్యవహారము వ్యంజన

వ్యవహారమనుమాట ఇక్కడ 'వార్త' అను అర్థమునగాక భిన్నసందర్భములను అర్థమున పరిశీలింపబడుచున్నది భిన్నదృష్టులతో సేకరింపబడిన సామగ్రి ప్రదర్శితమగుచున్నది

### 1 పదము — భౌగోళిక విశేషప్రతీతి

నేటి తెలుగువారు నాల్గు మండలములుగా నివసించుచున్నారు పోతాఉన్నాడు అను వాక్యమును వినగానే రాయలసీమవాడని, ఎలా అనగానే సర్కారువాడని, వచ్చిండు' అనగానే తెలంగాణమువాడని, గుంటడు అనగానే కళింగమువాడని గుర్తింతుము (దీనినే తిణై అని తొల్‌కాప్పియర్ వ్యవహరించెను) గుండు ను గూర్చిన ప్రసక్తి తిరుపతిని 'జరదా నుని గూర్చిన ప్రసక్తి హైదరాబాదును, పొగాకు ప్రసక్తి గుంటూరును తలపించును ఇది ఈ వ్యాసకర్తను శ్రోతగా గ్రహించి చెప్పినవిషయము పదమునకుగల ఇట్టి భౌగోళిక విశేషప్రతీతి వ్యంజకతకు ఒక నిదర్శనము

### 2 శిష్టాశిష్ట ప్రతీతి

జనులనడుమగల శిష్టాశిష్టభేదము కూడ రూపములచే గమ్యమానములగుటగలదు

| | | | |
|---|---|---|---|
| ధారం | పఠం | బావి | (బ్రాహ్మణ వైదికోచ్చారణము) |
| ↕ | ↕ | ↕ | |
| దారం | పటం | బాయి/బావి | (వ్యవహారోచ్చారణము) |

పై రూపములలో పదములుకాక వర్ణోచ్చారణములు భిన్నముగానున్నవి ఇట్టి వర్ణోచ్చారణ భేదములను శిష్టాశిష్టసూచకములుగా భద్రిరాజు కృష్ణమూర్తిగారు విశ్లేషించి యున్నారు।

చేకూరి రామారావుగారు ఆధునికాంధ్రమునకు వర్ణనిర్ణయముచేయుచు చెప్పిన క్రింది విషయములు వర్ణవ్యంజకతను పరోక్షముగ సమర్థించునవి

ఫది, ముప్పై, నలభై వంటి మాటల్లో వినిపించే మహాప్రాణో చ్చారణకు మూలం చెప్పడం కష్టం వ్యవహర్తల ప్రాచీన విద్యాగంధాన్ని కాని, సాంస్కృతికంగా వారి ఔన్నత్యాన్నిగాని సూచించటానికి మహాప్రాణో చ్చారణ ప్రవర్తిస్తుంది ఏదైనా విషయాన్ని నొక్కిచెప్పడానికికూడ మహా ప్రాణోచ్చారణ ఉపయుక్తమవుతున్నది 2 (1974 పుట 352)

ఇట్లుగాక దేశమంతటను అన్నివర్గములవారును వాడు కొన్నిపదములున్నవి

కన్ను, ముక్కు, చెవి, తల, పాలు, నీళ్ళు - ఇవి వస్తువులు

నొప్పి, మంట, కోపం, ఇష్టం - ఇవి భావములు

అది, ఇది - అనిర్వచనీయ భావములు (వస్తువులుకానప్పుడు)

ఇట్లుగాక పైన శిష్టాశిష్టభేదములుగ చెప్పబడిన ఉచ్చారణభేదములు కొన్ని మానసిక భావములకు వ్యంజకములుగా అందరియందును కనిపించుచున్నవి

వాడిఖర్మ!, పోయిధావు!, పెద్ద, ఫెళ్ళని, ధామ్మని మొదలైనవి

ప్రకాశంగారు (1974) కూడ పైన రామారావుగారు చెప్పినట్లే అర్థ భేదములేని ఈ అల్పప్రాణ, మహాప్రాణ శబ్దోచ్చారణములు 'ఎంఫసిస్' (emphasis)ని సూచించునని వ్రాసిరి 3 ఆశ్చర్యద్యోతకములైన ఆహా! ఓహో!

ఎగతాళిని సూచించు ఇహీః - ఇట్టివానియందుగల 'హ' కారము తప్పక భావ వ్యంజకమని చెప్పగలము. ధాత్వర్థనిరూపణము సాధ్యముకాని యిట్టి వర్ణములు (పదగత) రెండు చూపబడుచున్నవి

'అప్పా, అమ్మా అనుశిశువాగ్రూపములున్నవి అందుగల ప, మ'లు నిరర్థకములని, ధాతుప్రత్యయ నిరూపణము కుదరదని పండితులు నిరూపించి యున్నారు కాని అవి 'ప్రేమసూచకము' లని వైయాకరణులు గుర్తించి యున్నారు కారణమిట్లున్నది

'అమ్మ' మహదర్థమునందు ప్రయుక్తమగుట (నాయుడమ్మ కృష్ణమ్మ)

అప్ప మహత్యర్థమున వాడబడుట (అప్పగారు)

ఈ కారణములుగా అవివ్యంజకములుగా గ్రహింపబడుచున్నవి 4 కాని 'పండు మట్టి, కప్ప, దుమ్ము' మున్నగు పదములందును 'ప మ లున్నను అవి ప్రేమ సూచకములుగా లేవు కారణము అన్యవర్ణసంపర్కమె నైఘంటికదశ

## 4 సంధుయి — వ్యంజకత

సంధి జరుగుటయు, జరుగకపోవుటయు రెండును వ్యంజకములే

1 వాడు - అమ్మమని చెప్పాడు

2 వాడమ్మమని చెప్పాడు

1 లో 'వాడు' తరువాత అపుదలయున్నది సంధిలేమి వా యిద ఊనిక నాపా దించి అర్థవిశేషమును ద్యోతకము చేయుచున్నది ఇచ్చటసంధి శబ్దమునకు అంగ భూతమగుచున్నది (వక్తపురాణము చెప్పువాడైనపుడు అర్థవిశేషము లేకుండ గనే విసంధి కనబడవచ్చు )5

ఇట్టిదే మరియొక ఉదాహరణము

ఈమార్పునకు కారణం తెలియడంలేదు

పై నగాగమము లేకపోయినచో అశ్లీలార్థ స్ఫురణముండునను భావము తప్ప నిర్మాణాత్మకమైన అవసరములేదు కాని క్రింది ఉదాహరణమున అశ్లీలార్థస్ఫురణ లేకయే వ్యవహారము సాగుచున్నది

'ఉప్పుకారం తక్కువగా తింటూ ఈమందు వాడాలి ఇచ్చట సందర్భము అశ్లీలార్థమును నియమించు చున్నది - అని ఒక సమాధానము చెప్పవచ్చు ఎట్లయినను శబ్దాశ్రితమైన సంధియు వ్యంజకమే

5 ఊనిక

1 అతనింటికి వెళ్ళాడు

2 అతనింటికి వెళ్ళాడు

1 లో వెళ్ళినది 'అతడు' (కర్త) 2 లో కూడ అతడు subject స్థానమున నున్నది కాని గుప్తముగనున్నది ఇక్కడ గమ్యమైనది 'అతనిల్లు' కాని 'అతడు' కర్తృస్థానీయుడుకాడు ఇక్కడ ఊనిక అర్థభేదకమనుట ఒక పద్ధతి ఊనిక ఈ అర్థ విశేషసమర్పక (వ్యంజక) మనుట మరియొకపద్ధతి ఊనికను తెలుపు మరికొన్ని సందర్భములను ఇట్టివే

1 అతనే వచ్చింది

సముచ్చయార్థకములను అర్థవిశేషకములే

2 వాడూ నేనూ రాశాము

3 వాడూ మంచివాడే

కాని పై అన్నివాక్యములందును వక్తృశ్రోతృ సందర్భము మారినపుడు అర్థనియతి జరుగుచుండును

భర్త నాకెందరూ కావాల్సినవాళ్ళే

→

భార్య నేనులేన్వా

సందర్భమూహించు కొనిన తప్ప భర్తృవాక్యమునగల ఊనికను భార్య ఎట్లు గుర్తించినదో నిర్ధరింపలేము. కాని ఊనిక గుర్తింపబడినదనుటకు భార్య సమాధానము నిదర్శనము ఇట్టిదె

నాదానివి (you are mine)
|
నాదానివి (you are voice) (చలనచిత్రగేయమందలి రూపము)
|

౬ స్వరము

1 వాళ్ళు వెళ్తారో ↑ లేదో! ↓

2 వాళ్ళు వెళ్తారా? ↑

3 వాళ్ళు వస్తారు →

{ ↑ = ఉదాత్త, ↓ = అనుదాత్త, → = స్వరిత }

నిర్మాణాత్మకముగా ఓ = సందేహార్థకము, ఆ = ప్రశ్నార్థకము, అర్థసమర్పక దృష్టిలో ఇవి భిన్నభావములకు వ్యంజకములు

పదముల నాశ్రయించియు స్వరము అర్థవిశేషకము కావచ్చు.

1 అబ్బో? ఆతను బృహస్పతి (మూర్ఖుడనుట)

2 అమ్మో ఆమె గాంధారి (కుత్సితయనుట)

సందర్భౌచిత్యము పాటింపని స్వరము హాస్యహేతువగుటయు అనుభవమున నున్నదే

నేను నీకోసం V పుట్టాను (V = falling tone)

(ఆద్యంత పదములను వచనముగా మధ్యపదమును స్వరయుక్తముగా చదివిన వ్యంగ్య సద్భావమర్థమగును - ఇది ఒక చలనచిత్రమందలి వాక్యము)

## 7 పరికల్పనము - లక్షణ

వ్యవహారమునందుగల పదములలో ఎక్కువవంతులు ధాత్వర్థములు లేనివి అనగా రూఢ్యర్థములేయున్నవి కొన్ని ఉదాహరణములు

రెక్కమాను తిరగలి పచ్చకాయితం ఎర్రమందు, నల్లమందు, తెల్లగుర్రం లక్షణామూలముగా సమాస నిర్మాణము జరుగుట నేటి రచనలందును గలవని చూపుటకు క్రింది ఉదాహరణములుచాలు

మంచం కిడులాట, నీటిమంట నీటిగోడ నల్లబజారు

కొన్ని క్రియలు లక్ష్యార్థప్రధానములున్నవి

చేతిలో చేయువేయు, మాట ఇచ్చు, మాటతిప్పు, మాట నిలబెట్టుకొను, మాట లాడు, మాట అండించు, కడుపుచేయు, నెలతప్పు

ఊతపదములైన క్రిందిరూపములందును లక్ష్యార్థములే చెప్పవలయును

తస్సదియ్య!, అమాటకొస్తే! వాడిమింపదెగ!,

క్రింది రూపములలో అర్థనిర్ణయము కష్టము

అమ్మయ్య (హమ్మయ్య), అమ్మమ్మ, అబ్బబ్బ, అయ్యోయ్యో!

క్రింది ధ్వన్యనుకరణ రూపములందు కేవలము శబ్ద వ్యంజనము చెప్పవలెను

కటకటాలు, మరమరాలు ఒనామాలు, అత్తపత్తి 6

పదకల్పమునగల ఈవాచ్యాతిశయ అర్థవిశేషము లక్షణావృత్తిచేత వివరింపబడు మన్నను, భిన్నసందర్భములందు వక్తృశ్రోతృభావములకు వ్యంజకములే అగు చున్నవి. దీనికి నిదర్శనము భిన్నభాషలందున్న సమానభావములు.

సూర్యుడు - జగజ్జ్యోతి — world candle

బాధ - కడుపు తరుక్కుపోవడం — boiling of bowels

వాగ్దాన పరిరక్షణ - మాట నిలబెట్టుకోవడం — keepup the word

పైనుండి క్రిందికి - నఖశిఖ పర్యంతం — top to bottom

## 8 అబద్ధములు - చెప్పిపొడువు

1 నేను ఇచ్చేశానే - అదేంటయ్యా లేదంటావు

(ఇది ఒక అబద్దవాక్యము అబద్ధతవక్తృశ్రోతృగత అనుభవము నే అనుమీయ మానము)

2. నీవు వ్యభిచారివని ఆయన పుకారుపుట్టిస్తున్నాడు జాగర్త

(ఇది ఒక కొండెము ఇచ్చటయుభావము అనుమీయమానమే)

3 అవునులెండి! ఏరుదాటాక తెప్పతగలెయ్యటమే!

(ఏరు - కష్టము, దాటు, - తెప్పసహాయమునేసిన వ్యక్తి ఇచ్చటను భావము అనుమీయమానమే)

4 ఏమ్మా! మళ్ళీవచ్చావు మాయిల్లు పచ్చగావుండటం ఇష్టంలేదా (పచ్చగా - సుఖంగా, ఇచ్చట లక్షణావృత్తి)

పై నాల్గు వాక్యములందును వ్యక్తమగునవి ఆయావక్తలకు శ్రోతలకు నడుమగల భావమై యర్థ్యము. వ్యవహారదృష్టితో చెప్పబడు పదవాక్యగత పదార్థ సంబంధము అనుభవదశలో భావముగా పర్యవసించును ఇచ్చటినుండి వ్యవహారమున కావ్యత్వదశ ఆరంభమగుచున్నది (చూ 11 3 పొడుపు కథలు)

## 9 ఉత్తమ వక్తృత్వము

వ్యవహారమునకూడ ఉత్తమవక్త అని ఎలువబడువాడు ఈక్రింది రెండు లక్షణములలో ఒకదానినొ రెంటినోకల్గియుండును

1 అనుప్రాసాది చమత్కారము 2 అర్థచమత్కారము

1 ఇది ఒకవక్త సంభాషణము

"ఇది ముద్దకట్టిన శృంగారము ముద్దుమాటలతో పెద్దల్నికూడ పొద్దు తెలియకుండా బుద్ధిగాకూర్చునేలాచేసే ముద్దబంతి పలుకులు, మొద్దువానికిగావా ' దీనిని విని ఒకశ్రోత ఇట్లన్నాడు - "ఏమిటి దద్దాదద్దా అంటున్నాడు ఏంమాట్లాడుతున్నాడో?' - దీనితాత్పర్యమిది - ఆయనకు శబ్దమేతప్ప అర్థమెటుపోవునో తెలియదని వక్తృగతమైన అపాండిత్యమునకు ఈ అనుప్రాస వ్యంజకము

ఒక విద్యార్థి ఒకపోటీవ్యాసమున ఇట్లువ్రాసెను -

భారతీయ కర్షకులకు వర్షమే హర్షదాయకము"

(అతని ఉపాధ్యాయుడు మొదటిబహుమతి ఇచ్చి 'అందరును మహాకవులుకాలె ర నెను - తాత్పర్యము - ఆగురువుగారికి అనుప్రాస అపాండిత్య బోధకముగాగాక, మహాకవిత్వలక్షణముగా స్ఫురించినది )

2 రెండవపద్ధతిలో వక్తృకాకువును, లక్ష్యార్థములను ఆశ్రయించును

1 తిక్కన నిజంగా తిక్కనే - (ఎచ్చివాడని)

(ఆవేక్త భావము - లేకపోయినచో ఈ తెలుగువారికి అంత పెద్దభారతము నెందుకు ప్రసాదించుననని)

2 ధ్వని అంటే ఏమనుకొన్నారు? ఇదిగో మాస్నేహితుడుచేసేది'
(ఆస్నేహితుడు నిరర్థకముగా మాట్లాడునని - ధ్వని దీనికి వ్యతిరేకమని)

3 దేవులపల్లి కృష్ణశాస్త్రి అనే ఒక కవి వుండేవాడు' -

(వక్తృదృష్టిలో దేవులపల్లి ఇంతత్వరితముగా అంత అప్రసిద్ధుడయ్యెనని భావము) ఇట్లు వ్యవహారమున వ్యంగ్యమున్నను అది కేవలము అర్థమునాశ్రయించినది కారణము వ్యవహారమున మానవుడు జగమాకుడై యుండుట - బుద్ధికి సన్నిహిత ముగా ప్రవర్తించుట అనగా నిదియే)

(ఎచ్చివాని వ్యవహారమునలేనిది తాత్పర్యము - అన్వయము ఒక వాక్యము - వం(డడ్ రుపీస్‌తో నై న్యాధికారం - అన్వయము లేకపోవుట అతని యున్మత్తతకు వ్యంజకము)

పూర్వోదాహృత వాక్యమువంటిది వార్తాపత్రికలో వచ్చినది

ఒక రూపాయలో లక్షరూపాయల నాణెం

ఇక్కడ అన్వయమన్నది హేతుసందర్భము కాని యిదియు వ్యంజకము కావచ్చును - ఒక వ్యాపారి కాకువుతో ఉచ్చరించినపుడు

వార్తాపత్రికలలో గల కార్టూనులు" వ్యంగ్యమునకు చక్కనిచోటులు

1 మామంత్రిగారు రోజూచెప్పిన ఉపన్యాసం చెప్పలేకపోతుంటే రికార్డుచేయించా'

2 'మావారికి నామీద ప్రేమండీ? అందుకే నాఫలహారంకూడ వారే భోంచేస్తారు'

3 A రండి పీళ్ళు మనవాళ్లలే

B మనభార్య ఏదండీ

(పై మూడింటను హాస్యము వ్యంగ్యము - ఇది విషయగత, వక్తృబోధక, విశేషతలవలన సిద్ధించునది)

## 10 వక్రప్రయోగము

ఆకాశవాణిలో 'పొలంకబుర్లు కార్యక్రమమున క్రిందివాక్యము వినవచ్చినది

చీడపురుగులు చిన్నా పెద్దా అనే భేదంలేకుండా ఈ చెట్లని ఆశిస్తుంటాయి'

పై వాక్యమున చిన్నా, పెద్ద - అను మానవసాంఘిక విభాగము వృక్షములపై ఆరోపింపబడి వక్రత సిద్ధించినది ఇట్టి వాక్యమే ఒక కథలో ఇట్లున్నది

అస్థిపంజరం మీద పురుగొకటి ఊగలాడుతూ వచ్చింది' పై రెండు వాక్యములును వ్యంజకములు ఎప్పుడు? చెట్లను ధనికులుగాను పురుగులను

దళితప్రజలుగను సంకేతములుగ చూచినపుడు అస్థిపంజరం, పుర్రె ఇవి ఒక పేదజీవి శరీరమును సూచించునపుడు

ఒక చలనచిత్రమందలి వాక్యమిది -

(1 + 2a) (2 + 1a)
చెంబుకెళ్ళాలని పొలమిస్త్రీ చేస్తున్నాను వదినా

(2 + 2a) (1 + 1a)
(పొలానికెళ్ళాలని చెంబిస్త్రీ చేస్తున్నాను)

సందర్భమిది ప్రియుడు ఇంటిలో 'చెంబిస్త్రీ' చేసుకొనుచున్నాడు పొలమున వేచియుండు ప్రియురాలిని గూర్చిన కలలలో తేలియాడుచున్నాడు బాహ్యస్ఫురణ లేదు ఇంతలో వదినవచ్చినది ఆ అబ్బాయి తబ్బిబ్బు వాక్యమున పదాంశముల తబ్బిబ్బుగా వ్యక్తమయినది 1 e, ( +2a, (2 + 1a)

## 11 అలంకార ప్రయోగములు

11 1 A) వస్తుధ్వనిలో భేదముగ అలంకారధ్వనికూడ ఆనందోపదిష్టము.

ఒక ఉదాహరణము

'ఆయన పులివంటివాడు'.

ఇందువాచ్యతయే 'ఆయనపులి' - ఇందుముఖ్యార్థము బాధింపబడుచున్నది లక్షణ చెప్పుదుము

పులికడుపులో పిల్లి పుడుతుందా!

అన్న ఒక సామెతయున్నది ఇది ఒక అర్థాంతరన్యాసము ఒక జమీందారుగారి అబ్బాయి బలపరాక్రమాలను నవలాకారుడట్లు సమర్థించవచ్చు అతని తండ్రి పులివంటివాడను ఉపమ' ఈ అర్థాంతరముచే వ్యంగ్యము ఇట్టిది అలంకార ధ్వని ఇక్కడను పర్యవసానము భావముననే

B) ఒక తల్లి కుమారుని నిందించుచున్నది. తండ్రి కష్టపడి సంపాదించు చున్నాడు కుమారుడు తండ్రి కష్టమును లెక్కింపక బాధపెట్టుచున్నాడు

'నెమలి' కంటనీళ్ళు వేటగానికిముద్దా'? (ముద్దు + ఆ?) (తల్లి ఏడ్చును)
ఇదియు సామెతేకాని వాచ్యార్థము పూర్తిగాలేదు తండ్రి = నెమలి కంటి నీళ్లు = కష్టము, వేటగాడు = కుమారుడు ముద్దు = లెక్కచేయుట

వాచ్యార్థములేని ఈచోట్ల శబ్దములు సంకేతములగు చున్నవి అయినను మరల వ్యంజకములే అగుచున్నవి కారణము 'బాధ అను భావమున పర్యవ సించుటవలన (తల్లిఏడ్చుట అను చేష్టచే ఇది వ్యంగ్యము)

అంతమాత్రాన ప్రతిసంకేతమును వ్యంజకముగా మరితీరవలెనని నియమములేదు ఇద్దరు పెండ్లిపెద్దలు మాట్లాడుకొనుచున్నారు ఒకరు మరొకరితో అనుచున్నారు

C) 'ఎలాగయితే నేమండీ! పీర్లు గుండానపడ్డాయిగా!'

'ఆః ఆః ఏదో భగవంతుడిదయ

మొహరంపండుగలో కడపటివేడుక పీర్లను గుండముదాటించుట - ఇది సంకేతమై వివాహము సంపూర్తినందినదన్న విషయమును వ్యంజించును

11 2. సామెతలు (proverbs) భాషలోని లక్షణావ్యాపారమునకు చక్కని నిదర్శనములు ఇన్నిటను సాంస్కృతిక, సాంఘికనైపథ్యములు వ్యంజింపబడుచుండుట ప్రధానాంశము

1 ఆవు నలుపైతే పాలునలుపా ! (కులము - గుణము)

2 గతికితే అతకదు (వివాహసందర్భము)

3 దేవుడు వరమిచ్చినా పూజారి వరమీడు (beurocracy)

4 అత్తసొత్తు అల్లుడు దానంజేసినట్టు (misuse)

5 ఎండికొద్దీ రొట్టె (competence – performance)

6 గొర్రెలుతినేవాడుపోయి బర్రెలుతినేవాడు వచ్చినట్టు (bad to worse)

11 3 పొడుపు కథల (riddles) లో కూడ ప్రధానాంశము లక్షణయే వస్తుభావవ్యాపారములు భావముగ పర్యవసించుట 'పొడుచుట భావము వస్తుభావ వ్యాపారములుగ నిష్క్రమించుట విప్పుట'.[7]

1 వస్తాగర్భిణి పోతా బాలింత (కపిలబావి)

2 అమ్మ అంటే తగుల్తాయి, అక్క అంటే తగలవు (పెదవులు ఉచ్చారణప్రక్రియ)

3 యాలనన్ను చూస్తావు? (the reflective quality of mirror)

4 కాలేబండమీద ఎనుగొడ్డు పుర్రుబోసె (కాలేపెనంమిద దోసె పొయ్యడం)

5 అవ్వకుంచెళ్ళో తాత చెయిబెట్టె (గొడుగు విప్పడం)

సంవాద (dialogue) రూపమునమున్న పొడుపుకథలను లక్ష్యార్థప్రధానములే ఇందు వ్యవహారము కావ్యదశగా పరిణమించుట స్పష్టముగచూడవచ్చు

6. A) 'కట్టింటిబాయే కరిమెకమా
మా మెకం నిన్నుజూఎ మేతానీళ్లొదిలింది
మేత తినిపిస్తూరాయే - నేతమామిడిఎలకా ;

B) అల్నేరడిపండరసేత్లో బెటొక్కొని
కసుకాయమింకెల కన్నేస్తివి?
కిడిసోట్లోవెటొక్కురా కసరినాబట్టా '

జానపదులిచ్చిన సందర్భమిచ్చట ప్రసక్తనీయము (భర్తపొలంలో పని చేస్తుంటే భార్య అన్నంతీసకెళ్ళి పొలంగట్టులో భర్తకువడ్డిస్తోంది ఆదేసమయంలో చెరువుగట్టుమీదుగా ఒక కన్నెపడుచు నడిచిపోతుంటె అన్నం తినడంకూడా మరచిపోయి తదేకంగా ఆమెనేచూడ్డం మొదలుపెట్టాడా భర్త సహించలేని భార్య ఇలా అంది (A) దీనికి సమాధానంగా అమ్మాయి చేసినహాతబోధ (B)

పై సంవాదమున క్రింది 'జంట' లలో శబ్దార్థస్పర్థ, వాచ్యార్థరహితత్వము సంకేతత్వము - వీనిమూలముగ జనించు భావనిర్మాణము ప్రధానములు

జంటలు కరిమెకము × మామెకము
మేతానీళ్ళువదిలింది × మేతతినిఎస్తూరాయే
అల్నేరిడిపండు (అరచేయి) × కసుగాయ (కన్నేస్తివి)
కడినొట్లోబెటొక్కురా × కసరినాబట్టా

(వివరాలకు చూ బ్రహ్మానంద & నారాయణ, స్రవంతి, జనవరి (1980) పుటలు 14-19).

## 12 వ్యవహారముక్తకము

ఇట్లుకాక ఒకవాక్యార్థము మరొక వాక్యార్థమున పర్యవసించి శ్రోతకు నిర్దిష్టభావమును ద్యోతనము చేయుటయుగలదు.

1 అత్త మాకోడలికి తెల్లవారలేదింకా పిన్నిగారూ!

ఎన్ని ఆఁ! ఆవయస్సులో మనమూ అంతే

అత్త మీరు మరీను! అయితేమాత్రం

(ఒక వాస్తవిక సంఘటన దీనికాధారము)

ఇందు నిర్దిష్టమగు భావమున్నది అది పడుచువారిశృంగారముదయాస్తమయము లను గమనింపదనుట. అత్తగారి వాక్యమున ముఖ్యార్థబాధ ఉన్నది నిదర్శనము క్రింది వాక్యములు.

2 అత్త, మాకోడలు ఇంకా నిదరలేవలేదండీ (ప్రొద్దెంతెక్కినా నిద్దరపోతుంటే) ఎన్నిగారి వాక్యమునకు వాచ్యతలేదు

ఎన్ని పోనీలెద్దు అది వయసులక్షణం

అత్తగారి రెండవవాక్యము అసంపూర్ణము

అత్త అత్తగారింట్లోనూ భయం భక్తి లేకపోతే ఎలా?

2 లోని వాక్యములు 1 లోని వాక్యములకు తాత్పర్యములు. పూరకములు (కాంప్లిమెంటరీ) కారణము 1 లోని వాక్యములు అర్థాంతర ప్రతిభాసకము లగుట అనగా 1 లోని పిన్నివాక్యము 2 లోని అత్త మొదటి వాక్యమునకు సమాధానము. 1 లోని అత్త రెండవవాక్యము 2 లోని ఎన్నివాక్యమునకు సమాధానము ఈ కారణముగనే ఒక వాక్యార్థము మరొక వాక్యార్థముగ పరిణమించునని చెప్పబడినది

'తెల్లారు ~ నిద్రలేచు

పర్యాయపదములు కావు కాని స్మారకములు (collocational)

కావున మొదటి వాక్యమున లక్షణప్రవర్తించును వాక్యము రూపమున పర్యాయ - అర్థము - రెండువిధములు

1. అత్తపై కోడలకు గౌరములేమి

2 కోడలు కొడుకుల సమయమెరుగనితనము

ఎన్నిగారి వాక్యము రెండవవాక్యార్థము నాశ్రయించి పుట్టినది ఈ అర్థము వక్తృశోత్కృగరమైన పూర్వానుభూత శృంగారస్థాయిని స్మరింపచేయుచున్నది

ఎన్ని 'ఆః అనుట ఈ అర్థాంతరన్యాసమునకు నిదర్శనము

ఉద్దీప్త శృంగారానుభవము అత్తగారి వాక్యములందు ప్రతిఫలించినది

మీరు మరీను అనుటలో వాచ్యార్థములేదు

ఇందును రెండర్థములు 1 ఎన్ని పూర్వాశ్రమమున మిక్కిలి అనుభవించినది కావున - (ఆలంకారికముగా భవంతి')

2 ఎన్ని తననుబాగుగానెరిగినది అత్తకు తన పూర్వ అనుభవము స్మర్యమాణమైనది (భావయంతి)

అత్తగారి మూడవవాక్యమున పైనచూపిన (గౌరవములేమి) భావము తుడుచుకు పోయినది అది పూర్వానుభూతశృంగార ఎన్రిత్వభిజ్ఞచే ఆచ్ఛాదింపబడి

1 'అయితేమాత్రం ' అను వాక్యముగ వ్యక్తమయినది ఇది ఏమయితే; ఏమిమాత్రం; ఇందు 'భ్రమధార్మిక విస్రబ్ద'కు అభినవులు చేసినంత నిరూపణమున కవకాశమున్నది గృహస్థాశ్రమమున సూర్యోదయాత్పూర్వము భార్య నిదురలేచుట గృహిణీధర్మ నిర్వహణమున ఒక అంశము, కోడలు దానిని భగ్నముచేయుచున్నదని అత్త ఆందోళన పిన్ని ఏతద్విషయవిముక్తురాలు

పూర్వాశ్రమ వంచితురాయి కావున గృహిణీధర్మమును 'బానిసత్వము'గా లెక్కించునది 'మీరు మరీను ఆయితే మాత్రం' - దీనిని స్మరింపచేయును ఇదివ్యవహార ముక్తకము ఒక సమాజ సాంస్కృతిక నేపథ్యమునకు ఈ సంద ర్భము వ్యంజకముగా గ్రహించుటజరిగినది శాలివాహానుని గాథలిట్టివి

## 13 చైతన్యదృష్టి - వ్యంజన

వక్తృశ్రోతృ ప్రతిభాసంబంధిగా నిర్వచింపబడుటవలన ప్రతిభాసమానత లేకపోయినపుడు జరుగు అనర్థములకొక సందర్భముదాహృతమగుచున్నది

ఒక కవి 'ప్రపంచమొక పద్మవ్యూహం' అని వ్రాసెను దానిగొకడు 'పద్మవ్యూహం' అనుమాట కవిపై సంప్రదాయమునకు గల ప్రభావమును మరొకడీవిమర్శ తప్పనును 'పద్మవ్యూహ మందలి క్రౌర్యదౌష్ట్యములు మాత్రమే గ్రాహ్యములని - భారతముతో సంబంధములేదని వాదించును, ఇక్కడ రెండు రకములగు విమర్శలకు చోటిచ్చు అంశమేది ?

వక్తృశ్రోతృగత సమాన విభిన్నానుభవములు ఒక కవి కొకతత్త్వ ముండును ఆతత్త్వమున్న మరొకడు దానిని సరిగా భావించును లేనివాడొకడు మరొకరీతిగా భావించును ఏది సత్యమనుటను నిర్ణయించు ప్రమాణము మరల అనుభవమే ఈ అనుభవము ఆధునిక ప్రాచీన భేదములను కల్గినదికాదు, నన్నయ మొదలు ఈనాటివరకు తెలుగు పాఠకుని అనుభవ మున మార్పులేదు ఉండదు అట్టి సమయమున 'పద్మవ్యూహ మను మాటకు రెండర్థములు లాగి రెందుకు? అర్థమెప్పుడును బుద్ధికి సంబంధించినది వ్యావహారికమైనది భావ మెప్పుడును హృదయగతము అర్థముతో సంబంధము లేనిది కావుననే పద్మవ్యూహ' మను పదము సంచు భారతయుద్ధమున, నేటి వ్యవస్థయందును గల సమానలక్షణ మొకటి వ్యక్తమగుచున్నది అవికౌర్యము

ఇది రసపరకవిత్వమయినను చైతన్యపర కవిత్వమైనను సమన్వయించు వాగ్వ్యాపారదశ

కావున కావ్యవ్యంజననుగూర్చి పరిశీలించుటకు మొదటిమెట్టు అర్థము కంటెను భావము భిన్నమని గుర్తించుట ఈదృష్టితో వెల్చేరు నారాయణరావుగారు (1978) వ్రాసిన ఒక వివరణము ప్రసక్తనీయము.[8] క్రింది ప్రయోగములు దిగంబరకవులవి 'పులిచంపిన వేడినెత్తురు వ్రాలలోనివేడి అత్తరు, కుళ్ళిపోయిన వక్షం, స్వార్థపుకాంక్రీటు తొడలు, ఫ్లాస్కులో విరబూసిన కాఫీపరిమళాలు, కొజ్జాల కామకేళి ' (పుటలు 193-198)

ఈప్రయోగములపై ఆయన వ్రాసిన వ్యాఖ్యానమిది

గీతం రసాన్ని వదలి రాక్షసత్వాన్ని ప్రతిబింబించినరూపం అవుతూంది (పుట 196)

'కుళ్ళిపోయిన వక్షం అప్పుడు వాటి అర్థాలు వాచ్యార్థాలే ఈదశలో వాటికి ప్రాణవంతమైన అర్థాలను ప్రతిబింబించే 'శక్తి' వస్తుంది రమణీయార్థాలను చెప్పే దంతక్షతాలు, నఖక్షతాలు క్రూరత్వానికి గుర్తులవుతాయి రాక్షసత్వానికి రసార్థం వస్తుంది[9] (పుట 197)

కవిత్వంతో ఒకమాటకి ఒక అర్థం, ఒకప్రయోజనం, అనేనిశ్చయం లేదని - కవి సమాజం ఇచ్చిన అర్థాలను ఉపయోగించుకోవడంలో వాటికి ఎన్నో క్రొత్త ప్రయోజనాలను కనిపెట్టగలడని చెప్పటానికి ఈరచన మంచి ఉదాహరణ (అదేపుట) వాచ్యముకాని అర్థమేది? — 'వ్యంగ్య' మనినచో ఆలంకారిక విమర్శయైపోవునని భావించవచ్చు ఈ 'దశ', 'శక్తి' 'రసార్థం' - వీనిని ఆలంకారికముగ తప్ప వ్యాఖ్యానించుట ఎట్లు? అయినను వ్యంగ్యసద్భావము ను గుర్తించుట వారిలో కనిపించెడి వాగ్వ్యాపారదృష్టికి నిదర్శనము

— ० —

# అనుబంధము 4

## కావ్యము - వ్యంజన దశానిరూపణము

భరతానందాభినవుల ధ్వనిమార్గమును 'ఆముక్తమాల్యద' కావ్యమునకు సమన్వయించిన ఒక విమర్శ ఇట సమీక్షింపబడుచున్నది ఆముక్తమున చారిత్రిక దృష్టులతో పరిశీలనచేసిన విమర్శకులు కొన్ని సమస్యలుగుర్తించిరి

1 ఇందు వస్త్వైక్యము లేదని - భిన్నకథలుండుటవలన

2 రసము 'భక్తి' అని

3. కర్త రాయలు కాదని

ఇంకను నారికేళపాకమని, అనవసరములగు ఋతువర్ణనములున్నవని, రెడ్లను నిందించెనని, రకరకములగు విమర్శలున్నవి కాని రసధ్వని దృష్టితో కావ్యమును పరిశీలించి ఇందు ప్రధానరసము శృంగారమని - అంగరసము వీరమని, కథలు స్వామిదయాధర్మప్రధాన వీరములను వ్యంజింపచున్నవని - నాయకుడు స్వామి కావున - వివాహము పార్యంతిక ఫలము కావున భక్తి కాదని - కావ్యము రసమత పరముగా సమన్వయించుచున్నదని ఆముక్తమాల్యదా సౌందర్యము న తుమ్మపూడి కోటీశ్వరరావుగారు నిరూపించిరి (1971)

ఈ పరిశీలనమున శబ్దార్థములకు ధ్వనికారిక వివక్షించిన విశేషణము లన్నియు సమన్వితములగుచున్నవి కావ్యమునంతయు ఒక వాక్యముగ గ్రహించుటతో కథాంశములన్నియు 'పద' స్థానీయములగుచున్నవి కర్తృస్థానమున స్వామి, కర్మస్థానమున గోద క్రియాస్థానమున సర్వకథయు నిముడుచున్నవి శబ్దార్థవ్యాపార ప్రస్థానత్రియ నిరూపకమీకావ్యము

కావ్యాంతర్గత విశేషమంతయు కావ్యనామముచే స్పష్టమగుచున్నది కావ్యనామము ఆముక్తమాల్యద' నాయికపేరుగోద కావ్యమందెచ్చటను గోద అను పేరు కనిపించదు నాయికాకావ్యనామములభిన్నములు ఇచ్చటినుండి పరిశీలన మారంభమగును - 'ఆముక్తమాల్యద ఇది బృహత్సమాసఘటన బహువ్రీహియందు కర్మధారయములు బద్ధములై కావ్యవస్తు కథాసూచకములగుచున్నవి సమాసము కర్తనపేక్షించుచున్నది - స్వామి వ్యంగ్యముగుటను దేవి వ్యక్తమగుటను సూచించుచున్నది. పరమ భాగవత శిఖామణి సశ్రీక విశిష్టాద్వైతమును కాశ్మీర శివాగమమునకు పునర్వ్యాఖ్యానమో అనునట్లు కావ్యమున నిరూపించినాడు

కావున నాయకుడు కథయంతటను వ్యాపించియున్నాడు
పైకి గోద చరిత్ర కనిపించుచున్నది ఇది కావ్యనామ
వ్యంజకతకు సంబంధించినది - నామవక్రత అని
కుంతకాచార్యుడుస్మరించినదీతత్త్వమునే

ఆశ్వాస సంఖ్య - వ్యంజకత ఆముక్తమాల్యద ఆరు ఆశ్వాసముల ప్రబంధము (వేదమువారు 7 అశ్వాసాలుగా ప్రకటించిరి) నాయిక గోద ఆమె భూదేవి అవతారము భగవతి సద్గుణములు కలదిగావర్ణితమ కావున ఆరాశ్వాసములు నాయకుడు మన్నారుస్వామి రసము శృంగారము కథ వారిపెండ్లి ఇట్లనుటకు హేతువు మొదటి కడపటి పద్యములు రసధ్వని నిరూపణము దీని నాధారముగా జరుగును

శ్రీకమనీయ హారమణి (కావ్యప్రారంభపద్యము)

1 ఎన్నిను గూర్తునన్న వినుమేమునుదాల్చిన మాల్యమిచ్చునప్పన్నది రంగమందయిన పెండిలిసెప్పుము (కథాప్రారంభము)

2 కంతుసామ్రాజ్యమేలించి కరుణచిత్తమొలయ జగములఁ బాలించు చున్నవాడు (కావ్యాంతము)

కావున కావ్యమంతయు ఒకేవాక్యము అదియిట్లు వ్రాయబడుచున్నది. ఇది కథ

మును గల్పిన మాల్యమిచ్చిన చిన్నది స్వామిరంగమున వివాహమాడిరి

మును అనగానేమి? ఎప్పుడు? రంగమున - ఎందుకు వివాహమాడెను. స్వామి ఎవరు. దీనికి సమాధానము తక్కినకథయంతయు చెప్పుటయే

కథానిర్మాణ వ్యంజకత ఆమెపూలు మునుదాల్చుటకు హేతువు - తండ్రి విష్ణుచిత్తుడగుట - అతడు స్వామికి పూజారియగుట శ్రీరంగమున 'పెండ్లి' ఎందుకు? వారి యూరు విలిబుత్తూరు స్వామిమన్నారుదేవుడు ఆయన కోరి వివాహమాడినాడు ఆమె అంతగొప్పదా? అవును - కావున మాలదాసరి కథ (6వ ఆ) ఆమెకు స్వామిపై ప్రేమ ఎందుకు? నిత్యధర్మోద్యోగిత గలవాడు కావున - అది దయా - ధర్మ - దాన - వీరములుగా కావ్యమంతటను నిండియున్నది

మూడు కథలున్నవి - పాండ్యరాజు కథ - యామునుని కథ - మాలదాసరి కథ - మొదటి కథ కవిచెప్పెను రెండవకథను భగవంతుడు శ్రీదేవితో చెప్పెను - మూడవ కథను మన్నారుస్వామి విష్ణుచిత్తునితో చెప్పెను.

ఈమూడు కథలందును ముగ్గురుద్ధరింపబడిరి ఉత్తమమధ్యమాధములు - స్వరూప స్వభావముల ననుసరించి పాండ్యచక్రవర్తులిరువురు బ్రహ్మ రాక్షసుడొకడు

దయావీరస్ఫురణ మధుర నేలెడి పాండీడు ఉదాత్తుడు గంభీరుడు నిరీతిగా రాజ్యమేలుచున్నాడు ప్రజలు మహాభోగులైరి. కావున ఆనగరమున ననంగ

ధనుష్టంకారములు నిరంతరము మూర్ఛిల్లుచున్నవి అతనియందొక దోషము - భోగినీసంగతి తత్సంగతికై పోవుచు -

'వినియె వెలల్ చతుర్వ్వయిని' (2-76)

ఆగ్రంథమొక పరదేశవిప్రుడు చదివెను విని రాజు భ్రమ నొందెను స్వస్థితిని విచారించి యేవగించుకొనెను మోక్షమునుగూర్చి ఆలోచింపక బుద్బుద ప్రతిమ శరీరమునమ్మి భ్రష్టుడనై తిరిగితి! అనిదైన్యము నొందెను అతని దైన్యము స్వామిలో కృపనుగిలకొల్పెను - ఈసమయమున నాయకుడు కథలో ఆవిర్భ వించెను ఆస్వామి కృపామూర్తియై తన్నుగొలువవచ్చిన భక్తుడగు 'విష్ణుచిత్తు' నితో నుదారమధురోక్తుల నిట్లనెను -

'నేడు మహామతీ! మధుర నీపురయంబునజొచ్చి మన్మహిమమున్
ప్రకటించి వాడునురోఎనాడిహము వైష్ణవుగా బొనరింపు సత్కృపన్'
(2-88)

పెరియాళ్వారు వడవడవడంకి భయముతో నాకువాదశక్తి' లేదని విన్నవించెను అంత స్వామి

'నీయిచ్చయె మిన్నక పోవోయి మునిప్రవర - నిన్ను మెప్పింతును భూ
నాయకసభ నింపుటకై నీయత్నము వలవదవల నేనున్నాడన్'
(2-93)

అనెను —

కావున మహాగురువు పాత్రుడగు శిష్యునుద్ధరించుటకై వచ్చెను ఉద్దీపన విభావము పాండీనిదైన్యస్థితి ఆలంబనవిభావము రాజు ఇది విభావసంపుటి

వీని ననుసరించి నాయకునియందు దయాపూర్వకమైన ఉత్సాహము జనించినది అదియే 'నేడు మహామతీ' అనుట ఆరాజు తనను ప్రార్థించెనా? పండితులను తేల్చిపెట్టుడనినాడు కాని స్వామియే కృపవహించి విష్ణుచిత్తునిపంపెను ఇది నిర్హేతుకకృప కావున దయావీరము (చూ ఆ ము సౌ పుటలు 16-13)

ఇట్లు మొదటి కథలో స్వామినాయకుడు - దయావీరస్ఫురణనిర్ధారకము ధర్మవీరద్యోతనము స్వామియే చెప్పినకథ శ్రీదేవిశ్రోత పూర్వకథయందలి చక్రవర్తికి పూర్వవంశ్యుడొకడు మధురనేలుచుండెను శైవము స్వీకరించి జందెము త్రెంచుకొని వేదబాహ్యుడైనాడు పరమత సహనము కోల్పోయినాడు అతనిపాలన సనాతనవైదికధర్మ వ్యతిరేకముగా సాగుచున్నది రాజ్యమధర్మపు టూబిలో దిగబడినది సర్వలోక ప్రభువు దీనినిజూచి ధర్మసాపన చేయనెంచి - విచారించి - యామునాచార్యునకు వాదిజయము చేయవలయునను తలంపుకల్గించెనట (4-53) తరువాత వైదికధర్మయుతమగు రాజనీతికథనము ఇచ్చట ఆలంబన విభావము ధర్మము ఉద్దీపనము పాండీని వేదబాహ్యపాలనము ఇందలి ధర్మవీర స్ఫురణ (ఆ ము సౌ పుటలు 23-26) స్వామి అలౌకిక నాయకత్వమున కుద్యోతనము

దానవీరవ్యక్తీకృతి ఇదియు స్వామియేచెప్పెను శ్రోత విష్ణుచిత్తుడు దాసరి మహాభక్తుడు మంగళకైశికీగానముచే కురుంగుడి నంబిని రంజింపచేయు టయే నిరంతర జీవనముగా గలవాడు ఒకనాడతనిని బ్రహ్మరాక్షసుడు బంధించెను అతనిదేహము భుజింపనారంభించెను తన వ్రతమునొనర్చి వత్తునని నారాయణు నిపై శపథముచేసి వాడు బంధమూడ్వగా తనపని పూర్తిచేసికొనివచ్చెను దాసరి దేహార్పణమునకు ఎద్దపడెను రాకాసి గానఫలమిమ్మనెను వీడంగీకరింపలేదు రాకాసి పూర్వవైష్ణవచార్యుల మహత్త్వము కీర్తింపగా దసరి మెత్తబడి

'భగవంతుండ రక్షించు నూరడిలు' మనగా రాక్షసునికి తొల్లింటిరూపముతో పాటు 'భాగవతశ్రీయు లభించి తరించెను

ఇందాలంబనము బ్రహ్మరాక్షసుడు ఉద్దీపనము రాక్షసగతమగు దైన్యము కావు - వాడు చెప్పిన వైష్ణవచరిత్రలు, కాని నాయకుడు దాసరియా మన్నారుస్వామియా? దాసరియైనచో శాంతము కావలెను - కారణమతనికి ధర్మార్థకామ విషయోత్సాహములేదు కాని నాయకుడు స్వామి కావుననే

ఫలపరిమాణ గణన పరిపన్నుల కెక్కుడియది ?
భగవంతుండ రక్షించు నూరడిలు' మని దాసరి కర్తృత్వమును

స్వామికి అప్పగించుకొన్నాడు అతనికి కర్తృత్వబుద్ధిలేదు పూర్వ కథలో వలె గాక యిచట నాయకత్వము భక్తునిచే సంక్రమించినది ఇచ్చటను దానవీరస్ఫురణ అవ్యక్తుడగు స్వామికిగల ప్రభుతను వ్యక్తీకరించుచున్నది (చూ ఆ ము సౌ పుటలు 26-36) ఇట్లీమూడు కథలును ప్రధానేతివృత్తమగు గోదా మన్నారు దేవుల వివాహమున (వీరరసములు శృంగారమున) పర్యవసించుచున్నవి

శృంగారప్రతీతి నాయికానాయకులుత్తమప్రకృతులై యుండవలయును, యువకులు, ఉజ్జ్వలవేషులునై యుండవలయును ఆముక్తనాయకుడు సాక్షాత్పరమేశ్వరుడు నాయిక యుత్తమ ప్రకృతియనుటకు -

'అయ్యిందువదన ధరాంగనకావున (5-37) అని కవి చెప్పనేచెప్పెను తండ్రివిష్ణుచిత్తుడు మరి ఐశ్వర్యలబ్ధములగు పుద్యానకాసార కమలాది సామగ్రి ఎట్లుపలబ్ధమగును? దీనినికూడ నాయకుడే అనుగ్రహించెను అది ప్రథమకథ యందే చెప్పబడినది స్వామిసుధాశనవర్ధకితో ఇట్లనెను

'ఏతదీయ నిలయమప్పురిన్ మణిమయంబును సార్థము
చేయు' మని (4-32)

మరల గోద యౌవనమును వర్ణించునపుడును, తమతండ్రి శ్రీశదత్తశ్రీలు గృహమున త్రవ్వితండములయ్యె (5-38) అని వర్ణించి కవి స్వామి నాయకత్వమును, ప్రియత్వమును స్థాపించినాడు

ఆలంబన విభావములు - నాయికానాయకులు ఉద్దీపనములు - గుణచేష్ట అలంకరణ తటస్థ - ములని చతుర్విధములు ఇవన్నియు సమన్వయించునట్లు గోదా గత రతిస్థాయిని వ్యంజించినాడు (చూ ఆ ము సౌ పుటలు 41-48)

ఇట్లు వీరరసకథలను శృంగారమున పర్యవసింపచేయుట యందు మానవమనస్తత్వమున్నది - ఆలంకారిక శాస్త్రనేపథ్యమున్నది - పురుషార్థసమన్వయ మున్నది అనగా శృంగారరసము విశిష్టాద్వైతమును వ్యంజించుచున్నది మరియు రసముఖముగ వ్యంగ్యమగుట అనగా అర్థమిది (చూ ఆ ము సౌ పుటలు 51 56)

ఇది రసధ్వని నిరూపణము ఇటపై కావ్యమందలి వాక్యమును వ్యంజకముగ గ్రహించుటవలన సాధ్యమయినది ఇట్లు వ్యంజకముగా గాక వాచకముగ గ్రహించినచో ఆవాక్య ప్రయోజనమంతటితో పూర్తియగును అది కావ్యమంతటను వ్యాపించదు అంతర్గతముగ ప్రసరించదు నిర్మాణమర్మజ్ఞుడైన ప్రతికవియును ఇట్టివాక్యములను నిబంధించియే కావ్యనిర్మాణము చేయును

వ్యంజనదశలు - వినిర్మాణము

I 1 మహావిష్ణువు పాండీనుద్ధరించి మోక్షమునిచ్చెను

2 ,, విష్ణుచిత్తుని ముఖముగ పాండ్యునిపరిపాలన చక్కదిద్దెను

3 ,, మాలదాసరి ద్వారమున రాక్షసునిపాపము తొలగించెను.

II ఈ కథలను వినిన గోద స్వామిపై మరులుగొనెను

III స్వామి గోదను వివాహమాడెను

ఇట్లు నిర్మాణగతముగ ఒక కథ మరియొక కథలో పర్యవసించుచున్నది ఇది నిర్మాణగతమైన వ్యంజకత - ఇదియెట్లు చెప్పగల్గితిమి? కథయందు స్వామి వచ్చుటను ఇందిరా ద్వితీయుడై శృంగారమూర్తియై వాచాలమూర్తిగా సాక్షాత్కరించుచున్నాడు - కథలాయనే చెప్పును తనభక్తులచే చేయించిన మహిమల కథలు - ఆకథలు విని గోద మురిసిపోయినది - ఫలితము వివాహము

ఋతువర్ణనములున్నవి వానిని అంగిరసబోధకములుగా కవి నిక్షేపించెను ప్రతివాక్యమును, పదమును, అంగాంగిరసములలో దేనినో ఒక దానిని తాకునదే ఏదియు అన్వర్థముకానిది ఉండదు ఇట్లుచేయు కావ్యనిర్మాణము 'రసధ్వని నాశ్రయించిన వినిర్మాణము

ద్వైధీభూత స్ఫురత్త కథ అంతయును ఘటప్రదీపప్రతీతివలె రెండుదశల వ్యాఖ్యానింపవీలున్నది 1. కేవలము శృంగారకథగా 2 విశిష్టాద్వైతవ్యాఖ్యానముగా ఈ రెండుదశలను సమానస్కంధములలో వ్యవహరించు శక్తి కవివాక్కునకున్నది వైష్ణవభక్తులు గోదా చరిత్రమును శృంగారముఖముగనే భావించిరి (ఆ ము సె ప్రుటలు 51-58)[1] కావున వీరికి శృంగారముముందు గుణీభూతమైనది అనగా అప్రధానమైనది

ధ్వని ప్రభేదనిరూపణము

ఒక ఘట్టమును గ్రహించి ధ్వనినిరూపణము చేయుటకువీలున్నది మాల దాసరి కథ చెప్పుటకు కారణము - గోద విరహమర్థము కాక తండ్రి స్వామితో మొరపెట్టుట అప్పుడు స్వామి దాసరికథ చెప్ప తుదకు -

ఆప్పుణ్య కథ వహనసమయంబున గుహనావరాహంబువలన
మహిమహిళ విశేషఫలదంబ గానంబయన వివి
కూతురై నీకొదవి ఇంతకన్న పరమతపంబున్నదే' (6-80)

అని చెప్పెను ఈవాక్యములందే ఈకథారహస్యమున్నది.

1. భూదేవి గోదగా జన్మించుటకు హేతువు గానముచేసి స్వామిని పొందుట.
2 విరహముచే నిరతము గీతరసమున ప్రొద్దుపుచ్చుట.
3 అవిప్రలంభమే - అందలి ఉపాలంభనమే తపస్సు

(ఆ ము సౌ పుట-117)

చరిత్ర యున్నది 'నాచ్చియార్ తిరుమొళి' లో భగవంతుడు గోదను వివాహమాడుట, అగ్నిలో లాజలు వేల్పించుట - ఉన్నది భగవంతుని భార్యయైనంతనే ఆమె జగదీశ్వరియైనది - ఈవృత్తాంతమును గమ్యమానముచేయుట మాలదాసరి కథతో మొదలైనది - ఆమె జగదీశ్వరి - నీకు కూతురుగా పుట్టినది - హేతువు గాన మహాత్మ్యము కావున దాసరికథ ప్రసక్తము

ఇట్లు ఏఘట్టమును కావ్యమున ప్రత్యేకముగ లేదు - ఒక వాక్యమున్నది - అది యామున ధర్మనీతి ప్రబోధమున నున్నది

'సుషుప్తి పూర్వకము ప్రేయసీ గోష్ఠి పొసగు పతికి (4-2/1)

